# భారతి

సాహిత్య మాస పత్రిక





జనవరి 1986

వెల : రు. 4/-



# ఉత్సాహంతో ఎంత పనయినా చేసే మిమ్మల్ని నిరుత్సాహ పర్చాలా ఈ పాడు జలుబు?



జలుబు మహా చిరాకు కలిగిస్తుంది.
మీ ఉత్సాహాన్ని చప్పగా చల్లార్చి వేస్తుంది.
ముక్కు కారడం. తలనొప్పి.
జ్వరం వచ్చినట్లు వుండడం. ఒళ్లు నొప్పులు. ఇవన్నీ చాలవన్నట్లు మధ్య మధ్యలో తుమ్ముల పరంపర.

అన్నిటికంటే చిరాకు కలిగించేదేమిటంటే మీతోపాటు మీ పనికీ ఇబ్బందే.

కాని, ఈ బాధల నుండి తప్పించుకోడానికి మార్గం వుంది ఒకటి. అదే కోల్డరిన్‌లో పూర్తి నమ్మకం.

జలుబు బాధలను తొలగించడానికి ప్రత్యేక ఫార్ములా కలిగినది కోల్డరిన్. ఇది మూడు విధాలుగా పని చేస్తుంది:

కారే ముక్కును శుభ్రం చేస్తుంది
తలనొప్పిని తగ్గిస్తుంది. జలుబుతోపాటు వచ్చే జ్వరాన్ని తగ్గించడానికి సహాయం చేస్తుంది.

ఈ మారు జలుబు మీపై దెబ్బ తీసినపుడు కోల్డరిన్‌తో మీరూ దానిపై ఎదురుదెబ్బ తీయండి.

మీలాంటి ఉత్సాహవంతులు వెధవ జలుబుతో నీరసపోకూడదు మరి.




## కోల్డరిన్

జలుబు-నివారక టాబ్లెట్

ప్యాకెట్‌పైన సూచించి

సంపుటము : 63 జనవరి 1986 సంచిక : 1

# భారతి

## సాహిత్య మాసపత్రిక

*

సంస్థాపకుడు

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

*

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

(1938-1972)

*

## విషయానుక్రమణిక

*

ముఖచిత్రం : నర్తకి కుమారి కమలారెడ్డి





# చెప్పుకో తగిన పరిణామాలు

1985 లో చెప్పుకోదగిన విశేషాలే కొన్ని జరిగాయి. ఒక ప్రధాన మంత్రితో బాటు ఎందరో ప్రాణాలని బలిగొన్న 'పంజాబు సమస్య' పరిష్కారం కావటానికి ఇప్పటి ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్ గాంధి, అకాలీ నాయకుడు హర్చంద్‌సింగ్ లోంగోవాల్ ఒక ఒప్పందం చేసుకొన్నారు హర్చంద్ సింగ్ లోంగోవాల్‌ని సిక్కు తీవ్రవాదులు హత్య చేశారు కాని పంజాబు ఎన్నికలు జరిగాయి, శ్రీ సుర్జిత్‌సింగ్ బర్నాలా నాయకత్వం కింద అకాలీలు అక్కడ ప్రభుత్వాన్ని నడుపుతున్నారు ఇదంతా లౌకిక సిద్ధాంతాలకి ఒక విజయం అనటానికి వీలులేకపోయినా కనీసం ఒక అంతర్యుద్ధం వంటిది శాంతించిందని అనుకుని సంతోషించాలి దేశాన్ని వేధిస్తూ వచ్చిన "అస్సామ్ సమస్య" కూడా ఈ ఏడా పరిష్కారం అయింది. అస్సామ్ గణ పరిషత్ వారు ఎన్నికలలో గెలిచి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకున్నారు అస్సామ్‌లోని పరిణామాలని పంజాబులో జరిగిన దానితో పోల్చటం సరికాదు. ఒకచోట సిక్కులకి అన్యాయాలు ఏవీ జరగకపోయినా సంక్షోభం ఏర్పడితే, మరొకచోట అస్సామీ మాతృభాషగా కలవారు తమ స్వంత రాష్ట్రంలోనే తగిన గుర్తింపు లేకుండా బాధపడ్డారు ఇప్పుడు అస్సామ్ ఉద్యమాన్ని నడిపినవారే అధికారంలో ఉన్నారు వారు దూర దృష్టితో వ్యవహరించి తమ రాష్ట్రం ఎదుర్కొంటున్న చిక్కులని తీర్చుకొగలరని ఆశించాలి అంతర్జాతీయ రంగం సయితం రెండు అగ్రరాజ్యాల నాయకులు శ్రీ గోర్బచేవ్ శ్రీ రోనాల్డ్ రీగన్ జెనీవాలో కలుసుకుని అణ్వస్త్రాల ప్రమాదాలని తగ్గించే ఉద్దేశంతో చర్చలు జరిపారు. ఈ చర్చల ఫలితాలు అంత ఆశాజనకంగా లేవుని ముందు ముందు మంచి జరిగే అవకాశాలు పెరుగగలవని ఆశించాలి.

1985 కాంగ్రెసు పార్టీ శత జయంతి సంవత్సరం ఒక బ్రిటిషు వ్యక్తి చేత నెలకొల్పబడిన ఈ సంస్థ ఒక శతాబ్దం కాలంలో చాలా మార్పులు చెందింది సుమారుగా పదహారు సంవత్సరాల కింద ఆ రాజకీయ పక్షంలో వచ్చిన చీలి అన్నిటికన్నా ముఖ్యమయినదని అనిపిస్తుంది ఇప్పుడు ఆ పార్టీ నాయకులుగా ఉన్న వ్యక్తి ఎన్నికల మొత్తం మీద మనంగానే గెలిచారుని నేటి కాంగ్రెసు–ఐ గాంధిగారు, తిలక్ మహాశయుడు, బాబూ రాజేంద్రప్రసాద్, సర్దార్ వల్లభాయి పటేల్, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూల రాజకీయ పక్షం అనటానికి వీలులేదు పాకిస్తాన్, ఈజిప్టు, బంగళాదేష్, కొన్ని దక్షిణ అమెరికా ఖండపు దేశాల వలె కాకుండా భారతదేశం పార్లమెంటరీ పద్ధతి ప్రజాస్వామ్యాన్నే కొనసాగించుకో గలుగుతోంది ఈ వ్యవస్థ ఎన్నో రకాల రాజకీయ పరిణామాలని తనలో ఇముడ్చుకో గలుగుతోంది ఇన్ని మతాలూ, భాషలూ, సాంస్కృతిక సంప్రదాయాలూ కల భారతదేశం ఒకటిగా నిలబడటం పశ్చిమ యూరోపులోవారికే ఎందరికో ఆశ్చర్యం కలిగిస్తూ ఉంటుంది ప్రాంతం, భాష, మతం – వీటిక సంబందించిన అభిమానాలు ఇక ముందు కూడా భారతీయుల మధ్య ఐకమత్యానికి అడ్డు రావని ఆశించాలి భారతి అభిమాను లందరికీ కొత్త సంవత్సరం శుభాకాంక్షలు

విడి పత్రిక వెల : నాగు రూపాయలు

నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రయివేట్ లిమిటెడ్ తరఫున సంపాదకుడు ప్రచురణకర్త : శివలెంక రా

ముద్రణ : ఆంధ్రపత్రికప్రెస్, గాంధీనగరం, విజయ-3; సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ

# మహావర్తులం

## సాంధ్య శ్రీ

గడచిన ఆరోజులు ఎంత చిన్నవో
గుర్తులో దీర్ఘ కాలికాలై ఇప్పటికీ విడిపోవు
కదిలినప్పుడెల్లా
కనిపించని ఆపాదముద్రలే మనస్సైకతంలో
స్పష్టా స్పష్టంగా
ఆకళింపుదారం తెగని గుర్తులం
ఆనందమో అనుభవమో ఇది మననంలోని మహా వర్తులం....
యవ్వనపు పూలువి సిరిన పుప్పొడి తిరునాళ్ల
రంగుల దండ యాత్రలో
పొదరింటి హరివిల్లును ధరించి పరిమళాన్ని ఎక్కుపెట్టిన తరుశాఖలు
కుహూరుతాల నారి సారించి వదిలిన
వాసంత వేశంత మొక మహానరిత్తులో
తల మునిగిన వాడ్ని - అల్పుడ్ని....
గులకరాళ్ళ మధ్య దుడుకు దూకుడుతో
దొర్లుకుంటూ పోయిన ఇలా తరంగిణి
నా దుర్ని రీక్ష్యప్రభాదూర్ధ రచ్ఛటులతో
శప్తమై
తప్తమై - మూర్ఛనలు లేక
మౌనంగా మూర్ఛబోయిందని శతధా భిన్నమైన గుండె
కళ్లలోకి ప్రవహించినా
రాయితడవదు - రాగం వినబడదు
నీల గిరుల మీద పడిన
నల్ల మబ్బు తడి మెరుపుల
వర్షంలో- సంతతహర్షంలో మూర్తి కట్టిన పులకింతకు
రూపురేఖలు దిద్దాలనుకునేనా అవ్యక్తా వేశపు కుంచె
కరిగి కరిగి
గుండె కొండల మీంచి -నీరై - వాగై - వంకై - వరదై
అపాత జల పాతమై
ఎక్కడో అపరిచిత హృత్కుళంలో పడి
ఒకే ఒక్క పగడమైనప్పుడు
ఇంతానే నెక్కడున్నాను .......?

కాలం కౌగిలింతలో కరగని ఎన్ని యుగాలను
క్షణాల క్రింద ఖర్చుచేస్తూ
శరద్విభావరీ సంచలిత జ్యోత్స్నాంకిత హృదయాన్ని
తెల్లమబ్బు గొడుగు క్రిందకు చేర్చి
వెన్నెల మడుగులకు అడుగులొత్తిన
నా అసంకల్పిత చర్యలో
మూర్తి కట్టని ఋతువుని ముద్దుపెట్టుకున్న పెదవిని
నేనా ........... పదవిని ........ ?
నీ హార ప్రతి సీరల్లో
చిరుగాలికి చిద్విలాసంగా కదిలే మొక్క
తూర్పు సూర్యుడ్ని కవ్విస్తుంటే
ఓపలేనంత చూపుల స్పర్శని ఎంతసేపు ధరించానో
నా కన్నా ............
చెట్టైన మొక్కకు తెలుసు ....ఇంకా
ఏ బీజంలో ఇమడాలి ......., నేను.......?

వేగిపోతున్నాను
తొడిమ వీడిన పూవులా రాలి పోతున్నాను
అయితే నేం....
మనోజ్ఞ సుందర సామీప్యంగా మనసును హత్తుకొన్న
జ్ఞాపకాల బరువులో
మలుగుతున్న వెలుగు సాయంకాలం ఎర్రపడ్డప్పుడు
మందారం పెట్టుకొన్న ప్రౌఢ కౌగలించుకుంది కదా....
ఆ దివంగత సుఖాన్ని మననం చేసుకొన్న కాలపు అంచున
ఆకుపచ్చ తివాచీ పరుచుకున్న
అరకులోయ కుటీరంలో స్వప్నవాసవదత్త చూపుతడిని
ద్రాక్షాసవంగా మలిచి
ఎద దోసిళ్లలోకి వంచుతున్నప్పుడు
గుండె చప్పుళ్ల అనుభూతి
అద్వైతాన్ని ప్రవచించింది

ఎవరు సుఖీ
ఎవరు నఖీ ....!



# పరిచయాలు

## శ్రీ వసంతరావు వెంకటరావు

శ్రీ వసంతరావు వెంకటరావు గారి పేరు బారతి పాఠకులకే కాదు ఇతరులకు ఎందరికో కూడా సుపరిచితమయినదే వారు పేరుపొందిన విద్యావేత్త, రచయిత విజయనగరం మహారాజ కాలేజి ప్రిన్సిపాల్‌గా ఉన్నారు తెలుగు బాషా సమితి, తెలుగు అకాడమిలతో సన్నిహిత సంబంధం కలవారు

ఇప్పటిదాకా 200 పత్రికలలో, సావనీర్‌లలో 650 పయిగా వ్యాసాలు, గేయాలు నాటికలు పద్యాలు జనరంజక విజ్ఞాన గ్రంథాలు (తెలుగు) 29, కాలేజి స్థాయి బౌతికశాస్త్ర పాఠ్యగ్రంథాలు 7, ప్రమాణ భౌతికశాస్త్ర గ్రంథానువాదాలు 4 - వీటి రచయిత శ్రీ వెంకటరావు గారు

ముద్రణకి సిద్ధంగా ఉన్న రచనలు నేటి విజ్ఞానం - ఆత్మజ్ఞానం (బౌతికశాస్త్ర దృష్టిలో ఇటీవల వస్తున్న మార్పు), ఎస్ ఎల్ బోస్ స్మారకోపన్యాసాల అనువాదం (అంగ్ల మూలం ఆచార్య ఎస్ రామమూర్తి), ఒక రోజులో ఒక జీవితం (వైజ్ఞానిక గేయ సంపుటి)

రానున్న రచనలు జనరంజక విజ్ఞాన సాహిత్యం (తెలుగులో), బౌతికశాస్త్ర చరిత్ర కాలతత్వం (ప్రాచీన, ఆదునిక బావాల సమీక్ష, శ్రీ పేరి సూర్యనారాయణ గారితో కలిసి చేసినవి)

ఆచార్య వెంకటరావు గారి మొదటి వైజ్ఞానిక వ్యాసం తేజస్తరంగములు - తేజః కణములు 1934లో బారతి లో ప్రచురించబడింది'

---

**నేను పుట్టిన ఊరు గుంటూరు - చేస్తున్న ఉద్యోగం ఉస్మానియా విశ్వ విద్యాలయం తెలుగు శాఖకు అధ్యక్షం. 1. కవితా సంకలనం అగ్నిపుత్రిక ఇందులో చాలా కవితలు మీ భారతిలో ప్రచురింపబడినవే 2. కథల సంపుటి 'అయోథా' 3. పిహెచ్.డి. —తెలుగు జానపద గేయగాథలు**

**4. పరిశోధన | సాహిత్య వ్యాసాల 6. ఆంధ్రులకథ-ఆంధ్రుల చరిత్ర.**
**5. పరిశీలన | సంకలనాలు ఆంధ్రప్రభలో సీరియల్ అయింది-**
**7. కాశ్మీర దీపకళిక ఆంధ్ర జ్యోతిలో సీరియల్ అయిన తొలి అధునిక చరిత్ర. సాహిత్య వ్యాసాలలో కొన్ని భారతిలో ప్రచురితమైనవే—**

**ప్రస్తుతానికి జానపద సాహిత్య చరిత్రను తెలుగువారికి అందించాలనే ప్రయత్నంలో ఉన్నారు. మంచి కథలు వ్రాశానని వ్రాయాలని అనుకుంటాను,**

## శ్రీమతి నాయని కృష్ణకుమారి

---

నేను పుట్టిన స్థలం రేపల్లె గుంటూరు జిల్లా ప్రస్తుత నివాస స్థలము విశాఖపట్నము నేను ప్రస్తుతము ఆంధ్ర యూనివర్శిటిలో రీడరుగా హిస్టరి మరియు పురాతత్వశాఖలో పని చేయుచున్నాను

ఆంధ్రదేశంలో చాళుక్య చోళుల పరిపాలన అను పేరుతో ఇంగ్లీషులో ఒక పుస్తకము నాది ఇటీవల ప్రచురితమైనది దాదాపు ప్రతి సంవత్సరము నేను వివిద చారిత్రక సంఘాల వారు నిర్వహించే సాంవత్సరిక సమావేశాలకు హాజరవుతుంటాను నేను వ్రాసిన రచనలలో

ప్రస్తుతము యు జి సి వారిచే యంగ్ సయింటిస్ట్స్ ఎవార్డ్ ఇన్ సోషల్ సయిన్స్ ఎండ్ హ్యూమానిటిస్ 1984-85 క్రింద ఎంపిక కాబడి సుమారు ఒక లక్ష రూపాయల బడ్జెట్‌తో 'మద్యాంధ్ర దేశములో పంచారామములు అన్న రిసెర్చి ప్రాజెక్టుపై పని చేయుచున్నాను ఇది ఒక మూడు సంవత్సరముల కాలం వుంటుంది

పంచారామములు ఆంధ్రదేశములో బౌద్ధమతము క్షీణించిన పిదప స్తూపములపై లేదా అచ్చట బౌద్ధ అరామములు ప్రాతిపదికగా నిర్మింపబడినవని కొందరు చరిత్రకారులు, అట్లు కాక ఆంధ్రములో శైవము అనాదిగా వున్నదని దానికిని, బౌద్ధస్తూపములలోని అయక స్తంభములకు ఎట్టి సబంధము లేదని కొందరు చరిత్రకారుల వాదము

శైవ క్షేత్రములైన పంచారామముల పుట్టు ర్వోత్తరముల గురించి పరిశోదన మరియు ఆ దేవాలయ శాసనములు శిల్పము, వాస్తు నిర్మాణము మున్నగునవి నేను ప్రథమముగా తలపెట్టిన అంశాలు

ఇంతేగాక, విజయనగరము జిల్లాలో ఇంతవరకు పరిశోదించబడని, వెలుగులోకి రాని, గుల్లావెల్లి దేవాలయం పైన వ్రాసిన వ్యాసము, అనంతవర్మ చోడగంగుని 20వ విజయరాజ్య సంవత్సరము నాటి శిలా శాసనము కొరటాంలోనిది వలివేరులోని త్రైపురుషాలయము ఇంకా పచురిచవలసి వుంది

## డా. మైనేని కృష్ణకుమారి

---

వీరవల్లి గ్రామం (భోనగిరి దగ్గర నలగొండ జిల్లా) లోనే పుట్టినా (1938లో) హైదరాబాదు నగరంలో నే జీవితం కొనసాగుతోంది

కేశవ స్మారక విద్యాలయంలో ఇంగ్లీషు బోదించే ఉపాధ్యాయుడిగా గత ఇరవై సం ల నుంచి ఉద్యోగం (అంతకు పూర్వం కొంతకాలం పత్రికారచయితగా కూడా)

1965-70 దిగంబర కవితోద్యమంలో మిగతా అయిదుగురుతో బాటు -

1970-75 విప్లవ రచయితల సంఘం సాపక సభ్యుడిగా - కార్యదర్శిగా ఆ తర్వాత సైద్ధాంతిక విబేదాలవల్ల రాజీనామా -

పౌర హక్కులు - ప్రజాస్వామిక ఉద్యమంలో చురుకైన పాత్ర

'మీసా' కింద జైలు నిర్బంధం కూడా

1979-82 జనసాహితి సాంస్కృతిక సమాఖ్య స్థాపక సభ్యుడుగా -

ప్రజాసాహితి మాసపత్రిక సంపాదకుడిగా కొంత కాలం - ఆ తరువాత సంస్థాపరమైన విబేదాలవల్ల రాజీనామా

ఇటీవలే ఒక కథా కావ్యం పూర్తిచేయటం జరిగింది పయనిస్తున్న మానవ మహా కావ్యం (తాత్కాలికంగా అనుకున్న శీర్షిక) అనే ఈ కావ్యం గత 20 ఎళ్ళ యువతరం జీవితానికి - ఉద్యమానికి అంతర్నిహితమైన అభివ్యక్తినిచ్చిందని నమ్మకం

**ఇంతవరకు వెలువడిన పుస్తకాలు**

(1) మండుతున్న తరం (కవితా సంపుటి - 1972)

(2) ఈనాటికి (కవితా సంపుటి - 1984)

(3) గోడల వెనుక (జైలు జ్ఞాపకాలు ఇంగ్లీషు, పంజాబీ, హింది మళయాళంలోకి అనువదించబడింది)

(4) హైదరాబాద్ అజ్ఞాత చరిత్ర పుటలు (నిజాంనాటి ప్రజా ఉద్యమం - అనువాదం)

(5) మరో భారతదేశం (నవల)హిందీ నుంచి అనువాదం)

హింది ఇంగ్లీషు బాషలో కూడా మౌలిక రచనలు చేసి ప్రచురించారు 30 కథలు, 100 వ్యాసాలు వివిద అంశాలపై ప్రచురణ ఇంతవరకు

## నిఖిలేశ్వర్

---

## శ్రీ చేకూరి రామారావు

పుట్టినది ఖమ్మం జిల్లా మదిర తాలూకా ఇల్లిందల పాడు గ్రామం యువ సంవత్సర అషాఢ శుద్ధ పాడ్యమి (1935 జులై 1) సర్టిఫికెట్లలో 1-10-1934 అని పడింది

చదువుకున్నది హైస్కూలు సత్తెనపల్లి, నరసరావు పేట (అప్పుడు నరసరావు పేటలో నాయని సుబ్బారావు గారు హెడ్మాస్టరు)

హైద్రాబాదులో ఇంటరు, బి ఎ దాకా ఆంధ్రా యూనివర్సిటీలో ఎమ్ ఎ (తెలుగు) కార్నెల్ యూనివర్సిటీలో ఎం ఎ పి హెచ్‌డి లింగ్విస్టిక్స్

సిద్ధాంత వ్యాసం ఎట్రాన్స్‌ఫర్మేషనల్ స్టడీ ఆఫ్ తెలుగు

ఉద్యోగం ఉస్మానియా యూనివర్సిటీ హైదరాబాదులో లింగ్విస్టిక్స్ విభాగంలో ప్రొఫెసరుగా

రచనలు 1 రెండు పదులపైన గేయాలు (1982) 2 తెలుగు వాక్యం (1975) 3 వచన పద్యం – లక్షణచర్చ (సంపత్కుమారతో కలిసి)(1978) 4 తెలుగులో వెలుగులు ద్రావిడ భాషల ధ్వని, వాక్య నిర్మాణ విశేషాలపై రాసిన వ్యాసాలు ఇంగ్లీషులో లింగ్విస్టిక్ జర్నల్‌లలో అచ్చయినాయి

సాహిత్య వ్యాసాలు బారతి, సృజన, ప్రజాసాహితి వంటి పత్రికల్లో అచ్చవుతున్నాయి ఎక్కువ రచనలు బారతిలో నే అచ్చయినాయి

భాషాశాస్త్ర సిద్ధాంతాల సాయంతో తెలుగు సాహిత్యాన్ని పరిశోదించాలని, తెలుగు భాషపైని ఒక పెద్ద పుస్తకం రాయాలని, ప్రాచీనాంధ్ర బాషపైన పరిశోధన చేయాలని (నేను చెయ్యలేక పోతే విద్యార్థుల చేత చేయించాలని సంకల్పం)– అని రాస్తున్నారు శ్రీ చేకూరి రామారావు గారు

---

నేను ప్రస్తుతం విశాఖపట్టణంలో పురావస్తుశాఖలో రిజిస్టరింగు ఆఫీసరుగా పని చేయుచున్నాను ఆంధ్రదేశములో జైనమత వ్యాప్తిపై పరిశోధన చేసి నాగపూరు విశ్వవిద్యాలయము నుండి 1979 వ సంవత్సరములో 'డాక్టరేటు షట్టా పొందితిని జైనమతంపై పరిశోదనలు జరిపిన వారిలో మొట్టమొదటి ఆంధ్రుని అని విషయములపై చరిత్రకారులు దృష్టి సారించి ఆంధ్రమున జైనమత వ్యాప్తిపై పరిశోదన జరపక మౌనం వహించిరి డా నేలటూరి వెంకటరమణయ్య మరియు డా పరబ్రహ్మశాస్త్రి ఆశీస్సులతో ఆ వెలితిని నేను పూరించితిని

జైనమతం 24 తీర్థంకురులచే బోదింపబడినది ఆ 24 తీర్థంకురులను మన తెనుగుదేశంలోని శిల్పులు శిల్పించరా? వారి శిల్పాలకై ప్రస్తుతం శోధిస్తున్నాను ఏ ప్రాంతములో నైనా జైన శిల్పాలు వుండవచ్చును ఎక్కువగా పార్శ్వనాథుడు, మహావీరుని శిల్పాలే మనరాష్ట్రములో కన్పడుచున్నవి

జైనుల పండుగలు, వారి పూజావిదానంపై త్వరలో వ్యాసము పంపగలను లోగడ బారతి పాఠకులు జైన తీర్థంకురుల జీవిత విశేషములను బారతి ద్వారా ప్రచురించమని కోరిరి ఆ రచనను త్వరలో చేపడతాను

## ఘంటా జవహర్‌లాల్

పురోగమనానికి అదొక్కటే మార్గమని హృదయపూర్వకంగా విశ్వసిస్తాడు.

ఇంతకూ, ఆ నియమాల ప్రకారమే ప్రకృతి గమనం సాగుతుందని నిష్కర్షగా చెప్పడు. తన పరిశోధన లాధారంగా, పరిమితమైన దేశ కాలాలలో ఈ నియమాలు ప్రకృతి స్థితిని, గతిని విశదీకరిస్తాయి అంతవరకు సార్వకాలికమే.

వివిధ శాస్త్రాలకు పరస్పర సంబంధం కనుగొనడం కూడా విజ్ఞాని ఆదర్శమే. విశ్వ నిర్మాణానికీ స్థితికీ ఆధారభూతమైన నాలుగు రకాల బలాలు విశ్వంలో నున్నట్లు విజ్ఞానులు గుర్తించేరు. అవి : పరమాణు కేంద్రకంలో న్యూక్లియాన్లను బంధించి ఉంచే తీవ్ర బలం; ఉప పరమాణుకణాల అంతశ్చర్యలో పాల్గొనే అల్పబలం; కేంద్రకం చుట్టూ ఎలెక్ట్రాన్లను తిరగనిచ్చే విద్యుదయస్కాంత బలం; భూగోళాలు ఆకాశయాత్ర చేయడానికి అవసరమైన గురుత్వాకర్షణ బలం. వీటి తీవ్రతలలో చాలా వ్యత్యాసముంది అయినప్పటికీ, ఆ నాలుగింటినీ కలిపే ఏకీకృత క్షేత్ర సిద్ధాంతం ప్రతిపాదించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. బహుత్వంలో ఏకత్వం దర్శించడమే విజ్ఞానశాస్త్రి లక్ష్యం !

విజ్ఞాన శాస్త్రం హేతుబద్ధమైనదని జన విశ్వాసం. కొన్ని సందర్భాలలో ఒకే కార్యానికి వివిధ కారణాలుండవచ్చునన్న సత్యం విజ్ఞానం అంగీకరించవలసి వచ్చింది. నక్షత్ర గ్రహ గమనాలనూ, చెట్టు పట్టుతప్పి నేలకు రాలే పండ్ల గమనాలనూ విశదీకరించడానికి గురుత్వాకర్షణ నియమం 17వ శతాబ్దిలో న్యూటన్ ప్రతిపాదించేడు. మన అనుభవంలోనున్న సంఘటనలను ఆ నియమం చక్కగా వివరిస్తుంది. అయితే ఆ ఆకర్షణబలం పనిచేసే విధానం స్పష్టంగా తెలియదు. అది ప్రశ్నగానే మిగిలిపోయింది. కాని, ఈ శతాబ్దిలో దానినే మరో విధంగా ఐన్‌స్టైన్ వివరించేడు. ఖగోళ గమనాలకు వస్తువుల మధ్యనున్న ఆకర్షణబలం కారణం కాదన్నాడు. లక్షల మైళ్ళు నిడివిగల సూర్యుని వంటి ద్రవ్య గోళాలు వాటి నావరించిన ఆకాశకాల లక్షణాలలో మార్పు కలిగిస్తాయన్నాడు. అంటే, పెద్ద ద్రవ్యరాసి చుట్టూ ఉన్న ఆకాశ కాలంలో గురుత్వక్షేత్రం ఏర్పడుతుందన్నాడు. దాని మూలంగా ఆకాశ కాలంలో వక్రత ఏర్పడుతుందన్నాడు అట్టి వక్రమైన ఆకాశకాలంలో పడిన గ్రహాలవంటి గోళాలు వక్రతను అనుగమిస్తూ ఘర్షణ రహితంగా ప్రయాణం చేస్తాయన్నాడు. ఈ విధంగా ప్రతి గ్రహం తన కక్ష్య నేర్పరచుకొంది.

ఆకాశమంటే 'శూన్యం' అని సామాన్య భావన. అట్టి శూన్యంలో వక్రత ఏమిటి అనిపించవచ్చు. అది పరీక్షించే విధానం ఐన్‌స్టైన్ సూచించేడు కాంతి కిరణం సూటిగా పోతుంది. దానికి వంగడం తెలియదు. కాని, దాని మార్గమే వంకరగా ఉంటే అది వంగక తప్పదు కదా ! సూర్యుని ప్రక్కనుండి వచ్చి భూమిని చేరుకొనే నక్షత్ర కిరణాలు వంగుతాయని, ఆ వక్రత పారిమాణికంగా లెక్కకట్టి చెప్పేడు. నక్షత్ర కిరణం వంగడమేమిటి ? భూమిపైన ప్రయాణించే మనం వంగని సూటి మార్గాన పోగలమా ? భూమి బంతి ఆకారంలో నుండబట్టి, దాని తలం వక్రమైనది. అట్టి తలంపైన వక్రంగానేకాని సూటిగా పోయే అవకాశమే లేదు అట్లాగే, సూర్యునావరించిన ఆకాశ కాలవక్రత్వం వెంబడి పోయే కాంతి కిరణం వంగక తప్పదు.

ఆకాశకాల వక్రత పరీక్షించడానికొక విధానముంది. సంపూర్ణ సూర్య గ్రహణ సమయంలో సూర్యుని ప్రాంతంలోనున్న నక్షత్రాల ఫోటో తీయాలి. కొంతకాలం తరవాత, ఆ ప్రదేశంనుండి సూర్యుడు తరలిపోయినప్పుడు, మళ్ళీ ఆ ప్రదేశం ఫోటో తీస్తే, సూర్యుని ప్రక్కనున్న నక్షత్ర స్థానంలో మార్పు కనిపిస్తుంది. మొదటి ఫోటోలో నక్షత్ర ప్రతిబింబం ఏర్పరచిన కాంతి కిరణాలు సూర్యునావరించిన వక్ర ఆకాశ కాలంలో ప్రయాణం చేసేయి. రెండో ఫోటోలో నక్షత్ర కిరణాలు సూటిగా ప్రయాణం చేసేయి మొదటి ఫోటోలోని నక్షత్ర స్థానం అభివ్యక్త స్థానం, రెండో ఫోటోలో స్థానం నిజస్థానం. ఈ రెండింటికి గల వ్యత్యాసం ఆకాశ వక్రతను సూచిస్తుంది. అట్టి ప్రయోగాలుచేసి, ఆకాశకాల వక్రతను విజ్ఞానలోకం అంగీకరించింది.

ఈ సందర్భములో హేతువాద పరిమితత్వం స్పష్టమవుతుంది. గ్రహాలు సూర్యుని చుట్టూ తిరగడమనే ఒకే కార్యానికి విభిన్న కారణాలను విజ్ఞానం అంగీకరిస్తుంది. న్యూటన్ గురుత్వాకర్షణ నియమం ఒక స్థాయివరకు సరిపోతుంది. ఆ స్థాయి దాటిపోయినప్పుడు ఆ వివరణ చాలదు. భూవాసులకు నిత్య వ్యవహారంలో న్యూటన్ నియమం సరిపోతుంది. కాని, ఆకాశంలో పడి అపార దూరాలలోనున్న అసంఖ్యాక నక్షత్ర మండలాలైన గేలక్సీలను పరిశీలించినప్పుడు ఐన్‌స్టైన్ వివరణ అవసరమవుతుంది. అంటే, ఒక్కొక్క జ్ఞాన స్థాయికి ఒక్కొక్క హేతువాదం అవసరమన్న సత్యం అంగీకరించక తప్పదు.

ఆకాశగోళాల విషయం యోచిస్తే ఒక మహత్తర సత్యం గోచరిస్తుంది. ఆకాశంలో కదలకుండా స్థిరంగానున్న వస్తువేదీలేదు. గ్రహాలు తమలో తాము తిరుగుతూ సూర్యునికి నిత్య ప్రదక్షిణాలు చేస్తున్నాయి ప్రతి నక్షత్రం తనలో తను తిరుగుతూంది. నక్షత్ర కూటాలైన గేలక్సీలు ఆత్మ ప్రదక్షిణం చేస్తున్నాయి. గేలక్సీలో విపరీత వేగాలతో చెదిరిపోతున్నాయి. మన భూగోళమే స్థిరంగా లేదు. భ్రమిస్తూ, పరిభ్రమిస్తూ గమనిస్తూ ఉంది. జీవులకు నిలకడ తెలియనే తెలియదు. అయినప్పటికీ స్థిరంగా నున్నామన్న భ్రమకు లోనై ఉండటం ఆశ్చర్యమే ! మన అనుభవం సత్యానికి పూర్తిగా వ్యతిరేకంగా ఉంది. ఉన్నా, అనుభవమే సత్యమని నమ్ముతున్నాము.

సూక్ష్మాతి సూక్ష్మమైన పరమాణు లోకాలను ఉప పరమాణు లోకాలను యంత్ర సహాయంతో దర్శించినప్పుడు మన లౌకిక జ్ఞానం కేవలం నిరుపయోగమవుతుంది. ఇప్పటికి 100 కణాలకు పైగా ఉప పరమాణు లోకంలో గుర్తించినట్లు విజ్ఞానులు చెబుతారు. పరమాణు నిర్మాణంలో పాల్గొనే కణాలు మూడు మాత్రమే 50 ఏండ్ల క్రితం తెలుసు. అవి ధనావేశంలోగల ప్రోటాను, ఋణావేశం గల ఎలెక్ట్రాను, ఆవేశంలేని తటస్థ కణం న్యూట్రాను, ప్రోటాను న్యూట్రాన్లు బరువైన కణాలు; ఎలెక్ట్రాను సాపేక్షంగా తేలికైన కణం. పరమాణువులోని ప్రోటాను న్యూట్రాను కలిసి అత్యల్ప ప్రదేశంలో కేంద్రకంగా ఏర్పడి ఉన్నాయి. దాని చుట్టూ ఎలెక్ట్రాన్లు తిరుగుచున్నట్లు భావిస్తారు.

ఇట్టి సహజ పరమాణువులు ప్రకృతిలో 92 ఉన్నాయి. అవే మూలకాలు. ప్రతి మూలకానికి నైసర్గికమైన ధర్మాలున్నాయి పరమాణువులు స్థిరమనీ, వాటిని మార్చడం అసాధ్యమనీ అనుకునేవారు. కాని, వాటిలోనే ఒక రకం రేడియో ధార్మిక మూలకాల పరమాణువులు ఆకస్మికంగా విఘటనంచెంది, మూడు రకాల కిరణాలను వెలువరిస్తాయని ప్రయోగాలు చూపించేయి ఆ కిరణాలలో బీటా కిరణాలు అనేవి ఎలెక్ట్రాన్ల ప్రవాహాలు. ఈ కిరణాలు కేంద్రకము నుండి వెలువడుతాయి కేంద్రకంలో ఎలెక్ట్రాన్లు లేవు అందుచేత న్యూట్రాన్లు ప్రోటాన్లుగా రూపాంతరంపొంది ఎలెక్ట్రాన్లను వెలువరిస్తున్నాయని భావించవలసివచ్చింది ప్రయోగాలమూలంగా తెలిసినవిషయమేమంటే; న్యూట్రాను ఎన్ నుండి ఎలెక్ట్రాను ఇ· వెలువడినప్పుడు దానితో బాటు అంటి న్యూట్రినో అనే కణం కూడా బహిర్గమిస్తుందని, ప్రోటాను మిగులు తుందని,

$$\text{ఎన్} \rightarrow \text{ఇ}^{-} + \text{వి}^{-} + \text{పి}$$

ఇట్టి రూపాంతరకణాలు రేడియో ధార్మిక మూలక కేంద్రకాలలో నియమానుసారంగా నిత్యం జరుగుతున్నాయి అందుచేత, కేంద్రకము కూడా స్థిరంగా లేదని స్పష్టమయింది.

రేడియో ధార్మిక కేంద్రకాలనుండి వెలువడే ఆల్ఫాకణాలు హీలియం కేంద్రకాలు, వాటి సంకేతం ${}_{2}\text{హెచ్ ఇ}^{4}$. వాటిలో కొన్ని మూలకాలను తాడనం చేయగా వాటి కేంద్రకాలు రూపాంతరం పొందడం గమనించేరు కాబట్టి, మూలకాలు కూడా శాశ్వతమైనవి కావనీ, అవి రూపాంతరం పొందుతాయనీ నిర్ణయమయింది ఉదాహరణకు, అల్యూమినియం (సంకేతం ${}_{13}\text{ఎ ఎల్}^{27}$)ను ఆల్ఫాకణాలతో తాడనం చేసినప్పుడు మూలకం సిలికన్ (సంకేతం ${}_{14}\text{ఎస్ ఐ}^{30}$)తో బాటు ఒక ప్రోటాను ఏర్పడుతుంది.

$${}_{13}\text{ఎ ఎల్}^{27} + {}_{2}\text{హెచ్ ఇ}^{4} \rightarrow {}_{14}\text{ఎస్ ఐ}^{30} + {}_{1}\text{హెచ్}^{1}$$

అని వ్రాయవచ్చు. అంటే శక్తివంతమైన కణాలను మూలకాలపైన ప్రయోగించినప్పుడు క్రొత్త మూలకాల సృష్టి జరుగుతుంది.

ఈ నేపథ్యంలో, కణాలను కాంతివేగాన్ని సమీపించే వేగంతో త్వరితము చేయగల యంత్రాలు నిర్మించి, వాటిలో కణాల సంఘాతాలు అధ్యయనం చేసినప్పుడు రకరకాల క్రొత్త కణాలు దర్శన మిచ్చేయి. వీటిని ప్రాథమిక

కణం అదే దిశలో గమిస్తూ 'ఏ' నుండి 'ఎ' ని చేరుకొనేసరికి లంబపాదం 'డి' వద్ద వెనక్కు తిరిగి 'సి' ని చేరుకొంటుంది 'ఎ' వద్ద బయలుదేరిన కణం ఒక ఆవృత్తి పూర్తి చేసుకొనేసరికి, దాని లంబపాదం ఒక దోలనం పూర్తి చేస్తుంది ఇదే విధంగా, వృత్తపరిధిపైన కణం నిర్విరామంగా తిరుగుతూంటే, లంబపాదం 'సి' నుండి 'డి' కి, 'డి' నుండి 'సి' కి దోలాయమానంగా గమిస్తూ ఉంటుంది సి నుండి బయలుదేరి అసమవేగంతో 'డి' ని చేరుకొని, అక్కడ తాత్కాలికంగా ఆ దిశ మార్చుకొని 'సి' వైపు అసమవేగంతో గమిస్తుంది కణగమనం సమవేగంతో అవిచ్ఛిన్నంగా జరిగితే, లంబపాద గమనం డోలాయమానమై అసమంగా సాగుతుంది అంతేకాక సి, డి, అనే రెండు ధ్రువాలను ఏర్పరుస్తుంది కణగమనంలో లేని ధ్రువాంతరగమనం కణలంబపాదగమనానికి ప్రాప్తించింది అవిచ్ఛిన్న గమనం విచ్ఛిన్న గమనంగా వ్యక్తమయింది ఒక్క పరిమాణం లోపించడం వల్ల యధార్థానికీ అనుభవానికీ ఎంత వ్యత్యాసముందో గమనించగలము యధార్థమైనది వృత్తీయ సమగమనం; అభివ్యక్తమయినది రేఖీయ అసమగమనం. ఒక్క పరిమాణజ్ఞానం లోపించడం వల్ల ఏర్పడిన ద్వంద్వాలు. పరిమాణాన్ని అధిగమిస్తే మాయమవుతాయని స్పష్టమే కదా !

శీతోష్ణాలూ, సుఖ దుఃఖాలూ, వెలుగు చీకట్లూ వంటి ద్వంద్వాలను నూతన దృష్టితో విజ్ఞానం వివరింపపూనుకొంటూంది. నాలుగు పరిమాణాలలో జరిగే సంఘటనలను, మూడు పరిమాణాల జ్ఞానంతో అర్థం చేసుకొంటున్నప్పుడు వాస్తవం అవగాహన కాక, దాని వికృతి మాత్రమే అనుభవమవుతూంది. అందుకే ద్వంద్వాలు మనః కల్పితాలన్నారు. కణం యొక్క చలద్వైక్యతను లోపించిన పరిమాణం విడగొట్టి, ద్వంద్వాలుగా ప్రదర్శించింది. అభివ్యక్త పాదగమనాన్ని అధిగమించి కణగమనాన్ని రెండు పరిమాణాలలో దర్శించినప్పుడు ద్వంద్వాలే కనిపించవు. వాస్తవ సత్యాన్ని దర్శించిన భర్తృహరి "నమశ్శాంతాయతేజసే" అన్నారంటే ఆశ్చర్యమేముంది ?

ఇంతవరకు విజ్ఞానం గుర్తించిన వాస్తవాలను సమీక్షిద్దాము స్థూల నక్షత్ర లోకంలో గమనరహితంగా స్థిరంగా ఉన్న గోళమే లేదు. నిలకడకు తావులేదు ఉపపరమాణు లోకంలో ప్రాథమిక కణాల సృష్టి స్థితిలయాలు నిత్యం జరుగుతున్నాయి. ఆకాశంలో శూన్యమంటూలేదు. మన భూగోళం మహావేగంతో పరుగెత్తుతూంది అయినప్పటికీ మనం నిలకడగా ఉన్నామని సంబరపడుతున్నాము. ఇది జ్ఞానజనితమా ? అజ్ఞాన జనితమా ? కాల పరిమాణం మన ఊహ కందదని ఒప్పుకోక తప్పదు పై కారణాల వల్ల వాస్తవం తెలుసుకొనే అవకాశం ప్రకృతి శాస్త్రాలు కలిగించలేవు అందుకే "స్వానుభూత్యేకమానాయ"

అయితే అవిచ్ఛిన్నంగా నిరంతరం జరిగే శివతాండవం దర్శించాలన్నా, అందులో పాల్గొనాలన్నా మానవుడు నక్షత్ర స్థాయికి పెరగాలి, లేదా, పరమాణు స్థాయికి కృశించాలి. అప్పుడు అనుభూతమయేది అత్యద్భుత శివ తాండవం. నక్షత్రానికీ పరమాణువుకూ పరిమాణంలో మధ్యనున్న మానవుడు సత్యం దర్శించలేక అభివ్యక్త విశ్వమే సత్యమనే భ్రమకు లోనవుతున్నాడు.

# ఏది ?

## మొవ్వ వృషాద్రిపతి

కమలాకరములు – కుముదాలయములు
భ్రమరాకులములు – కాసారమ్ములు
కావవి నే డాహ్లాదకరమ్ములు
పంక పూర్ణములు – శంకాకీర్ణము
లనుపమ జల నీలీ శీర్ణమ్ములు.

రాజ హంసములు – చక్రవాకములు
క్రౌంచబకాదిక జల శకుంతముల
తత విహారములు – నుత కూజితములు
మాసిపోయినవి – బాసిపోయినవి.

కారెను పోతుల క్రుమ్ములాటలకు
ఊరపందిగమి – పోరలాటలకును
మదకరి విసరవు చెర లాటలకును
ఆలవాలములు – భయామేయములు
భయదనక్రముల – వీర విహారము
సర్ప సంతతుల – స్వైర ప్రచారము
తిమి తిమింగిలపు – ధృతి సంచారము
లారు కాలము లు – మేర మీరినవి
ప్రకృతి కిది యొక వికృత తలమో ?
వికార సుందరి కిది ప్రతిబింబమొ ?
స్వార్థ విలాసిని హేలానృత్యమొ ?
నవ నాగరికత కమరిన రూపమొ ?
పరుధులు దాటిన – భావదాస్యమో
భావము నొంచిన – మోహముద్రయో
వ్యామోహమ్ముల నవయగ జేసిన
లోలత్వమ్ముల వ్యాపకత్వమో ?

# మేమేం చేసేది ?

## కాలువశ్రీ

ఆకాశవాణిలో
అనవరతం చెప్పే
అభివృద్ధి కార్యక్రమాల గూర్చి
వినాలనే వుంది
        వీడియోల్లో చూపే
        రంగు రంగుల బొమ్మలను
        నగ్న సౌందర్యాలను
        విలోకించి తరించాలనే వుంది.
దూరదర్శనల ముందు కూర్చుని
మీ దివ్య మంగళ విగ్రహాలను
దర్శించుకోవాలనే వుంది
జారు సెలవిచ్చే దేశ పురోగతిని గూర్చి వింటూ
వీనులకు విందొనర్చాలనే వుంది.
        కాని
        మా దేహాలను పూర్తిగా కప్పుకోవటానికి
        నాసిరకం బట్టలైనా కొనుక్కోలేని మేము
        వాట్నెలా ఖరీదు చేసేది !
కాళ్ళుచాపి పడుకుంపే కుండలు తగుల్తా యని
ముడుచుకొని మాత్రమే పడుకునే మేము
వాట్నెక్కడ పెట్టుకునేది ?
        ఉన్న మారాజుల ఇండ్ల కెళ్ళి చూద్దామనున్నా
        ఏరోజూ కడుపు నిండా తిండి దొరకని మాకు
        రేపటి కూలి గూర్చి చింతే తప్ప
        వాటి ముందు కూర్చునే ఓపికెక్కడిది ?

# బెమ్మానందం

శ్రీ రంధి సోమరాజు

అన్నీ తీరి పోనాయి
మంచీ సెడ్డా...కట్టం....సుకం
ఆకలీ అవత్తలూ
అన్నీ అన్నీ తీరిపోనాయి !
కల్లాకపటం కలికానికి నేదు
సిగపట్లూ నేవు గిల్లి కజ్జాలూ నేవు
అంతా సావానగాళ్లే....సేయితులే....
ముద్దు ముచ్చట్లు ఎన్నెల దేవుళ్ళు
వోరూ వోర్నీ వొదులుకోరు
అందరూ అందరికీ సుట్టాలె
వొల్లమాలిన పూలవూసుల సుట్టాలు
గొప్ప గొప్ప ఇసేయాలమీద
య్యేంత తిన్నని వూహలో....
తెల్లార్లూ ఆసిరి మొగ్గ సిందులే....
అస్సలు తెల్లారడమేటి !
సుట్టూత సూరి దేవుళ్ళే
రెప్ప మూత్తేనే ఎల్తురు పెరిగిపోద్ది !
నిద్దర్నీ అలసటునీ సిదిమీసినాది బతుకు
అదేటో వొయ్యారంగ
గాలి బుడగ పొరనాయ్యా బతుకు
ఏటోగ మిగిలి పోతున్నాది
ఆ సార 'నానున్నాను....నానున్నాను' అంటోంది.
య్యేంత తెలివిగా ఉంది !
అదే పేనమా........?
'యెరుక' అంటారే అదే అయ్యుంటాది తప్పాదియ్యా....
కల్లు సిల్లు లొడ్పేసుకుంటే ఆపడ్తాదే
పెసలద్దాలతో సూత్తే ఆపడ్డాదే
అంత సన్నగున్నాది ఆ సార....
బెమ్మాండాన్నే మోత్తోంది
అదేనేమొ ఎలుగుతెలిసినోల జందెప్పోన !
అదే....అదే
అడ్డూ దాపూలేని మిన్నేటి సుక్కల తపను మంటలూ....
గడ్డకట్టించేసే సలివిడి ముద్దల వూపగాలులు

ఆ సలిపుట్టల రుసుల పలుకులూ
కొండల్ని పెవాహాలు సేసీసే
పాలపుంత సుట్టూత ఎన్నెల సంగీతాలూ
ఆ 'సార' కే ఆరతు లిత్తున్నాయి
య్యా ఆనందాన్ని పట్టునేక
దూరాన్ని; దగ్గర పెనేసీసుకుంది !
వుత్తర దచ్చినాల సూదంటుకేగి లంటే అదే....
మరి యిడి పోడ మేటి ?
అది పేరుక పోయిన, స్త్రీటాయినా అతుక్కుపోయిన
'సుక్కురాల' కౌగిలి !
అందుకేనర్రా....యీ రాళ్ళు దేవుళ్ళ !
అయిస్టీనో ఓడో సెయ్యేట్టి పగలదీత్తాడు
అప్పుడెయ్యి ఏలకోట్లు నోకాలు....రూపాలు....
య్యింక సావేటి
అస్సలు దేవుడికి సావేత్రటోరే ...
సెర్మమూ పేనము, పేనము సెర్మమూ....
ఇడి పోని పేవుబోతుల్లా కలేసీసుకున్నయ్యేయ్యేమో....
య్యింక పండుటాకు జారి పోయినట్టు
య్యెక్కడికి జారిపోవడం ?
బూదేవత ఒడి నోకా....
నచ్చత్రాల గుండెగూడుల్లోకా....
కాదు....కాదు....నీలోకి నువ్వే....
అడుగూనేదు కప్పూనేదు
ఆమాట కొత్తే ఆకాసెమే నేదు....
అంతటా వున్నదే వుంది
లేని దనే దన్సలు నేదు
ఔనౌను....వున్నదే వుంది !
ఆ వూసె త్తితేనే ఆయి !
వోరి అయ్యా....
బెమ్మానందం అంటే య్యేదేలా....
ఔనౌను
యిదే యిదే బెమ్మానందం !

# నే ధన్యనైతిని!

గుమ్మడిదల దుర్గాబాయి



"శ్రీలా! లీలా! యింతవఱకేమి చేయుచుంటివే! అబ్బా! రాట్నమున్న నీకు తిండియు, నిద్రయు కూడ నక్కఱలేదుగదా! తండ్రిగారు నీకొఱకై వేచియున్నారు భోజన మొనర్చి తిరుగబోగూడదా!" యనుచు కమలాబాయి లో వసారాలో నుండి తన ప్రేమంపు పుత్రిక యగు లీలను పిల్చుచుండెను. "వచ్చుచుంటి నమ్మా" యని చెప్పుచు లీల రాట్నము నక్కడ దిగవిడచి కదురు తీసి తన బీరువాలో జాగ్రత్తపరచి తండ్రి యొద్దకు జనియెను.

శ్రీనివాసరావుగారప్పుడే భోజన మొనర్చి కోటు తొడుగుకొని కమలాబాయి అందిచ్చు తమలపాకు మడుపులందుకొనుచు, 'నే డెక్కడ మన లీల జాడ గానబడదే! పాఠశాల నుండి యింటికి వచ్చినదా?' యని యేమొ పల్కబోవు చుండగానే లీల తండ్రిగారిం జేరి, 'నాయనా! రేపు రాబోవు డిశంబరు నెలలో జరిగెడి కాంగ్రెస్ మహాసభకు జరుగబోయెడి వస్తు ప్రదర్శనముకై మా పాఠశాలోపాధ్యాయులు యే బాలికలు చాల సన్నముగ నూలు వడకి తెత్తురో వారలచే నూలు దండలు తయారుచేయించి వారల కొక బహుమాన మిత్తుమని నుడివి యుండుటచే నే పాఠశాల నుండి వచ్చిన దాది రాట్నము వద్దనే యుంటివి. కావున నా అలస్యమునకు క్షమింపవేడెద'నని పలికెను. 'అమ్మా! నీ కార్యదీక్ష కెంతయు సంతసించితిని. లెమ్మా వేగ జని భోజన మొనర్చి, నూలు వడికి నీ తోడి బాలికలలో విజయలాభమంది నీ వుపాధ్యాయుల ఆదరమునకు పాత్రురాలవు కమ్మని ఆశీర్వదించి తండ్రి ప్రొద్దగుట జేసి వేవేగ కోర్టునకు వెడలెను.

శ్రీనివాసరావుగారు ఆ గ్రామమందు పలుకుబడి కలిగిన యొక సంపన్నగృహస్థు; శాంతస్వభావము గలవాడు; భూతదయాపరుడు; బిరుదు లనెడి బురదలో దిగబడి ధనతృష్ణాతురుడై స్వార్థమన్నది వీడకయుండు పెద్ద మనుష్యుల వలెగాక, తన కున్న కొద్దియో, గొప్పయో పరుల సహాయార్థమై వినియోగించుచు, తోడి సత్పురుషుల మెప్పించుచుండెడివాడు. కమలాబాయి కూడా తన పతి సుగుణముల కేమాత్రము తీసిపోవక, పతి ఆదరణకు లోనై ఆయన సత్సంకల్పములకు చేయూత నొసంగుచు తోడి స్త్రీజాలికెల్ల తలమానికమై యొప్పుచుండెను. ఈ కమలా శ్రీనివాసదంపతుల కేకమాత్ర పుత్రిక లీల. లీల లీలలం గాంచుచు ఆ దంపతులందుచుండెడి సంతోషమునకు మేరలేదు. అయిదేడులు వచ్చినతోడనే లీల తనకు తానై పాఠశాలకు బోయి యుపాధ్యాయులు చెప్పెడి పాఠములందధిక శ్రద్ధవహించి వారి యెడ వినయ వివేకములతో ప్రవర్తించు తన నెచ్చెలులలో నగ్రగణ్యయై వెలుగుచుండెను.

సాయంకాలమయ్యెను. గోగణము తమ తమ నెలవులు చేరుచుండెను. పక్షులు పోట యెరనిడి తమ తమ లాయముల వైపు తిరుగుచుండెను. బాలురు, బాలికలు, పాఠశాలల విడిచి తమ తమ పాఠముల గూర్చి యొండొరులతో ముచ్చటించుకొనుచు ఇండ్లకు జేరుచుండిరి. లీల కూడ చేత పుస్తకములనిడ గృహము జేరెను. కమలాబాయి లోన వంటచేయుచుండెను. వంట పనులలో తల్లికి కొంత సహాయ మొనర్చి లీల తన చిన్ని పూదోటలోని మొక్క లెట్లున్నవో చూడనేగెను శ్రీనివాసరావుగారు ఆఫీసునుండి యప్పుడే యింటికి వచ్చిరి. కాలు సేతుల గడిగికొని బల్లపైనున్న వార్తాపత్రికను గైకొని కాంచుచుండెను. కొంత సేపటికి 'లీల యెక్కడ?' యని యాయన సేవకు నడిగెను. 'అమ్మాయిగారిప్పుడే పూదోటలోని కేగియున్నా' రని సేవకుడు చెప్పెను. తిన్నగా తాను కూడ తోటలోనికి జని సాక్షాత్ వనలక్ష్మికిం బోలె పశ్చిమాంబుధిని గ్రుంకనున్న వృద్ధభానుని అరుణకాంతులు ముఖమునందలమి కొన చిన్ని చేతులతో గాలి కెగురు ముంగురుల నెగద్రోసి కొనుచు నడుమ నడుమ తా బడిలో నేర్చుకొన్న జాతీయ గీతములం బాడుకొనుచు పూలమొక్కల నడుమ తిరుగాడు లీలంగాంచి 'ఆహా! అపార కృపామయుడగు భగవాను డెట్టి సుగుణఖనిని నాకు లభింపజేసినాడు! ఈ బాలకు సదయ హృదయమునకుం దోడు దేశభక్తి కూడ నలవడినది! నా హృదయగతమగు ఆశ చిగిర్చి పుష్పించి ఫలించు సూచనలు సుగుణమణి యగు యీ లీలా మూలముగ భగవంతుడు నాకు గాన్పింపజేయుచున్నా'డని మనమున తలపోయుచు తదేకధ్యానమున ఆమెను వీక్షించుచుండెను. ఇంతలో ఇంటి నుండి 'శ్రీనివాసరావుగారున్నారా?' అను కేక వినబడుటతోడనే ఆలోచనా పరం పరలో మునిగియున్న ఆయన 'ఇదిగో వచ్చుచుంటి' నని లోనికరిగెను. రాత్రి చీకటులు గ్రమ్ముకొనుటం జేసి లీల కూడ వనవిహారము చాలించి యింటిలోనికరిగెను.

* * *

శ్యామసుందరుడు కొంచెము పొడవరి. దా దాపిరువది యేండ్లుండవచ్చును. విశాలనేత్రములు, ఆజానుబాహువులు, సమున్నత శరీరము, పసిడి ఛాయయుకల్గి ఆతడు చూపరులకెంతయు ముదముగూర్చుచుండెను. అతనికి సౌందర్యమునకు తోడు సహజసద్గుణములు సువర్ణమునకు తావి యబ్బినట్లు ఒప్పుచుండెను. అతని శరీరచ్ఛాయకు తోడు ఆతడు ధరించియున్న ఖద్దరు వస్త్రములు అతనికొక వింత యందము కూర్చుచుండెను. అతడు ఆ గ్రామములో ఉన్న దొరతనమువారి కళాశాలయందు పట్టపరీక్షకు చదువుచుండెను. అతడు ప్రతి పరీక్షలోను అగ్రస్థానమలంకరించి రాజధానికంతయు ప్రథముడుగ నుత్తీర్ణుడగు చుండెడివాడు. ఈతనికి కేవలము విద్యయందే కాక హాకీ, క్రికెట్, టెన్నిస్ మొదలగు ఆరోగ్యాభివృద్ధి నొసగు వ్యాయామముల యందు కూడ చాకచక్యము కడుమెండు. ఎన్ని మారులో నాతడు సహాధ్యాయ బృందముతో గలిసి దేశ

దేశాంతరముల కేగి తా నేర్చుకొన్న వ్యాయామ పరిశ్రమల యందు ఎదిరి బృందము నోడించి, పొగడ్తలనంది తా చదువుకొన్న, కళాశాల కొక అలంకారమని

పేరువడసి జయలక్ష్మిని చేబట్టి పురమునకు, మరలెడి నృపతికైవడి జయజయ ధ్వానములతో గ్రామమునకు మరలుచుండెడివాడు. కాని ఈతని సుగుణములను గనివిని మరియు భాగ్యము లేకుండగనే ఈతని తలిదండ్రు లిహలోక సౌఖ్యముల వీడిపోయిరి. తలిదండ్రులు లేని లోటులేకుండ ప్రసాదరావు తమ్ముని అతి గారాబముతో చూచుచు కంటికి రెప్పవోలె కాపాడుచుండెడివాడు. ప్రసాదరావు కొంచెము ముంగోపముగలవాడు. తాపట్టిన కుందేటికి మూడే కాళ్లను వారిలో నొకడు. ఈతడు దొరతనమువారి కొలువునందుండి వారి అడుగులకు మడుగు లొత్తుచు, స్వేచ్ఛకు తిలాంజలి నొసంగి స్వార్థమునే కోరుచుండు మహనీయులలో నగ్రస్థాన మలంకరించెను. ఈతని తమ్ముని ఎన్ని మారులో ఖద్దరు వస్త్రముల విడువమని బోధించెను. కాని, విఫల మనోరథుడగు చుండెను. రాట్నమన్నను, ఆతనికి జనియించెడి క్రోధ మింతింత కాదు. శ్యామసుందరుడు కళాశాల నుండి వచ్చిన దాది మాతృసమానయగు వదిన లక్ష్మీబాయి యొద్ద గూర్చుండి ఆమెకు రాట్నము వడకుచుండుట నేర్పుచున్నప్పు డెంతయు మనమున విసుగు చెందు చుండెడివాడు.

ఫిబ్రవరి నెల దేశమంతయు సైమన్ కమీషను బహిష్కరణాందోళనలతో అల్లకల్లోలముగ నుండెను. ఏ పత్రికల జూచిన నీ వార్తయే ! యెవరినోట విన్న నీ మాటయే ! నాడానగరమం దెక్కడ చూచినను విద్యార్థుల సంరంభమే. శ్యామసుందరుడు ప్రాతః కాలకృత్యముల నెర వేర్చుకొని శుద్ధమైన ఖద్దరు వస్త్రమును ధరించి జాతీయైకమత్యమునకు మూలకారణ మనదగు జెండా చేతనిడి అన్నగా రెంత వలదనుకున్నను తన భావి జీవితమెట్లు పరిణమించునో యను సందేహ మిసుమంతయును లేక దృఢదీక్షాపరుడై "మహాత్మ గాంధీకి జయ్" అని కేకలిడుచు రణరంగమున నుండి వీడునికైవడి తోడి యువకుల ప్రోత్సహించుచు నగర సంకీర్తనలో పాల్గొనుటకై వెడలెను. సాయంకాల మయ్యెను. పట్టణపురమందిర మంతయు స్వచ్ఛంద సేవకుల యుత్సాహముతో; బాలుర జయజయ ధ్వానములతో గూడ కర్మచారుల తత్తరపాటుతో; అల్లకల్లోలముగ నుండెను. శ్యామసుందరుడు నాటి సభయందు స్వచ్ఛంద సేవాదళ నాయకుడై యెక్కడచూచిన తానయై నాయకుల గంభీరోపన్యాసముల నతిశ్రద్ధగ నాలించుచు; మనమును త్సాహస తరంగములు మొలకలెత్త ఆవేశ పూరిత హృదయుడై ఒకచో గూర్చుండి తనలో తానిట్లు తలపోయ దొడంగెను 'అయ్యో ! ఈ యుపన్యాసముల వినిన కొలది నా యొడలు జల్లుమనుచున్నదే ! నేనింతవర కెంత మూర్ఖుడనై యుంటిని ! దాస్యశృంఖలా బద్ధునిగ నొనర్చు యీ విజాతీయ విద్య నేర్చుకొనుటయందు నా యమూల్య మగు కాల మెంత వృథా ఖర్చు చేసితిని ! ప్రపంచమున దైవ సృష్టిలో స్త్రీలు స్వాతంత్ర్య దేవతలుగ పరిగణింప బడుచుండ పురుషులు దాము తమ స్వేచ్ఛా జీవనమును నిగళ బద్ధముగ నొనర్చు కుంటయే కాక తమ భార్యా పుత్రికల గూడ దాస్య వృత్తిని ప్రబోధించి విద్యా విధానములకే దోసి లొగ్గింప జేయుచుండ, ఇక వారలయందు జాతీయతా బీజములు మొలకలెత్తు టెట్లు ? మన కన్న తల్లి మన దేశమాత, మన మాతృభూమి యొక్క స్తనముల పాలం గ్రోలి ఆమె యొసగు సుమధుర, సుశీతల జలముచే, పెంపబడి కర్తవ్య విమూఢులమై, ఆమె పర పదదళిత యగుచుండ గాంచి, స్వేచ్ఛా పరులమై విలాస తరంగములలో మునిగి తేలుచుంటిమే ? అయ్యో ! తలచుకొన్న కొలది నా గుండె నీరగుచున్నది. రెండక్షరముల తోకగ తగిలించుకొని బిరుదులకై యాశపడియుండు మహనీయులలో నే నొక్కడను గావలసివచ్చెగా ! అయ్యో ! ఎంత యవివేకినైతి, ఎట్టి దేశద్రోహినైతి. ఇకనైనను నాయీ తుచ్ఛ దేహమును దేశసేవకు, మానవసేవకు అర్పించి, నా జీవితమును సార్థకము జేసికొనెద గాక' అని కృతనిశ్చయుడై అప్పటికి తొమ్మిది గంటల రాత్రియగుటచే అన్నగా రేమందురో అను భయమున కాళ్లు ముందరపథమును బంధించుచుండ ఇంటివైపు మఱలెను.

* * *

నాడు అమావాస్య. ఆకసమంతయు కటిక చీకటులచే, కారు మబ్బులచే భయానకమై చూపట్టుచుండెను. మేఘగర్జనములు భయంకరశబ్దములు శ్రీనివాసరావుగా రింటియందుండెడివారల హృదయములు మరింత కలవరపఱచు చుండెను. నేటికి వారము దినముల నుండి శ్రీనివాసరావు గారు ప్రబల బాధచే పీడితులగుచున్నారు. వైద్యశిఖామణులు అనేకులు రోగినిగాంచి నిరాశను వెల్లడి పఱుచుచుండిరి లీలాకమలల హృదయములు మిగుల క్షోభిల్లుచుండెను. పిడుగుల ఫెళఫెళారావములు వారి భయకంపిత హృదయములను మరింత కలవర పరచుచుండెను. రోగి కను నీరసించి, శల్యావశిష్టుడై యుండెను. కమలాబాయి విచారసంతప్త హృదయయై ఆర్తత్రాణ పరాయణుండగు భగవంతుని వేనోళ్ళ స్తోత్రము చేయుచు పతి పాదముల చెంత కడు నిశ్చలమానసయై గూర్చుండెను.

అర్ధరాత్రి. జగమంతయు గాఢాంధకార బంధురమై యుండెను. నక్షత్రముల కాంతిగూడ సన్నగిల్లెను. మిణుగురుపుర్వుల స్వల్పకాంతులు తక్క వేరొండు వెలుగు లేదు. ఆకసము మేఘావృతమై, వర్షము వచ్చెడు సూచనలు పొడసూపుచుండెను. ఇట్టి భయంకర సమయమున ఇర్వురు యువకులు ద్విచక్ర శకటముల నధిరోహించి కడువేగముగ బోవుచు ఇట్లు సంభాషింప మొదలిడిరి.

"అయిన, రాధాకాంతా ! డాక్టరుగారు యిప్పుడు వత్తురని యను కొందువా ? ఆయన సదయహృదయుడే. మన యజమానుని స్థితి నాలోచించిన బాగుగ గన్పట్టదు, మనలను తండ్రివలె ప్రేమించెడివాడు ఎట్టి వాడైనను మృత్యు ముఖమున బడవలసినదే గదా ! కానిమ్ము, దైవఘటన యెట్లున్నదో యెరుగ నేరితరము ?" ఇట్లు సంభాషించుచు వారు కొంతవడికి డాక్టరుగారి గృహమును సమీపించిరి. డాక్టరుగారు నిద్రించుచుండిరి. వారిని నిద్ర నుండి మేల్కొలిపి సంగతంతయు విన్నవించిరి. డాక్టరు సురేంద్రనాథ్‌గారు కడుదయార్ద్ర హృదయుడగుటం జేసి శ్రమయని యెంచక అట్టి కటికచీకటి రాత్రి సమయమున తగు పరికరముల చేద నిడికొని, బయలుదేరిన కొంతవడికి గృహమును సమీపించెను. డాక్టరెప్పుడు వచ్చునో, ఏమిచెప్పునో అని వీధి యరుగు మీద నిలిచి చూచుచుండిన లీల డాక్టరును గాంచినతోడనే ఒక్క పర్వున లోనికిబోయి "అమ్మా! డాక్టరుగారు వచ్చిరే" యనుచు తల్లిం జేరెను.

సురేంద్రనాథ్‌గారు తిన్నగా గదిలోనికిబోయి, రోగి హస్తమును చూచి పరీక్షించి ఒక్క వేడి నిట్టూర్పు విడిచెను. డాక్టరేమి చెప్పునోయని అత్యంత మాతురులైన తల్లికూతులిర్వరకును. డాక్టరు యొక్క నిరాశా సూచక దృష్టులు గాంచినంతనే ఏడ్వాగ లేదు. "దీనావనా ! దీనరక్షణ బిరుదాంకా ! మా తండ్రిని నా కుంచవా ? మా తండ్రిని కాపాడవా ?" యంచు లీల బోరన నేత్ర సాగెను. ఇంతలో 'అమ్మా ! లీలా' యని తండ్రి పిల్చుచున్నటులయ్యెను. అంత లీల తండ్రి యొద్దకు జని "ఏమి నాయనా ! ఏల పిల్చితిరి ?" యని యనుచుండగనే, శ్రీనివాసరావు తన గారాబు కుమార్తెను కుశ్శించి జీర్ణములైయున్న తన చేతులతో అదిమి పట్టుకొని హృదయము మీద నిడికొని, "నా కన్నతల్లీ, నా బంగారుమొలకా నేను మిమ్ముల వీడిపోవుచున్నాను. నాకు పరమేశ్వరుని ఆజ్ఞయైనది మీరు విచారింపకుడు. మరణము జీవకోటికి సామాన్యమే ! నిన్నొక యింటిదానిగ, చేయజాలనైతిని. అదియె మనమున బాధించుచున్నది." అని యేమియో పలుకబోయి కఫము కుతుక కెగదన్నుటచే మాట్లాడజాలక కొంతవడికి "అమ్మా ... నేను ... పోవు ... చున్నాను ... మాతృ...దేశము... మాతృ...భూమిని... మరువ...వలదు...నా జీవితము...వృధాగా...గడిపి... వేసితిని...నీవైనను...భారతాంబ.. ఋణము ... దీర్చ .. యీ దీనుని ... ఆత్మకు ... శాంతి గల్గింపుము...దీనురాలగు...నీ తల్లికి...ధైర్యము... చెప్పు ...నీ తండ్రి...నీకు ఇక...లేడు...శ్రీమన్నారాయణా...మీ లీలా... కమలల...నెట్లు...గాచెదవో."

ఇట్లు పలుకుచు ఆ యుదార హృదయుడు విశ్రాంతి దీర్చుకొను వాని భంగి జగద్రంగమును వీడి కన్నులు మూసుకొనెను.

ఇక నేమున్నది ? శ్రీనివాసరావు గారి పంచభూతాత్మకమైన శరీరము పంచభూతములలో కలిసిపోయెను. లీలా కమలల హృదయము లెట్లుండునో వ్రాయుటకు కలమాడుట లేదు.

* * *

"లక్ష్మి ! లక్ష్మి ! అబ్బా ! మన శ్యామసుందరు డెట్టివాడయ్యెనే ! దేశము, దేశసేవ, యివన్నియు వీనియందే ఆవిర్భవించి యున్నవి. ఈ ఖద్దరు గుడ్డలు, యీ రాట్నములు యివన్నియు వీనికొరకే బ్రహ్మ సృష్టించెను గాబోలు ! ఇంకను వీడేమో గొప్ప గొప్ప చదువులు చదివి; బిరుదములంది, దొరతనము వారి కృపకు పాత్రుడుగా నోపునని యెంతయో మురియుచుంటిని. నా తలపులన్నియు బూడిదగలిసిన పన్నీరాయెనే ! తిన్న యింటికి వాసము లెక్కపెట్టినటులు నాకే పంగనామములు పెట్టుచున్నాడు ! తండ్రితో సమానుడగు నా యాజ్ఞ లెక్క సేయక నిన్న తాను పాఠశాల బహిష్కరించు టెందులకు ? పట్టపరీక్షకు వెళ్ళ

సంసిద్ధుడైయుండి మధ్య కొరవితో తల గోకికొనునట్లు లీకృత్యములేల ? దొర తనము వారెంతయు సమర్థులు. వారేమి చేయదలచినను ఒక్కతృటిలో నొనర్ప గలరు. వారి కోపానలమున కాహుతియగుట కంటే వేరొండులేదు.'' ఇట్లు ఇంకేమియో పల్కుచు మూర్తీభవించిన క్రోధదేవతవలె ప్రసాదరావు పడక కుర్చీ మీద కూర్చుండి తమ్ముని రాక కెదురు చూచుచుండెను.

శ్యామసుందరుడు లోన నడుగిడుట తోడనే ప్రసాదరావు కనుబొమ్మ లెత్తివడ "ఎవరు వారు ? ఓహో ! శ్యామసుందరావుగారా ? తీరుబడిమైనదా ? దేశ నాయకులు మిమ్ముల విడచిరా ? అసహాయోద్యమాందోళనలో ఎంతమంది మూర్ఖులు పాఠశాలల విడచి, ఉద్యోగముల మాని, కూటికి గుడ్డకు మొఖమువాచి, దేశద్రిమ్మరులై, తిన్నచోట నిలువక నిలచినచోట నిద్రింపక, ఫకీరులవలె తిరుగు చుండుట లేదు ? నీవు కూడ వారిగతినే అనుసరించుచున్నటులు తోచుచున్నది. కానిమ్ము ! నీ ప్రారబ్ధమునకు నే నేమి చేయగలవాడను ? వచ్చియు రానిమాటలతో, తప్పటడుగులతో నున్న నిన్ను తండ్రిగారు తమ మరణ సమయమందు నన్ను జేరంబిలిచి 'నాయనా ! నీకు రెక్కలు వచ్చినవి. నీ తమ్ముడింకను చిరుతప్రాయము వీడలేదు. వానిని నీ చేతులలో వీడిపోవుచున్నాను. నీ తల్లి వాని




బాల్యమందే గరించినదిగదా ? ఇక వాని భారమంతయు నీదే. నీ తమ్ముని నీ వెటులు కాపాడెదవో ?' అని నుడివి యున్నందున నింతగ చెప్పవలసి వచ్చెను.'' ఇట్లు చెప్పుచు, ప్రసాదరావు పడక కుర్చీనుండి లేచి గదిలోకి వెళ్లి ఒక కవరుదెచ్చి తమ్ముని ముందు విసరవైచి, "ఇదిగో నీ పాఠశాలా ప్రధానోధ్యాయులు సాయం కాలముననే దీనిని నా కంపియున్నారు. దీనిం గాంచి నీ యభిప్రాయము నను కరింపు'' మని పల్కెను.

ఇంతవరకు మంత్రముగ్ధునివలె, నిలువబడియున్న శ్యామసుందరుడు ఉత్తరము తన కాలివద్ద పడినతోడనే త్రొట్రుపాటొంది భయకంపిత హస్తములతో దాని నెత్తి యీ విధముగా చదివెను.

శ్యామసుందరా !

సైమను కమీషను బహిష్కారణాందోళనలలో పాఠశాల మానిన యువకులు పాఠశాలనుండి వెడల గొట్ట బడుదురను మా శాసనములను నీవు వినియేయున్నాడవు. నీవు పాఠశాల యందు అందర కంటె నెక్కుడుగ వృద్ధిలోనికి రాగలిగిన వాడివనియు వినయ వివేక సౌశీల్యాది సద్గుణములు గల్గిన వాడవనియు ఎంచి యింతకు మున్నెన్నియో మారులు నీవు ఇట్టి పనులు చేసినను ఓపిక వహించితిమి. కాని నేడు జరిగిన విషయమున నీవే గాక, తా చెడ్డకోతి వనమెల్ల చెరచినటులు తోడి సహాధ్యాయుల నందర, ప్రోత్సహించి, వారల గూడ పాఠశాలలు మాన్పించి, యుత్సవములలో పాల్గొని నందున నిన్ను పాఠశాలనుండి వెడల నడవవలసినదిగ, పై అధికారులు ఆజ్ఞాపించుచున్నారు.

ఇట్లు,
ప్రధానోపాధ్యాయుడు.

ఈ యుత్తరము చదివినతోడనే శ్యామసుందరుని మనోవీధిని, విచారానందము లొక్కతూరి, పరుగిడ మొదలిడెను నిశ్చేష్టుడై, నోటమాట లేక పదినిమిషముల వరకటులే నిలువబడి యుండెను. 'శ్యామా ! భోజనమునకు లెమ్ము ఇంతకే తడవైనది' యని, పిల్చు లక్ష్మిబాయి కేక కర్ణపుటముల సోకినంతనే దీర్ఘాలోచనాపరుడై యున్న శ్యామసుందరుడు తెల్వొంది 'వదినా! ఇదుగో వచ్చు చుంటి'నని తన గదిలోనికి వెళ్లి యుత్తరీయము తీసి మంచముపై పడవైచి, వంట యింటివైపు మరలెను. లక్ష్మిబాయి వడ్డించి మరది రాకకై నిరీక్షించుచుండెను. శ్యామసుందరుడు పాదప్రక్షాళన మొనర్చుకొని విస్తర ముంగిట భుజింప గూర్చుండెనే కాని, మనస్సు మనస్సులో లేదు. ఎంతయో బాధనందు వానివలె గన్పట్టుచుండెను, సంగతంతయు నెరింగియున్న లక్ష్మిబాయి "శ్యామా, ఏమటు లుంటివి ? సరిగ భోజనమైన చేయలేదే, భుజింపుము. నాయనా మీ యన్నగారి సంగతి నీ వెరింగియున్నదే కదా ! వారి కెంత తోచిన నంతయే కాని వేరొండు గానరు. దైవనిర్దేశ మెటులున్న నటులగు విచారించి మనస్సును బాధింప చేయుట తక్క వేరొండు లేదు '' అని పల్కెను.

శ్యామసుందరుడు వేవేగ భుజించి, తల్లివలె ఆదరించి లాలించి ప్రేమించి కన్న కుమారుని భంగి ఆదరించెడి వదినగారితో నైనను మాట్లాడక తిన్నగ గదిలోనికేగి శయ్యపై నొరిగి, రెండు చేతుల తల నదిమిపట్టుకొని 'ఆహా! సర్వేశ్వరా ! ఎట్టి విషమస్థితికి తెచ్చితివి ? నా మనోదార్ఢ్యము నెరుంగగోరియే నన్నిట్టి యిక్కట్టుల పాల్చేయు చుంటివా ? నే నిప్పుడేమి చేయనగు ? నా కేది కర్తవ్యము ? అంతవాని నింతవానిగ నొనర్చి, విద్యాబుద్ధులు చెప్పించి తన సర్వస్వము నన్నుగ భావించి పెంచుచున్న అన్నగారి యాజ్ఞ యొకవంక ! దీనావస్థయై దిక్కులేక తన పుత్రులేమో తన్నుద్ధరించెదరని నమ్మి యున్న భారతమాత, శివాజీ, రాణాప్రతాప్, తిలక్, గాంధీ ప్రభృతులగన్న మాతృభూమి, సీత, సావిత్రి, దమయంతి, చంద్రమతి మొదలగు సాధ్వీమతల్లుల గాంచిన పవిత్ర జన్మభూమి. దేశసేవకులై పలు బాములపడి అనేక సంవత్సరములు కఠినకారా గారవాస శిక్షకులై అవసానసమయమందు గూడ మాతృదేశమో, మాతృదేశమో యని విలపించుచు ప్రాణములర్పించిన చిత్తరంజన్, గోఖలే, నౌరోజీ, లజపతిరాయి మొదలయిన వీర శిఖామణుల గన్న భారతరత్న గర్భ, నా జన్మధాత్రి హాహారావములు మరియొక వంక !

"కానిమ్ము, నా హృదయగతమగు కోర్కెయే పుష్పించి ఫలించుగాక! నేడే మాతృ భూరంగమున దుమికి నా సోదరుల సుఖదుఃఖములో పాల్గొని దేశమాతకు సత్పుత్రుడనై మెలగెదగాక ! అపార కృపామయుడగు నప్పర మేశ్వరుడు నా సంకల్పము లీడేర్చి నాకు చేయూత నొసంగి నా జీవితము

ధన్య మొనర్పజేయుగాత !"

ఇట్లు తలపోయుచు శ్యామసుందరుడు హృదయ భారము కొంత తగ్గ కర్తవ్యనిర్దేశ మొనర్చుకొని పొట్టకూటికినై దాస్యవృత్తికి పూనికొల్పు విద్యకు స్వస్తి చెప్ప నిశ్చయించి అన్నగారు దీనికెట్టి శిక్ష నొసంగెదరో యను భయ మంతయు విడనాడి దినమంతయు నలసియుండుటచే నిద్రాదేవియొడిలో శర ణందెను.

* * *

అఘటనా ఘటన సమర్థుండగు భగవంతుని లీలలంగన నేరితరము? ఒకతరి మానవుల సంతోషాంబుధి నోలలాడింప చేయుచుండును. ఇంకొకతరి విచారసాగరమున ముంచుచుండును. ఇంతవరకు జన్మించినదాది కష్టమన్న నెట్టిదియో యెరుంగక నిరంతర సుఖసాగరమున నోలలాడు లీల కడు యిక్కట్టు లకు లోనయ్యెను. కృష్ణపక్ష చంద్రునివలె ఆమె నానాటికి క్షీణించుచుండెను. క్షయ రోగపీడితుని దేహ మట్లాబాలదేహము కృశించుచుండెను మనోవ్యాధికి మందేది యనునట్లు ఆమె రోగము వీరికి వారింప నశక్యమైయుండెను బాల్య మాదిగ తన్ను పెంచి పెద్దదానినిగ నొనర్చి తన సుఖమునే యభిలషించుచున్న పితృమరణముకై చింత యొకవంక, భర్తృ వియోగానల దందహ్యమానయై సతతము కన్నీరు కాల్వలై కార దుఃఖించుచు, శుష్కించి కడు దుర్బలమై మంచముపట్టి నానాటికి కృశించుచున్న తల్లికై చింత మరియొక వంక. అట్టితరి సామాన్య బాలికలైన, ధైర్యము విడనాడి కిం కర్తవ్యతా విమూఢలై బెగడంది ఉందురు అట్లుగాక ధీరయగు లీల పొంగి పొంగి పొరలి వచ్చుచున్న దుఃఖము నాపుకొనుచు తానే అధైర్యమందిన తన తల్లి కూడ బెగడంది అసువుల బాయగల దేమో యను భయమున కనువారలకు ధైర్యముతో నున్నట్లే కన్పట్టుచుండెను.

నాడు ఏకాదశి. ప్రాతః కాలకృత్యముల నిర్వర్తించుకొని చేతనొక పళ్ళెమిడి దేవతా పూజార్థమై పూలుగొని తెచ్చుటకు లీల తన చిన్ని పూదోట లోని కేగెను. నాటి యుదయమునుండియు కమలాబాయి స్థితి మారినట్లు కాన్పించు చున్నది. తనలో తానేదో గొణుగుకొనజొచ్చెను. నడుమ నడుమ "లీలా ! లీలా ! నీ ముద్దు ముచ్చటలన్నియు తీరకుండగానే, నీ తండ్రి నిన్ను వీడి పోయిరి. నిన్నొక యింటిదానిగ చేసినచో నాకీ బెంగ యుండకపోవును పితృ వియోగముచే పరితపించుచున్న నీవు మాతృవియోగముచే ఎంత దిగులందెదవో ! సంపూర్ణ యౌవనవతివై వివాహయోగ్యవై యున్నతరి భగవంతు డెట్టి యాపదల పాల్చేసెనే ! నీ తల్లి యింక జీవింపజాలదు. మాతాపితృవిహీనవగు నీ కిక దిక్కె వ్వరు? ఎట్టి యాపదల పాలం దవలయునో! ఎందరి యపహాస్యములకు గురి కావ లసి వచ్చునో ! ఎందరు క్రూరుల క్రౌర్యముల బారి పడకుండ కాపాడుకొన వల యునో ! ఆహా ! దయామయా ! నా చిన్నారి లీల నేమి చేయనెంచితివి ? నామె కేది దిక్కు ? లీలకు ధైర్యమొసంగుము ఆపదల నుండి యుద్ధరింపుము సద్బుద్ధి నొసంగి, పుట్టినింటికి, మెట్టినింటికి సత్కీర్తి చేకూర్చునట్లనుగ్రహింపుము నేను పోవుచున్నాను. లీలను నీ చేతినిడి పోవుచున్నాను కాపాడుము" అని పలవించుచుండెను లీల పూలను గొనితెచ్చి తల్లి మంచము వద్దకు వచ్చి చూచు సరికి కమలాబాయి స్మృతితప్పియుండెను. తల్లి స్థితి గాంచినతోడనే లీలకు ధైర్యము సన్నగిల్లెను కన్నుల నుండి కారు బాష్పముల నొత్తుకొనుచు, "అమ్మా ! ఏమియో బాధగా నున్నటులు గాన్పించుచున్నది" యని లీల తల్లిని పలుకరించెను అంత కమలాబాయి "అమ్మా ? నీ తల్లికి అవసానము సమీపించు చున్నది. ఇక నేబోవుచున్నాను. నీ తండ్రిగారు తమ మరణ సమయమందు నీ కాదేశించిన మాట మరువ వద్దు నా కోరిక కూడ నదియే సత్పుత్రివై నీ దేహమును మానవసేవకునై వినియోగించి సచ్చరిత్రవై తోడి స్త్రీ లోకమున కాదర్శప్రాయవై, చదువుల సరస్వతివై, విద్యలేక దేశమన్న నెట్టిదియో యెరుం గక దేశస్థితి యన్న నెట్టిదియో యెరుంగక భర్త యున్నతాశయముల కెంతయు ఆటంకమును గలిగించు వృథాప్రలాపముల యందే కాలమంతయు గడిపి అవిద్యాంధకారమందు మునిగి తేలుచున్న స్త్రీల నుద్ధరింపుము అహం కారమును త్యజించి కొద్ది గొప్పల దరికి జేరనీయక నీ కాలమును గడుపుకొను చుండుము ఇంక మాట్లాడజాలకున్నాను, ఆయాస మధికమగుచున్నది. కొంచెము...మంచినీరు..." ఇట్లు చెప్పుచు మనస్సంతయు భగవదాధీనము గావించి మాయా ప్రపంచక రంగము నుండి ఆత్మ పాత్రాభినయము సమాప్తి గావించుకొనెను.

గాలికి, దుమ్ము రేగినట్లీ వార్త క్షణములో గ్రామ మంతయు వ్యాపించెను విన్న వారందరు "అయ్యో ! సుగుణమణి యగు లీలకెట్టి కష్టము సంభవించె ! కరుణామయుడగు భగవాను డామెయెడ కడు నిర్దయుడాయెనే ? ఇక ఆ బాలకేది గతి" యని వగవజొచ్చిరి. మెల్లగ నీ వార్త పాఠశాలా ప్రధానో పాధ్యాయినియు, దయావతియు నగు, శారదాబాయిగారి కర్ణము లంబడెను వెంటనే ఆమె లీల గృహమునకుం జని తల్లి మంచము వద్దనే కొయ్యవారి పడి యున్న లీలంగాంచి తన వద్దనున్న ధనముతో శవమునకు దహనసంస్కారాదుల ముగింపజేసి లీలను తనతో గూడ నింటికి తీసుకొని వెళ్ళి ఆదరించి ఆమెకు తల్లి లేని లోటు దీర్ప బ్రయిత్నించుచుండెను లీలయు ఆమె మధురసంభాషణలచే ఆదరసత్కారములచే, కొంత దుఃఖముపశమిల్ల తల్లిదండ్రుల అంత్య వాక్కుల స్మరించుకొనుచు వారి కర్తవ్య మీడేర్ప ప్రయత్నించుచుండెను.

* * *

ఆ గ్రామమున శారదాబాయి గారి నెరుగని వారెవ్వరునులేరు. ఆమె బాలికల యందు చూపెడి యనురాగము, విద్య బోధించుట యందు గల నేర్పు, కార్యదీక్ష, ఔదార్యము, సహనశీలత, సద్గుణసంపత్తును గాంచిన ప్రతి వ్యక్తియును ఆశ్చర్యము నొందక మానదు.

శారదాబాయికి పాపము, బాల్యముననే వైధవ్య దుఃఖము ప్రాప్తించెను. వివాహసమయమందు తక్క భర్తృముఖ మెన్నడు వీక్షింపని యామెను అనేకులు మూలబడవైచి వంటపొయ్యి వద్దనే కుక్కి ఆమె యున్న తాశయముల మంటగలుప యత్నించిరి కాని యోచనా పరురాలగు యా యువ పవిత్రమానసమే యామె సచ్చరిత్రమునకు మూలకారణమనియు, మనో నైర్మల్యము లేక, ఇరుగు పొరుగు అమ్మల అధిక్షేపములకు లోనై లేని పోని యసంబద్ధ ప్రలాపముల తమ విలువగల కాలము వృథ పుచ్చుచు అనేకులగు క్రూరుల మోహదృష్టులకు గురియై తమ పవిత్ర జీవితము మరింత అపవిత్రముగ నొనర్చుకుంటయో, కాక కుల కళంకములై, పుట్టినింటిని, మెట్టినింటిని అపకీర్తి పాలుచేసి దేశమాతకు, దుష్ప్రవర్తనలచే మరింత భారమును గల్గించుచున్న పెక్కురు స్త్రీల సంగతి విచారించి, వగచి, యట్టి అభ్యంతరముల సంభవించినను లెక్కింపక నా యీ తుచ్ఛదేహమును స్త్రీ విద్యకునై బలిమొసంగి అవిశ్వాసలై మూఢలై, అవిద్యాంధ కారమునబడి తట్టుమిట్టాడుచున్న నా సోదరీమణుల నుద్ధరించి నా జీవితమును సార్థకము చేసికొనియెదగాక యని దృఢనిశ్చయయై స్త్రీ విద్యలో ఉన్నతి జెందుచు వచ్చుచున్న పూనానగరమును గూర్చి తానది వరకు వినుచున్నది యగుటం జేసి ఒరులకీ వార్త తెలియజేయకుండ, ఒరుల సహాయ ముపేక్షింపకుండ తాను అబలయను సంగతియే మరచి ఆవేశమాత్ర సహాయయై ప్రోత్సహించుచుండ, చిన్నగ పూనా చేరెను. నాలుగు సంవత్సరము లక్కడ నుండి, ఉన్నత విద్య నంది ఆంగ్లవిద్య నభ్యసించి బిరుదములంది తామే అపర సరస్వతులని యెంచుచు, విర్రవీగి, కన్ను మిన్ను గానక, పరులతో భాషించినయెడ తమ విద్య కెక్కడ లోపము వచ్చునో యను భయముచే మూర్తీభవించిన గర్వ రాసులో యన తిరుగుచుండు మన యీ నాటి కొందరు సోదరీమణులవలె గాక శారదాబాయి యున్నత విద్యతో పాటు వినయ, వివేక, సత్ప్రవర్తనాదుల యందు కూడ తన యంతయామె లేదని పలువురచే గణింపబడి పూనా కళాశాల యందు వన్నెకెక్కి, జన్మభూమి కేతెంచి తన స్వంతధనముతో పాఠశాలాభవనము నొకదాని గొని దానికి శారదాభవనమని పేరిడి, పెక్కురు బాలికలనందు జేర్చి తన ఆశయ మీడేర్చుకొనుచుండెను.

శారదాబాయి యొక్క సాంగత్యలాభము వలన లీల గృహకృత్యముల యందేమి అధ్యాపకత్వము నందు గల నేర్పునందేమి మిక్కిలి నేర్పుగడించి, ఆమెకు తలలోని నాల్కవలె ప్రవర్తించుచు ఆమె కనుసన్నలమెలగుచు తత్ప్రేమ భాజనమై మెలంగుచుండెను ఒక నిమిషము లీల లేకున్న శారదాబాయికి ఈ జగమంతయు నంధకారమయముగ తోచుచుండును అప్పుడప్పు డామె తన స్థానమున లీలను ఉపాధ్యాయిగ నొనర్చి బాలికలకు పాఠముల చెప్పించుచు తాను మిగుల ఆనందించుచుండును బాలికలుగూడ లీలను తమ సోదరిగ భావించి, పాలు నీరు వంగి ఒక్కటై మెలగుచుండిరి సాంగత్య లాభము వలననే కదా గులాబి చెట్టు క్రిందనున్న మన్ను గూడ పరిమళించుట. అటులే శారదా సాంగత్యము వలన సహజ సద్గుణవతియగు లీల సుగుణశీలయై అన్నిట నామెకు తోడు నీడయై తల్లిదండ్రుల కీర్తి మరింత వృద్ధి పరచుచు, ఆ గ్రామ మందు సర్వజన ప్రేమైక వర్తినియై యొప్పుచుండెను

ప్రాతఃకాలము ఏడు గంటలై యుండవచ్చును. ప్రాతఃకృత్యము లీడేర్చుకొని శుచియై శారదాబాయి లీలను ముందిడుకొని నిత్యమును వలె తులసీదాస కృతమగు హిందీ రామాయణమును చదువుచుండెను లీలగూడ ఆమె చదువు పద్యముల నర్థము చేసుకొనుచు నత్యంత కుతూహలితమానసయై వినుచుండెను కొంత తడవునకు రామాయణ పఠనము ముగించి, శారదాబాయి లీలతో సంభాషించు చుండెను. ఇట్టితరి పాఠశాల పరిచారిక యొకర్తు చేతనొక యుత్తరము నిడి "అమ్మా ! తపాల వాడిప్పుడే దీని నా కొసంగె"నని, చెప్పుచు ఆమెచేతి కందిచ్చెను. ఇట్టి సమయమందు ఉత్తర మెమ్మువరి వద్దనుండియో యని యోజించుచు కవరు చింపి లోని కాగితముతీసి యిట్లు చదువదొడగెను.

"ప్రియ సోదరీ, నమస్కారములు,

ఈ మధ్య వచ్చిన సైమన్ కమీషను బహిష్కరణావసరమున నేను పాఠశాలను బహిష్కరించితిని. దాని ఫలితముగా పాఠశాల నుండి వెడలగొట్టబడితిని నాడు మొదలు మా అన్నచే పలుబాములకు లోనై వారి కోపానలమున కాహుతి యగుచుంటిని. చదువుమాని, యింటియందు చేతకాని పిరికిపందవలె గూర్చుండినయెడ, తిండి పెట్టుట తనకు గూడ దుర్భరమగుననియు, యింకను ఏవేవో దుర్భాషలాడి నన్ను కంటకముగ జూచుచుండెను. ఇట్లుండ, మొన్న ఆ గ్రామములో జరిగిన విద్యార్థి స్వచ్ఛంద సేవాదళమునకు నన్ను నాయకునిగ నొనర్చి యుండుటచే నేను అన్నగారి అభిప్రాయములకు వ్యతిరేకముగ, ప్రచారము చేయవలసి వచ్చెను, అన్నగారది విని, ఆగ్రహపరవశులై నా మూలమున తమ యుద్యోగమునకు గూడ భంగము కలుగుననియు, నేను యిల్లు వీడిపోయిన తాను సుఖముగ దినములు గడుపుకొందుననియు చెప్పెను. కాని అయన యేమన్నను మౌనవ్రతము దాల్చి యూరకుంటిని ఇంతలో వదినెగారు వచ్చి నన్ను గాంచి, నాపై జాలినొంది, కఠినోక్తులచే నా మనస్సు నొప్పింప వలదనియు, మిమ్మె దైవముగ భావించి పూజించుచు, పితృసమానులుగ నెంచి, గౌరవించుచున్న అతని హేయదృష్టిని జూడవలదనియు, మా అన్నగారిని ప్రార్థించెను. అట్టితరి ఆయన ఆమె నావలకు ద్రోసివైచి "నీవా నాకు నీతులు గరపుదానవు ? ఆ చెనటి నిన్ను కూడ చెరచుచున్నాడే ! మీరే దేశభక్తులు, దేశము నుద్ధరింప అవతరించినారు కాన, యిద్దరు గూడ నొక్కచోటికిబోయి హాయిగ జీవింపుడని" పలువిధముల నిందించెను. పతివ్రతా శిరోమణియగు యాయమ మిగుల వగచి 'భర్తృసందేహమునకు గురినైతినే' యని మిగుల దుఃఖించెను ఈ సంగతి వినినంతనే నా హృదయమున మిన్ను విరిగి మీద పడినట్లాయెను. 'అయ్యో ! నా మేలు నభిలషించుచు నా మూలమున, ఒక పతివ్రతయగు నబల భర్తృసుఖమునకు, దూరము గావలసి వచ్చెన ! తిండిలేకపోయినను, గుడులేక పోయినను, ఆయన సుఖముకొరకైనను నేనిల్లు వీడిపోవుట నాకర్తవ్య' మని భావించితిని. అన్నగారి సందేహమునకు గురియై వారికంటికి శూలమువలె మెలగు చుండుట హేయమని యెంచితిని నా సంగతి నీకు తెలియబరచుట నా కర్తవ్యమని ఎంచి నీ కీ యుత్తరము వ్రాయ సమకట్టితిని

ఇట్లు నీ ప్రియసోదరుడు,

— శ్యామసుందరుడు "

ఈ లేఖ గాంచినతోడనే, శారదాబాయి నిశ్చేష్టయై, కొంతవడికి అన్నగారి దౌర్జన్యము, వారి క్రౌర్యము తనకు తమ్ముని యందుగల అనురాగము గాంచి, యిట్టితరి అన్నగారి దృష్టికి దూరముగనుండుటయే శ్రేష్ఠమనియు, తాను జీవించియున్న పర్యంతము అతని కెట్టి కష్టము కలుగజాలదనియు, ఉత్తరము గాంచిన తోడనే తనవద్దకు రావలసినదనియు, తమ్మునికొక లేఖ వ్రాసెను లీల గూడ ఉత్తరము సంగతులను శారదాబాయి నోటినుండి విని తానుగూడ శ్యామసుందరుని కొరకై జాలినొంది అతని యున్నతాశయములకు, ఉదార స్వభావమునకు మనమున మిగుల సంతసించి అట్టి సుగుణముల ప్రోడయగు తమ్ముని గలిగియున్న శారదాబాయి యొక్క అదృష్టమును, మిక్కిలి కొనియాడి అతడు వచ్చిన తోడనే తాను అతని యొద్ద శుశ్రూషచేయుచు దేశచరిత్ర, దేశములోని యిప్పటి పరిస్థితులు. నేర్చుకొనుటకు కృతనిశ్చయయై అతని రాక కెదురు చూచుచుండెను.

* * *

నాటి ఉదయము నుండియు లీలా శారదలు శ్యామసుందరుని రాకకై నిరీక్షించుచుండిరి. నిమిషమొక యుగమువలె వారికి తోచుచుండెను. ఎన్నిమారులు గడియారము వంక చూచినను ధూమశకటము వచ్చు సమయమగుట లేదు. ఆతురులై యున్న సమయమందు అన్నిటను విలంబమే కాన్పించును అట్టితరి ఎప్పుడు శ్యామసుందరుని గాంతుమా ! ఎప్పుడు వానితో సంభాషింతుమా యని యున్న మన లీలాశారదల మనము లెంత వేగిరపడుచున్నవో వారి ఆతురత సూచించు మొగములే చెప్పుచున్నవి.

గడియారము టిక్కు టిక్కుమని పండ్రెండు గంటలు కొట్టెను. గణ గణమను శబ్దముతో నొక జట్కా బండి శారదాభవనము ముందు ఆగెను శ్యామసుందరుడు లోననుండి దిగి ప్రేమ దృష్టులతో తన్ను గాంచుచు, తన కెదురుగ వచ్చుచున్న అక్కగారికి ప్రణమిల్లి వసారాలో నుండు సోఫాపై కూర్చుండెను చేత మంచినీరు చెంబు నిడికొని లీల లజ్జాభయము లొక్కమారు, పెనగొన త్రొట్రుపాటొందు అడుగులతో మెల్లగా తలుపుచాటున నుండి శారదాబాయికి ఆ చెంబు నందిచ్చెను. "లీలా ! రమ్మిటు, రమ్మ సిగ్గేలనమ్మా," యని లీలను పిలిచెను. అపరిచిత నామము వినుటతోడనే శ్యామసుందరుడు గుమ్మము దిక్కు మొగమై, "అక్కా 'లీలా !' యని యిప్పుడెవరి నామము పేర్కొంటివే ? ఆమె ఎవరు ? మీ పాఠశాలా విద్యార్థినియా ?" అని యడిగెను అంత శారదాబాయి "నాయనా ! లీల మాతాపితృ విహీనయగు నొకబాలిక. కేవలము పరమాత్ముని సహాయము తక్క వేరొండు సహాయ మామెకు లేదు. చూడు ! బేలతనము సూచించు ఆమె సుకుమార ముఖము గాంచిన ఆమె సద్గుణము లన్నియు కన్నుల కట్టినట్లుండును నిరాశచే, శుష్కించి, వాడిపోయిన నా ఆనందమునకు దోహదము గాంచిన దీ బాలామణియే" యని పలికెను. అక్కగారు చెప్పిన మాటలన్నియు వినుచున్న శ్యామసుందరుడు లీలవైపొక్కమారు చూచెను అంత వరకు శ్యామసుందరుని ముఖ సౌందర్యము గ్రోలుచు, పిపాసాయుతములైన లీలా దృష్టులు శ్యామసుందరుని దృష్టులలో లీనమైపోయెను. ఆ చూపులలో నేమి మాయాజాలమున్నదో కాని కొంతవరకు వారు ఈ బాహ్య ప్రపంచమును మరచి తమ జీవితమును ఒకరి కొకరు ధారపోసినటులు తెల్పుచున్నవో యను దృక్కులతో అట్లే నిలిచిరి. శారదాబాయి ముసి ముసి నవ్వులతో 'ప్రణయాంకము' ప్రారంభమయ్యె గదాయని లోన తలపోయదొడగెను.

శ్యామసుందరుడు ఆ గ్రామమున అడుగిడినదాదిగ జాతీయ సంస్థల నిర్మించి అందు రాట్నములను, మగ్గములను పెట్టించి అనేకులు బీదవారల కుపాధి కల్గింప మొదలిడెను. ఇంతియ కాక పల్లెటూరు గ్రామముల కేగి దేశ పరిస్థితులు, దేశము, దేశ దారిద్ర్యమన్న నెట్టిదియో యెరుంగక తమలోతాము తగవులాడుకొనుచు, అన్యోన్యము ఐకమత్యమును వీడి మతకలహములచే తమ్ముతామే నిర్భాగ్యులుగ జేసికొనుచున్న పల్లెలవారిని విద్యావంతులనుగ జేసి, వారలలో ఐకమత్యము గలిగించి రాట్నముల యందు, మగ్గముల యందు వారి కుత్సాహము జనింపజేసి వారి గౌరవమునకు పాత్రుడై, ఒక నిముసమైనను వృథపుచ్చక ఒరుల హితముకొరకై పాటుపడ జొచ్చెను

శ్యామసుందరుని వయస్సుతోపాటాతని బుద్ధి వికాసము, కీర్తి ప్రతిష్ఠలు కూడా వృద్ధినంద జొచ్చెను, స్వార్థరహితమగు సేవ, ఫలాపేక్ష లేని దేశభక్తి, మనోవాక్కాయ కర్మముల నాతడు చేయుచున్న మానవసేవ యెరి హృదయముల నాకర్షింప కుండును ? అతని మాటయన్న ఎల్లరును ప్రాణముల నిచ్చుటకైనను సంసిద్ధులగుదురు. అతని సత్ప్రవర్తనయే అతనికి తోడై దారి చూప శ్యామసుందరుడు నానాట వృద్ధికి రాదొడగెను. దేశసేవా పరుడు, స్వార్థత్యాగి, కీర్తి కాముడు అగు తమ్మునిగాంచి శారదాబాయి పొందు ఆనందమునకు మేరయేలేదు. లీలకన్ననో దివారాత్రము లాతని స్మరణయే ! ఆతని నామ ముచ్చరింపని గడియ యొక్కటైనను గానరాదు శ్యామసుందరుడు దినమంతయు పని చేసి యింటికి వచ్చిన తోడనే లీలకు నైతిక రాజకీయ ఆర్థిక విషయములను నేర్పుచుండును. వారు ప్రతిదినమును దినమంతయు, తామొనర్చిన సేవను, దాని లాభమును ఒకరి కొకరు చెప్పుకొనుచుందురు. ఈ విధముగ దినముల నతి సుఖప్రదముగ వారు గడుప జొచ్చిరి లీలా శ్యామసుందరుల హృదయములు కూడ, నానాటికి ప్రేమపాశములచే గట్టిగ గట్టుపడుచుండెను

* *

శారదాభవనము నిజముగ శారదాభవనమే. బాలికలతో నిండి యున్నప్పుడది యెంతయో సుందరముగ చూపట్టుచుండును. బాలికలు చదువుకొనుటకు విశాలములగు గదులు, రాట్నములు వడుకుటకు, మగ్గములపై నేత నేయుటకు తగు పెద్ద వసారాలు, బాలికలు స్వేచ్ఛగ ఆడుకొనుటకు తగిన ఖాళీ స్థలమును, వివిధములగు పూల మొక్కలతో నిండి బాలికల సేవచే పెరిగి వృద్ధినందుచు బాలికల విద్యాబుద్ధులవలెనే వృద్ధిని సూచించుచున్నట్లుండు నొక యారామము నందు గలవు. ఈ గృహమందే శారదాబాయిగారి నివాసము.

వెన్నెల పిండియారబోసి నట్లుండును. మలయ మారుతము కలువల రేనికి తోడై దినమంతయు నలసి, విసికి, వేసటనంది యున్న ప్రాణికోటి కాహ్లాదకరమై యొప్పుచుండెను. పక్షిగణములు తమ తమ కులాయముల వీడి జాతి భేదముల విసర్జించి, అన్యోన్యమైత్రి సూచించుచున్నవో యన్నటులు వింత వింత ధ్వనులతో కూయుచుండెను

ఇట్టి సమయమున సుమారు పదునాలు సంవత్సరముల ప్రాయము గల యొక కన్నియ ఆ తోటలో నొక చలువరాతి తిన్నెపై మూర్తీభవించిన సౌందర్య దేవతవలె కూర్చుండి యేమియో యాలోచించుచుండెను. స్వర్గం నుండి విహారార్థమై బయలు వెడలి, ఆ యారామ సౌందర్యమునకు మెచ్చి కొంతసేపు శ్రమ బాపుకొన నెంచి వచ్చి కూర్చుండిన దేవకన్యవలె నామె కిన్పట్టుచుండెను. ఆమె సౌందర్యమును గాంచి, సిగ్గంది, మోము వాంచి నటు పద్మినీకాంతుడు మరగుపడజొచ్చెను.

యోచనాసాగరములో లీనమై యున్న యా సౌందర్య రాశి కన్నుల నెవ్వరో వెనుక నుండి గట్టిగ మూసిరి. లజ్జాభయము లొక్కసారి చుట్టుముట్ట, "అబ్బా ! శ్యామసుందరా, పట్టు విడువుము. నీ కెప్పుడును హాస్యమే" యనుచు లీల ప్రణయకోప మభినయించుదాని పగిది చూపట్టుచు పట్టు విడిపించుకొన జూచెను. శ్యామసుందరుడు పట్టు విడిచి "యేమి నా లీలా రాణీ ! ఏలయిట్లు ఏకాగ్రచిత్తవై, అన్యమనస్కవై కూర్చుంటివి ? నీ ఆలోచనలో నాకు కొంత పాలియ్యవా ? నా ప్రేమైక రాశి, నా హృదయ పీఠాధి దేవత, నా వలపుల రాణి, నా లీలాదేవి మనోగతాభిప్రాయము నెరుగ దగ్గవాడను గానా ! నా వాక్కు లాలించి కరుణించి నా హృదయాందోళనము కొంత తగ్గింపవా ?" అని ఆమె చెక్కిలినొక్కి బతిమాల దొడగెను.

"ప్రాణేశ్వరా ! లీల నీ పదదాసి. ఏ దినమున నీ సుగుణములు విను భాగ్యము నాకు తటస్థించినదో, ఎన్నడు నీ సుందరాకారమును నేను కన్నుల గాంచితినో, మనోవాక్కాయ కర్మముల దేశసేవా తత్పరుడవై మానవకోటికి నీ వొనరించెడి సేవను ప్రతికా ముఖమున విని, యానందించితినో నాడే నన్ను నీ కిచ్చుకొంటిని. నీ వంటి పూజ్యుడగు భర్తను చెట్టబట్టి సుఖించు టెన్నడో యని భావించితి. ఇంతవరకు నీ మనోగతాభిప్రాయము తెలియక దిగులందితి. నన్ను నీవు కోరకయున్నను నీ వంటి దేశభక్తున కర్థాంగియగు భాగ్యము లేకున్నను, నీ పదదాసినై నీ పదసేవ లభింపజేయుమని భగవంతుని పెక్కు విధముల స్తోత్రము చేసితి. తల్లి దండ్రులు లేనిలోటు దీర్చి నా కన్ని విధముల తోడు నీడ అయి నన్ను లాలించి పాలించుచున్న శారదాదేవిగారికి నా హృదయాభిలాష యెఱింగింప దలచుకొంటి. జీవితేశ్వరా! యీ లీలకోర్కె నేమి సేయ సమకట్టితివి, నన్ను కరుణించి నా కోర్కె లీడేర్చవా ?" యనుచు లీల శ్యామసుందరుని వక్షస్థలమున తన పక్షస్థలము నుంచి, ఆతని కంఠము కౌగిలించుకొనెను. "నా ప్రేమైక రాశీ, త్రికరణశుద్ధిగ నీవే నా యర్ధాంగివి. నిన్ను తక్క నే నన్యులను కోరను. సుగుణ మణివగు నీ సద్భావములు, నీ దేశభక్తి, నీ కార్యదీక్ష, ఎన్నడు నా సోదరీ ముఖమున విని కన్నులార గాంచి, యెన్నడు అపరిమితానందము నొందితినో, నాడే నా హృదయమునకు నీవు రాణివైతివి. సద్గుణముల కాదర్శ ప్రాయవగు నీ పొందుగోరి నీతో సుఖించు భాగ్య మెవ్వనికి గల్గును ! నీ వంటి అర్ధాంగి లభించిన నా అదృష్టమేమని కొనియాడుదును. భార్యాభర్తల అభిప్రాయములు ఏకమై వారలతి సుఖప్రదముగ నుండిననేకదా వారియిల్లు సంతతలక్ష్మీనివాసమై యొప్పుచు, భూలోక స్వర్గమువలె బొడగట్టుచుండును. ఇంతయేల ? లీలా దృఢ పాశములచే కట్టుబడి శుక్లపక్ష చంద్రునివలె నానాట వృద్ధి గాంచుచున్న మన పవిత్ర ప్రేమకు, ఈ నిశా కాంతతో గూడిన శశాంకుడే సాక్షియై యుండుగాక !"

ఇట్లు చెప్పుచు శ్యామసుందరుడు లీల మొగము నెత్తి చెక్కిలి ముద్దాడెను. ప్రేమ మయులగు నా కాముకీ కాముకుల యానందమునకు స్వాగత మిచ్చుచున్న నటులు పూలమొక్కల నుండి పూవులు జల జల వారి శిరముల మీద రాలెను.

ఇంతవరకు మరుగున నుండి ఆ భావిదంపతుల అన్యోన్యానురాగ సంభాషణము నాలించి శారదాబాయి ఆనందపరవశమై పోయెను. ఆనంద బాష్పము లామె కన్నుల నుండి ప్రవహించెను.

* * *

నాల్గు దినముల నుండి, శారదాబాయి అస్వస్థయై మంచము పట్టియుండెను. బాలికలకు పాఠములు చెప్పుటలేదు. లీలయే ఆమె స్థానమున బాలికలకందరకు పాఠములు చెప్పుచు శారదాబాయి లేని లోటుతీర్ప బ్రయత్నించు చుండెను. బాలికలు ఆమె నొక క్షణమైనను, వీడక తల్లి వెంట పిల్లలభంగి సంతతమామె యొద్దనే యుండుచు, ఆమె కన్ని విధముల తోడ్పడుచుండిరి. శారదాబాయి శయ్యపై నుండియే లీల బాలికల యందు చూపెడి యనురాగమును, వారల అన్యోన్యమైత్రిని గాంచి మనమున సంతసించు చుండెడిది.



# శ్రీమాస్తి

కన్నడ మూలం : శ్రీ నిసార్ అహమద్
స్వేచ్ఛానువాదం : జానమద్ది హనుమచ్ఛాస్త్రి

వారెల్లపుడూ ఇలాగే
ఇక్కడే గాంధి బజార్ పెద్ద చౌరస్తా ఎదుటే
సిగరెట్ పీలుస్తూనో, పత్రిక చూస్తూనో
కబుర్లాడుతూనో వున్నప్పుడు ప్రత్యక్షమౌతారు
ఉన్నపళంగా నిర్దిష్ట సమయంలో
అనుభవం పండిన
వయసు సుఖదుఃఖాలతో
ఎదిగిన వదనం
పూర్వం వెలసిన వెలుగు
కనిపించే మందనయనం
సాంత్వనం పలికే పాత నమూనా
సులోచనం
వీధి కుక్కలనూ పోట్లగిత్తలనూ
భిక్షుక బాలురనూ బెదిరించాలన్నా
ఎత్తైన చెట్లనుండి రాలే పిట్టల రెట్టలను
ఎండవానల ధాటిని ఎదిరించాలన్నా
అదే గొడుగు గద
వీధుల్లోవారు నా ఎదుట వెళ్ళినప్పుడెల్లా
పల్లె సీమల పరమానందం పట్టణానికి పాకినట్లు
వేకువ చలికి వేడినీట జలకమాడినట్లు

హృదయం నిర్మల మౌతుంది తేలిక పడుతుంది
గవిపురం నుండి గాంధీ బజార్ కొరకు
ప్రకృతి పిలుపులా ఆకర్షిస్తుంది క్లబ్
అక్కడనే కాచి వుంటారు కిట్టు, గుండూ, సుబ్బు
నవయవ్వనాల పచ్చని రంగుల్లో పొంగుల్లో
ఫ్యాషన్ల పహరాలు పండు మగ్గిన చూపుల్లో
వర్తమానం కేంద్ర బిందువులా
పరి మొర్రి వేషాల తాకళ్ళలో
అచ్చు కట్టినట్లు
40 నాటి బెంగళూరులా
కాలం కుదిపిన కాయం కాళ్ళీడుస్తూ వచ్చే
ఈ వృద్ధుణ్ణి చూసి 'అయ్యో' అన్నాను.
ఎన్నదగిన వాడంటూ కేలు మోడ్చాను
రహదారి విస్తరించి ఫుట్‌పాత్ సంకోచించి
పరుగు పందెం హెచ్చి నెమ్మది తరగి
లోకం కంప్యూటర్ స్విచ్ తీగల్లా
సంధిగ్దమై
పడిపోయిన విలువలు చెల్లా చెదరై
ప్రతి క్షణం విసిరేస్తున్నాయి
సరళ వృద్ధాప్యానికో పెద్ద సవాల్.

✿ ✿

శారదాబాయి జబ్బునిమ్మళించుట లేదు. నానాటికి జ్వరమెక్కువగుచునే యున్నది. బాలికలు ఇండ్లకు పోవుటయే లేదు. ఆమె మంచమువద్దనే కూర్చుండి ఆమెకు సేవా శుశ్రూషలు చేయమొదలిడిరి. లక్ష్మీ ప్రసాదరావులు గూడ ఆమెకు జబ్బు అను వార్త తెలియుట తోడనే ఆమెను చూడవచ్చిరి. ప్రసాదరావు ఇంతకు ముందే తమ్ముని సుగుణములు, అతని కీర్తి ప్రతిష్టలు పలువురచే విని, "అయ్యో! నేను ఎంత కఠినాత్ముడను ? నిష్కారణముగ ననరాని మాటలచే తమ్ముని మనసు నొప్పించి యింటినుండి తరిమి వేసితినే ? అట్టి తమ్ముని నే నింకొకని జూడజాల. నాయందెంత భక్తి, ప్రేమ, వినయము ! లక్ష్మి చెప్పెడి మాటలనైన వినక పోయితిని. కోపముచే మండిపడు చున్నప్పుడు యుక్తాయుక్త విచక్షణ తోచదు. ఇకనైన నా తమ్ముని నా తప్పులు సైరింపుమని వేడుకొనియెద' నని తలపోయు చుండెను. లక్ష్మియన్ననో లీలా శ్యామసుందరుల యనురాగమును వారల ఆదర సత్కారములను వారు మనఃపూర్తిగ చేయుచున్న దేశసేవను విని అధికానందము బొందుచుండెడిది. లీల పుట్టి పత్ని లభించిన శ్యామసుందరుని సౌభాగ్యమునకు మురియుచుండెడిది. శ్యామసుందరుడు అన్నగారు తన యందు చూపెడి అనురాగమునకు రెట్టించిన ప్రియముతో ఆతనిని గౌరవించుచుండెను. లక్ష్మి సరస్వతులవలె ఒంటి తిరుగాడుచు అత్యంత ప్రీతితో మెలగుచున్న మరదండ్ర నిర్వుర చూచుచున్న శారదాబాయి ఆనందమునకు మేర లేకుండెను.

ఇట్టి యానందము నామె యెన్నియో రోజులు అనుభవింప భగవంతు డనుగ్రహింపలేదు. శారదాబాయి వచ్చిన పని యీ ప్రపంచమున సమాప్తియైనదని కాబోలామె తన పాత్ర నీ మాయా ప్రపంచ నాటకరంగము నుండి తొలగింపదలచెను.

నాడు శారదాబాయికి జబ్బెక్కువాయెను. శ్యామసుందరుడు ప్రక్కలో కూర్చుండెను లీల పాదములొత్తుచుండెను. శారదాబాయి కన్నుల తెరచి వారిని దగ్గర దగ్గరకు బిల్చి "అమ్మా ! లీలా ! అబ్బాయీ, శ్యామసుందరా ! నా కర్తవ్యము పూర్తియైనది. నేను పరంధాముని జేరబోవుచున్నాను. నేటికి నా కన్నులు చల్లనైనవి యేవీ మీ చేతులిటు తెండు. మిమ్ము నేకముచేసి చూచి ఆనందించెదను. ఈ పాఠశాలను మీ నీడ నిడి పోవుచున్నాను మీ బాలికలవలె, భావించి వీరిని వృద్ధిచేయుడు. బాలికలను సౌశీల్యాది సద్గుణ సంపత్తిచే అఖిల దేశముల కాదర్శ ప్రాయులునుగ నొనర్చి మీ జీవితమును సార్థకము చేసికొండు. నా యీ ధనమును పాఠశాలకై విని యోగింపుడు. నే కోరున దిదియే. దయా మయుడగు భగవానుడు, మీకు ఆయురారోగ్యైశ్వర్యాదుల నిడి ఆదర్శ దంపతులుగ నొనర్చి రక్షించుగాత !' ఇట్లు చెప్పుచు శ్యామసుందరుని హస్తమున లీల చేయినిడి "అబ్బాయీ, శ్యామసుందరా, లీల వట్టి బేల; తల్లి దండ్రులు లేని లోటు లేకుండ నామెను కాపాడి ప్రేమింపుము. సీతా రాములవలె, అన్యోన్య మైత్రితో మెలంగుడు," అని పల్కుచు, "నేటికి నే ధన్యనైతిని. నా జీవితము సార్థకమయ్యె" ననుచు ఆ ప్రేమైకి రాశి అసువుల విడిచెను.

[డిసెంబర్ 1929 భారతి సంచిక నుండి పునర్ముద్రితము]

శ్రీమతి నాయని కృష్ణకుమారి

# ఆధునిక సాహిత్య విమర్శన రీతులు జానపద సాహిత్యం ప్రతీకాత్మకత

ఆధునిక సాహిత్య విమర్శకులు తెలుగులో ప్రతీక వాదాన్ని గురించి ఏం చెప్పాలనుకున్నా తొలుతగా ఫ్రాన్సు దేశాన్ని స్మరించడం, అలవాటు చేసుకున్నారు. ఇది 19వ శతాబ్దపు ఆరంభంలో అక్కడ పుట్టిన వాదం. దీనికి ఆద్యుడు ఫ్రెంచి కవి బోదిలేర్ - ఇది అక్కడ నుండే దిగుమతి అయి వచ్చి, తెలుగు దేశపు కవుల పాశ్చాత్య సాహిత్య మమకారం కారణంగా, వారి కావ్యాలలో కుదురుకున్నదని మన విమర్శకుల సిద్ధాంతం.

పాశ్చాత్య ప్రపంచంలో ఈ వాదాన్ని అప్పటి కవులు వాడిన ప్రతీకల్ని బాగా గమనిస్తే బుద్ధి జన్యమైన చాతుర్యం చేత, మాటల్ని దొరకబుచ్చుకుని కవి ఇంద్రజాలికుడై నెరిపే జగ్లరీ లాగా ఇది కనిపిస్తుంది. ఈ వాదాన్ని పరిశీలిస్తూ, డబ్ల్యు. బి. ఏట్సు ప్రతీకాత్మక కవుల లక్షణాలను కొన్నిటిని క్రోడీకరించాడు. అందులో ముఖ్యమైన లక్షణం, ప్రతీక ప్రతిబింబించే భావం సులువుగా దొరకకుండా ఉండడం అన్నది. ప్రతీక కవి సాధారణమైన కవిత్వ సామగ్రినే చేపట్టినా సంవిధాన చాతుర్యం చేత అది విశిష్టంగా, కష్ట గ్రాహ్యంగా ఉండాలి. ఈ విశిష్టత ఎక్కువగా శబ్దాలు పేర్చడం వలననే పాశ్చాత్యులు సాధించారు. అందుకే అక్కడ వింత గొలిపే వాక్య నిర్మాణాలూ, విడ్డూరమైన విరుపులూ, మాటలు చెదురు మదురుగా ఒక నియతి లేనితనంలో కుప్పలు పడడాలు కనిపిస్తాయని పాశ్చాత్య విమర్శకులు భావించారు.

ఈ ధోరణి పాశ్చాత్య దేశాలలో సాధింపబడిన ధోరణి.

మన సాహిత్యంలో ప్రతీకలు ఎప్పటి నుండీ ఉన్నాయి? - ప్రతీక వాదం ప్రత్యేకంగా ఏర్పడక పోయినంత మాత్రాన, సాహిత్య జీవన స్రవంతిలో కలగలిసి పోయిన, అంశంగా ప్రతీకను గురించి ఆధునిక విమర్శకులు అధ్యయనం చేయనక్కర లేదా?

సాహిత్య మనేది, మానవుని ఆలోచనా ధారకు ఆధారమైన ప్రక్రియ. ఏ జాతికి చెందిన భావ స్రవంతినైనా రెండు భాగాలు చేయవచ్చు. [1] అక్షరాస్యుల భావధార - ఇది లిఖిత రూపంలో మన కళ్ల ఎదుట కనిపిస్తుంది. కవి ఎదుట లేకపోయినా, మనం వారి గ్రంథాల నాధారంగా చేసుకుని దాన్ని విశ్లేషించవచ్చు. అనగా విశ్లేషణకు అది సులభంగా అందుబాటులో ఉంటుంది. అక్షర జ్ఞానం కలిగిన వాళ్ల సంఖ్య తెలుగు దేశంలో నూటికి పాతికను మించి లేదు. అందులో రచనా ప్రక్రియ సాగించే వారి సంఖ్య నూటికి పదిని మించదు. అనగా శాస్త్రముఖం తెలిసి గ్రంథావలోకనం చేయగలిగి, పండిత చర్చలలో వ్యుత్పన్నతను పెంచుకుని ఒక నిర్ణీత మార్గం బుద్ధిని పదును పెట్టుకుని, గ్రంథ రచన చేయగలిగిన వారు నూటికి పదిమంది - ఆధునిక సాహిత్య విమర్శన రీతుల్ని పరిశీలిస్తున్నామంటూ మనం పరిశీలిస్తున్నది, ఈ పది మంది సృష్టించిన సాహిత్యంలోని భావధారను మాత్రమే. ఈ భావధారను ఆధారంగా కొని మొత్తం సాహిత్యం పాశ్చాత్య ప్రభావ సంకలితమైనదనీ, దీనికి మూల బీజాలు పాశ్చాత్య దేశాలలో ఉన్నాయనీ నిర్ధారిస్తున్నాము.

[2] నిరక్షరాస్యుల భావధార :- ఈ నిరక్షరాస్యులు తెలుగు జనాభాలో ఎక్కువ భాగాన్ని ఆక్రమించుకున్నవారు. ఇందులో భావ ప్రకటనా సామర్థ్యం సాహిత్య రూపేణా చేయడానికి సమర్థత కలవారు దాదాపు 50 శాతం. వీళ్ళు చదవనూ, వ్రాయనూ చేతకానివారేకాని ఆలోచించనూ, ఆలోచనా ప్రవాహాన్ని శబ్దార్థ సంయుతంచేసి, నియత రూపంలో ప్రకటించనూ చేతకాని వారుకారు. వీరి భావాల్ని వీరు మౌఖిక ప్రచారంచేతనే బ్రతికించు కుంటుంటారు. వీరి కవిత్వం వినిపించేదేకాని, కనిపించేది కాదు.

తమ భావాల్ని వీరు చెదురుమదురుగా, నియంకృతి లేకుండా గాలికి వెదజల్లే వారని అనుకోవడానికి వీలులేదు. లయబద్ధమైన నడక, శ్రుతి పేయమైన శాబ్దిక సౌందర్యం, గుండెను తాకే అర్థ పౌష్కల్యం, వీరు వెలువరించే భావాల చుట్టూ కొలువు తీరే ఉంటాయి.

ప్రాచీన అలంకారికులు కావ్యాన్ని గురించి చెప్పిన లక్షణాలు వీరి మౌఖిక సాహిత్యానికి అన్వయిస్తాయి - రమణీయార్థ ప్రతిపాదక కావ్యాలూ, రసాత్మక వాక్యాలూ, అలంకృత భావ చిత్రాలూ, గుణయుక్త శబ్దార్థ విన్యాసాలూ - వీరి సాహిత్యంలో మనకు లభిస్తూనే ఉంటాయి. ఒక పద చిత్రాన్ని మీకు ఉదాహరణగా చూపిస్తానిక్కడ -

ఎండిన చెట్టొకటి నిలువెల్లా ఇగురు తొడిగి ఆవిష్కృతమయ్యే శబ్ద చిత్రం ఇది.

(1) ఉరుములు ఉరిమీ
మెరుపులు మెరిశాయీ
పాలు పొంగినట్లు నీళ్ళు పొంగినాయీ
చెట్టు చుట్టుతా చుట్టుకొన్నవమ్మా
ఉడికిన వేళ్లకు ఊపిరొచ్చినాదీ
పాసిన వేళ్లకు ప్రాణమొచ్చినాదీ
లేత యిగురులే చెట్టుబెట్టినాదీ
ఆకులేసి మరి మొగ్గ తొడిగినాదీ
మొగ్గలేసి బలుపూతలు బూసిందీ
పూతలుపూసి పిందెలేసినాదీ
ఆరూ మూడూ తొమ్మిది గడియలకూ
పళ్ళుబండి మరి పక్వము కొచ్చేనూ-

ఇంతింతై వటుడింతయై అనే పోతన పద్యంలోని ఆవిష్కారాన్ని జ్ఞప్తికి తెచ్చే ఆవిష్కారం ఇక్కడకూడ. అంతేకాదు సరళమైన కథన పద్ధతీ, వర్ణనా పారమ్యమూ కనిపిస్తాయి. అలంకారాలకు తల్లి అయిన ఉపమను నిరక్షరాస్య కవి తీర్చి దిద్దిన వైనానికి మరొక ఉదాహరణను మీ ముందుంచుతున్నాను.

కొలుములా దరికొల్పి ఇనుమును కరిగించడం ఇక్కడ ప్రసక్త విషయం.

(2) చిగురు చింతలకాడ చిటుకొలుము బెట్టి
కమసాల్ల బిలిపించి కపట మెత్తించి
నేరాటి పండంటి నీలాలు బోసి
ఉల్లి తెరాంటిదే ఊకపై బోసి
నిమ్మపండుచాయ నిప్పు వేసేను
బారు తిత్తుల జోడు బోరు కొలిపేను
కొలిసి తూముడు ఇనుము కొలుములో బోసి ఊదేటి తిత్తులూ
ఉరుములను బోలు
తూలేటి నిప్పులూ చిన్నాలు బోలు
ఎగిరేటి నిప్పులూ మిణుగుర్లు బోలు
కుతకుతని ఆ ఇనుము కదిలి ఉడికింది.

పాశ్చాత్యులు పెట్టిన భిక్షగా ఇమేజిజం గురించి చెప్తూ ఆధునిక విమర్శకులు ఎజ్రాపౌండును పేర్కొంటుంటారు. ఎజ్రాపౌండు సంగతి తెలియని జానపదుడు ఒక అద్భుతమైన చిత్రాన్ని ఇలా ఇస్తున్నారు చూడండి.

(3) మొగిలూ గమ్మాదాయో
వానాగట్టాదాయె
అవ్వా మన వాకిట్ల
వరదా లెక్కడియే -
నువ్వెళ్లి పక్కింట్ల పండంగ కొడుకా
నీయాని శ్లోకము
వరదలై పారె -

కరుణ పరిప్లానితమైన ప్రతిబింబం కనిపిస్తుందిక్కడ. ఎజ్రాపౌండ్ చెప్పినట్లు పొదుపుగా శబ్దాలు వాడడం, లయను సాధించడం, శబ్ద శ్రేణిని నిర్ణయించుకొని పటిష్టమైన శబ్ద చిత్రాన్ని తయారుచేయడం మనం ఇక్కడ చూడ గలము.

ఇటువంటి కాల్పనిక లక్షణం సర్వమానవులకూ సమానమైన లక్షణమే. దీన్ని ఉద్బోధించడానికి జానపదునికి ఎవరూ అలంకార సాహిత్య పాఠాలు నేర్ప నక్కరలేదు వారిలో స్ఫుటంగా కనిపించే ఆత్మాశ్రయ లక్షణానికి ఒక ఉదాహరణ చూడండి.

(4) ఏటికెతంబెట్టి ఎయిపుట్లు బండించి
గంజిలో మెతుకెరుగనన్నా
పొద్దు పొద్దున లేచి
పొయికాడ కూచుంటె
పోరి ఒస్నీ పోయెరన్నా
పోరి తల్లి దస్నీ పోయెరన్నా

కాల్సెయి కడుక్కొని
కట్టమీద కూచుంటె
కాకి దస్నీ పోయెరన్నా
కాకి పిల్ల దస్నీ పోయెరన్నా

పొద్దు పొద్దునలేచి
బొక్కెన లాగంగ
బొక్క బోర్ల బడితిరన్నా
నాకెంత శరలాయెనన్నా
నాకు చావు రాకా పాయెనన్నా-

ఇంతకు మించి ఆత్మాశ్రయ లక్షణం ఎక్కడ కనిపిస్తుంది? శృంగారాన్ని ప్రణయాన్ని ఆశ్రయించి, నాగరకులైన భావకవులు ఆత్మాశ్రయత్వాన్ని వెలయించగా, జానపద కవి కరుణను ఆశ్రయిస్తున్నాడు. భారతంలో విశ్వరూప దర్శనం చేయలేక పోయానన్న ఆర్తితో చేతులు మోడ్చి ధృతరాష్ట్రుడు వెలువరించిన ఆత్మ వేదనను చూడండి.

కరుణింపుము సంశ్రిత భయ
హరణ గుణా / సహింపు మజ్ఞానంబున్
శరణంబు వేడెద భవ
చ్చరణంబులు కనుగొనం ప్రసాదింప గదే?



ఈ దృశ్యమైన వేదనే ఆ జానపద కవిది కూడా. మనోవేదనను ఉన్నదున్నట్లుగా వెలువరించడానికి కరుణ రస చర్చతో పనిలేదు కదా!

(5) ఎలుకలేరు కట్టి దున్నంగనూ
పిల్లెయ్య మిర్రెక్కి పొడంగనూ

అని జానపదుడు ప్రతీకాత్మకంగా అన్నప్పుడు ఇందులో వ్యక్తావ్యక్త స్థితిలో మనకు కనిపించే మార్మికతకు వ్యాఖ్యాన మక్కరలేదు. అందులో లోకం తీరును ప్రతిబింబించిన విధానాన్ని, ఏ పాశ్చాత్యుడూ జానపద కవికి మప్పలేదు.

ఇంత విపులంగా వివరణ ఇవ్వడానికి నాకు బలమైన కారణం ఉంది. ఆధునిక కవితా పద్ధతులుగా, కాల్పనిక, భావ, ప్రతీక, అస్తిత్వ, అభ్యుదయ, విప్లవ, మార్మిక వాదాలను విమర్శిస్తూ, ఇవన్నీ ఆధునిక కవితా పద్ధతులని, పాశ్చాత్యులే ఈ వాదాలకు మూలభూతులనీ తెలుగు దేశంలో ఈ వాదాలు వాళ్ళ వల్లనే ప్రభావితాలయినాయని, విమర్శకులు చెప్పడమే ఈ విపులీకరణకు కారణం.

సాహిత్య విమర్శకులు, ఒక్కొక్క కవి కావ్యాన్ని ప్రత్యేకంగా విమర్శించినప్పుడు, ఆ కవి పాశ్చాత్య కవి ప్రభావానికి లోనైనాడో, అందుకై అతడు సంపాదించుకున్న ఇతర భాషా సాహిత్యాల పరిచయ నేపథ్య మెటువంటిదో విమర్శించడంలో తప్పులేదు. అంతేకాని, కేవలం ఇరవై శాతం మాత్రమే ఉన్న అక్షరాస్యులనుద్దేశించి విద్యావంతులైన కవులు వెలయించే అత్యల్ప సంఖ్య కల గ్రంథాల నాధారంగా కొని, మొత్తం జాతికి సంబంధించిన భావధార, ఈ కాలంలో ఇలాగే ఉంది అని నిర్ధారించడం, సాహసమే కాక దురుసైన అసత్య ప్రచారం కూడా. ఇరవై శాతం కూడా లేని రచయితలనూ, వాళ్ళ ఆలోచనా ధోరణిని పట్టి, మన సాహిత్య విమర్శ ఇప్పుడు నడుస్తూ ఉందన్న విషయం మనం గుర్తించితీరాలి.

అంతేకాక నిరక్షరాస్యులైనా, కవన ప్రతిభ కలిగి, మౌఖిక ప్రచారంలో తన భావధారను బ్రతికించుకుంటూ వస్తున్న సామాన్యుని కవిత్వానికి ఏ విమర్శన పద్ధతులు పడుతున్నాయి? షెల్లీ, కీట్సు, వర్డ్స్‌వర్త్, జేమ్స్ జాయిస్, వర్జీనియా ఉల్ఫ్, ఇజ్రాపౌండ్, బోదిలేర్, జాపాల్ సార్త్రె, — వీళ్ళెవరి ముఖాలు తెలియని నిరక్షరాస్యులు వెలువరించే సాహిత్యాన్ని ఏ కొలత బద్దతో చూడాలి? అటువంటి నిర్ణాయక సూత్రాలని మొత్తం సాహిత్యానికి అన్వయించే విధంగా ఎలా తయారుచేయాలి? అని సాహిత్యకులూ, సదస్సులూ, ప్రధానంగా చర్చించాలి.

కవిత్వానికి విశ్వజనీనమైన సామగ్రి [2] శ్రుతి మధురమైన లయాత్మక శబ్దం [2] హృదయ దఘ్నంగా మనిషిని ముంచే లోతైన అర్థం. ఇవి ప్రధానాంగాలు. కావ్య శరీరపరంగా, ప్రపంచం మొత్తం మీద ఈ రెండు ఏ కవికయినా కావలసిన సాధనాలు

పోగా, కావ్యావిష్కారం చేస్తున్న వ్యక్తి మానసిక స్థితిని బట్టి, రసస్పర్శ, సన్నివేశమూ, ఇతివృత్తమూ, కథనమూ ఏర్పాటవుతాయి. ఇవి కూడా విశ్వవ్యాప్తంగా ఏ కవులకయినా, సంతరించుకోవలసిన వ్యక్తిగత లక్షణాలు వీటితో శ్రోతకు కూడా ఐక్యం లభిస్తే, ఆ రచన సమాజంతో సరినడకలు నడిచి, సాంఘిక ప్రయోజనాన్ని సాధించే సృజనాత్మక రచనగా భావిస్తుంది. వీటికి శ్రోతతో ఐక్యము లేకపోతే ఆ రచన కేవలం కవిపరంగానే నిలిచి, కాల్పనిక కవిత్వమో, భావకవిత్వమో, ప్రతిబింబ కవిత్వమో, ప్రతీక కవిత్వమో అవుతుంది. ఎక్కడైనా మొదటిది అనుభూత కవితగానూ, రెండవది కేవలం ఆనందదాయక కవితగానూ ఏర్పడుతుంది. జానపద కవికి సంబంధించిన భావధార అనుభూతి ప్రధానమైనది.

ఈ విషయం గుర్తు పెట్టుకుంటే మనం సమాలోచన చేసే సాహిత్య విమర్శ మరొక రకంగా ఉంటుంది. (1) ఎవరో ఒకరిద్దరు ఒక మార్గం పట్టి, పదిమందిని కూడగట్టుకొన్నంత మాత్రాన, ఆ మార్గాన్ని మొత్తం సాహిత్య చరిత్ర గతులు, మార్చిన మార్గంగా ప్రస్తుతించే పద్ధతి మానుకోవాలి (2) దాన్ని అల్పసంఖ్యాక విద్యాధిక వర్గం చేపట్టిన వ్యక్తిగత మార్గంగా అధ్యయనం చేయడం నేర్చుకోవాలి. అంతేకాక, (3) సమకాలికంగా జీవించి ఉన్న నిరక్షరాస్య భావ మార్గంతో అక్షరాస్య భావమార్గాన్ని బేరీజు వేసుకుని, సాహిత్య రంగంలో వాటి

స్థానాలను గుర్తించాలి. (4) జానపద వాఙ్మయ పద్ధతుల్ని అవగతం చేసుకుని, వాటిని వివిధ ప్రయోజనాలను సాధించే వాహికలుగా నాగరకులు కూడా వాడు కోవడం అలవాటు చేసుకోవాలి. మార్క్సిస్టులు ఈనాడు ఎక్కువగా ప్రచారం చేస్తున్న జనసాహిత్యాధ్యయన ప్రాముఖ్యం ఇటువంటిదే.

ఈ నేపథ్యం అవగతం చేసుకున్న తరువాత తిరిగి ప్రతీకల ప్రసక్తి తెస్తే, మన సాహిత్యంలో ప్రతీకల కుండే విశిష్టత శబ్దాల వల్ల కాక, అంతర్గత మైన అర్థాలవల్ల సాధింపబడుతుంది. ప్రాచీన ఆలంకారికులు చెప్పిన వ్యంజనా వృత్తి, రూపక, ప్రతీప, సందేహ, దృష్టాంతాద్యలంకారాలూ, ప్రతీకాత్మక లక్షణాన్ని కొంతలో కొంత కలిగి ఉన్నవని చెప్పవచ్చు. రూపకంలో గోడకు రంగు వేసి నట్లుగా ఉపమేయానికి ఉపమాన ధర్మం ఆరోపింపబడుతున్న విషయం అందరికీ తెలుసు. ఆరోపించే ధర్మం ఇక్కడ చాలా స్పష్టంగా, ఉండవలసినంత గాఢంగా ఉంటుంది. ఇదే ప్రతీక విషయంలోనైతే వర్ణ్యవస్తు లక్షణాలు ప్రతీకలో గుప్తంగా, మరీ బట్టబయలు కాకుండా కేవలం సూచనా మాత్రంగా ఆరోపింపబడి వుంటాయి. ఈ గుప్తలక్షణం ఉండడం వల్లనే ప్రతీకను విశ్లేషించడంలో క్లిష్టత్వం ఏర్పడుతుంది. అయితే ఈ ఆరోపణ అర్థ సంబద్ధమైనదే కాని, కేవలం శబ్దం మీద ఆధారపడి ఉండదు దీన్ని అర్థం చేసుకోవడం మెదడుకు మేత వంటిదని చెప్ప వచ్చు ప్రతీకలు గుప్తమైన అర్థాన్ని విశ్లేషించడానికి ఒక జాతి సంప్రదాయం, సాంఘిక జీవనం, పురాజీవన పద్ధతి, తెలిసి ఉండాలి. ఈ ప్రతీకలు వచనంలో ఉంటాయా, ఛందంలో బిగింపబడి ఉంటాయా అన్న విషయానికి పెద్ద ప్రాధాన్య మేమీ లేదు. ఇవి పాటల్లో, కథల్లో, సామెతల్లో, నుడికారంలో, ఎందులోనైనా కని పించవచ్చును. ప్రాచీన కాలానికి చెందిన ప్రతీకాత్మకత, సాధారణంగా, మతభావ నకూ, ప్రాచీన జీవన విధానానికీ సంబంధించి ఉంటుంది. ప్రతీకాత్మకత యొక్క అమోఘమైన శక్తి జానపద నాగర సాహిత్యాలకు మూలభూతమైన పురాగాథలో కనిపిస్తుంది.

ప్రతీక అనేది, మనిషికి ఆలోచనా విన్యాసానికి గల సత్తాను తెలియజేసే అద్భుతమైన సాధనం. ప్రతీకల్ని సందర్భాను గుణంగా ఏరి కూర్చుకో గల శక్తిమంతుడు మానవుడు. ఎటువంటి సందేహానికైనా నివారణోపాయాన్ని అందిస్తూ ద్వారాలు తెరిచే తాళం చెవిలాంటిది. ప్రతీక - మన ఆలోచనా శక్తి విశ్రమించే అద్భుతస్థానం ప్రతీక. విజ్ఞానం, కళలు, మానవీయ శాస్త్రాలు, మతం అన్నీ ప్రతీకాత్మకతను ఆశ్రయించేవే.

మనస్తత్వ వేత్తలు నిర్ణయించినట్లుగా, ప్రాచీన మానవుడు దాచి పెట్టాలనుకున్న విషయాలను, లేదా అతడు ఎదుర్కొనడానికి సాహసించని విష యాలను, లేదా అతడు కావాలని గందరగోళాన్ని సృష్టించాలనుకున్న విషయాలను, దాచిపెట్టడానికి, పురాకథలు ఉపయోగ పడతాయి. అందుకనే అవి ఎక్కువ మార్మిక లక్షణంతో కూడి ఉంటాయి. ఈ లక్షణం శక్తిమంతంగా రూపుదిద్దు కోవడానికి తోడ్పడేవి ప్రతీకలే.

ఒక పురాగాథ :-

ఉదా :- సృష్టి జరుగక ముందు ఆదిశక్తి ఒక్కతే ఉండేది. ఆమె పక్షిరూపంలో జల మధ్యంలో ఉండేది. ఆమె కోడి గేరినట్లు గేరి, నెమలి పొదిగి నట్లు పొదిగి, సముద్రమధ్యంలో ఒక గుడ్డు పెట్టింది. ఆ గుడ్డు పై పెచ్చు ఆకాశం గానూ, కింది పెచ్చు భూమిగానూ రూపుదిద్దుకున్నాయి. ఇట్లా కథ సాగుతుంది. ఇక్కడ ఉద్భవించే జీవ సంపుటికి గుడ్డు ప్రతీక.

గుడ్డు ఆకారంలో ప్రపంచాన్ని ఊహించడం, మనకు కొత్తకాదు. అండమూ, పిండమూ, బ్రహ్మాండమూ, మూడూ పోలికలు కలిగిన వస్తువు లుగా జ్ఞానులు భావిస్తారు.

అందుకు స్త్రీ గర్భంలో తొలుత బీజరూపంలో ఏర్పడి, తదుపరి పిండాకారాన్ని పొందే గర్భస్థ శిశుభావన కారణం కావచ్చు. ఈ గుడ్డు కూడా నీటి మధ్య ఉనికిని కలిగి ఉంది.

గర్భస్థపిండం కూడా ఉమ్మనీటి మధ్య తేలియాడే స్థితికలది. ఇక్కడ గుడ్డు ఉద్భవించబోయే జీవసంపుటికి నిలయం. అందువల్ల సర్వ జీవ సమన్వయాకృతిగా గుడ్డు ప్రాచీన భావనలో స్థానం పొంది ప్రతీకాత్మకంగా నిలిచిపోయి ఉండవచ్చు. భారతీయ సంప్రదాయం ప్రకారం జీవం అనేది మరణం వల్ల నశించి పోయేది కాదు - జన్మ పరంపర చేత అవ్యాహతంగా సాగిపోయేది. అందువల్ల దానికి సంకేతం, గుండ్రని, కొసలులేని, రూపమే. అందువల్ల కూడా దానికి గుడ్డు ప్రతీకగా నిలిచి ఉండవచ్చు.

ఇటువంటిదే మరొక సంకేతం - సఫలతాచర్యకు స్త్రీని, ప్రతీకగా చెప్పడం క్షేత్రం అనే పదానికి వ్యవసాయయోగ్యమైన భూమి, అనే అర్థంతో పాటు సంతాన యోగ్య అయిన స్త్రీ, భార్య అనే అర్థాలున్నాయి. ఈ అర్థాలు మన భాషలోనూ సాహిత్యంలోనే కాక, పలుదేశాల భాషల్లో ఉన్నాయి. అంతే కాక, వ్యవసాయపరమైన చర్యలలో సర్వప్రాధాన్యమూ స్త్రీకే అర్పింపబడ్డది. నాట్లు వేయడం, విత్తులు చల్లడం, కలుపు తీయడం - స్త్రీలు మాత్రమే చేసే పనులు సఫలత చుట్టూ స్త్రీ పురుష సంబంధమైన లైంగిక చర్యల ప్రసక్తి కని పిస్తుంది. భూమి పండడం, పంట కనడం - వంటి ప్రయోగాలు పిల్లలను కనే తల్లిని ప్రతీకగా భావించే ప్రయోగాలు. ఎంతో కర్మకాండ స్త్రీని ప్రతీకగా గ్రహించి పొలం పనుల చుట్టూ అల్లుకుని ఉంటుంది.

[2] కేవలం సాంఘిక వ్యవస్థను తెలిపే కొన్ని ప్రతీకలు :- 1) కామధేనువు (2) కల్పవృక్షం - ఇవి రెండూ కోర్కెల నిచ్చేవి. అనగా జీవన గమనాన్ని సుఖతరం చేసి, అనుకున్నది ఒనగూడేటట్లు చేసే సాంఘిక వ్యవస్థకు సంబంధించిన రెండు విషయాలివి - [1] చెట్టు [2] పశువు. ఒకటి వ్యవ సాయాన్ని రెండవది పశుపాలననూ తెలియజేసే రెండు ప్రతీకలు. ఈ రెండూ తొలికాలపు వృత్తులు. మనుష్యులకు తిండినిచ్చేవి. అందుకే కామితార్థాల నిచ్చే వస్తువులుగా వృక్ష ధేనువులు ఇక్కడ ప్రసక్తాలయినాయి. కేవలం పాల సముద్రంలో పుట్టి ఇంద్రునిచే సంపాదింపబడినవిగా మాత్రమే ఇవి మామూలు కంటికి కనిపిస్తాయి.

[3] ఆర్థిక సన్నివేశాలను తెలిపేవి

"ఉసురంటి అసురంటి
ఊకె గూచుంటి
పొయ్యిలోపటి పిల్లి
లేచె దారేది"

పొయ్యిలోపలున్న పిల్లి ఒక వ్యక్తిగతమైన ఆర్థిక వ్యవస్థ కిక్కడ ప్రతీక - పిల్లి లేవదనగా పొయ్యి అంటుపెట్టడం కుదరక పోవడం వలన, లేవదు. అంటే ఆ కుటుంబం పొయ్యి అంటబెట్టే స్తోమత కలిగింది కాదని అర్థ-

ఇక్కడ ప్రతీకాత్మకతను అర్థం చేసుకోవడానికి పై పైన, శబ్దాల విశ్లేషణ చేయడం వల్ల ఫలితముండదు.

[4] మతవైషమ్యాలు తెలిపే ప్రతీకాత్మక కథనం :- జానపదగేయ గాథల్లో శైవ, శక్తి వైషమ్యాలు తెలిపే గాథగా రచింపబడిన కథ. కర్నాటకంలో జనించి ఆంధ్ర దేశంలో పన్నెండు పదమూడు శతాబ్దాలలో విహరించిన శైవం, వీరతా ప్రతీకతో, తెలుగుదేశంలో విజృంభించింది. సమకాలికంగా ఉన్న వివిధ మత శాఖలను ఆక్రమించి వాటిని పడగొట్టే ప్రయత్నం చేసింది. జైనాన్ని పూర్తిగా నామరూపాలు లేకుండా చేసింది. వైష్ణవంతో స్పర్థ పెంచుకుంది. గ్రామీణుల సర్వత్ర ప్రసరించిన మత విశ్వాసం గ్రామదేవతా పూజనం, అడుగు సుతాలవారిని పూజారులుగా కలిగి, గ్రామంలోని జనం మొత్తానికి రక్షక దేవతగా మసలి – పాడి, పంట, చెట్టు, చెరువు, పొలిమేర, వంటి గ్రామీణ సంపదకు నిలయాలైన వాటిని ఈ శక్తి రక్షిస్తుంది. ఈవిదలో వరద గుణం కంటే అభయగుణాన్నీ, శాసక లక్షణాన్నీ జనం చూస్తారు. ఈ గ్రామ దేవతారాధనను అరికట్టి జనుల్ని తన వైపుకు ఆకర్షించడానికి తీవ్ర ప్రయత్నం తొలి కాలంలో చేసింది శైవం.

ఆ స్పర్థకు నిలవలేక నామరూపాలు లేకుండా పోయింది జైనం కాగా ఎదురొడ్డి నిలిచి పోరాడింది గ్రామదేవతారాధన విధానం. ఈ మొత్తం పోరాటాన్ని ప్రతీకాత్మకంగా చిత్రించిన గేయగాథలు జానపద సాహిత్యంలో చాలా ఉన్నాయి తెలుగులో. శక్తి కథలన్నిటిలో శైవ, శాక్తాల స్పర్థ; కేవలం వ్యక్తుల పేరు మీద చిత్రితం కావడం, శక్తి విజయం పొందడం కనిపిస్తుంది. ఈదెమ్మ కథ, మాతపురాణం, మాతంగికథ, వంటి ఎన్నో కథలలో ఈ అంశమే నిక్షిప్తమై ఉంది.

శక్తి - వర్ణన -

> "ఓ లోకపావని ఓ జగదంబ
> ఓ యాది మాశక్తి ఓ పరంజోతి
> ధారుణికి నీవె ఆధారంబు తల్లి
> అండపిండ బ్రహ్మాండంబు నీవె
> మతములు నీవె సమ్మతములు నీవె
> సురలెల్ల నీవె మర్మములును నీవె
> నీయందు బుట్టెను నిఖిల లోకములు
> ముగురు మూర్తుల గన్న మోహినివమ్మ
> రక్షించు రక్షించు ఓ లోకమాత -

శక్తికి ప్రతి స్పర్థి అయిన రాజు వర్ణన -

> "భక్త వత్సలు పూజ పరగంగ జేసి
> పరగ గుమ్మడి కాయ జన్మించినోడ
> తన తండ్రి గండాన తరుణి గర్భమున
> నిండార జన్మించి నిముషమున వచ్చి
> పరగ గుమ్మడి పంట పుట్టిన వాడ
> నాడెమై కలిగిన నరరుద్ర హరుడ
> కడిమి మెరసిన ఘనుడ, వీరశైవుండ

వీరిద్దరికి జరిగిన పోరాటంలో శక్తిది అంతిమ విజయం. అందువల్ల కథలో ముక్తాయింపు

> "అవునోయి రుద్రుడ అతిభక్తుడావు
> నీవంటి రాజేగి నిఖిల లోకముల
> మాతను గాల్చితివి మహా సంతోషమాయె
> ఇలకీర్తి బొందమీ విశ్వంబు లోన
> వెలగి మంగళ మహాశ్రీ చేయుచుండ –"

అని కనిపిస్తుంది.

స్త్రీ దేవతా పారమ్యానికి, శైవం మీద అంతిమ విజయ ప్రకటనకూ, ఈ కథ మొత్తం ప్రతీకాత్మకంగా వెలసిన కథ. అంతేకాని, ఒక గ్రామ దేవతకూ, ఒక రాజుకూ మధ్య జరిగిన ఉదంతంగా దీన్ని తక్కువ అంచనా వేయ రాదు. గ్రామదేవతగా కనిపించే మాతృదేవత ఆరాధనా బీజాలు చాలా ప్రాచీన కాలంలో వెదజల్ల బడినవి. మాతృదేవతా భావన త్రిమూర్త్యాత్మకమైన దైవీ భావన పెరిగి, విజృంభించి తుదకు శాక్తేయంగా భాసించి నాగరక మత విధానంలో ఒక విశిష్ట స్థానాన్ని పొందింది. జానపద కథలన్నింటిలో ప్రతీకాత్మక లక్షణం కనిపిస్తూనే ఉంటుంది. అవి ప్రాచీన జీవనానికి సంబంధించిన మతసాంఘిక సంఘటనలకు ప్రాతినిధ్యం వహిస్తూ కనిపిస్తుంటాయి.

[1] స్త్రీ ప్రాధాన్య - పురుష ప్రాధాన్య సంఘాల మధ్య ఘర్షణ - మేనమామ - మేనల్లుళ్ళ పోరాటపు కథలుగా [పరశురాముని యుద్ధం – తరిదేవి కథ – బాలగౌరి వివాహం వంటివి] మేనగోడలు - మేనమామల మధ్య స్పర్థల ఉదంతాలుగా కనిపిస్తాయి. అదే విధంగా [2] ఉడికించని ఆహారం తినే కాలంలో కొత్తగా వచనం చేసే విధానం, సంస్కృతి జీవనంలో ప్రవేశించగా ఆ రెండింటికి మధ్య వచ్చిన స్పర్థ కూడ ప్రతీకాత్మకంగా కథలలో కనిపిస్తుంది. ఇటువంటి ప్రాచీనాంశాలను ఎన్నో కథలను విశ్లేషించి, మనం దొరక పుచ్చుకోవచ్చును.

జానపద విజ్ఞానంలో మనం అవలంబించే ఆచారాలతో, నిర్ణయించు కున్న అంశలలో, మత విధానంలో, సాంఘిక రంగంలో, అడుగు అడుగునా మనకు ప్రతీకాత్మకత ఎదురవుతూనే ఉంటుంది, కొన్ని అలవాట్లను చూడండి :-

[1] ముగ్గు - ఇంటివాకిట వేసే ముగ్గు అలంకరణ కొరకన్న అభి ప్రాయం ఈ నాటిది. ఇంటి విషయమై తీసుకునే రక్షణ చర్యలలో ఒక అంశం ముగ్గు అనేది ఆనాటిది - అనగా ముగ్గు రక్షణచర్యకు ప్రతినిధిగా నిలిచిన ప్రతీక. ఇంటిని దుష్ట శక్తులు ప్రవేశించకుండా అరికట్టే "అడ్డు కర్ర" "వాకిట్లో ముగ్గర వేశావా ?" అనే ప్రయోగం గమనించండి. కర్ర అనే పదానికి ఉన్న అర్థం అక్కడ ప్రతీకాత్మకమైంది. ముగ్గే దుష్టశక్తుల్ని అదుపులో ఉంచుకోవ డానికి పనికి వచ్చే వలయాకృతమైన రంగం "వాడిని మొత్తానికి ముగ్గులోకి దించారు" అనడంలో ఈ ప్రతీకార్థం భాసిస్తుంది. ముగ్గుల్లోనే త్రికోణాలూ, పంచ, షష్ట, అష్టకోణాలూ, కల ముగ్గులుంటాయి. వాటికి ప్రత్యేకార్థాలున్నాయి.

శ్రీచక్రం జీవ, పరమాత్మల అద్వైత సిద్ధికి ఒక సంకేతం - జానపద భావనలో రక్ష-వలయంగా ఏర్పాటయిన ముగ్గు, నాగరక సామాన్య భావనలో అలంక్రియా వస్తువుగానూ, నాగరక మత భావనలో జీవాత్మ పరమాత్మల సంబంధ సిద్ధిగానూ రూపు చెందింది

జంతువులు, పక్షులు ప్రకృతి వస్తువులు, ఒక మత విధానానికి ప్రతీకలై కుదురుకున్నట్లు జానపద వాఙ్మయాధ్యయనం వలన తెలుస్తుంది. తోటెమిక మత స్వరూపంలో, మన గోత్ర సంజ్ఞల్లో, ఈ ప్రతీకల్ని మనం క్షుణ్ణంగా గుర్తించవచ్చు. ఇవి కేవలం గుర్తులు మాత్రమే కావు. ఎంతో చారిత్రక నేపథ్యం కలిగిన ప్రతీకలు - ప్రతీకాత్మకత ఏనాటినుండో జానపదుల్లో బ్రతికే ఉంది. ఈ లక్షణం లేనిదే జానపద కవి గొంతు సారించడు. జాతి జనంలో అధిక సంఖ్యాక వర్గం జానపదులు. వారి కవితా మార్గాలను పరిశీలించకుండా, అల్ప సంఖ్యాక, అక్షరాస్య కవితా మార్గాలను బట్టి సాహిత్య విమర్శన సూత్రాలను అల్లడం, నిర్ధారించడం అపచారం – సాహిత్య జిజ్ఞాసువులు ఈ విషయమై ఆలోచిస్తారని నేను ఆశిస్తున్నాను.



# మోక్షం

### శ్రీ వఝ్ఝల కాళిదాసు

"దేముడూ లేడు దయ్యమూ లేదు
మతం లేదు గితం లేదు
అర్థమూ అధికారమూ
అన్నిటికన్న ముఖ్యం !
నాలుగు వేదాలని
నడి సముద్రంలో ముంచేస్తాం
గుడిలోని దేవుళ్లకి
గుడిసె కూడా లేకుండా చేస్తాం"
అని అరుస్తూ
విరుచుకు పడుతున్న
హిరణ్యాక్ష హిరణ్య కశ్యపులతో
పాశవికమైన బలంతో
లేశమూ సంకోచించక
ఆడదాన్ని
ఆటబొమ్మగా భావించి
పరమానహ్యంగా
పరిహసించే
బలాత్కరించే
హరించుకు పోయే
గాక్షసత్వం మూర్తీభవించిన
రావణ కుంభకర్ణులతో
దయా విరహితంగా
భయోత్పాదకంగా
నిసువుల్ని నహితం
నిర్దాక్షిణ్యంగా
హత్యచేసే కంసులతో
సర్వ శ్రేయో దాయకులనీ
స్వధర్మ రక్షా దక్షులనీ
ఆత్మ గౌరవాభిమానులనీ

అనవరత స్వార్థ రహితులనీ
చీత్కరించి దూషించే
శిశుపాల దంత వక్త్రులతో
దుష్టులకీ దురాగతాలకీ
తోడుగానిల్చి

వరహాల వరాలందించే
కుబేరులతో
కుహనా ప్రభువులతో
ముసురుకు పోతున్న నా దేశానికి
మోక్షం ఎప్పుడో ! ? !

---

# కొలనుతో చెలిమి

ఆకాశంలో నిర్లక్ష్యంగా ఎగురుతున్న చిలుకలు
ఆకుపచ్చని వేపచెట్టుతో అద్వైతైక్యం చెందాయి
ఈదుతున్న బాతు రేపిన తరంగాలలో
పూర్ణిమా చంద్రబింబం గాజు ముక్కలై
చెరువంతా చెదిరిపోతోంది
చిన్న మరకకూడా స్వచ్ఛధవళత్వంతో
ఎంతగా వికసిస్తే పరిపూర్ణత్వం సిద్ధిస్తుందో
అంతగా వికసించిన కలువ పూల కొలను
అహంలేని అనుభూతిలా.
ఈ దృశ్యాల్ని తిలకిస్తూ చెరువుగట్టునచెట్లు
చిరుచలనమైనా లేని సమాధిలో
నాతోబాటు

అంకితం - శ్రీ సుదర్శనం గారికి

# సాయం సంధ్య

ఎందుకో తెలీదుకాని, యీ సాయంసంధ్య చాలా బాగుంది
కారణాలడగద్దు
కనుచూపుమేరలో అలజడి లేదు
పొగలంతా దుమ్మురేపుతున్న నగరం
ఊరి చివరినా డాబాపై చల్లని గాలిలో విశ్రాంతి తీసుకొంది
చల్లని గాలి ఒళ్ళుమరచి ఈ మూలనుంచి ఆమూలకి
నిర్లక్ష్యంగా పరుగెడ్తోంది
చల్లారని టీ యీ చల్లని వాతావరణంలో
నులివెచ్చని ఆవిరితో ముఖాన్ని ముద్దిడుతోంది
కనుచూపు మేరలో కనరాని దృశ్యాలేమీ లేవు
యుగ యుగాలుగా పరిష్కారం దొరకని సమస్యల
వలయాలలో చిక్కుకున్న ప్రపంచం,
హఠాత్తుగా విముక్తమై హాయిగా నిద్రిస్తోంది
పసి పాప నిద్దుర పోతోంది. ఎవరూ చేదు పాటలు పాడద్దు
పీడకలల్ని దరికి తీసుకు రావద్దు
పగలంతా ప్రయోజనవంతమైన కోలాహలంలో
గడచి పోయింది
ఈ సాయంకాలాన్ని మాత్రం వ్యర్థమైన ప్రశాంతిలో
గడవ నివ్వండి
ఎందుకో తెలీదుకాని, యీ సాయం సంధ్య చాలా బాగుంది

---

### శ్రీ రాణి శివశంకరశర్మ

# సహగమనం




మధురాంతకం నరేంద్ర

(గతసంచిక తరువాయి)

## 7

"జీవితమంటే పెద్దరొటీన్ అని నిర్వచించినవాడు, నిజంగా మందమతి అయివుంటాడండీ డాక్టరుగారూ!" టీ కప్పును చేతికందుకుంటూ అన్నాడు సాగర్.

బాల్కనీ పిట్టగోడకవతల; తాము పెయింటింగ్‌లోని బొమ్మలంకామని తెలియజేయడకోసమన్నట్టుగా తలలూపుతున్న కొబ్బరిచెట్ల వెనక; వొకదానితో వొకటి పోటీపడుతున్నట్టుగా మింటికెగసిపోతున్న నక్షత్రాల హోటళ్ళకు దూరంగా; ఫ్యాక్టరీ పొగగొట్టాలతో సంధికుదుర్చుకున్న బూడిదరంగు ఆకాశంపైన, సంధ్య వెలుతుర్లు బిక్కుబిక్కుమంటూ పరచుకున్నాయి.

పిట్టగోడక్రిందున్న కుండీల్లోని క్రోటన్ మొక్కలు పువ్వేదో ఆకేదో తెలియనివ్వకుండా జాగ్రత్త పడుతున్నాయి.

కాలనీకోడ్డు వాహనాల రణగొణధ్వని వినిపిస్తూనే వుంది. యింటిలోపలి నుంచి పాశ్చాత్య సంగీతం కొరడాను ఝుళిపిస్తూనే వుంది.

సగం నెరిసిన వెంట్రుకల్ని వోచేత్తో సవరించుకుంటూ "మీ 'పీస్ అండ్ ఫెటర్నిటీ అసోసియేషన్' యినాక్టివ్‌గా తయారయినట్టుంది సాగర్" అంది డాక్టర్ సుందరవల్లి.

"మీరు టాపిక్ మారుస్తున్నారన్న విషయం నాకు స్పష్టంగానే తెలిసిపోతోందండీ" అంటూ ముఖం ముడుచుకున్నాడు సాగర్.

"తెలిసిపోతే మరేమీ ప్రమాదం లేదులేవయ్యా ఫిలాసఫరూ!" ఆమె నవ్వేసింది "స్వతహాగా డాక్టర్ని గదా! యేయే జబ్బుకేయేమందులివ్వాలో నాకు బాగా తెలుసు. పల్స్ చూడకపోయినా నువ్విప్పుడు టెన్షన్‌లో వున్నావని చెప్పేసెయ్యగలను. వుద్రేకంలో వున్న మనిషికి, ఆ వుద్రేకానికి కారణమైన టాపిక్ నుంచి కాస్సేపు దూరంగా తీసుకెళ్ళడమే మెడిసిన్...."

"అయినా అసోసియేషన్‌కు నేను కేవలం కార్యదర్శిని మాత్రమే గదండీ! అధ్యక్షులు మీ ఆయనే గదా! యీ విషయం ప్రొఫెసరుగారినే అడక్కపోయాలా మీరు?"

"నేను వదలిపెట్టేదాన్ని కానని నీకు తెలిసేవుంటుంద" ఆమె మరోమారు బిగ్గరగా నవ్వేసింది. "ఆయనే చెప్పారు - పోయిన సారి యెగ్జిక్యూటివ్ బాడీ మీటింగుకు సెకట్రీ ప్రెసిడెంటూ - అంటే నువ్వూ ఆయనా. యిద్దరు మాత్రమే హాజరయ్యారట గదా?"

"యేం చెయ్యమంటారండీ డాక్టరుగారూ! అంతా బలవంతపు బ్రాహ్మణార్థమైపోయింది. యేదో గొప్ప పనిచేస్తున్నామన్న కీర్తి తమకుమాత్రం యెందుకు దక్కకూడదని అందరూ అనుకుంటారు. కానీ దానికోసం వొక అరగంటయినా స్పెండ్ చేయటానికి తీరికుండదు పాపం! యెవడో వొకడు గొడ్డుచాకిరి చేసి, యేదయినా చేస్తే క్రెడిట్ నాదంటే నాదని కీచులాడుకుంటారు అందరూ. మందలించాలంటే చిన్నవాళ్ళెవరూ లేరు గదా! డాక్టర్లూ, లాయర్లూ. బిజినెస్ మాగ్నెట్లూ! యిలాంటి వాళ్ళనేనండీ లిటరరీ యిల్లిటరేట్సని పిలిచేది! విసుగెత్తిపోయి, వొకోసారి ఫైళ్ళన్నీ డస్ట్‌బిన్‌లో పడేసి, లెట్ ది అసోసియేషన్ గోటుది డాగ్సని చేతులు కడిగేసుకోవాలనిపిస్తుంది. కానీ జీవితానికి సంతృప్తిని కలిగించే, యీ పని చేజేతులా నాశనం చేయాలని అనిపించదు. చుట్టూనెలకొన్న కొండంత చీకటిని ప్రారోలడం కోసం, చిన్న ప్రమిదనయినా వెలిగించడమన్నది మా 'మాటో' గదా! అందుకే వొకరిద్దరం పట్టు బలవంతాన నెట్టుకొస్తున్నాం దీన్ని. వొకమాటడుగుతాను, యేమీ అనుకోకండి డాక్టరగారూ! మా అసోసియేషన్‌లో మీకు గూడా సాధారణసభ్యత్వముంది గదా! ప్రతి సభ్యుడూ కనీసం రెండు నెలల కొకసారయినా, మీటింగుకు రావాలని నియమం గూడా వుంది గదా! మీరొచ్చి యెన్నేళ్ళయి పోయిందో చెప్పండి?"

"నువ్వామాట అడుగుతావేమోనని భయపడుతూనే వున్నానయ్యా నేను. కానీ యేం చెయ్యను చెప్పు? మా ప్రొఫెషనుకున్న యిబ్బందే అది! క్షణం తీరికుండదు. ప్రయివేటు నర్సింగ్‌హోం ప్రారంభించినప్పటినుంచీ రెస్టంటే యేమిటో నాకు తెలియకుండా పోయింది. యిద్దరు అసిస్టెంట్లున్నారన్న మాటేగానీ, అన్నీ నేనే దగ్గరుండి చూసుకోవాలి. సాయంకాలం ఆరింటికంతా యింటికొచ్చేసేయమని ఆయన రోజూ పోరుతూనే వుంటారు. 'అలా టైమింగ్ ప్రకారం నడవడానికి నేనేమయినా మీలా అకడమిక్ ఫీల్డులో పనిచేస్తున్నాననుకుంటున్నారా' అని ఆయన కంటే బిగ్గరగా కేకలేసి, ఆయన్ని మాట్లాడనివ్వకుండా తప్పించుకుంటున్నాను. అంతెందుకు, నాతో యేదో మాట్లాడడంకోసం అపాయింట్‌మెంట్ కావాలని ఫోన్ చేశావుగదా నువ్వు! నిన్ననే అరేంజ్ చేయాలనుకున్నాను. కానీ అర్జెంటుగా వొక డెలివరీకేసొచ్చింది. వీల్లేకపోయింది. యిప్పుడయినా, నేనిలా యిక్కడ కూచున్నానన్న మాటేగానీ ధ్యాసంతా అక్కడే వుంది...." ఆమె బిగ్గరగా నిట్టూర్చింది.

"మీ బాధను అర్థంచేసుకోగలనండీ! ఆదర్శాలు చెప్పడం చాలా సులభం. ఆచరణ దగ్గరికొచ్చేసరికి గానీ అందులోని యిబ్బందులు అర్థంగావు. వొకమంచి పని చేయాలని అనుకున్నారనుకోండి, వెయ్యి అడ్డంకులు యెదురవుతాయి. యేం చేయాలోగూడా అర్థంగాని పరిస్థితి యెదురవుతుంది. వొక సమస్య వున్నట్టుగా

మరొకటుండదు. అందుకే జీవితాన్ని రొటీనని డిఫైన్ చేసినవారు డల్ హెడెడ్ మానని అన్నానేను. మళ్ళీ పాతటాపిక్ దగ్గరకొచ్చానని అనుకుంటున్నారు గదా మీరు! లాభంలేదండీ డాక్టరుగారూ, అంత సులభంగా మరచిపోగలిగే సమస్య కాదండీ యిది! వొక అన్నయ్య యింతవరకెప్పుడూ యిలాంటి పరిస్థితిని యెదుర్కొని వుండడు. మీరెందరో వ్యక్తుల్ని చూసివుంటారు. యే యితరవ్యక్తీ అడిగివుండని సహాయాన్ని నేనిప్పుడు మిమ్మల్ని అర్థించబోతున్నాను. మీరు సరే నంటే గానీ నాకీ టెన్షను తగ్గదు........"

నుదుటిపైన చెమట బిందువులు పొటమరించాయి. పెదవులు వణకుతున్నాయి. కంటికి కనిపించని ఆధారాన్ని దేన్నో వూతగా పట్టుకుంటున్నట్టుగా పిడికిళ్ళు బిగిస్తున్నాయి. వుద్వేగంతో బిగ్గరగా వుచ్ఛ్వాసనిశ్వాసాలు విడుస్తూ రొప్ప సాగాడు అతను.

అతడి ఆవేశపు పొంగుల్ని అరికట్టడంకోసం వొక చిరునవ్వును చిలకరించడానికి ప్రయత్నించింది ఆమె.

"నాతో నువ్వే విషయం గురించయినా నిస్సందేహంగా మాట్లాడొచ్చు కొత్తవ్యక్తితో మాట్లాడుతున్నట్టుగా నువ్విలా టెన్షన్ ఫీలవ వలసిన అవసరంలేదు. దాదాపు పదిహేనేళ్ళుగా పరిచయముంది గదా నీకూ మీ ఫామిలీతో నాకున్న స్నేహం యీనాటిదా చెప్పు? యింట్లో యే చిన్న ఫంక్షను జరిగినా, మీ ప్రొఫెసరుగారికి నువ్వు పక్కన లేకుంటే కాళ్ళూ చేతులూ ఆడవు. యింతటి అటాచ్‌మెంటున్న వ్యక్తి దగ్గర నువ్విలా బిడియ పడితే యెంత బాధగా వుంటుందో ఆలోచించిందావా నువ్వు?"

"అయ్యయ్యో! మీరలా అనుకోకండి డాక్టరుగారూ!" కలవరపడిపోతూ ఆమె మాటలకు అడ్డు తగిలాడు సాగర్. "చెప్పడానికి అభ్యంతరమేదీ లేదండీ! ఎలా మొదలుపెట్టాలో, యెలా చెప్పాలో తోచక తికమక పడిపోతున్నానంతే!.... కాసేపు ఆగి మళ్ళీ చెప్పసాగాడు. యీ సమస్య యెక్కడ ప్రారంభమయిందో స్పష్టంగా తెలిస్తే, అక్కడి నుంచీ చెప్పడం ప్రారంభించవచ్చు. ఆలోచిస్తే యీ సమస్య మొదలేదో చూపెట్టలేని విషవలయంలా కనిపిస్తోంది, యెక్కడ ప్రారంభమయిందో తెలియదుగానీ, చూస్తుండగానే పెద్దవూబిలా తయారైపోయింది. వూపిరి తిప్పుకోనివ్వడంలేదు.

"..... ..... ....."

"జరిగిందేమిటో మీకు తెలుసు. అనుకోకుండా మా ఫామిలీకి పెద్ద షాక్ తగిలింది. పెళ్ళయి ఆరునెలలయినా గడిచీ గడవకముందే చిరంజీవి పోయాడు. షాక్‌తో మంచంపట్టిన మానసను మీరే ట్రీట్ చేశారు గదా! యింకా మానస పూర్తిగా కోలుకోలేదన్న విషయంగూడా మీకు తెలుసు. తాను వద్దని అంటున్నా బలవంతంగా పెళ్ళి చేయించినవాడిని నేనే! హాయిగా, సుఖంగా, నవ్వుతూ నవ్విస్తూ తిరగవలసిన వ్యక్తి; వున్నట్టుండి మోడుగా మారిపోతే చూస్తూ భరించలేక పోయాను. యీ సమస్యకు పరిష్కారం చూపెట్టవలసిన బాధ్యత నాపైనేవుంది అందుకే నేనే యిన్షియేటమ్ తీసుకున్నాను. యెన్ని కష్టాలనయినా భరించి, యెన్ని అడ్డంకులనయినా యెదిరించి. మానసకు మళ్ళీపెళ్ళి చేయాలని నిర్ణయించుకున్నాను..."

"మళ్ళీ పెళ్ళా?"

"అవునండీ.. రీ మేరేజ్.. తప్పంటారామీరు?"

"తప్పనిగాదు...." ఆమె తడబడిపోయింది.

మరి....అందుకు..."

"మీ సందేహం నాకు తెలుసునండీ! మళ్ళీపెళ్ళి చేసుకోవడానికి ఒప్పుకునే వ్యక్తి యెవరు దొరుకుతాడా అని మీ అనుమానం,..ప్రపంచం ఇంకా గొడ్డుపోలేదండీ! ఆదర్శాలకోసం తమ జీవితాల్ని కత్తిపైన సాముగా మార్చుకునే వ్యక్తులు ఇంకా వున్నారు..."



"యెవరతను ?" ఆమె కుతూహలాన్ని అపుకోలేకపోయింది.

"మా రాజేష్..."

"నిజంగా !"

"అవునండీ ! మొదట తనకు తానుగా అతనే ఆ మాట అన్నప్పుడు నేను సైతం నా చెవుల్ని నేను నమ్మలేక పోయాను. యిక నేను చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం చేసేసుకోవచ్చునని అనుకున్నాను. కానీ ముసళ్లపండుగ ముందేవుందని అర్థంచేసుకోలేక పోయాను..."

"........."

"అమ్మనూ నాన్ననూ వొప్పించేసరికి నా తల్ప్రాణం తోకకొచ్చింది. కూతురి జీవితం బాగుపడడం కంటే వాళ్లకు కావలసిందేముంటుంది ? కానీ వాళ్లెందుకో భయపడి పోయారు. యెన్నిసందేహాలు వెలిబుచ్చారనుకున్నారు ? ఆ అబ్బాయి నిజంగా వొప్పుకున్నాడా ? వాళ్ల అమ్మానాన్నా యేమన్నారు ? పెళ్లయ్యాక అతడెలా ప్రవర్తిస్తాడోయేమో ! అతడెలాంటివాడు ? యింతకూ అతడు ఆరోగ్యవంతుడేనా ? మీకు నవ్వొస్తోంది గదూ ? మీరు నమ్మలేరుగానీ వాళ్లు యింకా చాలా సిల్లీసందేహాలు బయట పెట్టారు. వాళ్ల సందేహాల్ని తీర్చి వొప్పించేసరికి నా తలబట్టగిట్టిపోయింది. అప్పడే యేం జరిగిందిలెండి ? అమ్మానాన్నల్ని వొప్పించడం వొకింతయితే, మానసకు నచ్చజెప్పడం రెండింతలు ! యెంత చెప్పినా 'వూ' అనదు, 'ఆ' అనదు. స్తబ్ధంగా కూర్చుంటుంది. గట్టిగా కేకలేస్తే కంటికి కడివెడుకార్చుస్తుంది. చచ్చిగీపెట్టినా పెదవివిప్పదు చివరికి మౌనమే అర్ధాంగీకారంగా భావించి, రాజేష్‌కు పచ్చజెండా చూపెట్టాను...."

"మానస అత్తా, మామా...."

"మొదట వాళ్లుకూడా అమ్మానాన్నల్లాగే సవాలక్ష సందేహాల్ని వెలిబుచ్చారు. అన్నీ వివరంగా చెప్పడానికి నావోపిక చచ్చిపోయింది. 'నాకు మంచి అని తోచింది నేను చేస్తున్నాను. మీరెలా అనుకున్నా నాకు అభ్యంతరం లేదు' అని వొక్కమాటతో తెగేసి చెప్పి, నేనొచ్చేశాను. చివరకు వాళ్లు యేమనుకున్నారో యేమో, అభ్యంతరం చెప్పలేదు...."

"కానీ...."

"మనుషుల్ని వొప్పించడంతో పనయిపోయిందనుకుని, చేతులు కడుక్కోడానికి సిద్ధపడ్డాన్నేను. యింతలో 'పరిస్థితులు' మేమున్నామంటూ విరుచుకుపడ్డాయి. ఆవేళ మీరొచ్చి మానసను చెక్ చేశారు...."

"......"

"ఫేట్... విధి....యీ పరిస్థితికి పేరేదైతేనేం ? సమస్య మళ్లీ మొదటికొచ్చించి...యిప్పుడు పరిష్కారం మీ చేతుల్లో వుంది...."

"నా చేతుల్లోనా ? !"

"అవునండీ డాక్టరు గారూ ! మానస జీవితం, ఆమె భవిష్యత్తూ మీ చేతుల్లో వున్నాయి...."

"అంటే ! ?"

"మానసకు ముందే మరో పెళ్లి జరిగిందని తెలియజేసే సజీవసాక్ష్యం వుండగూడదని రాజేష్ షరతు...."

"అందుకని...."

"అటువంటి సాక్ష్యమొకటి యీలోకంలోకి వూడిపడకుండా జాగ్రత్త పడాలి. అందుకు మీరు సహాయపడాలి...."

డాక్టరు సుందరవల్లి చాలా సేపటివరకూ జవాబు చెప్పలేకపోయింది.

సాగర్ అసహనంగా సమాధానంకోసం యెదురు చూడసాగాడు.

ఆకాశంలోంచి కెంజాయరంగు పారిపోయి చాలాసేపయిపోయింది. నగరంలో విద్యుద్దీపాల సరంరంభం ప్రారంభమై పోయింది డాక్టరుగారి గృహాంతర్భాగంలో సైతం దీపాలు వెలిగాయి. బాల్కనీలో మాత్రం యింకా చీకటి కొలువు చేస్తూనేవుంది.

డాక్టర్ సుందరవల్లి గొంతు సవరించుకుంది—"మానస మామగారిని కలిశావా నువ్వు ?"

"ఆయననా ? యెందుకు కలవడం ?" సాగర్ విస్తుపోయాడు.

"యిన్ని ఆలోచించ గలిగిన వాడివి, యింత చిన్న విషయం స్ఫురించలేదా నీకు ?" ఆమె ఆశ్చర్యపడిపోయింది. "యిటువంటి క్రిటికల్ సిచ్యువేషన్‌లో నిర్ణయం తీసుకోవలసిన వ్యక్తి ఆయనగాక వేరెవరు ?"

"మీరేం చెబుతున్నారో నాకు అర్థంగావడం లేదండి...."

"ముందు నువ్వు నా పరిస్థితిని గూడా వోసారి ఆలోచించు వృత్తిరీత్యా నేనొకడాక్టర్ని. ప్రమాదంలోవున్న వాళ్లని చేతనయినంత వరకూ రక్షించడం నావృత్తి. యేమంటావు ?"

"నిజమేనండీ ! యిప్పుడు మీరు చేయబోతున్నది గూడా అలాంటిపనే ! యెలాగంటారేమో ! వోసారి మళ్లీ ఆలోచించి చూడండి. యీ సహాయం చేయడం ద్వారా మీరు నాశనమైపోతున్న వొక జీవితానికి మళ్లీ వెలుగు చూపించిన వారవుతారు...." సాగర్ మళ్లీ ఆవేశపడసాగాడు.

"నువ్విప్పుడిలా కోపంతెచ్చుకుంటే నేనేంచేయను చెప్పు ? నేనునీకే సహాయం చేయడానికైనా సిద్ధంగా వున్నాను. కానీ ముందుకొన్ని సందేహాలకు సమాధానాలు కావాలి...."

"నేను కోప్పడడం లేదండీ...."

"నేను కోరుకుంటున్నది గూడా అదే ! మీ చెల్లెల్ని కాపాడ్డానికి నేను సిద్ధంగావున్నాను. కానీ అందుకోసం మరోప్రాణిని నాశనం చేయడం సబబుగా వుంటుందా అన్నది నా అనుమానం..."

"మీరిలా యెందుకు మాట్లాడు తున్నారో నాకెంతకూ అర్థం కావడం లేదండీ డాక్టరుగారూ ! యిందులో మరో ప్రాణిని చంపేప్రశక్తి యెక్కడుంది?"

"యెందుకులేదు ? యిలాంటి వాటినే మనవాళ్లు భ్రూణహత్యలని అంటూవుంటారు, వినలేదా నువ్వు ?"

"మరేమీ పరవాలేదు. మీరెందుకిలా తటపటాయిస్తున్నారో నాకర్థమయింది. నీతులూ న్యాయాలూ కాలానుగుణంగా మారుతూ వుంటాయి. అబార్షన్‌ను భ్రూణహత్యగా భావిస్తే యిక కొంపగుండమయినట్టే ! మీలా అందరూ అనుకుంటే యిక దేశంలో కుటుంబనియంత్రణ పథకం గతి గోదారే అయివుండేది ! దేశంలో యీ సరికి నిల్చోడాని కయినా స్థలం దొరికేది కాదు...."

"నువ్వు వాదాన్ని కేవలం వాదించడం కోసమనే అనుకోవడం యేమీ బాగాలేదు...."ఆమె అడ్డుతగిలింది. "కుటుంబ నియంత్రణ వాళ్ల 'మాటో' యేమిటి ? మేమిద్దరు, మాకిద్దరు'- అదీవాళ్లస్లోగన్ ! యిద్దరు పిల్లల తరువాత పిల్లల్నికంటే అది నేరం. అంటే యేమిటి ? ప్రతిదంపతులకూ యిద్దరు పిల్లల్ని పొందే అర్హత వుంది. కాబట్టి మానస కడుపులోని ప్రాణికి జీవించే నైతికహక్కుంది. దాన్ని కాదని అనడానికి మనకు హక్కులేదు ..."

"మీకు నా సంగతి నవ్వులాటగా కనిపిస్తున్నట్టుంది...." సాగర్ గింజుకున్నాడు.

"అదే నేను వద్దన్నది. నీకు సహాయం చేయడానికి నేను సిద్ధంగా వున్నాను. నా సందేహం తీరేవరకూ నువ్వువోపిక పట్టక తప్పదు. నువ్వుకోప్పడితే నేను చేయగలిగిందేమీలేదు...." ఆమె అనునయించింది.

"యిది మామూలు పరిస్థితిగాదు డాక్టర్" ఆవేశాన్ని బలవంతంగా అణచుకుంటూ నెమ్మదిగా చెప్పసాగాడు అతను. "దీన్ని మీరు అసాధారణ పరిస్థితిగా భావించాలి. యేలోటూ లేని దంపతులకయితే పిల్లలు కలగడం వొక వరం. కానీ భర్తలేని అభాగ్యురాలికి అది వొక శాపం. పరిస్థితంతా మీకు వివరంగా చెప్పాను. రాజేష్ పెట్టిన షరతు మీకు తెలుసు. ఆ పొరబాటే గనుక జరిగితే, మానస జీవితం యెడారై పోతుంది. పాతికేళ్లయినా నిండకమునుపే ముసలిదైపోవాలి. సాటి స్త్రీపైన మీకు కనికరం కలగడంలేదెందుకో?..."

"అయితే వొకమనిషికి పునర్జన్మ యివ్వడంకోసం, మరో మనిషిని చంపి పారేయమంటావు...."

"మీరలా అంటే నేనేం చెప్పగలను?" సాగర్ తుపాకీ గుండు తగిలి నట్టుగా విలవిల లాడిపోయాడు. "యింకా రూపొన్నయినా ధరించని బిడ్డకూ పాతికేళ్ళ అమ్మాయికీ – యిద్దరికీ వొకే న్యాయమేనా ?"

"యెందుకుండకూడదు?"

సాగర్ మనసు కకావికలై పోసాగింది.

"యిద్దరు మనుషుల్లో వొకరికి వొకన్యాయం, మరొకరికి యింకొక న్యాయం అంటూ వుండవు. డాక్టరుగా వొక ప్రాణిని చంపే హక్కు నాకుందా చెప్పు?"

"మీరీ పని చేయకపోతే అన్యాయంగా మా చెల్లెలి జీవితం నాశనమైపోతుంది. అలా నాశనం చేసే హక్కు మాత్రం మీకుందంటారు. అంతే గదా!" తనకు ఆలంబనగా వొక వాదం దొరికిన సంరంభం అతడి మాటల్లో తొంగిచూసింది.

"ఆ పని మాత్రం నేనెలా చేయగలను? మానస మళ్ళీ కళకళలాడుతూ తిరగడమే నాకు కావలసింది గూడా!"

"మీ ధోరణి మరీ విచిత్రంగా వుందండీ" మరోసారి విస్తుపోయాడు సాగర్. "యిప్పుడు మనకు రెండు దారులు మాత్రమే వున్నాయి. వొకటి మానసను రక్షించడం. రెండోది చేజేతులా ఆమె జీవితాన్ని నాశనం చేయడం...."

"అక్కడే పొరబడుతున్నావు నువ్వు. రెండు దారులు మాత్రమే వున్నాయని యెందుకనుకోవాలి. మూడోదారి గూడా వుండొచ్చుగదా ?"

"అదెలా కుదురుతుంది ?"

"జీవించే హక్కున్న ప్రాణిని చంపడం తప్పు. ఆ హక్కు యిప్పుడిప్పుడే ప్రాణం పోసుకుంటున్న వ్యక్తికీ, వోసారి యెదురు దెబ్బతిన్న మనసికీ- యిద్దరికీ యిచ్చి చూద్దాం...."

"యింపాజిబుల్.... అందుకు రాజేష్ వొప్పుకోవడం లేదు...."

"నచ్చజెప్పు...."

"యిప్పుడే అతడెంతో త్యాగం చేస్తున్నాడు. యింతకంటే యెక్కువ అడగడం భావ్యం కాదు...."

దీనికి త్యాగమని పేరు పెట్టడం పెద్దనేరం...."

"డాక్టరుగారూ, మీదగ్గరికి రావడమే నేను చేసిన పొరబాటుగా కనిపిస్తోంది"

"నీకు మళ్ళీ కోపం వచ్చింది గదూ ?" ఆమె నవ్వేసింది. "నాకు తోటి స్త్రీ మీద కనికరం లేదని నిందించావు. నేనేమీ బాధపడలేదు. పురుషుడిగా నీకు అహంకారం పనికిరాదన్నాను. నువ్వు మాత్రం గిజగిజలాడిపోతున్నావు...."

"నేను అహంకరిస్తున్నానా ?" అతడు బెంబేలు పడిపోసాగాడు.

"కాక యింకేమిటి? యీ ప్రపంచంలోని ప్రతి వ్యక్తికీ సుఖంగా బ్రతికే హక్కుంది. ఆ హక్కును ప్రశ్నించే శక్తి యెవరికీ లేదు. మానసకు గూడా మళ్ళీ హాయిగా బ్రతికే హక్కుంది. అందుకు యెవరయినా చేయవలసింది కేవలం తోడ్పాటు మాత్రమే! దానికి త్యాగమని పేరు పెట్టడం ఘోరం...."

"యేమిటోనండీ! నాకంతా అయోమయంగా వుంది...."

"పెద్ద ఫిలాసఫర్‌వి. యింత చిన్న విషయం అర్థంకాకపోవడ మేమిటి ? మగవాడు రెండోపెళ్ళి చేసుకోవడం న్యాయం. స్త్రీకయితే ఆ న్యాయం వర్తించదు. అంతేనా ?"

"యెవరా మాట అన్నది? మీరు నన్ను పూర్తిగా అపార్థం చేసుకున్నారు." మాటలు కూడబలుక్కుంటూ చెప్పసాగాడు. యిది అన్యాయమని అందరూ అంటారు. నేను మరో ముందడుగు వేసి, స్త్రీకి సైతం రెండో పెళ్ళి చేయడం న్యాయమేనని నిరూపించి చూపించాలని అనుకుంటున్నాను...."

"అంతవరకూ బాగానే వుంది. రెండోపెళ్ళి మగవాణ్ణి పెళ్ళి చేసుకోవడానికి సిద్ధపడిన అమ్మాయి పరిస్థితి యెలా వుంటుందో ఆలోచించావా నువ్వు? మీరెప్పుడయినా ఆ అమ్మాయి త్యాగం చేస్తోందని మాటవరసకయినా అన్నారా ?..."

"........"

"అలాంటప్పుడు, యిప్పుడు రాజేష్ త్యాగం చేస్తున్నాడని అనడంలో న్యాయం వుందా చెప్పు ?"

"........"

"దీన్ని త్యాగం అనరు. తోటి మనిషిగా అతడు తన బాధ్యతను నెరవేరుస్తున్నాడు. ఆ బాధ్యత తమకుందని గుర్తించేవాళ్లు అరుదు. మనిషి మనిషిగా బ్రతకడం లేదిప్పుడు. నిజమైన మానవులు కరువైపోయిన యీ లోకంలో రాజేష్ వొక రేర్ స్పెసిమన్. అతడు నిజమైన మనిషి. తన బాధ్యతను గుర్తించిన మనిషి. ఆ మేరకు అతన్ని మెచ్చుకుందాం. గౌరవిద్దాం. కానీ త్యాగం చేస్తున్నాడని మాత్రం అనవద్దు. అలా అనడం ఘోరం. నీ వనుకుంటున్న ఆదర్శానికే అది మచ్చ...."

"నిజమేనండీ.... కానీ యింతకూ యిప్పుడు మీరు నాకు చేసిన సహాయమేమిటి?" బిగ్గరగా నిట్టూర్చాడు సాగర్. "సమస్యను మళ్లీ మొదటికే తీసుకొచ్చారు. అంతేనా ?"

"అలాగని యెందుకనుకోవాలి? నీకొచ్చిన సమస్య యేమిటో స్పష్టంగా విశ్లేషించి చూపెట్టానని గూడా అనుకోవచ్చుగదా!"

ఆత్మావలోకన చేసుకోవడం కోసం, సాగర్ కాస్సేపు మౌనంగా వుండిపోయాడు.

లాండ్ కాబోతున్న విమానమొకటి గుయ్యిమని రొద పెడుతూ నగరం పైన గిరికీలు కొడుతోంది: దారి తప్పిన బాటసారిలా చంద్రుడు ఆకాశం పైన్నుంచి బిక్కు బిక్కు మని తొంగిచూస్తున్నాడు. టీవీ ప్రసారాలు ప్రారంభం కావడంతో, కాలనీ వీధుల్లో పిల్లలెక్కడా కనిపించడం లేదు.

"నాకంతా అయోమయంగా వుంది మేడమ్!" వేడెక్కిపోయిన నుదుటిని అరిచేతితో పరామర్శించుకుంటూ అన్నాడు సాగర్. "వొక సమస్యను పరిష్కరించమని మీదగ్గరికొస్తే, మరో సమస్యను తీసుకొచ్చి పెట్టారు మళ్ళీవోసారి ఆలోచించి చూడండి. రాజేష్ వాదనలో కొంచెం న్యాయముందని అనిపిస్తోంది నాకు. మీరీ సహాయం చేయగలిగితే, తరువాత యిబ్బందేమీ వుండదు...."

"అంటే నువ్వింకా స్వార్థపూరితంగానే ఆలోచిస్తున్నావన్నమాట!?"

"మళ్ళీ మీరు అలాగే మాట్లాడుతున్నారు...." విలవిలలాడిపోయాడతను.

"నీ చెల్లెలి సుఖం కోసం మరొకరి హక్కుకు భంగం కలిగిస్తున్నావు...."

"మీకు సహాయం చేయాలని వున్నట్టు లేదండీ డాక్టరుగారూ! అందుకే యిలా అకుకు అందకుండా పోకకు చెందకుండా మాట్లాడుతున్నారు." నిట్టూర్చాడు.

"నువ్వు పొరబడుతున్నావు" చివాలున అడ్డుతగిలింది ఆమె. "మీ కుటుంబం కంటే ఆత్మీయులు మరెవరూ లేరు నాకు. అందుకే నీకిలా నచ్చజెప్పుతున్నాను. నువ్వడుగుతున్న పనిలాంటి దెప్పుడయినా చేయవలసివచ్చినపుడు, వొకటికి రెండుసార్లు ఆలోచించి నిర్ణయం తీసుకోమంటుంది వైద్యశాస్త్రం. ప్రాణం పోయడమే గానీ, తీయడం మా విధి గాదు పోనీ మరో మార్గం చెబుతాను. నువ్వో మళ్ళీ వోసారి ఆలోచించు. మీ రాజేష్‌ను గూడా మళ్ళీ వొకసారి కదిపిచూడు. మానస, మరో వ్యక్తి – యిద్దరిలో యెవరినో వొకరిని మాత్రమే రక్షించగలమని స్పష్టమయినప్పుడు, నీ కిష్టమయిన పనే చేస్తాను. కానీ అప్పుడు చివరి నిర్ణయం తీసుకోవలసిన వ్యక్తి నేనుగాదు. నువ్వు గూడా కాదు...."

"మరి....?"

"మానస అత్తా, మామా...."

"మళ్ళీ యిదేమిటండీ?"

"అంత చదువుకున్నావు. యింత చిన్న విషయం అర్థంగాలేదూ నీకు? మానస కడుపులో వున్న బిడ్డకు స్వంత మనుషులెవరూ లేరని అనుకుంటున్నావు నువ్వు. తండ్రి చనిపోయినంత మాత్రాన ఆ బిడ్డ అనాథ అవుతుందా? ఆ బిడ్డకు తల్లివుంది. తల్లి సైతం నిరాదరణ చేసిందనుకో, ఆపైన వాళ్ళ తాతయ్యున్నాడు. ఆ బిడ్డ వాళ్లవంశాంకురం, ఆ విషయం మరచిపోతున్నావు నువ్వు...." డాక్టర్ సుందరవల్లి కంచుకంఠం సాగర్ చెవుల్లో చాలాసేపటి వరకూ

ప్రతిధ్వనిస్తూనే వుండిపోయింది.

## 8

"మంచితనానికి లోకంలో స్థానంలేదు. వేలు చూపెడితే మనిషినంతా మింగేసే స్వభావం మీది. తలనొప్పిగా వుందంటున్నాడు గదా, పోతేపోనిలెమ్మని వొకప్పు కాఫీ తాగిరమ్మంటే. గంటలతరబడీ అక్కడే వుండిపోతే యేమనుకోవాలి? నేను గూడా పొద్దుటినుంచీ గొడ్డువాకిరీ చేశాను గదా? యిప్పుడు టయమెంత యింది? రెండున్నర. డ్యూటీ అయిపోయాక యింటికెళ్లిపోవాలని నాకు గూడా వుంటుంది గదా! నాకు తెలుసులేవోయ్, మంచితనానికి లోకంలో స్థానం లేదు." కస్సుమంటూ పైకిలేచాడు రాజేష్.

"యెప్పుడూలేనిది, యింతమాత్రానికే యిలా మండి పడుతున్నావేమిటోయ్ యివ్వాళ? యేమయింది నీకు? మొదట తమాషాకు గొడవచేస్తున్నావేమోనను కున్నాను. తీరాచూస్తే...." విస్తుపోయాడు అతను.

"యిది చిన్నవిషయమా? నీకలాగే వుంటుందిలే...." రాజేష్ ముఖం ముడుచుకున్నాడు.

"మరి? నాలుగైదురోజులుగా నీ సంగతి గమనిస్తూనే వున్నాను. నువ్వెందుకో వ్యగ్రంగావున్నావు. అవునా?"

"నేనా? వ్యగ్రంగానా? అదేమీలేదు...." తాను సులభంగా బయటపడి పోతున్నాడన్న విషయం స్ఫురించడంతో అతడు కంగారు పడిపోయాడు.

"నాకు తెలుసులేవోయ్! కొత్త వ్యక్తిని బుకాయించి నట్టుగా నన్ను యేమార్చలేవు. మూడేళ్లుగా మనంవొకేచోట పనిచేస్తున్నాం. అంతమాత్రం గ్రహించ లేనా నేను? నువ్వెందుకో బాధపడుతున్నావు."

"లేటుగా వచ్చింది చాలక, నన్నేక్రాస్ యెగ్జామిన్ చేస్తున్నావన్నమాట?" రాజేష్ ముఖం చాటు చేసుకున్నాడు."నేను వెళ్తున్నాను. యేయీగారొచ్చి అడిగితే బ్లూప్రింటు రేపటికి రెడీ అవుతుందని చెప్పు...."

తన కొలీగ్ తనకేసి చిత్రంగా చూస్తున్న విషయాన్ని రాజేష్ గమనించ లేకపోయాడు.

మట్టిరోడ్డుపైన చకచకానడవసాగాడు.

కొండవాళ్లని తెగగొట్టి కొత్తగా నిర్మించిన మట్టిబాట అప్పుడే తెగిన గాయంలా ఎర్రగా మెరుస్తోంది.

బాట కిరువైపులా ముళ్లపొదలు బారులు తీరి నిల్చుని వున్నాయి.

ఆకాశాన్ని అందుకోవాలన్న పోటీలో హఠ్ఠాని కాళ్ల విరగ్గొట్టుకుని, చతికిల బడిన పస్తాదుల్లా అటువైపొక కొండా,యిటువైపొక కొండా...మధ్యలో పరిగెడు తున్న నదీ ప్రవాహం...దాన్ని అరికట్టడంకోసం నిర్మించిన ఆనకట్టా....ఆదృశ్యం ప్రకృతితో మానవుడు నెరపుతున్న నిరంతరపోరాటానికి భాష్యం చెబుతున్నట్టుగా కనిపిస్తోంది.

చేతిలోని టీస్క్వేయర్నీ, కంపాసుబాక్సునీ మరో చేతిలోనికి మార్చుకుని రుమాలుతో చెమటను తుడుచుకుంటూ నడక సాగిస్తున్నాడు రాజేష్.

వేళదాటిపోవడంతో ఆకలి చచ్చిపోయింది.

కానీ చికాకు మాత్రం తగ్గలేదు.

తనపై తనకే విసుగు కలుగుతోంది.

'వొకర్నని లాభమేముంది? తనకే బుద్ధిలేదు. తెలిసి తెలిసీ తప్పటడుగులు వేయడం తనకలవాటైపోయింది. యెన్ని యెదురు దెబ్బలు తగిలినా తనకు బుద్ధి రావడం లేదు. తలనొప్పిగా వుందని వాడు నటించి నంతమాత్రాన తానెందుకు కరిగిపోవాలి? నీపని గూడా నేనే చేస్తాను, వెళ్లి అరగంటలో రమ్మని భుజం తట్టి సాగనంపిన తరువాత, ఆలస్యం జరిగిందని ఆఘోరించడ మెందుకు? తానొక బుద్ధిలేని వెధవ...' వెయ్యోన్నో వొకటోసారి తిట్టుకున్నాడు అతను.

'అందరూ యింతే... మంచితనానికి లోకంలో తావులేదు. అమాయకుడైన వాడైన కనిపిస్తే, వాడినెత్తిపైన చేయిపెట్టడం కోసం అందరూ కాసుక్కూచుంటారు. యెదుటివాడి మంచితనానిక్కూడా కొన్ని హద్దులుంటాయని వొక్కడూ వొక్క డంటే వొక్కడయినా తెలుసుకోడెందుకు? అయినా వొకర్నని లాభమేముంది? పొరబాటు తనలోనే వుంది....' నిముషానికోసారి నిట్టూరుస్తూ ముందుకు సాగి పోతున్నాడు—'సుఖంగా సాగిపోతున్న జీవితాన్ని పరీక్షలపాలు చేయడం తన కలవాటై పోయినట్టుంది. సమయం దొరికింది లెమ్మనుకుని తమ వుక్కు కౌగిళ్ళని మరింతగా బిగిస్తున్న పరిస్థితులమధ్య చిక్కి చిక్కిరించడం మినహా తనిప్పుడు చేయగలిగిందేముంది? జీవితం ముళ్ళపాన్పయి పోతోంది. బ్రతుకొక శాపమై కూర్చొంది. యెన్నాళ్ళీపరీక్ష? తన జీవితాన్ని నందనవనంగా మార్చిపారేసే దేవత యెక్కడుంది? తన పెదవులకొక చిరునవ్వును అతికించగల మాంత్రికురాలెక్క డుంది? మానస...అవును, మానస....మానస....యేదీమానస? తన జీవితాన్ని పండించగల శక్తి మానసకుతప్ప మరెవరికుంది? అదిగో మళ్ళీ తన బుద్ధి పెడ దారి పడుతోంది. తనకోసం సర్వప్రపంచాన్ని వదలిపెట్టి రాగలవ్యక్తి తనకిప్పుడు కావాలి. వదలిపెట్టాలని అనుకున్నా వదలిపెట్టనిగతం మానసనిప్పుడు వెంటాడు తోంది. అసలింతకూ ఆమె తనగతాన్ని వదలిపెట్టాలని అనుకుంటోందని తానెలా నమ్మగలడు? యెటువెళ్ళాలో తోచక సతమతమైపోతున్న మానసకు ఆసరాచిచ్చి ముందుకు నడిపించగల వ్యక్తి యెక్కడున్నాడు? దారిని చూపెట్టగలడని అను కున్న వ్యక్తి నిష్ప్రయోజకుడై పోయాడెందుచేత? అతడెందుకు సందేహిస్తు న్నాడు? యెందుకిలా మూర్ఖుడైపోయాడు? మూర్ఖత్వం....అమాయకత్వం..చిక్కు మాలిన పుస్తకాలన్నీ చదివిన పైత్యం....పొగరు...అన్నీకలిపి పోతపోసిన విగ్ర హంలా తయారై పోయినట్టున్నాడు. లేకపోతే చంద్రమౌళిగారిలా తన దగ్గరకొచ్చి' మరచిపోవాలని అనుకున్న విషయం మళ్ళీ జ్ఞాపకం రావడంతో విసుగ్గా నిట్టూర్చాడు. చేతిలోని టి స్క్వేయరు క్షణక్షణానికి బరువెక్కుతున్నట్టుగా అనిపించసాగింది. 'యిదేమిటిలా శిలువలా తయారైకూచుంది? ముందు దీన్ని గదిలో గిరవాటే యాలి....'

హాల్వ్యూ గెస్టుహవుసు యింకా ఫర్లాంగుదూరముంది.

మిగిలినదూరాన్ని గూడా నిట్టూర్పులతోనే కొలుస్తూ గెస్టుహవుసు ముంగి లిలోకొచ్చి నిల్చుండిపోయాడు.

యెండలోనుంచి వొక్కసారిగా నీడపట్టుకు రావడంతో గదంతా చీకటితో అలుక్కుపోయినట్టుగా కనిపించింది.

కళ్ళు నులుముకుంటూ లోపలికొచ్చాడు.

కుర్చీలో యెవరో కూచున్నట్టుగా స్పష్టాస్పష్టంగా కనిపించింది,

కళ్లు చిట్లించుకుని చూశాడు.

'పొద్దస్తమానమూ ఒకేరకమయిన ఆలోచనలతో విసిగిపోవడంచేత ప్రతి



వ్యక్తి సాగర్‌లాగే కనిపిస్తున్నట్టున్నాడు' అనుకున్నాడు.

'యిది భ్రమగా అనిపించడంలేదు. ఇతను నిజంగా సాగరేనేమో! యిదెలా కుదురుతుంది ? యీ సమయంలోయిక్కడ .. యిక్కడికెలా వచ్చాడు ?' కంగారును కప్పి పుచ్చుకోవడం కోసమన్నట్టుగా మంచంపైన కూర్చున్నాడు.

టీ స్క్వేయరూ, కంపాక్సూ చేతుల్లోనే వున్న విషయం జ్ఞాపకం వచ్చింది. రెండింటినీ ప్రక్కన పడేశాడు.

ముందెవరు మాట్లాడుతారోనని పందెం వేసుకున్నట్టుగా కాసేపు యిద్దరూ మౌనంగా కూచున్నారు.

చివరకు రాజేష్ వోడిపోయాడు.

"యెప్పుడొచ్చావు ?" అంటూ పలకరించాడు.

"గంటయింది...."

"యివ్వాళ కొంచెం లేటయింది.'' సంజాయిషీ యిస్తున్నట్టుగా చెప్పసాగాడు. "డ్యూటీ వొంటిగంటకే అయిపోయింది. కానీ మా కొలీగ్ వొకతను.... నాకు నువ్వొస్తున్నట్టుగా తెలియదు గదా ?...."

"......"

"అయిదు నిమిషాలు... రెండు చెంబుల నీళ్లు దిమ్మరించుకుంటేగానీ, యీ దుమ్ము వదిలిపెట్టదు..."

చల్లటి నీటితో స్నానం చేశాకగానీ ఆకలి సంగతి జ్ఞాపకం రాలేదు.

టేబులుపైన కారియరు సిద్ధంగా వుంది.

"భోంచేశావా నువ్వు? '

"పన్నెండింటికి భోంచేసి బయల్దేరాను. నువ్వు కానియ్.... యిప్పటికే ఆలస్యమైపోయింది...."

కారియర్‌లోంచి గిన్నెల్ని విప్పి, పింగాణి ప్లేటులోకి వడ్డించుకున్నాడు.

"నువ్వు ఆఫీసు వైపుకైనా రాలేదట !...." అన్నాడు సాగర్.

"యిక్కడే సరిపోతోంది. యిటువైపు కొండపైన గెస్టుహవుసుందికదా! అటువైపు కొండపైన గూడా యిలాంటిదే మరొక గెస్టుహవుసు కట్టాలని ప్లాను. యెంత తొందరలో వీలయితే అంత తొందరగా పని పూర్తిచేయమని ఛీఫ్ యింజనీర్‌గారి ఆర్డరు. సర్వేలూ, ప్లాన్‌డ్రాయింగ్— అన్నీ నా నెత్తిపైనే పడ్డాయి... "

సాగర్ మౌనంగా వుండిపోయాడు.

తిన్న శాస్త్రాన్ని ముగించాక, గిన్నెల్ని వొకవైపుకు సర్దిపెట్టి, పైకి లేచాడు రాజేష్.

వాష్ బేసిన్‌లో చేతులు కడుక్కుని, టవలుతో తుడుచుకుంటూ, వాలు కుర్చీలో కూర్చున్నాడు.

"యీరోజు సాయంకాలమైనా వూళ్ళోకొస్తున్నావా నువ్వు ?" అంటూ ప్రశ్నించాడు సాగర్.

"కొంచెం యెండ తగ్గాక వెళ్దాం. నువ్వు ప్రాజెక్టు చూడాలన్నావుగదా వోసారి, సాయంకాలం వో అరగంటసేపు అలా తిరిగొచ్చాక యిద్దరమూ కలిసే వెళ్ళిపోవచ్చు...." దినపత్రికలో ముఖాన్ని దాచుకుంటూ జవాబు చెప్పాడు రాజేష్.

అరగంటసేపు దినపత్రికతో కాలక్షేపం చేస్తున్నట్టుగా నటించిన తరువాత, ముఖాన్ని అవతలకి తిప్పాడు.

సాగర్ కళ్లు మూసుకుని మంచంపైన పడుకుని వున్నాడు. నిద్రపోతున్నదీ లేనిదీ స్పష్టంగా తెలియడంలేదు.

పేపరు నవతలికి పారేసి, రాజేష్ తాను కూడా కాస్సేపు కునికిపాట్లు పడ్డాడు.

నాలుగున్నర గంటల ప్రాంతంలో ప్యూను ఫ్లాస్కులో కాఫీ తీసుకొచ్చాడు.

యిద్దరూ ముఖాలు కడిగి, కాఫీలు తాగి బయట పడ్డారు.

సూర్యుడు కొండవెనక్కి జారిపోయేముందుగా, చివరగా వోసారి తనవితీరా ఆనకట్టను కలయజూస్తున్నాడు.

ఆనకట్ట తలుపుల గుండా యివతలకి దుముకుతున్న జలపాతపు హోరు లయబద్ధంగా వినబడుతోంది.

అక్కడక్కడా గ్రామికుల గుంపులు కనిపిస్తూనే వున్నాయి.

మిత్రుడికి నిర్మాణ విశేషాలు వివరిస్తూ ఆనకట్టపైకి తీసుకొచ్చాడు రాజేష్.

"ఆనకట్టకి తలుపులు లేకుంటే బావుండేది. యెంచక్కా వచ్చిన నీళ్ళంతా యిక్కడే ఆగిపోయి వుండేవి" అన్నాడు సాగర్ యధాలాపంగా.

"అదెలా కుదురుతుంది ?" రాజేష్ విస్తుపోయాడు. "వేగంగా వచ్చే ప్రవాహపు తాకిడి నుంచీ ఆనకట్టను కాపాడ్డం కోసమూ, వాటర్ లెవల్‌ను డేంజర్ లైను దాటకుండా చూసుకోవడం కోసమూ తలుపులు తప్పనిసరిగా కావల్సిందే!"

"నిజమే ! నేనేదో పరధ్యానంగా వుండి అలా అనేశాను" బుద్ధిమంతుడిలా సాగర్ తప్పు వొప్పుకున్నాడు.

"ప్రకృతిని జయించానని మానవుడు అనుకుంటే అంత ఫూలిష్‌నెస్ మరొకటుండదు. యీ ఆనకట్ట మానవుడి ఆత్మవిశ్వాసానికి, ఆదర్శానికి సింబల్‌గా కనిపిస్తుంది నాకు. ఆదర్శం యెంత ఉన్నతమైనదయినా కావొచ్చు. కానీ దానికి కొన్ని హద్దులుంటాయి గదా !"

దెబ్బతగలవలసిన చోటే తగిలింది. సాగర్ వో ట్రాక్‌పైన కూలబడిపోయాడు.

'తన వాదనలోని సహేతుకత్వాన్ని యెంత సునాయాసంగా వెల్లడిచేయ కలిగాడు తాను ! ఆలోచనలకు పదును పెట్టవలసిన అవసరమయినా రాలేదు. మాటలకోసం వెతుక్కోవలసిన అగత్యమయినా కలగలేదు !' తన తెలివి తేటలకు తానే ఆశ్చర్యపడిపోయాడు రాజేష్. అతడి ముఖంలో విజయగర్వం తొంగిచూసింది. జేబులోంచీ సిగరెట్టు పెట్టె పైకి లాగి, మిత్రుడి ముందుకు చూపాడు.

సాగర్ వొద్దన్నట్టుగా తలవూపాడు.

తానొక సిగరెట్టు వెలిగించుకుని, ట్రాక్‌పైన కూర్చున్నాడు రాజేష్.

"నాకేమిటో అంతా అయోమయంగా వుంది రాజూ ! యేందేయాలో తోచడం లేదు...." సాగర్ తన నిస్సహాయతను బయట పెట్టేశాడు. "చంద్రమౌళిగారి ధోరణి నాకు అర్థంగావడం లేదు. వొక్కోసారి ఆయన వాదంలోనూ న్యాయమున్నట్టుగా అనిపిస్తోంది. అందుకే వోసారి నిన్నుకలవమని చెప్పానాయనతో...."

"చాలా గొప్పపని చేశావు !" వెటకారం చేస్తూ అడ్డుతగిలాడు రాజేష్. "అవతల మా అమ్మానాన్నలకూ, అన్నయ్యకూ ఎలా నచ్చజెప్పాలో తోచక సతమతమైపోతున్నాన్నేను. చాలని దానికి, ఆయనగారిని గూడా నాపైకి తోలేసి, తమాషా చూడాలనుకున్నావు ఆయన జలగలా పట్టినపట్టు వదలి పెట్టలేదు...."

"వొకసారి ఆయన వైపునుంచీ గూడా ఆలోచించి చూడు రాజూ !" ప్రాధేయపడ్డాడు. సాగర్.

"ఆయన కొచ్చిన కష్టమేమిటిప్పుడు ?" రాజేష్ విసుక్కున్నాడు.

"యింట్లో ఆయనా, వాళ్లావిడా—మరోవ్యక్తి లేదు. వాళ్లవంశం ఆయనతో అంతమైపోతోంది గదా అని బాధపడుతున్నాడు. బిడ్డను తానే పెంచుకుంటానని అంటున్నాడు గదా ?"

"వంశం వంశమంటూ బీసీ నాటికబుర్లు చెప్పొద్దు సాగర్ ! వంశమూ, వంశవృక్షమూ అన్నీ ట్రాష్....అమాటకొస్తే యేవంశమయినా శాశ్వతంగా గూటంగొట్టుకుని అఘోరించిందేమో చూపెట్టుచూద్దాం. నేనూ చరిత్ర చదువుకున్నాను. యీదేశాన్ని యెన్ని వంశాలు పరిపాలించాయి ? యేమయిపోయాయా వంశాలన్నీ ? అంతెందుకు ? మీ ముత్తాతగారి పేరేమిటో చెప్పుచూద్దాం ! రెండు మూడుతరాలకు మునుపు యెవరెవరెలా వున్నారో తెలియనప్పుడు. వంశమూ, వంశవృక్షమూ అనే పడికట్టుమాటల్ని పప్పుజెప్పడమెందుకు ? యింత చదువు చదివీ, యిలా మాట్లాడ్డానికి సిగ్గుకలగడం లేదా నీకు ?..."

(65 వ పేజీ చూడండి)

డా॥ మైనేని కృష్ణకుమారి

# రాజరాజదేవేంద్రవర్మని యుద్ధపుర తామ్రశాసనము

## శక సంవత్సరము 998

ఇటీవల ఈ శాసనము మరో తామ్ర శాసనముతోపాటు విజయనగరం జిల్లా, బొబ్బిలి తాలూకాలోని గల్లావల్లి అను గ్రామములో కామేశ్వరస్వామి ఆలయ సమీపమున ఇటుకలకై నేలను త్రవ్వుచుండగా ఒక మృణ్మయ పాత్రలో ఆ వూరి గ్రామస్థులకు లభించినవి. తరుపరి వీటిని అచ్చటి కామేశ్వరస్వామి దేవాలయములో భద్రపరిచిరి. ఈ విషయము మే 15వ తారీకు 'ఆంధ్రభూమి' అను వార్తాపత్రికలో ప్రచురితమైనది. ఔత్సాహికులైన కొందరు ఆంధ్రవిశ్వ విద్యాలయ విద్యార్థుల సహాయ సహకారములతో నీశాసనమును ప్రచురణ నిమిత్తమై సంపాదింప గలిగితిని.

ఈ తామ్ర శాసనములో మొత్తము మూడు రేకులున్నవి. ఒక్కొక్క రేకు పొడవు, 25 5 సెం.మీ. వెడల్పు, 12.5 సెం.మీ మందము 0.6 సెం.మీ. అన్ని రేకులును ఒకే మందములో లేవు. ఈ రేకుల అంచులు కొంచము ఉబ్బెత్తుగా చేయబడుట వలన శాసన పాఠము ఎచ్చటను అంతగా దెబ్బతినలేదు. ఈ మూడు రేకులును ఒక కడియములో దూర్చి భద్రపరచుటకు అనువుగ ఒక్కొక్క రేకుకు ఎడమప్రక్క అంచునకు 4 సెం.మీ. దూరమున 23 సెం.మీ. వ్యాసము గల రంధ్రమున్నది. ఈ శాసనము మొత్తము బరువు 3 కిలోగ్రాముల 700 గ్రాము లున్నది. విడివిడిగా చూచినచో శాసనము రేకుల బరువు ఈ క్రింది విధముగా నున్నది.

| | | |
|---|---|---|
| మొదటిరేకు | — | 635 గ్రాములు |
| రెండవరేకు | — | 715 గ్రాములు |
| మూడవరేకు | — | 790 గ్రాములు |
| కడియముతో కలిపి రాజముద్రిక బరువు | — | 1.560 గ్రాములు. |
| తూకము మొత్తము | — | 3.700 గ్రాములు. |

ఈ శాసనము యొక్క మొదటి భాగము మూడవరేకు మొదటి ప్రక్కను, దాని తరువాతి భాగమును రెండవరేకు పైభాగము రెండవభాగమునను, తరువాతి భాగము మొదటిరేకు రెండవ వైపున, మొదటివైపునను చెక్కబడినవి. మూడవరేకు రెండవవైపు ఏమియును వ్రాయబడలేదు. రేకులమీది అక్షరములు కొంచము లోతుగానే చెక్కబడి శాసన పాఠమును చదువుటకు వీలుగనే వున్నది. శాస్త్రీయ పద్ధతిలో రేకులపైన ఏర్పడిన కిలుమువంటి పదార్థమును, క్లోరైడ్‌లను నిర్మూలించుట మొదట క్షార మిశ్రమముతోను తదుపరి ఆమ్లమిశ్రమముతోను శుభ్రము చేసిరిని. ఈ శాసనములో మొత్తము 47 పంక్తులు కలవు. వాటి వివరములు ఈ క్రింది విధముగానున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| మొదటిరేకు | — | మొదటివైపు | — | 8 పంక్తులు |
| మొదటిరేకు | — | రెండవవైపు | — | 10 పంక్తులు |
| రెండవరేకు | — | మొదటివైపు | — | 10 పంక్తులు |
| రెండవరేకు | — | రెండవవైపు | — | 10 పంక్తులు |
| మూడవరేకు | — | మొదటివైపు | — | 9 పంక్తులు |
| | | మొత్తము | — | 47 పంక్తులు. |

శాసనపు మూడు రేకులను గుది గ్రుచ్చియుంచిన సుమారు సెం. మీ. మందముగల రాగి కడియమునకు పై భాగమున గల రాజముద్రిక కళింగ గాంగ రాజుల సాంప్రదాయములోనే యున్నది. ముద్రిక పై భాగమున కూర్చుండిన నంది, దాని కుడివైపున సూర్యుడు, చంద్రుడు, అంకుశము, కత్తి ఎడమ వైపున డమరుకము, చామరము, శంఖం మున్నగునవి చెక్కబడినవి.



మొదటి రేకు : మొదటి వైపు

ఈ శాసనములో నుపయోగింపబడిన భాషపూర్తిగా సంస్కృతము. ఇది పద్య, గద్యములలో నున్నది శాసనము చివరి భాగము అసంపూర్ణముగా నున్నది. సాధారణముగా శాసనములలో చెప్పబడు విధముగా దానము చేసిన గ్రామము సరిహద్దులు గాని, భూమి దాన రక్షణ, భక్షణల ఫలాఫలములను తెలుపు వ్యాస ప్రోక్త శ్లోకములు దీనిలో ఎచ్చటను కానరావు.

శాసనములో వాడిన లిపి క్రీ. శ. 11వ శతాబ్దిలో వాడబడిన కళింగ నాగిరి లిపి. శాసనములో ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు, పూర్ణానుస్వారములు సంస్కృత సంప్రదాయానుసారముగా లిఖించబడినవి. మూడవ వజ్రహస్తదేవుని శాసనముల వలెనే దీని యందు కూడ 'బ' అను అక్షరమునకు బదులుగా 'వ'అను అక్షరము వ్రాయబడినది. ఉదాహరణమునకు 'మహాశబ్ద' అను పదమునకు బదులుగా 'మహాశవ్ద' (6 వ పంక్తిలో) అనియు 'సముపలబ్ధ' అను పదమునకు బదులుగా 'సముపలవ్ధ' (7వ పంక్తిలో) అనియు, 'శాకాబ్దే' అను పదమునకు బదులుగా 'శాకావ్దే' (పంక్తులు 25, 38, 46) అను పదము వుపయోగింపబడినది. మరియు "సింహ" అను పదమునకు మారుగా "సింఘ" (38వ పంక్తిలో) అనియు, "శుభే" అను పదమునకు "సుభే" అనియు "సంసిక్త"కు బదులుగా "సంశిక్త" (39 వ పంక్తిలో) అనియు వ్రాయబడినది. అంతేగాక పదాంత హల్లులు వ్రాయునపుడు అక్షరము క్రింది భాగమున అడ్డముగా చిన్నగీత వ్రాయబడినది. ఉదాహరణమునకు "నివహాన్" (11వ పంక్తిలో) మరియు "వారణాన్" (31 వ పంక్తిలో) మున్నగు పదములు. శాసనములో నచ్చటచ్చట పద్యమునకు పద్యమునకు మధ్యన మరియు పద్య, గద్యములు వేరుగా చూపించుట కొరకు (32, 40 వ పంక్తులలో) నాలుగు నిలువుగీతల మధ్యన పూర్ణానుస్వారమును వ్రాసిరి.

ఈ శాసనము శక సంవత్సరము 998, తులామాసము, విషువు సంక్రాంతినాడు కళింగ రాజైన రాజ రాజ దేవేంద్ర వర్మచే నీయబడినది. అనగా నిది క్రీ. శ. 1076న ఈయబడిన గ్రామదాన శాసనము.

మూడవ వజ్రహస్తుని శాసనములు, (1) రాజ రాజ దేవేంద్రవర్మని తక్కిన శాసనముల (2) వలెనే, ఈ శాసనములో కూడ కళింగ గాంగ వంశ వర్ణనము ముందుగా ప్రస్తుతించ బడినది. అత్రేయ గోత్రజులైన కళింగ రాజులు అమర పురమును బోలు అనేక సుధాధవళితములైన ప్రాసాదముల పంక్తులు గలట్టియు, ఎల్లప్పుడు వర విలాసినుల లలిత లాస్యములు గలట్టియు, ఉద్దండ పండితుల వంశములతో అలంకృతమైనట్టియు, శ్రీ దన్తి పురమునుండి ప్రసిద్ధ

సిద్ధ తాపసులచే అధిష్టించబడిన కందరములుగల మహేంద్రా చలము యొక్క బంగారు శిఖరము పైన ప్రతిష్టించ బడియున్న సకల చరాచర విశ్వమునకు గురువైనట్టియు, సకల భువనముల నిర్మాణము నందు ఏకైక సూత్రధారుడు, శంశాక చూడామణి యైనట్టి గోకర్ణస్వామి దయవలన శంఖము, భేరి, పంచమహా శబ్దములు, ధవళ ఛత్రము, బంగారు వింజామర మరియు నంది మున్నగునవి రాజ్య చిహ్నములుగా పొందినట్లుగా వర్ణించబడినది.

వంశ క్రమములో గుణ మహార్ణవుడు, అతని కుమారుడు మొదటి వజ్ర హస్తుడు, అతని కుమారులైన ఒకటవ గుండమ రాజు, మొదటి కామార్ణవుడు, వినయాదిత్యుడు పేర్కొనబడినారు. మొదటి వజ్రహస్తుని రెండవ కుమారుడైన కామార్ణవుని (I) తనయుడు రెండవ వజ్రహస్తుడు. ఇతనికి అనియంక భీముడని కూడ నామాంతరము కలదు. ఇతనికి మరల రెండవ కామార్ణవ, రెండవ గుండమరాజు, మధుకామార్ణవులని ముగ్గురు కుమారులు. వీరిలో రెండవ కామార్ణవునికి, వైదుంబ వంశజయైన వినయ మహాదేవి వలన మూడవ వజ్రహస్తుడు కలిగెను. ఈ వజ్రహస్తునికి అనంగ మహాదేవి వలన కలిగిన కుమారుడే ఈ దాన శాసన మిచ్చిన రాజ రాజ దేవేంద్రవర్మ. ఈ దిగువ నిచ్చిన పట్టికలో శాసనమున చెప్పబడిన కళింగ వంశ రాజుల వంశ క్రమమును, వారి పరిపాలనా కాలమును ఈయబడినది.

గుణ మహార్ణవుడు

↓

వజ్రహస్తుడు (I) 44 సంవత్సరములు

↓

| ↓ | ↓ | ↓ |
|---|---|---|
| గుండమరాజు (I)<br>8 సంవత్సరములు | కామార్ణవుడు (I)<br>35 సంవత్సరములు | వినయాదిత్యుడు<br>8 సంవత్సరములు |

↓

వజ్రహస్తుడు (2)<br>అను<br>అనియంక భీముడు<br>35 సంవత్సరములు.

↓

| ↓ | ↓ | ↓ |
|---|---|---|
| కామార్ణవుడు (2)<br>½ సంవత్సరము<br>[ఇతని భార్య వైదుంబ వంశజురాలైన వినయ మహాదేవి] | గుండమ (2)<br>3 సంవత్సరములు | మధుకామార్ణవుడు<br>19 సంవత్సరములు. |

↓

అనంతవర్మ వజ్రహస్తుడు (3)
(పట్టాభిషేక సంవత్సరం, శక 960)
33 సంవత్సరములు. ఇతని భార్య
అనంగ మహాదేవి

↓

రాజరాజ దేవేంద్రవర్మ
(పట్టాభిషేక సంవత్సరము, శక 992)
ప్రస్తుత శాసనము నిచ్చిన దాత.

శాసనములో మొదటి వజ్రహస్తుని గురించి అతడు పూర్వమయిదుగురు రాజులవలన ఐదు విభాగములుగ విభజింపబడి అనుభవింపబడిన భూమిని భూరి పరాక్రముడును, ఉదార చరితుడునైన వజ్రహస్తుడు తానొక్కడే స్వయముగా భుజబలము వల్ల శత్రునివహములను జయించి ఏకముచేసి పాలించినట్లుగా కలదు.

శాసనములో తరువాత ముఖ్యముగా చెప్పబడినది మూడవ వజ్రహస్తుని పట్టాభిషేక సమయము. ఈతడు శకసంవత్సరము 960 (క్రీ.శ. 1038)లో సూర్యుడు వృషభరాశిలో నుండగా, చంద్రుడు రోహిణిలో నుండగా కళింగ రాజ్యమునకు పట్టాభిషిక్తుడై అనంతవర్మ, పరమ మహేశ్వర, పరమ భట్టారక, రాజాధిరాజ మున్నగు బిరుదములను వహించెను (3).



మొదటి రేకు : రెండవ వైపు

శాసనకర్తయైన రాజరాజదేవునికి 'దేవేంద్రవర్మ' అనియు 'త్రికళింగాధిపతి' అనియు, 'మహారాజాధిరాజ'ను బిరుదములు కలవు. పరమ మహేశ్వరుడు, పరమ భట్టారకుడునైన ఈతడు శకసంవత్సరము 992న జ్యేష్ఠశుద్ధఅష్టమి గురు వారమునాడు ఉత్తర ఫల్గుని నక్షత్రమున, సింహలగ్నమునందు కళింగరాజ్యమునకు పట్టాభిషిక్తుడయ్యెను (4). ఈతడు తన తల్లిదండ్రులకు పుణ్య యశోభి వృద్ధికిగాను శ్రీపుర గ్రామస్తుడు, శాండిల్య గోత్రజుడు, వాజసనేయకుడునైన దుర్గయశర్మ పుత్రుడైన పల్లయశ[ర్మ]కు సమ్మ్వావిషయములోని యుద్ధపుర అను గ్రామమును చతుస్సీమములతోను, సర్వపీడా వివర్జితముగాను ఆచంద్రార్కముగా నిచ్చెను (5). రాజరాజ దేవేంద్రవర్మని ఇతర శాసనముల (6) వలె ఈ శాసనమందుకూడ దానమిచ్చు గ్రామమును అగ్రహారదానముగా ప్రస్తావించబడలేదు. దీనిని బట్టి చూచినచో దానగ్రహీతయైన పల్లయశ[ర్మ] తాను స్వీకరించిన గ్రామమునకు సంబంధించిన పన్నులన్నిటిని చెల్లించవలసిన బాధ్యతలున్నట్లు తోచుచున్నది.

'సమ్మ్వావిషయమను'నది మూడవ వజ్రహస్తుని శాసనములలోను, రాజదేవేంద్రవర్మ శాసనములలోను, అనంతవర్మ చోడగంగుని శాసనములలోను కూడ చెప్పబడినది. (7) ఇది ప్రస్తుతము విజయనగరము జిల్లాలోని బొబ్బిలి తాలూకా మరియు చీపురుపల్లి తాలూకాలోని కొంతభాగముగా గుర్తించబడినది. దానమీయబడిన 'యుద్ధపుర' అను గ్రామము ప్రస్తుతము బొబ్బిలి తాలూకాలోని 'వుద్దవోలు' గ్రామముగా గుర్తించుటకు వీలగుచున్నది (8). దానగ్రహీతయైన పల్లయశ[ర్మ] 'శ్రీపుర'గ్రామ నివాసిగా శాసనములో ప్రస్తావించ బడినది. ఈ గ్రామమును విశాఖపట్టణము జిల్లాలోని 'శిరిపురము'గా గుర్తించవచ్చును.

## అధోజ్ఞాపికలు

అ. ప్రస్తుత మీ శాసనము ప్రొ॥ సి. సోమ సుందరరావుగారిచే పరిష్కరించబడుచున్నది. ఇది గాంగశకము 200న (అనగా క్రీ.శ. 758వ సంవత్సరము)లో దేవేంద్రవర్మ కుమారుడు రాజేంద్రవర్మచే ఆత్రేయ గోత్రజుడైన దుర్గశర్మకు గల్లావెల్లిలోని వివిధ భూములను దానము చేసినట్లుగా నిచ్చిన తామ్రశాసనము.



రెండవ రేకు : మొదటి వైపు



రెండవ రేకు : రెండవ వైపు

1. మూడవ వజ్రహస్తదేవుని శాసనముల పట్టికకై చూడుడు : ఎపిగ్రాఫియా ఇండికా, వాల్యుం: 32, పేజి, 319; ఎన్. రమేశన్: కాపర్ ప్లేటు ఇన్‌స్క్రిప్షన్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు మ్యూజియము, వాల్యుం, 1, పేజి. 137; మరియు సి. సోమసుందరరావు, ఎపిగ్రాఫియా ఆంధ్రికా, వాల్యుం: 4 పేజీలు 25 నుండి 34 వరకు.
2. జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టారికల్ రీసర్చ్ సొసైటి, వాల్యుం: 8, పే. 171 అదే వాల్యుం: 31, నం: 24, పే 191 నుండి 196 వరకు.
3. శాసన పాఠములోని పంక్తులు 25, 26.
4. పైది., 38, 39
5. పైది., 43నుండి 46 వరకు గల పంక్తులు.
6. ఎపిగ్రాఫియా ఇండిక, వాల్యుం: 31, పే, 191-196; జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టారికల్ రీసర్చ్ సొసైటి, వాల్యుం: 8 పే. 176.
7. కాపర్ ప్లేటు ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు మ్యూజియం వాల్యుం 1, పేజీలు 144; మరియు 154 నుండి 155 వరకు. ఇండియన్ యాంటిక్వరి, వాల్యుం 18 పేజీలు 161-165.
8. ప్రాచీనాంధ్ర స్థలనామములను పరిశీలించినచో "పుర" లేక "పురము"లు చివరి పదములుగాగల గ్రామ నామములు కాలక్రమమున "ప్రోలు" లేక "ఓలు" శబ్దములుగా మార్పు చెందినవి. ఉదాహరణమునకు "కృష్ణరాయపురమను"నది కొప్పోలుగాను (కడపజిల్లా), "నిరవద్యపురము"నది "నిడదవోలు" (పశ్చిమ గోదావరి జిల్లా) గాను మార్పు నొందినవి.

శాసన పాఠము

(1, 3, 11, 13, 16 - శార్దూల విక్రీడితము; 2, 6, 12, 14 - అనుష్టుప్; 4 - వంశస్థ; 5, 9 - మాలిని, 7, 8 - గీతి; 10, 15 - వసంత తిలక)

మూడవరేకు : మొదటి భాగము

1. ఓం స్వస్తి శ్రీమతా మఖిల భువన వినుత నయ వినయ దయా దాన దాక్షిణ్య। సత్య
2. శౌచ శౌర్య ధైర్యాది గుణరత్న పవిత్ర కాణామ్రాత్రేతా గోత్రాణాం విమల విచా(రా)-
3. చార పుణ్యసలిల ప్రక్షాళిత కాలి కాల కల్మష మషీణాం మహా మహేన్ద్రాచల శి-

ఖర ప్రతిష్టితస్య స చరాచర గురోః సకల భువన నిర్మాణైక సూత్రధార -
స్య శశా ఙ్క చూడామణే ర్భ గవతో గోకర్ణస్వామినః ప్రసాదాత్సమా
దిత్తై -
క శఙ్ఖ భేరీ పఞ్చ మహా శ (బ్ద)ధ్వ ధవల చ్ఛత్ర హేమ చామరవర వృషభ లాఞ్ఛన
సముజ్వల సమస్త సామ్రాజ్య మహీ మనేక సమర సంఘట్ట సముప

లబ్ధ (బ్ధ) - విజయ లక్ష్మీ (సమా) -
లిఙ్గితోత్తుంగ - భుజ దణ్డ - మణ్డితాన్వయ మలఙ్క- (రిష్ణోర్)
విష్ణోర్వివ విక్రమాక్రాన్త ధరా మణ్డలస్య గుణ మహా (ర్ణ) వ మహా
రాజస్య (పు)

రెండవరేకు : మొదటి భాగము

10. (త్రః) ॥౦॥ పూర్వం భూ పతిభి ర్విభజ్య వసుధాయా పఞ్చ తిః పఞ్చధా భుక్తా భూరి పరాక్రమో భు -
11. జ బలాత్రామేక ఏన స్వయం ఏకీకృత్య విజిత్య శత్రు నివహాన్ శ్రీ వజ్ర హస్త చతుశ్చత్వారింశ -
12. త మత్యుదార చరితః సర్వామ రక్షిస మాః ॥ ( ) తస్య తనయో గుణమ రాజా (జో) వర్ష త్రయ మపాలయ
13. ద్భహీం ॥ తదానుజః కామార్ణవ దేవః పఞ్చ త్రింశత మద్వ (బ్ద) కాన్ తస్యానుజో వినయాదిత్య స్సమా -
14. స్త్రిసః। తతః కామార్ణవా జ్ఞాతో జగతీ కల్ప భూరుహః। యో రాజ ద్రాజిత చ్ఛాయో వజ్ర హస్తో
15. పని పతిః ॥ (2) ప్రస్థోదన్మద గన్ధ లుబ్ధ (బ్ధ) మధుప వ్యాలీఢ గధా న్గజా న్నర్థి భ్యస్సమదా -
16. త్సహస్ర మతులోయ స్త్యాగి నామగ్రణీస్స శ్రీమానసి యఙ్క- భీమ నృపతిర్గ జ్ఞాన్వయోన్నత
17. సకః పఞ్చ త్రింశత మద్వ (బ్ద) కా న్నమ భున ప్రిథ్వీం స్తుతః పార్థివై॥ (3) తదగ్రసూనుః సురరాజ
18. సూనువా సమస్సమస్తాం సమితారి మణ్డలః (1) స్సమపాతి కామార్ణవ భూపతి ర్ధ్రువం సమృద్ధిమాన
19. ర్థ సమూహం సముజ్వలః ॥ (4) తదను తదను జన్మోచిత్త జన్మోప మానో గుణనిధి రనవద్యో

రెండవరేకు : రెండవ భాగము

20. గుణమాఖ్యో మహీసః (1) సకలమిద మరక్ష త్త్రీణి వర్షాణి ధాత్రీవలయ మలఘు తేజో నిర్జి
21. తారాతి చక్రః ॥ (5) తతో ద్వైమాతురస్తస్య మధు కామార్ణవో నృపః। అవతి స్మావనీ మేతా మద్వా (బ్దా) నే
22. కాన్న వింశతిం ॥ (6) అథ వజ్రహస్త నృపతే ర్గ్రసుతా దఖిలగుణ జనాగ్రగణ్యః కామా
23. ఖవాన్క-సీన్ద్ర ప్రగీయ మానావదాత శుభ కీర్త్తిః ॥ (7) శ్రియ ఇవ వైదుమ్యాన్వయ పయః పయో
24. నిధి సముభవా యాశ్చయః సమజని వినయ మహాదేవ్యాః శ్రీ వజ్రహస్త ఇతిత -



మూడవ రేకు : మొదటి వైపు



రాజముద్రిక

25. నయః ॥ (8) వియ (ద్రి) ధృతు నిధి సంఖ్యాం యాతి శాకా వ్ద (బ్ద) సం (ఖ్యే) షే దిన కృతి వృషభ స్తై రో (హి)

26. ణీ భేసు లగ్నే (1) ధనుషిచసిత పక్షే సూర్య్యే వారె తృతీయాయుజి సకల ధర్మిత్రీం రక్షితుం

27. యో భి షి క్తః ॥ (9) న్యాయాయ్యేన యత్ర సమ మాచరితుం త్రివర్గ మార్గేణ రక్షతి మహీ మ్మహిత ప్రతాపే –

28. నిర్వ్యాధి యశ్చ నిరఘాశ్చ నిరాపదశ్చ శశ్వత్ప్రిజాభువి భవన్తి విభూతి మత్యః ॥ (10) వ్యాప్తే గ

29. జ్ఞగలోత్తమస్య యశసా దిక్చక్రవాలె శశి ప్రద్యోతా మలినేన యస్య భువనః ... (ప్రష్టో)

## మొదటిరేకు : రెండవ భాగము

30. ద సమ్పాదినా (1) స్తైస్తూరె తి సాన్ద్రి పఙ్క పటలైః కు స్తస్థలీ పట్టకేస్వాలి మ్పన్తి పునః పు

31. నశ్చ హారితామా ధోరణా వారణాన్ । (11) అనురాగేణ గుణినో యస్య వక్షో ముఖాబ్జ (బ్జ) యోః ।

32. ఆసీనే శ్రీ సగస్వత్యావనుకూలే విరాజతః (12) ॥ ఆగచ్ఛన్నురు విక్రమేణ సహసా శస్త్రిభి

33. ధాతా ద్విభో యేకా వ్యాహత విశ్వవృత్తి మహిమా హేలా నిరస్తో గనిః । తేనాకారి నికామ కామ్య –

34. తనునా రాజ్యం మహీమణ్డలే త్రింశద్వసర మత్ర సుత్ర యశసా వర్షత్ర యేణాధికం ॥ (13) తతో

35. నజ్ఞ మహాదేవ్యాం వ్రజహ స్త మహీపతేః । గౌర్యామివ హరస్యా భూ త్కా ర్తికేయ ఇ

36. వాత్మజః ॥ (14) లక్ష్మీ వధూ వదన పఙ్కజ మకరన్ద స్నోహ చారు పరి చు మ్బన చంచరీక

37. ః । యో మానినాంచ గుణినాంచ దురాత్మనాంచ సా న్తించ మోదమతు లంచ భయంచ ద త్తె ॥ (15) శా –

38. రావే (బ్దే) నయనాబ్ద (బ్జ గర్భ నిధిశె జ్యేష్టస్థ మీసిజ్ఞ (ంహి) కె లగ్నె చోత్తర ఫాల్గుణిశు గురు దినె పక్షె

39. సుసుప్రె సుభెలోకాలోక మహా మహీ ధవలాయా లంకార వత్యా భువ సంశిక్త స్సక –

## మొదటిరేకు : మొదటి భాగము

40. లిజ్ఞరాజ తిలకః శ్రీ రాజరాజో నృపః ॥ం॥ (16) కలిజ్గ నగరాన్పరమ మహేశ్వర పరమ

# అకాలవర్షం

## నిఖిలేశ్వర్

ఆకాశమే కరిగి
కుమ్మరించేధారాప్రవాహాల్లో
కనురెప్ప పాటులో జరిగిన అద్భుతం
ఎటు చూసినా జలమయమైన భూమి.
వర్షాకృతిని సాంతం
తనలో ఇముడ్చుకోలేని ఆరాటంలో
నిస్సహాయస్థితిలో
ఆనందమయమైన హోరులోనే
అణగిమణగి దాగిన విధ్వంసనం
మళ్లీ అంతే హఠాత్తుగా
అపారమైన ఈ చీకటి నిశ్శబ్దం
విస్తరించి దుముకుతూ పొంగేనదులు
విలీనం చేసుకుంటున్న
నిస్సీమ సాగర ముఖద్వారాలు
నా చుట్టూనీచుట్టూనిరంతరం

41. భట్టారక మహారాజాధిరాజ త్రికలిఙ్గాధిపతి శ్రీమద్దేవేన్ద్రి వర్మా రాజ రాజదే

42. వః కుశలీ సమస్తామాత్య ప్రముఖ జనపదాన్సమా హూయ సమాజ్ఞాపయతి విది

43. త మస్తు భవతాం । సమ్యా విషయె యుద్ధ పురాఖ్యో గ్రామ శ్చతు స్సీమా

44. విచ్ఛిన్న స్సజల స్తల స్సర్వ పీడా వివర్జితా మాచన్ద్రార్క క్షితి సమ కాలం

45. యావన్మాతా పిత్రో రాత్మనశ్చ పుణ్య యశోభివృద్ధయె వసు నన్ద నిధి గ –

46. ణితె శాకాబ్దె (బ్దె । తులా మాసె విషువతి సంక్రాన్త్యాం శ్రీపుర గ్రామ నివాసి । (శా)

47. ణ్డిల్యగోత్ర వాజసనేయక । దుర్గయశర్మణః పుత్రాయ పల్లయ శ (ర్మణః)

1. సంకేతరూపమున వ్రాయబడినది

### ఛాయా చిత్రముల జాబితా



□

సీరియల్

# సమిధలు

## దిలావర్

(గత సంచిక తరువాయి)

**15**

సూర్యుడు కొండల్లోకి వాలిపోతున్నాడు. పొలాల మీంచి వీస్తున్న అల్లరి పిల్లగాలులు పల్లెపడుచుల ముంగురులతో ఆడుకుంటున్నాయి. ఇంటి దారి పట్టిన ఆలమందలు కేరింతలు కొడుతూ తోకలు లేపుకొని పరుగులు తీస్తున్నాయి.

మునిమాపువేళ ముగ్గురు సహచరులతో పల్లెలోకి ప్రవేశించాడు రవి.

రవి నరనరాన వుత్సాహం పురకలు వేస్తున్నది.

జనసామాన్యం చేతిలో విప్లవసంస్కృతి శక్తివంతమైన ఆయుధం కావాలన్న తమ ఆలోచన రూపుదిద్దుకోబోతున్నది.

ఏ జనసామాన్యం సంక్షేమంకోసం కళలు అంకితం కావాలని కోరుకుంటున్నామో, ఏ ఆశోపహతుల గుండెల్లో ఆసులు మోసులెత్తేందుకు ప్రజాకళలు వర్ధిల్లాలని ఆశిస్తున్నామో, ఏ దగాపడిన తమ్ముళ్లను ఏదగకుండేదవకుండని కళలు సమాశ్వాసించాలని నమ్ముతున్నామో, ఏ ప్రజాస్వామ్యాన్ని కళలద్వారా సుస్థిరం చేయాలనుకుంటున్నామో, దోపిడి దౌర్జన్యానికి వ్యతిరేకంగా సుదీర్ఘ పోరాటాలకు ప్రజల్ని కళలద్వారా సమాయత్తం చేయాలనుకుంటున్నామో...ఆ ప్రజాకళలతో ...ఆ ప్రజల మధ్యకే వెళుతున్నామన్న భావన రవిని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది

క్రమంగా చీకటి అలుముకున్నది. ఆకాశంలో నక్షత్రాలు అక్కడక్కడా మినుకు మినుకు మంటున్నాయి చిన్న సాంస్కృతిక దళంగా ఏర్పడిన రవి బృందం వూరిమధ్యనున్న హనుమంతుడి గుడి ముందుకు చేరుకుంది

పనిపాట్లు ముగించుకున్న జనం ఒక్కొక్కరే గుడిముందుకు చేరుకుంటున్నారు. కొంచెం సేపటికి వూరిజనమంతా పోగయ్యారు. వాళ్ళవేపు తేరిపార చూశాడు రవి. బ్రతుకు భారంతో వంగిపోయిన వెన్నులతో పీక్కుపోయిన ముఖాలతో నిరాశలకు ప్రతిరూపాలుగా వున్న కళ్లతో అలసిపోయి-దారిద్ర్యం చేతిలో ఓడిపోయి దీనంగా కనిపిస్తున్నారు.

ప్రభు కంజెర ఝళిపించాడు.

శ్రీను, రంగ చప్పట్లు ప్రారంభించారు.

రవి పాటందుకున్నాడు.

కొండలు పగలేసినం — బలండలను పిండినం

.......... .......

బంజర్లను నరికినం-పొలాలను దున్నినం

మా చెమటలు కాల్వలుగా - పంటలు పండించినం

గింజెపడిదిరో .. ? గంజెపడిది రో ......  "కొండ"

పాటసాగుతున్నది .. కొండకోనల్లో సెలయేరులా... శిఖరాలమీంచి దూకే జలపాతంలా... ఉవ్వెత్తున విరుచుకు పడే సముద్ర కెరటంలా . .

సాహిత్యానికి తగిన గంభీరమైన గొంతు. గొంతుకు వూపునిస్తున్న ఆవేశం తమ కష్టాలే . .తమ కడగండ్లే . తమకన్నీళ్లే. తమసమస్యలే కళారూపంలో తమముందే ప్రదర్శింపబడుతుంటే సమ్మోహనాస్త్రం వేసినట్టు- కనికట్టు చేసినట్టు నిశ్శబ్దంగా-ఏమరచి వింటున్నారు జనం

ప్రజల సమస్యను వస్తువుగా తీసుకొని ప్రజల మాట్లలో ప్రజల బాణీల్లో ప్రజల పాటలుగా ఆలపిస్తే ఓ ప్రజాకళాకారుడు పొందే ఆనందం- వుత్తేజం-సార్థకత-ఎలా వుంటుందో ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాడు రవి.

ప్రజలకోసం ప్రాణాలర్పించిన త్యాగమూర్తులకు జోహార్లర్పిస్తూ మరోపాట మొదలయింది. ఈ పెట్టుబడిదారీ ఆర్థికవిధానాల ఫలితంగా పేదలు మరింత పేదలుగావడం - ధనికులు మరింత ధనికులుకావడం - నిరుద్యోగసమస్య-అధికధరలు నిరక్షరాస్యత పట్నజీవితం మీది వ్యామోహం-దోపిడీ దౌర్జన్యం-వర్గశత్రువును తుదముట్టించేందుకు ప్రజాశక్తి వెల్లువలా ఎట్లా పెల్లుబికిరావాలో మొదలయిన అనేక యితివృత్తాలున్న పాటలు వీరరసావేశంతో వినిపించాడు రవి.

పాటలు వింటున్నంతసేపు జనం వుద్రేకంతో కొట్టుకుపోయారు. తమ జీవితాలు యింత దుర్భరదారిద్ర్యంలో ఎందుకున్నాయో-తమకు మంచిరోజులు రావాలంటే ఏంచేయాలోనన్న ఆలోచనలు వారి మెదడును చీల్చుకుని వస్తున్నాయి.

తమ బిడ్డలవయసులోనే వున్న ఆ విద్యార్థులు కాచివడబోసిన జీవితసత్యాలను పాటలుగా పాడుతుంటే యిన్నాళ్ళుగా తాముకూడా ఆలోచించని విషయాలు వీళ్ళకెట్లా తెలిసాయని ముక్కుమీద వేలేసుకుంటున్నారు. హుషారుగా కొందరు రవిగొంతుతో గొంతు కలుపుతున్నారు. యువకులు కొందరు తన్మయంగా చప్పట్లను లయబద్ధంగా కొడుతున్నారు

మూడుగంటలపాటు జరిగిన ఆ కార్యక్రమం ఆబాలగోపాలాన్ని వుర్రూతలూగించింది ప్రతదైతన్న మెదడులో ఓకుదుపు ప్రతి వ్యథాభరిత హృదయంలో ఒక రగిలేజ్వాల ఆవేశం-వుద్రేకంతో వూగిపోయారంతా.

రవిబృందాన్ని ఎంతగానో మెచ్చుకున్నారు. హృదయపూర్వకంగా అభినందించారు తమతమ యిండ్లకు భోజనానికి రావలసిందిగా పోటీపడి ఆహ్వానించారు.

వాళ్ళ నిర్మలత్వం ఆప్యాయత రవిని కదిలించివేశాయి.

తాలింపులేని చింతపండు పులుసు-మామిడికాయ కారం-జొన్నకూడు.- యీ నిరుపేదలు ప్రతి రోజూ చేసే భోజనమిదే అన్న తలపురాగానే రవి కళ్లలో గిర్రున నీళ్ళుతిరిగాయి.

యిష్టంగా-మృష్టాన్న భోజనం చేసిందానికన్న తృప్తిగా భోంచేశారు రవి బృందం.

యువకులంతా రవిబృందం చుట్టూ చేరి ఎన్నెన్నో విషయాలగురించి గుచ్చిగుచ్చి అడిగారు అన్నిటికీ ఓపిగ్గా సమాధానాలిచ్చాడు రవి. యువకుల్లోని రాజకీయ జిజ్ఞాస రవి బృందాన్ని ఆశ్చర్య పరచింది మరికల్లాంటి కుర్రాళ్ల శిక్షణ యివ్వాలిగాని తమను మించి పోతారనిపించింది. వాళ్లకళ్లలో వెలుగుతున్న కాంతి రవికి ఎంతో ఉత్సాహాన్నిచ్చింది. అప్పుడే తమ కష్టాలు తొలగిపోయే రోజొస్తున్నది అన్న భావన యువకుల ముఖాల్లో స్పష్టంగా కనిపిస్తున్నది.

రవి బృందం ఆ రాత్రి గూడెంలో బసచేశారు. గూడెం వారు రవి బృందానికి పడుకోడానికివ్వగలిగింది ఒక్క చాప మాత్రం. అయినా ఆ చాప మీద మేను మరచి నిద్రపోయారు. పట్టిమంచం మీద కూడా ఎన్నడూ అంత తృప్తిగా అంత హాయిగా గాఢంగా నిద్దురోయి ఎరగడు రవి.

అమాయకులైన ఆ పల్లెప్రజల్లో ఒకడిగా కొన్ని గంటలు గడిపినందుకే అనిర్వచనీయమైన ఆనందం ఆ బృందం వారి గుండెల్లో గూడుకట్టుకున్నది. ఇన్నాళ్ళూ ఎక్కడో ప్రవాసంలో వుండి యిప్పుడు తమవాళ్లతో కలిసిపోయిన అనుభూతి కలుగుతున్నది. దారితప్పిన బాటసారికి అసలైన మార్గం దొరికినట్టయింది.

రోకటి చప్పుళ్లతో కొత్తరోజుకు స్వాగతం పలికింది పల్లె. పల్లెపడుచులు చీకటితోనే లేచి కళ్లాపి జల్లి ముగ్గులువేశారు. కావళ్లతో నీళ్లు మోసుకొచ్చారు రైతన్నలు.

మసక మసక చీకటి తెరలు కూడా తొలగిపోయి తెల్లవారింది .

ఆ పల్లెప్రజల దగ్గర సెలవు తీసుకొని మరో వూరు చేరుకున్నది రవి బృందం. ఆ వూరు కూడా వారి పాటల్లో ఓలలాడింది. మళ్లీ మరో వూరు ప్రయాణం అక్కడ్నించి మరో పల్లె. మారుమూల కుగ్రామాలన్నింటిని వారి పాటలు ముంచెత్తాయి వెళ్లిన ప్రతిచోటా హృదయ పూర్వక స్వాగతం వెళ్లిన ప్రతి గ్రామంలో వెల్లువలా చైతన్యం. పాటలువిన్న ప్రతి పల్లెవాసి లో కట్టలు తెంచుకున్న వుత్సాహం ..... ....ఉద్రేకం... .......

అవి ఆఖరిరోజు ఆవూళ్లో ఆనాడు రాజకీయశిక్షణా శిబిరం నిర్వహింపబడుతున్నది. ప్రముఖ కార్యకర్త ప్రసంగిస్తున్నాడు. కళలు ఏవిధంగా ప్రజల్లో వుత్తేజాన్నికలిగిస్తా యో—ఏవిధంగా ప్రజాపోరాటలకు సిద్ధంచేస్తాయో అసలు ప్రజాకళలు అంటే ఏమిటో —వాటిని ప్రజల నుండే ప్రజల కోసం ఎట్లా సృజనాత్మకంగా సిద్ధం చేసుకోవాలో చాలా ఆవేశపూరితంగా వివరిస్తున్నాడు.

సాంస్కృతిక దళాలన్నీ చాలా శ్రద్ధగా వుపన్యాసాన్ని వింటున్నాయి. ఒక్కొక్క మాటా వారి నరనరాల్లో వుద్రేకాన్ని నింపుతున్నది. వారికళ్లలో భవిష్యత్తు పట్ల అపార విశ్వాసం పెల్లుబుకు తున్నది.

గగుర్పాటుతో హర్షధ్వానాలు చేస్తూ తమ వుత్సాహాన్ని ప్రకటిస్తున్నారు.

ఆ వుత్సాహప్రవాహానికి హఠాత్తుగా అనకట్ట పడ్డది. వికృతంగా చప్పుడు చేసుకుంటూ పోలీస్ వ్యాన్ వచ్చింది.



ఒక హెచ్చరిక లేదు. ఒక నిషేధాజ్ఞ వుత్తర్వు లేదు. ఎలాంటి కబురూ లేకుండా జీపు దిగీదిగడంతోటే శిబిరంమీద విరుచుకు పడ్డారు పోలీసులు.

పోలీసుల లాఠీలు అమాయక విద్యార్థుల శరీరాల మీద పైశాచికంగా నృత్యం చేస్తున్నాయి కాని లాఠీల దెబ్బలకు ఎవరూ బెదిరినట్టు లేదు. ద్విగుణీకృతోత్సాహంతో "విప్లవం వర్ధిల్లాలి...... ఫాసిజం నశించాలి......" అన్న నినాదాలు దిక్కులు పిక్కటిల్లేట్లు వినబడుతున్నాయి.

అందరిలోనూ తెగింపు. మొండిధైర్యం. పట్టుదల పాలకులట్ల సిరసన. ప్రజాపుద్యమం పట్ల విశ్వాసం. అంకురిత క్రమ శిక్షణ. వెల్లువలా పొంగుతున్న తిరుగుబాటు మనస్తత్వం ఒండబారిన పోలీసుల్నే ఆశ్చర్యచకితుల్ని చేస్తున్నాయి.

ఒళ్ళంతా దద్దులు తేలే వరకూ. తలలు చిట్లేవరకూ రక్తంతో నేలతడిసిపోయేవరకూ, ఆ పైశాచిక హింసాకాండ కొనసాగుతూనే వున్నది.

ప్రజలు భయాందోళనతో దూరంగా వుండి ఆ దృశ్యాన్ని చూస్తున్నారు.

విద్యార్థులు దెబ్బలకు తట్టుకోలేక కుప్పకూలిపోయే వాళ్ళు కూలిపోతూనే వున్నారు, రోషంతో, అభిమానంతో, అచంచల విశ్వాసంతో నినాదాలు యిచ్చేవారు యిస్తూనే వున్నారు.

పశువుల కళేబరాలను యీడ్చుకెళ్ళినట్టు అందిన వారిని అందినట్టు యీడ్చుకెళ్ళి వ్యాన్‌లో పడేస్తున్నారు పోలీసులు అందర్నీ వ్యాన్‌లో వేశాక దుమ్మురేపుకుంటూ వెళ్ళిపోయింది వ్యాన్.

కళ్ళముందే జరిగిన ఘోరానికి మౌనంగా విలపించడం తప్ప ఏమీ చేయలేక పోయారు ప్రజలు.

వెళ్ళిపోతున్న వ్యాన్‌వేపు చెమ్మగిల్లిన కళ్ళతో చూస్తూ నుంచున్నారు.

తెలియని ఏదో వుద్రేకంతో ఏదో ఆక్రోశంతో వాళ్ళ హృదయాలు ఘూర్ణిల్లుతున్నాయి.

"అన్నెం పున్నెం తెలియని పసిబిడ్డలారా ! మా కోసం మీకెందుకయ్యా యీ చెరలు? మట్టిలో పుట్టి మట్టిలో పెరిగి చివరకు మట్టి అయిపోయే మా బతుకుల కోసం విలువైన మీ ప్రాణాలెందుకు పోగొట్టుకుంటారు బాబూ! మా యిండ్లు, మా పొలాలు - మా భార్యాబిడ్డలు పోయినా పరవాలేదు. మా చీకటి బతుకుల కోసం మీరు నెత్తురు ముద్దలు కాకండి తండ్రులారా; మా బతుకులిట్టా తెల్లారినా బాధలేదు ఏ తల్లి కడుపార గన్న బిడ్డలో మీ బతుకులెందుకు బుగ్గిపాలు చేసుకుంటారు పుణ్యాత్ములారా... మీ గోస మేం సూడలేం బాబులారా..." అంటూ ఓ తలపండిన ముసలవ్వ బోరుబోరున విలపించింది.

గుండెల్లోంచి తన్నుకొస్తున్న దుఃఖభారంతో అక్కడ్నించి కదలలేక కదలలేక కదిలారు ప్రజలు

## 16

రవిని బెయిలు మీద విడిపించుకొచ్చేసరికి తలప్రాణం తోకకొచ్చినట్టయింది రవి తండ్రికి.

రవి పరిస్థితి చూచి దాదాపు పిచ్చిదే అయింది రవితల్లి. మొదట్నించీ యీ చదువులు మనకొద్దని నెత్తీనోరూ బాదుకుంటూనే వుంది ఆమె. కొడుకు మాట కాదనలేక తండ్రే చదివిస్తున్నాడు. ఇప్పుడు తండ్రికూడా తాను చేస్తున్న పని తప్పే అనిపించింది.

కడుపులో చల్ల కదలకుండా వున్న రెండెకరాల కొండ్రను దున్నుకొని బతక్క ఎందుకొచ్చిన అగచాట్లు యివి అనుకుంటున్నాడతడు.

మొహం వాచేటట్టు ఎడాపెడా చివాట్లు పెట్టాలనుకున్నాడు. తీరా రవిని చూసేసరికి కన్నీళ్ళు ఆపుకోలేకపోయాడు. ఒంటినిండా సందులేకుండా వున్న గాయాలతో కొడుకు కనిపించగానే తల్లడిల్లిపోయాడు. వెంటనే ఆసుపత్రిలో చేర్పించాడు.

గదిలో తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్ వేపు నిర్లిప్తంగా చూస్తూ బెడ్‌మీద నిస్త్రాణగా పడివున్నాడు రవి.

అతడి తలకు, కుడిచేతికి బాండేజి కట్టివుంది. పైకి కనిపించని గాయాలు ఒంటినిండా ఎన్నో వున్నాయి. ఒళ్ళు నొప్పితో పోటెత్తుతుంటే బాధగా మూల్గుతున్నాడు

నర్సు వచ్చి ఇంజక్షన్ చేసి వెళ్ళింది.

రవిని చూడ్డానికొచ్చింది రేవతి.

రవి ఆసుపత్రిలో వున్నాడని తెలియగానే రేవతి గుండెలు ఝల్లుమన్నాయి దయాదాక్షిణ్యాలెరగని పోలీసుల చేతుల్లో రవి ఎంతగా గాయపడ్డాడోనని ఆమె ఆందోళన పడ్డది. ఒక్క నిమిషం కూడా ఆలస్యం చేయకుండా ఆసుపత్రి కొచ్చింది.

గదిలోకి ప్రవేశించిన రేవతి బాండేజితోవున్న రవిని చూడగానే చలించిపోయింది. గుండెల్లోంచి దుఃఖం తన్నుకొని వచ్చింది కళ్ళనుండి నీరు అప్రయత్నంగా వుబికింది.

వణుకుతున్న కంఠంతో "రవీ"! అని పిలిచింది.

కళ్ళు తిప్పి రేవతి వేపు చూశాడు రవి.

రేవతి కనిపించగానే రవి తన బాధలన్నీ మరచిపోయినట్టున్నాడు. అతని ముఖం సంతోషంతో వెలిగిపోతున్నది. కళ్ళలో అంతవరకూ పేరుకున్న నిరాశ తొలగిపోయినట్టయింది. వెలుగు నింపుకున్న కళ్ళు ఆమెను దగ్గరకు రమ్మని సైగచేశాయి.

రేవతి నెమ్మదిగా వెళ్ళి బెడ్ మీద కూర్చున్నది.

రవి చేతులను మృదువుగా తన చేతుల్లోకి తీసుకుంది. లోపల్నించి తన్నుకు వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్చింది రేవతి.

"ఛ...ఎందుకేడుస్తున్నావ్ రేవతీ...యిప్పుడేమయిందని ? రేవతి కళ్ళు తుడుస్తూ అన్నాడు రవి.

"ఇంకా ఏం కావాలి రవీ! ఇంత దారుణం జరిగితే... "

"షేమ్... షేమ్... నువ్వింత పిరికిదానివి అనుకోలేదు... ఇంతకంటే జరిగినా ధైర్యంగా ముందుకు సాగిపోవడమే మన లక్ష్యం.. ..."

"నువ్వేన్ని చెప్పినా... కబుర్లువేరు...కళ్ళారా చూస్తున్న పరిస్థితి వేరు... నిన్నీ స్థితిలో చూస్తూ ఎలా నిగ్రహించుకోగలను రవీ...చూడు శరీరమంతా దెబ్బలతో చితికేట్టు కొట్టారు పశువులు..." రవి శరీరాన్ని కోమలంగా తడుముతూ అన్నది రేవతి

"ఈ ప్రపంచంలో వాళ్ళకు తెలిసిన ఏకైక విద్య చితగ్గొట్టడమే కదా. అలా చెయ్యకపోతే ఆశ్చర్యపడాలిగాని —" అంత బాధలోను నవ్వడానికి ప్రయత్నించాడు రవి:

"ఏది ఏమైనా ఆ పాపిష్టివాళ్ళ కళ్ళలో పడ్డం మనకు క్షేమం కాదు రవీ."

"ఆడదానివనిపించావ్ రేవతీ! నీలో ఎప్పుడూ పౌరుషాన్నే - ధైర్యాన్నే చూసేవాడ్ని. ఇవ్వాళ నాకు కొత్త రేవతి-నేను కోరుకోని రేవతి కనిపిస్తున్నది.... చెప్పాను కదా-ఇంతకంటే భయంకరమైన పరిస్థితి ఎదురయినా మన పోరాటం.... చివరి వరకూ కొనసాగవలసిందే..." ధృఢ నిశ్చయంతో కిటికీలోంచి దూరంగా చూస్తూ అన్నాడు రవి.

"నేనెన్నడూ అధైర్యపడలేదు. అభిమానాన్ని చంపుకోలేదు. ప్లీజ్ రవీ ! నన్నర్థం చేసుకో. నీకేమన్నా జరిగితే నేను భరించలేను. కనీసం ఆ పరిస్థితిని వూహించడానికే నాకు భయంగా వుంది" కళ్ళలోంచి దూకుతున్న కన్నీటిని కొంగుతో తుడ్చుకుంటూ అన్నది రేవతి.

"పోనీ...నేను యికముందు ఎట్లాంటి వుద్యమాల్లోనూ పాల్గొనని పోలీసులకు హామీ రాసియిస్తే - పోలీసులు యిక మన జోలికి రాకపోవచ్చు" ముళ్ళలాంటి చూపులతో రేవతి వేపు చూశాడు రవి.

రేవతి ఏం బదులు చెప్పకుండా తల వంచుకుంది.

"యీ స్వార్థమే వుద్యమాలకు వెన్నుపోటు అవుతుంది రేవతీ! వుద్యమకారులందరికీ బంధువర్గం వుంటుంది. అంతా యిట్లాగే ఆలోచిస్తే యిక మిగిలే

దేమిటో నువ్వేచెప్పు .. " అన్నాడు రవి.

"ఉద్యమాన్ని బలహీనపర్చడం నాధ్యేయంకాదు. కానీ నిన్నీస్థితిలో చూస్తుంటే నాహృదయం తరుక్కుపోతున్నది. ప్రాణానికి ప్రాణమైన నువ్వొక వేపు—ప్రాణప్రదమైన వుద్యమం ఒకవేపు నేనేం చెయ్యను రవీ!" జాలిగా రవి వేపు చూస్తూ అనడిగ్ని రేవతి.

వ్యక్తులు ఎంతోమంది పుడతారు, గిట్టుతారు. వాళ్ళకోసం ఏ వుద్యమమూ ఆగదు రేవతి. కళ్ళముందు నీకు నేను కనిపించడంవల్ల బాధ పడుతున్నావు. ఎంతమంది అజ్ఞాత త్యాగమూర్తులు ఈ దేశంకోసం తమ ప్రాణాలను పణంపెట్టి పోరాటాలు సాగిస్తున్నారో ఆలోచించు. కన్నవారిని—కట్టుకున్నవారిని—సిరి సంపదలనూ—సమస్త సుఖాలనూ వొదులుకొని తాము నమ్మిన సిద్ధాంతంకోసం ఎందరు తమ నెత్తురు దారపోస్తున్నారో ఆలోచించు... " వుద్రేకాన్ని నిగ్రహించు కుంటూ రేవతికి నచ్చచెప్పుతున్నాడు రవి.

"రవీ! రియల్లీ యు ఆర్ గ్రేట్... మై స్వీట్ యు ఆర్ గ్రేట్ . " రవి మాటలు కలిగించిన వుత్తేజంతో పొంగిపోయి రవి నుదిటిమీద ప్రేమగా ముద్దు పెట్టుకుంది రేవతి. ఆమె కళ్ళు ధారగా వర్షిస్తూనే వున్నాయి.

రేవతి తలమీద ఆప్యాయంగా నిమురుతున్నాడు రవి.

కొన్ని క్షణాలు ఆర్ద్రమైన వారి ప్రేమలో మూగవోయాయి.

గదిలోకి ఎవరో వస్తున్న అలికిడి విని దూరం జరిగింది రేవతి. రవి తల్లి పాలుపట్టుకొని వచ్చింది. రేవతి ఆమెనుచూచి బెడ్ మీంచి లేచింది.

"మాతోబాటు చదువుకుంటున్న అమ్మాయి పేరు రేవతి." తల్లికి పరిచయం చేశాడు రవి.

"మా అమ్మ" అన్నాడు రేవతితో.

రేవతి నమస్కరించింది.

"చూడమ్మా! అందరిలాగే మావాడుకూడా బుద్ధిగా చదువుకుంటే మాకీ బాధలుండేవికావు... " అంటూ కళ్ళొత్తుకున్నది రవితల్లి.

ఆ మాతృహృదయాన్ని అర్థం చేసుకుంటున్నది రేవతి.

"యిప్పుడేమయిందమ్మా!" తల్లికేసి విసురుగా చూశాడు రవి.

"తల్లి కడుపుతీపి నీకర్థంకాదులే రవీ!" అంది రేవతి.

"అట్లాచెప్పుతల్లీ! నీకడుపుచల్లగావుండనీ అమ్మా! దేశంలోని సమస్యలన్నీ వీడికే ఎందుకు చెప్పు? ఒళ్ళంతా పచ్చిపుండు అయ్యేట్టు దెబ్బలు తగిలాయి. వీడి కేమైనా అయితే మా గతేంకానుచెప్పు?" ఆ తల్లి కళ్ళలో చివ్వున నీరు చిమ్మింది.

రేవతి మనసుకూడా ఆర్ద్రమయింది.

రవికి ఎటూ పాలుపోవడంలేదు.

కాసేపు గంభీరనిశ్శబ్దం అలుముకుంది గదిలో.

రవిని చూడ్డానికి కాలేజి విద్యార్థులు గుంపులు గుంపులుగా వచ్చారు. వారితో బాటు ప్రకాశం మాస్టారుకూడా వచ్చాడు.

బెడ్‌మీద బాండేజి కట్లతోవున్న రవిని చూడగానే ప్రకాశంమాస్టారి మనసు వికలమైంది. పువ్వుల్లాంటి ఎంతమంది విద్యార్థులు ఇట్లా పోలీసుల కర్కశమైన చేతుల్లో నలిగిపోతున్నారోనన్న భయంకరమైన వూహ మాస్టారి గుండెల్ని గుచ్చింది.

ఈ అవాంఛనీయ పరిస్థితులకు ఎవరు బాధ్యులు? ఎవరిని నిందించాలి? కసాయిల్లాంటి పోలీసుల పశుబలానికి అశుభం శుభం తెలియని ఈ విద్యార్థులు బలి కావలసిందేనా? అమూల్యమైన వీరి బ్రతుకులు ఇట్లా రాలిపోవలసిందేనా?

ఉద్యమం ఉద్దేశం మంచిదే కావచ్చు. ఉద్యమ కారుల త్యాగగుణానికి మనం జోహార్లర్పించవలసిందే. వారి చిత్తశుద్ధిని అభినందించవలసిందే కాని.... చదువుకోవలసిన అమూల్యమైన కాలం తిరిగి వస్తుందా? విజ్ఞానాన్ని ఆర్జించ వలసిన ఈ తరుణవయస్సు మళ్ళీ వస్తుందా? విద్యార్థుల జీవితాలు రాజకీయ చదరంగంలో పావులుగా మారవలసిందేనా?... ?

తనలో తాను క్షోభ పడుతూ రవివేపు జాలిగా చూశాడు మాస్టారు.

మాస్టారి అంతరంగంలో జరుగుతున్న మథనాన్ని వారి ముఖంలో చదవ గలుగుతున్నాడు రవి. తాను నడుస్తున్నబాట మాస్టారి ఆశయాలకు సమాంతర మని రవికి తెలుసు. కాని ఆ సమాంతర రేఖలుకూడా ఎక్కడో ఇన్‌ఫినిటీలో కలుస్తాయా? అక్కడ బలంగా తమను కట్టిపడేసే ఏ బంధాలో వున్నాయా?

సిద్ధాంతాలకు సమ్మెకాలకు, రాజకీయాలకు, వుద్యమాలకు, విప్లవాలకు అతీతమయింది మనిషి అంతరాంతరాలలో నిగూఢంగావున్న మానవత్వపు విలువలు. వాటిముందు సకల మానవాళి తల వంచవలసిందే.

"నమస్కారం మాస్టారు... " అన్నాడు రవి.

ఆవేశం, దుఃఖం, ప్రేమ ముప్పిరిగా పెల్లుబుకుతుంటే "మై బాయ్.... రవీ... ఎలావుంది?" అనుకుంటూ రవి దగ్గరకు వెళ్ళాడు మాస్టారు.

"మీ ఆశీస్సులు నాకెప్పుడూ వుంటాయికదా మాస్టారూ" అన్నాడు రవి వినమ్రంగా.

మాస్టారి కళ్ళు చెమ్మగిల్లాయి.

ఆప్యాయంగా రవితల నిమిరాడు మాస్టారు.

( ఇంకా ఉంది )

# 'కృత్యాద్యవస్థ'

## డా. అయలసోమయాజుల గోపాలరావు

కవితలల్లుదామని
కలం కాగితం పట్టుకుని
కూర్చున్నాను పనిగట్టుకుని –
ఎదురుగా –
కవులకులైక భూషణుడు
కవిల గెడ్డము – కన్నులు – జడదు
ఆలోచిస్తున్న ననుజూచి తలయూచి
'ప్రసన్న కథా కవితార్థయుక్తి చూస్తేనాస్తి
అక్షరరమ్యత అనలేపూర్ణత
నానారుచిరార్థసూక్తులా నీ ఉక్తులు !
కలం – నోరు – ముయ్ అన్నాడు–
కళ్లుమూసేను – అన్నీమూసినట్లే అని.
కలలో హరిహరమూర్తి నారాధించిన
మూర్తి – మూసిన నా కళ్లలో కనబడి
"అలతియలతి పదముల
అనల్పార్థరచన – నీలోనున్న
కావ్య శిల్పమున పొరగుడీవా ?
కలంపారేయ్ – కలలుకను" అన్నాడు
మంచం ఎక్కాను కలలుకందామని
పంచనే ప్రత్యక్షం ఓ ప్రబంధపరమేశ్వరుడు
"రాయంచలు కూయునట్లు
క్రౌంచమ్ములు కూయుటెట్లు !
'తద్రచనయకా' అనడం
తలక్రిందులుగా తపస్సు చెయ్యడం
అనేసరికి –
తలగడ క్రింద తలపెట్టి తలక్రిందులయాను
బంగారునాణేల స్నానంతో కవితానతిని
సింగారించిన ఓ సిరిపతి
"ఇంటింటా – ఊరూరా నీ బొంట్లకు
కనకాభిషేక – కవిసార్వభౌమబిరుదాలకు
లోటురాకూడదనే
దివిజకవివరులతో దివిలో వున్నాను.
నీవేమైనా గమికర్మీకృతనైకనీవృతుడవా !
అని నిలదీసేసరికి___
నిలువుగుడ్లేసి నీళ్లు నమిలేను.

దూరంగా గంగా తీరంలో
మందారమకరందాలందించిన అన్న
"పలికెడిది భావికవితలట
పలికించు విభుండు లేనేలేడు
కవనమునాపి మదనములకు
పో" అనేసరికి పోతున్నా అన్నా
ఇకలాభంలేదని – కవిత్వలేపనసంగతివిని
ఒక సిద్ధుణ్ని ఆశ్రయిద్దామని
సిద్ధమయేలోపల – పెద్ద కవిప్రవరుడొకడు"
"శిరీషకుసుమాన్ని ఎన్నడే నా చూసేవా !
అన్నాడు – "శిరస్సు వంచేను
"ఊరక కృతుల్ రచించడం శక్యమా !
ఊరుకో" అంటూ
మిన్నులు పడ్డ చోటుకి
వెన్నుపోటు పొడిచేడు
మొండిగా మరంవేసికూర్చున్నాను
జగమెఱుంగు కవితగల
జగమెటింగిన కవి
"చేమకూర ఎలావండాలో తెలుసా ?
ప్రతి పద్యచమత్కృతి ఎలా వుండాలో తెలుసా
సహృదయుల చెవిసోకగా చెప్పు
దక్షులెవ్వరా పక్షీ" అని నిలదీసేడు
ఏడుస్తూ – కాళ్లీడుస్తూ
జాడతెలియక నడుస్తున్న నన్ను చూస్తూ
"ఈసురోమని కలంపడితే
సొగసుకవితలు పలుకుటెట్లోయ్ !
పూర్ణకవితా భావములతో
ముందు కడుగేయ్ చిందుకవితోయ్"
అంటూ గొప్ప జాడ చూపేడో మహాకవి
గట్టిగా అడుగేస్తున్నాను
చుట్టూ కలయజూస్తున్నాను
చుట్టు పక్కలవారు నన్నేచూస్తూంటే
ఎవ్వరనుకొందురో ! నేను
మధురకవిత్వరచనాకండూతి

సహితలోకైక మూర్తిని "అంటూ
అడుగులో అడుగుగా
పదములో పదముగా
దిగివచ్చేను దివినుండిభువికి
నా భావం అర్థంకాలేదుకాబోలు
ఎవరి భావనతో ఎవరి ద్రోవన
వారుపోతున్నారు–
అంతలో ఆ చివరినుంచి –
జగన్నాథరథప్రస్థానంలో
'చింపిరిజుట్టూ – సిగరెట్టుచేతిపిడికట్టుతో
ఈ శతాబ్దికవితను చేపట్టినాయన –
నా చేయిపట్టుకు వెన్నుతట్టేడు
"రారాముందుకు
రాసేటందుకు
నాకేలందుకో
నీ కలమందుకో
పోదాం పోదాం పైపైకి–
రాద్దాంరాద్దాం కైపెక్కి–"
త్రుళ్లిపడిలేచేను
కళ్లు విప్పిచూసేను
కలం ఆ వైపు
కాగితం ఈ వైపు
కలలు కంటున్నాయి
నన్నూ కనమంటున్నాయి
ఈకృతి భారతి కంకితం.




2+2=8
ఇది వింతాకాదు, అలా అని విచిత్రమూకాదు
ముమ్మాటికి నిజం సుమండి !
అయినా ఒక్కసారి ఆలోచించి చూడండి !
మీ లెక్కలు తప్పూకాదు.
మేము చెప్పేది అబద్ధమూకాదు.
ఎలాగంటే ! N S O లోని ఆరవ ఇష్యూలో ప్రతి నెలా
రు.200/- మీరు పొదుపు చేశారనుకోండి.
ఆరేళ్ల తర్వాత వ్యవధి పూర్తయి అవి ప్రతి నెలా రు 403/- గా
మీ చేతికందుతాయి.
దానిని మరలా ఆ పథకంలోనే పొదుపు చేశారనుకోండి.
మరో ఆరేళ్ల తరువాత మీకు నెల నెలా రు 806/- లభిస్తాయి.
మరి మా లెక్కలు నిజమేనంటారా!
మా మాష్టారి పాఠాల్లో రెండు రెళ్లు నాలుగే! నా పొదుపు లెక్కల్లో రెండు రెళ్లు ఎనిమిది!!
పోస్టాఫీసు
వివరాలకు: .
మీకు దగ్గరలో ఉన్న పోస్టాఫీస్, జిల్లా కలెక్టర్ కార్యాలయంలో
స్పెషల్ తహసిల్దార్, జిల్లా సేవింగ్స్ అధికారి, భారత
ప్రభుత్వం, డిప్యూటీ డైరెక్టర్, స్మాల్ సేవింగ్స్ .
జారీచేసినవారు .
కమిషనర్,
స్మాల్ సేవింగ్స్, ఆంధ్రప్రదేశ్,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029
మీ భద్రత మా బాధ్యత

# ధ్వజస్తంభ ప్రతిష్ఠ

## భాగవతుల సుబ్రహ్మణ్యం

విశ్వనాధుని నివాసమైన హిమగిరి శృంగంలా, మెరిసిపోతోంది విరూపాక్ష దేవాలయ గోపురం - వెన్నెల్లో

నవమినాటి చంద్రవంక, సూచ్యాకార గోపురం పక్కగా, సాక్షాత్తు పరమశివుడే నెలతాల్పుని శిరసున దాల్చాడా అనే భావాన్ని కలిగిస్తోంది.

ఆలయ మంటపం చివర, ఆలవోకగా పడుతున్న వెన్నెల చల్లదనాన్ని తనివితీరా గ్రోలుతూ . గావంచా పరుచుకుని, తలకింద చెయ్యి పెట్టుకుని దీర్ఘాలోచనలో పడిపోయాడు చిదంబర శాస్త్రులు

ఓ పుణ్యనదీ తీరాన వెలసిన విరూపాక్షాలయం ఆ గ్రామానికి ప్రకృతి ప్రసాదించిన వరం. ఆలయంలో శివుడు స్వయంభువు దేవతలు ప్రతిష్ఠించారని ప్రతీతి రక రకాల కథలూ - గాథలూ ప్రచారంలో వున్నా, స్థలమహాత్మ్యాన్ని చాటి చెప్పే సంఘటనలు అప్పుడప్పుడూ జరుగుతూనే వున్నాయ్ ! ఇటీవల అలాంటి సంఘటనే ఒకటి జరిగి, మిడి - మిడి జ్ఞానంతో, కుహనా సంస్కారంతో దేవుళ్ళేడని వాదించే నాస్తిక పిపీలికాదులకి కనువిప్పు కలిగిందనే చెప్పాలి అప్పటికీ - లోపల నిజమనే భావన చోటు చేసుకున్నా, పైకి మాత్రం "అబ్బే! ఉత్త ట్రాష్" అనే వాళ్ళకి చెంపపెట్టులా కొన్ని నిదర్శనాలూ కనిపించాయ్.

ఇటీవల జరిగిన ఆ విశేషం ముచ్చటించే ముందు, కొంత కథ జరగవలసి వుంది

నాందీ ప్రస్తావనలతో సహా కథా విషయం ఇదీ ...

చుట్టూ పచ్చని పంట చేలూ - చెట్లూ - సెలయేళ్ళూ - కొండలూ అలంకారాలుగా సహజా భరణాలుగా కలిగివున్న అందమైన గ్రామం అది

నాగరికతా విషవాయువులు ఆ గ్రామం మీదకి ఇంకా అంత దారుణంగా ప్రసరించలేదు

ఊరు మొత్తం మీద ఏ పదీ - ఏ పాతిక మందో, బస్తీల కెళ్ళి చదువులు వెలగబెడుతూ, సెలవులకొచ్చే టప్పుడు నగరపు నగిషీలూ - జిలుగులూ తమ గ్రామంలో కూడా స్థాపిద్దామని ప్రయత్నించినా, ఆ కొత్తని వింతగా తమ ప్రాత ప్రజలు గుర్తించక పోవడం - మోజు చూపించక పోవడంతో వారికి ఆశాభంగం కలిగిందనే చెప్పాలి

ఊరంతా కలిపి ఐదారు వందల గడప కంటె ఎక్కువుండదు.

అన్ని జాతుల, వర్గాల మధ్య సామరస్య భావం మనసా - వాచా- కర్మణా వున్న ఆదర్శగ్రామం అన దగ్గ ఆ వూళ్ళో, వున్నవి ఇరవై వీధులే అయినా - విశాలంగానూ, అక్కడి మనుషుల మనస్సుల్లాగే నిర్మలంగానూ వుండి చూడ ముచ్చటగా వుంటాయ్.

ఊరిని అనుకుని ప్రవహిస్తున్న జీవనది, సాలు మున్నూరు కాలమూ గ్రామస్తులకు నీటి కొరత అంటే ఏమిటో, ఎలా వుంటుందో తెలీనివ్వదు

ఎవరి వృత్తులు వారు నిశ్చింతగా నిర్వర్తిస్తూ, 'దేశ సౌభాగ్యానికి గ్రామ లే పట్టు గొమ్మలు' అన్న సూక్తిలోని సత్యానికి ప్రతీకగా నిలుస్తారు.

పాపభీతీ దైవభక్తీ గ్రామ ప్రజల అంతరాంతరాల్లో చెరగని ముద్ర వేసుకుని వుంది.

అగ్రవర్ణాల పట్ల భక్తి ప్రపత్తులూ - ఆదరణాప్యాయతలూ ఊళ్ళో వాళ్ళందరూ తమ విధిగా భావిస్తారు.

అందుకే - ఎక్కడో ఎవరికి తెలీదుగాని, చిదంబర శాస్త్రులు ఆ వూరు చేరిన నాటి నుంచి నేటి వరకూ నిశ్చింతగా, భారంలేని బ్రతుకు వెళ్ళదీయ గలుగుతున్నాడు

అతడా వూరు చేరి పాతిక సంవత్సరాల పైనే అయింది.

అప్పటికింకా గ్రామంలో ఇంత జనాభా లేదనే చెప్పాలి. ఏదో గిరిజన గ్రామంలా, అక్కడొకటీ-ఇక్కడొకటి ఒకదాంతో ఒకటి పొంతన లేనట్టుగా ఇళ్ళుండేవి

దేవాలయం మాత్రం ? దీపం వెలిగించే నాధుడు లేక, పూజా పునస్కారాల్లేక, బూజులు పట్టి - పుట్టలు పెట్టి ఎంత భయం గొల్పుతూండేదని

సాయంత్రం అయితే, ఆ దరిదాపులకు కూడా వెళ్ళడానికెవరూ సాహసించేవారు కారు.

చాలా కాలంగా, అదో అమ్మవారి దేవాలయం అనీ, పేరు తెలీని పాడుబడ్డ దేవుడిగుడి అనీ, అనుకుంటూనే వుండేవారు తప్ప - ప్రజానీకానికి అది పరమశివుడి గుడి అని తెలిసింది కాద.

చిదంబర శాస్త్రులు వచ్చాకనే, ఆ దేవళంలో దేవుడు బయల్పడింది -

అప్పట్లో ...
నేటికి పాతికేళ్ళకిందట -

ఇంకా బయటి ప్రపంచంతో ఏ సంబంధమూలేని - సరైన రహదార్లు లేని కాలంలో, సన్నగా కాలిబాటల మీదుగా నడుచుకుంటూ - వేదపారాయణ చేసుకుంటూ వస్తున్నాడో నడివయస్కుడు.

విశాల వక్షాన విభూదిరేకలు, మెడలో రుద్రాక్షలు, నుదుటన తీర్చిన భస్మప్పెండెకట్లు, కావి పంచె కట్టు ... వెరశి ఆకారం అతడు వేద పండితుడని, వీర శైవుడని చెప్పకనే చెప్తాయి. మరీ అంత లావూకాని - సన్నం కాని సమమైన తీరులో ఓ మాదిరి వడివున్న నడకతో, అతడా గ్రామం శివార్ల దగ్గరకి చేరేసరికి, ఎండధాటికి తట్టుకోలేక శోషొచ్చి పడిపోయేడు

ఎంతసేపు గడిచిందో తెలీదు కాని, మధ్యాహ్నపు సూర్యుడు పడమటి కొండలవైపు పరుగులు తీస్తున్న వేళకు - మెట్టసాగు చూసుకుని వస్తున్న రైతు వర్గం ఆయన్ని చూడ్డం జరిగింది.

"అరే ! పాపం - బాపనాయన. మొహం తిరిగి పడిపోయి నట్టున్నాడు. ఎవరో తెలీదు ఎటు పోతున్నదీ తెలీదు" అనుకుంటూనే నదిలోంచి నీళ్ళు తెచ్చి ముఖాన జల్లి తెలివి తెప్పించి నీళ్ళు తాగించి సేద దీర్చి "ఏ వూరు మన్ది పొంతులూ ! ఏడికి పయిన మయ్యేరు ? ఇంతెండ వేళ, ఏ చెట్టు నీడనైనా కూంత సేపు కూసోనేకపోయేరా ?" అని ఆప్యాయంగా అడిగేరు.

కాస్త ఈ ప్రపంచంలో పడ్డాక, సంస్కారవంతుడు గనక తనని మళ్ళీ బతికించినంత పనిచేసిన ఆ గ్రామస్తులకు కృతజ్ఞతలు చెప్పి మళ్ళీ నడక సాగించ బోయేడు కాని అది అతడికి అసాధ్యమే అయింది.

వేదం చదూకున్న - బాగా బతికిన వూళ్ళో మెతుకు పుట్టక, పూలమ్మిన చోట కట్టెలమ్మలేక, ఘనాపాఠీల మని కాస్త జ్ఞానానికే వెర్రి పీగుతున్న గర్విష్ఠుల మధ్య ఉండలేక ... ఇలా ఎన్నో కారణాల వల్ల స్వంత చోటు వదిలిపెట్టి, బతుకు తెరువు వెతుక్కుంటూ బయల్దేరే దతడు.

ఘనాహారం తిని ఎన్నాళ్ళయిందో ఆ పరమాత్ముడికే ఎరుక నీరసానికి కారణం అదే !

ఆ సంగతే అతడు వారికి దాచకుండా చెప్పేడు.

ఊళ్ళో వున్న ఒకే ఒక బ్రాహ్మణ కొంప వరకూ ఏదోలా ఓపిక చేసుకురండని గ్రామస్తులు బ్రతిమాలారు. "లేదు ... మెతుకు పుట్టే చోట బతకడానికే పోతున్నాను" అని పడిన చోట నుంచి మళ్ళీ లేవబోయేడతడు.

"ఈ వూళ్ళో మీకు మెతుకు పుట్టిందనుకోండి ! ఇక్కడే ఉండిపోడానికి మీకేమన్నా అభ్యంతరమా ?" అని అడిగారు వాళ్ళు.

"అదేం లేదు ! ఉత్తపుణ్యానికి మీ గ్రామస్తుల రెక్కల కష్టంమ్మీద ఆధారపడ్డం - ఊరకే కూర్చుని తినడం నా వల్ల కాని పని. మీ గ్రామానికి నేన్చేసే ఉపకార మేదన్నా వుంటే చెప్పండి. అయినా నా వల్ల మీక్కలిగే మేలు ఏం వుంటుంది గనక ? రెక్కల కష్టం చెయ్యగల సత్తువ భగవంతుడిచ్చినా, ఏ వృత్తిలోనూ మెలకువలు తెలీని బ్రాహ్మడినయిపోయేను. వేదమ్ముక్కలూ - ఆశీర్వచన మంత్రాలూ - పూజా పురస్కారాలు తప్ప ఇంకేం రాని, నేను మీకేం చేయగలను ?" అని వాపోయేడాయన ...

అక్కడికి దగ్గర్లోనే వున్న ఆలయం వైపు చూపిస్తూ "అటు చూడండి బాబూ ! ఏ దేవుడు వెలిసేడో, ఎన్నాళ్ళయి పాడుబడిందో ? ధూపదీప నైవేద్యాలు లేకుండా ఎలా మరుగున పడిపోయేడో మాకు తెలీదు కాని, తలా ఓ చెయ్యివేసి, ఆ ప్రాంతం అంతా శుభ్రం చేస్తాం ... దేవుణ్ని కనుగొని, ఆ దేవుడ్నే కనిపెట్టుకుని వుండండి బాబూ ! మా వూరి గుళ్ళోదీపం పెట్టండి" అని సమస్యకి వెంటనే పరిష్కారం సూచించేశాడో రైతు పెద్ద.

అది చిదంబరశాస్త్రికి నచ్చింది.

అన్నమాట ప్రకారంగానే, రెండో నాటికల్లా గ్రామస్తులు పలుగూ - పారలతో, దేవళం దగ్గర మొక్కా - మోడూ పెరికి పారేసి శుభ్రం చేశారు. చదునైన జాగా మీద పుట్ట తొలగించే సరికి, విశాలమైన మటంపం లాంటి కట్టడం నందితో కూడా కన్పించింది.

వెంటనే గుడిలో శివుడున్నాడని గ్రహించేశారందరూ ...

అంటే కొన్ని శతాబ్దాల కిందట, ఏ మహారాజుల కాలంలోనో, తమ వూరిగుడి, గుళ్ళోని దేవుడూ వైభవాన్ని - నిత్య భోగాల్ని చవి చూడడం జరిగిందన్న మాట !

అలాగే,మట్టి - పుట్టలూ తవ్వుతూ, గర్భగుడిలోదాకా దారి చేసుకుంటూ పోయేసరికి, అన్ని అమరికలూ వుండి కొద్దిపాటి శిథిలావస్థకి గురైన శివలింగం బయల్పడడం, ఒకప్పుడు ఆలయంలో అర్చకులు వాడిన దైవ పరమైన సామగ్రి కనిపించటం జరిగే సరికి, గ్రామస్తుల ఆనందానికి అవధుల్లేకపోయేయి.



రెట్టించిన ఉత్సాహంతో, వరో వారం రోజుల్లో శిఖరంపై అంచు వరకూ పాకిన అడవి డొంకల్నూ, తీగల్నూ, చుట్టూ గోడల్ని కప్పేసిన సీమ చింత - తుమ్మ మొక్కల కొమ్మలూ నరికి పారేసి, వెల్ల వేయించి, ఆలయానికి కళ తెప్పించారు.

ఆ విధంగా దేవుడి గుడి బాగుపడ్డాకనే, ఊరు బాగుపడింది.

అక్కడక్కడా వున్న ఇళ్ళు క్రమంగా ఎక్కువై, వీధులుగా రూపాంతరం చెంది, గ్రామం అనిపించుకోడానికి అన్ని అర్హతలూ సంపాదించుకుంది.

ఊరు పెరిగిన కొద్దీ, దేవుడికి నిత్యపూజలూ - నీరాజనాలూ ఎక్కువయ్యాయి.

ఆలయం ఆవరణలోనే శాస్త్రులవారు ఉండటానికి కుటీరాన్ని పోలిన తాటాకు పాకను నిర్మించి ఇచ్చారు గ్రామస్తులు. పండగలు - పబ్బాలు లేని కాలంలో కూడా, దేవుడి నిత్య కొలుపుకి ఆర్థిక పరమైన చిక్కులు ఎదురు కాకుండా వుండేందుకుగానూ, శాస్త్రులవారి అన్నవస్త్రాలకు లోటు లేకుండా ఉండడం కోసమూ 'దేవుడిమాన్యం' పేర కొంత భూమిని ఆలయానికి రాసేశారు దాంతో ఆయన జీవికకిక నిశ్చింత ......

శాస్త్రుల వారికి పిల్లా - జెల్లా ఉండే వారని మొదట్లో చాలాకాలం వరకూ అందరూ అనుకొనే వారు. అయితే ఒకానొక మాట పట్టింపు మీద చిదంబర శాస్త్రి అసలు పెళ్ళే చేసుకోలేదని, శాశ్వత బ్రహ్మచర్య దీక్ష పట్టాడని తెలిసి ఊరివాళ్ళంతా ఆశ్చర్య పోవడమే కాక, ఆయన నిగ్రహ శక్తిని వేనోళ్ళ పొగిడారు.

'సంపాదించాలి – ఒకరికి పెట్టాలి - రేపటికి దాచుకోవాలి' అనే సంసార ఝంఝాటం లేని శాస్త్రుల వారి మాట మీద ... డబ్బు కాపీనం ఏ మాత్రం లేని శాస్త్రుల వారి మాట మీద ... నిరంతరం గ్రామం మేలుకోరే ఆయన ఆశీస్సులు మీద, ... ఊళ్లో పిన్నలకి - పెద్దలకి ఆయన మీద గురీ - గౌరవం నానాటికీ రెట్టింపు కాసాగింది.

ఊరి సదుపాయాలతో పాటు, ఆలయానికి కావలసిన సదుపాయాలూ ఏమేమి కావాలో చిదంబరంగారిని అడగనిదే, ఆయన సలహాలేనిదే, గ్రామ పెద్ద లెవరూ స్వంత నిర్ణయాలు తీసుకొనే వారు కాదు.

కేవలం నిర్ణయాలేనా? మంచీ - చెడూ ప్రస్తావనల్లో సైతం - ఆయనదే అగ్రతాంబూలం. శాస్త్రులవారు చెప్పిందే తుది తీర్పు. దానికి కట్టుబడి వుండటం తమ విధి.

కాలం ఇలా సాఫీగా జరిగిపోతూ వుండగా ...

ఆ వూరు తప్ప, చుట్టు ప్రక్కల ఊళ్లన్నిటిలోనూ విశేషమైన మార్పు లొచ్చేశాయి. సర్కారు సంస్కరణల పేరిట ఊరికో బ్లాక్ డెవలప్మెంటు ఆఫీసూ, పంచాయితీ ఆఫీసూ, పి.డబ్ల్యు.డి వంటి కొన్ని ప్రభుత్వాఫీసులూ ఓ మాదిరి పెద్ద గ్రామాలలో వెలిశాయి. ఆ వూళ్లో కూడా గవర్నమెంటు తన వేళ్లూను కుంది. జనాభా రికార్డులు తయారయ్యేయి.

ఎలక్షన్లంటూ నాయకులూ బయల్దేరేరు.

కొంత కాలానికి తమ గ్రామం కూడా ప్రభుత్వ కాలుష్యంతో నిండి పోతుందని, ప్రశాంతంగా వున్న వూరు నానా రాజకీయాలతో, కక్షలతో, కుతంత్రాలతో చీలిపోయి భ్రష్టు పట్టిపోతుందనీ, దీనికి తరుణోపాయం ఏమిటనీ గ్రామ పెద్దలు చిదంబర శాస్త్రులతో ఆలోచించేరు.

పరిస్థితులను కూలంకషంగా అవగాహన చేసుకున్న వాడై, చిదంబర శాస్త్రులు "తప్పదు! ఈ మార్పుని ఎవరం ఆపలేం! ప్రభుత్వం అనేది మారుమూల గ్రామాల్లో సైతం విస్తరిస్తుంది. ప్రతి గ్రామం అండా దానికి కావాలి. మనం ప్రభుత్వాన్ని బహిష్కరించనూ లేము - వ్యతిరేకించనూ లేము. రానివ్వండి! ఇన్నాళ్లూ ఎవరి వృత్తులు వారు చేసుకుంటున్నారు. తర తరాలుగా - వంశపారం పర్యంగా అదే వృత్తి వాళ్ళకి జీవనాధారం అవుతోంది. నిశ్చింతగా బతుకుతున్నారు. కాని రేపు - ప్రభుత్వ పాఠశాలలొస్తాయి. నిర్బంధ విద్య వస్తుంది. పిల్లలకి విధిగా చదువు చెప్పించాలి విద్య కొంత వివేక హేతువే అయినా, వృత్తిమీద ఆసక్తిని సన్నగిల జేస్తుంది. ఉద్యోగాలంటూ - బస్తీల చుట్టూ తిరిగే దౌర్భాగ్యపు రోజులు దాపురిస్తాయి. అంతే! మన తరం మాత్రం ఇలాగే తెల్లారిపోతుంది. మనలో మార్పుండదు. కాని రేపటి తరమే - ఈ మార్పుని ఆహ్వానిస్తుంది. అది అవసరం కూడా! దాన్ని కాదని మనుగడ సాగించడం కూడా కష్టమయి పోతుంది." అని భవిష్యద్దర్శనాన్ని సెలవిచ్చారు.

అదే జరిగింది.

అంతకు ముందు, మందకొడిగా ఎప్పుడో ఒకటీ - అరా మార్పులు సంభవించే ఆ వూళ్లో అచిరకాలంలోనే - నేరాలున్నా లేకపోయినా ఓ పోలీస్టేషనూ, పిల్లలొచ్చినా - రాకపోయినా ఓ ఎలిమెంటరీ స్కూలూ, రేపు గురించి ఎవరికీ ఏమాత్రం చింత లేకపోయినా ఓ ప్రభుత్వ బాంకు శాఖా ... ఇంకా, ఓ మాదిరి గ్రామానికి ఏమేం రావాలో అన్నీ వచ్చేశాయి. ఇతర ప్రదేశాల నుంచి గవర్నమెంటుద్యోగాల మీద, కొత్త వ్యక్తులు గ్రామంలో ప్రవేశించేవారు.

మరీ ఎక్కువగా కాక పోయినా, కొద్దో - గొప్పో ప్రజల ప్రవర్తనలో మార్పు తీసుకురావడానికి వాళ్ళు కారకులయ్యేరు.

వ్యక్తి ఆరాధనని వ్యతిరేకించడంలో, వాళ్ళు ప్రేరణ ఇవ్వడం ప్రారంభించేరు.

సజావుగా సాగిపోతున్న గ్రామ జీవితంలో, బేజారు సృష్టించారు.

తత్ఫలితంగా ఆ ఊరి ప్రజల్లో పరస్పర సహకార బుద్ధి స్థానే, స్వార్థం బీజాలు నాటుకున్నాయ్.

దాతృత్వ గుణం పోయి, దోపిడీ తత్వం మొగ్గ తొడిగింది.

శాంతియుత జీవన ధారకి అంతరాయం ఏర్పడి, అభద్రతా భావన చోటు చేసుకుంది.

మౌనంగానే, మారుతున్న కాలాన్ని భరిస్తూ వస్తున్నాడు చిదంబర శాస్త్రి.

ప్రజల్లో దైవభక్తి పూర్వం వున్నంత ముమ్మరంగా లేకపోయినా, ప్రత్యేక పర్వదినాల్లో కొద్దో - గొప్పో ప్రకటిత మవుతూనే వుంది.

అలాంటి పరిస్థితుల్లో ...

'రేపు' గురించి 'దాపు' తప్పనిసరైంది.

తొలిసారిగా ఆ అవసరం కన్పించింది. కాని అది అతనికి చాతకాలేద

కొన్ని గడ్డు నెలల్లో, ఆలయానికి ఎవరూ అర్చనకు రాకపోతే, దేవుడితో పాటు తానూ పస్తు పడుకోవలసిన పరిస్థితి ఏర్పడింది.

దాని క్కారణం —— దేవుడి మాన్యాన్ని సాగుచేస్తున్న రైతుల్లో స్వార్థ బుద్ధి ప్రబలిపోవడమే! ఏవో కుంటిసాకులు చెప్పి, పంట సరిగా చేలికివ్వక ఎగవేసేస్తూ వుంటే చిదంబర శాస్త్రులు ఏం చేస్తాడు?

ఓ మాదిరి నిర్లిప్తతతో, మనో వ్యాకులతతో శేషజీవితాన్ని వెళ్ళదీయడానికే నిశ్చయించుకున్నాడు.

అలాంటి గడ్డు రోజుల్లోనే, గోదావరీ తీరం నుంచి వీరభద్రాచారి వచ్చి, చిదంబర శాస్త్రుల్ని ఆశ్రయించాడు.

"స్వామీ! తమది చల్లని చెయ్యి అని విన్నాను. మీ చేత్తోనే నాకీ వూళ్లో ఇంత ఉపాధి కల్పించండి" అని వేడుకున్నాడు.

అప్పటికే పరిస్థితులు - పెత్తనాలు శాస్త్రులవారి చేతులు దాటి పోయేయి

విని, ఊఁ కొట్టే వాళ్లే తప్ప, విలువనిచ్చి గతంలో లాగ వెంటనే ఆచరించే పెద్ద మనుషులు రాజకీయాల్లోకి జారుకున్నారు.

అదే విషయం చెప్పాడు శాస్త్రులు.

"పోనీయండి! నా కొచ్చిన ఏకైక వృత్తికే ఒక ఆసరా కల్పించండి. మనదేశంలో, ముఖ్యంగా దక్షిణాదిన ధ్వజ స్తంభం లేని శివాలయాలు ఎక్కడోగాని, ఆసలు సాధారణంగా కన్పించవు. శిథిలాలయం పునరుద్ధరణ జరిగినా ధ్వజ స్తంభ ప్రతిష్ఠ మాత్రం జరగలేదు కదా! తామ్ర పత్రాలూ - ఇత్తడి రేకులూ మేళవించి, నగిషీలు దిద్ది అద్భుత పనితనం కన్పరుస్తూ, శిఖరాన చిరుమువ్వల గంటలు అమర్చి, నిర్ణీతమైన ఎత్తులో స్తంభాన్ని తయారిస్తాను. మీ కున్న ఏ మాత్రం కొద్దిపాటి పలుకుబడి అయినా, వినియోగించి నాకీ సాయం చేయండి" అని ప్రాధేయ పడ్డాడు.

పరోపకార బుద్ధి జన్మతః వచ్చిన చిదంబర శాస్త్రికి యోచన బాగానే వున్నట్టనిపించింది.

తానంటే, ఇంకా అంతో - ఇంతో అభిమానం కన్పరిచే ఐదారుగురు గ్రామ ప్రముఖుల్ని సమావేశ పరిచి, ఇటీవలి కాలంలో ఆలయానికి సంస్కరణ మాపేణా ఏమీ చేయడం లేదన్న విషయాన్ని పదే - పదే నొక్కి చెప్పి 'ఇన్నేళ్ళయినా గుడికి కనీసం ధ్వజ స్తంభం లేదన్న" సంగతిని ప్రముఖంగా కన్పరచి "ఈ వేసవుల్లో అది కాస్తా పూర్తి చేస్తే గ్రామం సుభిక్షంగా వుంటుందనీ, వర్తక వ్యాపారాలు సజావుగా సాగిపోతాయనీ" సూచించాడు శాస్త్రులు.

మారిన పరిస్థితుల ప్రభావము వారి మీద కొంత పడినా, దైవకార్యం తప్పు స్వకార్యం కాదనే సంగతి గ్రహించుకోవడం చేత "సరే! ఏర్పాట్లు చేయించండి! మరి మనకి అంత ఎత్తున స్థంభ నిర్మాణం చేయగల లోహశిల్పి దొరకాలి గదా!" అన్నారు.

వెంటనే వీరభద్రాచారిని పరిచయం చేసి "గోదావరీ తీరాన వున్న ఓ పుణ్యక్షేత్రంలో, ఈ శాస్త్రాధ్యయనం చేసిన నిష్ణాతుడైన వ్యక్తి ఇతడు. అందుకు అన్ని విధాలా సమర్థుడు -" అని తెలియజేశాడాయన.

మరో రెండు మూడు సమావేశాలు జరిగాయి.

ప్రముఖ వ్యక్తులతో పాటు, గ్రామస్థుల దగ్గర కూడా యధాశక్తి చందాలు పోగుచేశారు.

ఆలయం ఆవరణలోనే, మరో తాటాకు పాక నిర్మించి, చార్యులకు ఇచ్చారు.

తగినంత సమయం తీసుకుని, ఏకాగ్రతతో స్థంభాన్ని చెక్కి-వ్వటానికి అన్ని ఏర్పాట్లూ చేశారు.

శాస్త్రులవారు అందించిన చేయూతకి చార్యులు ఎంతో పొంగిపోయాడు. ఏక దీక్షతో ధ్వజస్థంభ నిర్మాణానికి శ్రీకారం చుట్టాడు.

అవసరమైన లోహాలు తెప్పించడం చేత, పని, ఆటంకం లేకుండా సాగిపోతోంది. కాని చార్యులకు భోజన వసతి ఎలా? ఉన్నంతలో శాస్త్రులే ఆ ఏర్పాటు కూడా చేశాడు.

కండలు తిరిగిన ఉక్కు కడ్డీ లాంటి శరీరం చార్యులది.

లోహాన్ని కాల్చి, రేకులుగా సాగగొట్టి - అవసరమైతే, అనుకున్నట్టుగా సాగకపోతే, మళ్ళీ - మళ్ళీ ప్రయత్నించి, సరిచేస్తుంటే, అతడి కార్య దీక్షకి అబ్బుర పడనివారు లేరు.

ముడిలోహం కొలిమిలో కరిగి, ముద్దగా మారి, పల్చని రేకులుగా సాగి, చిన్న - చిన్న స్థూపాల ఆకారం దాలుస్తోంది. లోపల బోలుగా వుండే గొట్టం మాదిరి స్థూపాలు మూడేసి రోజుల కొకటి తయారవుతున్నాయ్. రెండింటిని అతికే చోట, మరికొంత ఎక్కువ కైవారంతో కలిపే రింగులు చేయడానికి. స్థంభపు శిఖరాన వుండే కేతనం, దానికి గంటలూ చేయడానికి ఎక్కువ సమయం పడుతోంది. అలాగే ధ్వజస్థంభం అగ్రానికి చేరుకొనే కొద్దీ, స్థూపపు గొట్టాల ఆకృతి చిన్నది అవుతూవుంటుంది. అవి మరింత జాగ్రత్తగా రూపొందించాలి. మొత్తానికి సక్రమమైన కొలతలతోనే సత్కార్య నిర్వహణ రెండు నెలల్లో పూర్తి అయింది.

పౌష్య మాసంలో పున్నమికి ప్రారంభించిన పని, ఉగాది వెళ్ళిన నెల్లాళ్ళకి - వైశాఖ ప్రవేశం నాటికి అన్ని హంగులతోనూ ధ్వజసహితంగా అమిరింది.

ఇక ప్రతిష్ఠించడానికి దివ్యమైన ముహూర్తం కోసం అన్వేషిస్తే - వైశాఖ శుద్ధ దశమి అన్ని విధాలా అనుకూలంగా వున్నదని తేలింది.

ఊరు - ఊరంతా పర్వదినంలా జరుపుకో దగిన శుభ సమయం అది. మామూలుగా ఓ స్థంభాన్ని, గోతిలో పాతేయడం కాదు గదా!

శాస్త్రవిధి అని ఒకటుంది. దాని ప్రకారం వేద విహితంగా, కొంత క్రతువు జరిపి, నిర్దుష్టమైన కొలతలు గలిగిన గోతిని త్రవ్వి - అందులో నానా విధ వస్తు సామగ్రిని ఆవాహన చేసి, నవరత్నాల వంటి విలువైన వాటిని పునాదిగా పరిచి, ఒక దివ్య లగ్నాన స్థంభ ప్రతిష్ఠాపన చేయాలి. అనంతరం సమారాధన, రాత్రి తెల్లార్లూ జాగరణ, వివిధ నృత్త - గీత - వాద్యాది సాంస్కృతిక కార్యక్రమాలూ జరిగించాలి.

మరి దీని కంతటికీ ద్రవ్యం కావాలి గదా!.

పెద్దలు సమావేశమయ్యారు. యాగదీక్షకు వచ్చే దూరప్రాంతాల వేద విదులకు విడిది ఏర్పాట్లనుంచి, కార్యక్రమాంతాన ఎరువు తెచ్చినవి కడిగిచ్చే పనివాళ్ళ కూలి దాకా ఎంత ఖర్చవుతుందో అంచనావేశారు. అది పదివేలకు పైగా లెక్క తేలేసరికి, అందరూ కళ్ళు తేలవేశారు.

తమవల్ల కాదంటే, తమ వల్ల కాదని అందరు చేతులెత్తేశారు.

స్థంభ నిర్మాణానికే ప్రజానీకం దగ్గర చందాలు పోగుచేశాం. మూడు నెలల తేడాలో మళ్ళీ చందాల కోసం ఊరిమీద పడితే, వాళ్ళెక్కడి నుండి తెస్తారు. అని ఆ అభిప్రాయానికే స్వస్తి చెప్పేశారు.

అయితే మరెవరు పెట్టుకోవాలి ఈ ఖర్చు?

నువ్వు అంటే నువ్వు అనుకున్నారు.

"అక్రమంగా వెనకేసిందాంట్లో, అరవయ్యోవంతు అయినా బయటికి తియ్యరాదా! దేవుడి కార్యం కదా! ఏ ఖర్చు గట్టెక్కినా గట్టెక్కినట్లేగా" అని ఒకరి గుట్టు మరొకరు లాగడానికి ప్రయత్నించారు.

"ఆయనకు సలహా చెప్పకపోతే, ఆ పనేదో నువ్వే చెయ్యరాదా?" అని మరొకరు ఎత్తి పొడిచారు.

వాగ్వాదాల మధ్య సమస్య నలిగిపోయింది.

పెద్ద మనుషులు లేచి వెళ్ళిపోయారు.

ఆ వూరిలో, ముఖ్యంగా - ఒకనాడు స్వామికార్యానికి ఏ చేతులైతే కలసికట్టుగా సహకరించేయో, ఆ చేతులే కలియబడి కొట్టుకోడానికి సిద్ధమయ్యాయి.

తాను చెక్కిన ధ్వజ స్తంభాన్ని - ప్రతిష్ఠించిన తర్వాత దాని ఠీవిని కళ్ళారా చూద్దామని కాసుక్కూర్చున్న వీరభద్రాచారి ఆశ అడియాసే అయింది.

తానొకటి తలిస్తే, పరమేశ్వరుడు ఇంకోలా తలచాడని వీరభద్రాచార్యులు వాపోయేడు.

వారం రోజుల అనంతరం పునః ప్రయత్నం చేసి. చీలిపోయిన పెద్ద మనుషులందర్నీ పేరు పేరునా బ్రతిమాలి చిదంబర శాస్త్రి మళ్ళీ సమావేశ పరిచాడు.

ఏం లాభం? సమస్య తెగలేదు. ఇంకోసారి దులిపేసుకుని వెళ్ళిపోయేరు.

జ్యేష్ఠ మాసం కూడా వచ్చి వెళ్ళిపోయింది.

చంద్ర నిప్పులు చెరిగే సూర్య భగవానుడి కన్నా తీక్షణంగా చూపులు రువ్వుకుంటున్నారు - ఊళ్ళో పెద్ద తలకాయలు.

స్వంత ఊసు ఎత్తేరన్న కక్షతో మనసులో కుతకుత ఉడికిపోతున్నారు.

ఆషాఢ మాసం - శూన్యమాసం - శుభకార్య నిర్వహణకి ఎలాగూ పనికి రాదు. ఈ లోగా కాలమే కొంతవరకు వాళ్ళని చల్లారుస్తుంది లెమ్మని చిదంబర శాస్త్రులూ ఊరుకున్నాడు.



# ప్రకృతి

## శ్రీ చిట్రగుంట సాయి బాబా

కెందామర మూతి ముడిచిందని
తపనుడు తపించి అరుణుడైనాడు
ఆ తపనుని కిరణాల అరుణిమను
కుంకుమ పూ బాలలు అరువు తీసుకున్నాయి
శిలీముఖ సమాన కిరణ స్పర్శకు
కాలమేఘ మాలికలు ఖండ ఖండాలై
అనంతా కాశంలో అల్లల్లాడాయి
ఇంతలో —
తొలికిరణం తాకిడికి తామర
మెలమెల్లన ముచ్చటగా విచ్చుకుంటే
అది చూచిన కొంటె సూరీడు
'అమ్మయ్యా' అనుకుంటూ తెల్లనవ్వు నవ్వేడు!
అపుడపుడే హిమ జలకాలాడిన
ధరణీ రమణి
సూరీని నవ్వు టద్దాలలో చూచుకొంటూ
సస్యశ్యామలాంబ రాన్ని సవరించు కొందోమారు
కలకూజితాల ఎలకోయిల
పెంటికి కంటితో కైపు సైగలు చేస్తూ
జగతి ఎరుగని జగన్మోహన రాగాన్ని
ఆరాధనాలాపనం చేస్తే,
భ్రమపడి కేకి క్రేం కారం చేసి
బర్హాసౌందర్య ప్రదర్శనంతో బర్హిననిపించు కొంది,
విరహంలో ఊగిన ఆ నెమలి నెలత
శృంగార నర్తనం చేసి, అల సింది,
రెల్లు పొదలు వింజామర లైనాయి,
చిరుజల్లులు శైత్యోప చారాలు చేశాయి
ఆకాశానికి ఎదు రెదిగిన వెదురు
మోహన వంశిగా మారి గానం చేసింది.
ఆ పిల్లన గ్రోవి వల్లమాలిన విరహరాగానికి
క్షణం స్థంభించిన నెమలి నెలత
కాలు జారి, మోజు దీరి నెల తప్పింది.
చకోరాలు చేశాయి సీమంతపు మంతనాలు
సూడిద లైనాయి సురకుసుమ పరాగాలు
ప్రకృతి ఆనందాబ్ధిలో తేలింది

ఆ వేసవుల్లోనే ప్రతిష్ఠ అయిపోతుందని, ఆ భాగ్యాన్ని కళ్ళారా దర్శించి తరిద్దామని కాటికి కాళ్ళు జాపుకున్న ముసిలాళ్ళు సైతం ఒకరిద్దరు — కోరిక తీరకుండానే తనువులు చాలించేసేరు.

ఈ లోగా — శ్రావణమేఘాల సందడితో, తొలకరి పులకరించింది. సర్వ జనావళికి హర్షసూచకంగా, వేసవి తాపానికి ఉపశమనంగా వర్షపు జల్లులు పడ్డాయి.

కాని — ఆ జల్లుల తేమ వాతావరణానికైనా, పెద్ద మనుషుల మనసులు చల్లబడ లేదు.

చిదంబర శాస్త్రికి పరిస్థితులే వేదన కలిగించాయి.

ఏం చేస్తే వాళ్ళ మనసులు కరుగుతాయా అని తీవ్రంగా ఆలోచించాడు.

అంతా అయిపోయి, ఆఖరు నిముషంలో కేవలం సంకుచిత మన స్తత్వాల వల్ల స్వామి కార్యానికి అంతరాయం కలగడాన్ని ఆయన భరించ లేక పోయేడు.

అంతే! కఠోరమైన నిర్ణయం తీసుకున్నాడు.

వ్యక్తిగత దూషణలు మానుకుని, చిత్తశుద్ధితో తలోచెయ్యా వేసి, విరూపాక్షుని ప్రాంగణంలో, ధ్వజస్థంభ ప్రతిష్ఠ దిగ్విజయంగా నిర్వహించకపోతే, ఆమరణ నిరాహార దీక్ష పాటిస్తానని ప్రతినబూనాడు — చిదంబరశాస్త్రి.

వీరభద్రాచార్యులను ఈ నిర్ణయం కదిలించి వేసింది. అతడి కళ్ళు చెమర్చాయి. శాస్త్రుల వారికి మద్దతుగా, తాను కూడా ఏదో ఒకటి చెయ్యాలని పించింది. నిరాహార దీక్షలో తానూ కూర్చుంటానన్నాడు అతడు. వద్దని వారించాడు చిదంబర శాస్త్రులు.

వార్త ఊరంతా ప్రాకింది.

పెద్దమనుషుల మనసులు కరగలేదు.

రోజులు గడిచిపోతున్నాయి. దీక్షలోవున్న శాస్త్రులవారి శరీరము శుష్కించి పోతూన్నది.

కుంభవృష్టి కురిసే నడి వర్షాకాలం వచ్చింది.

చిత్రం! ఆ యేడాది ఒక్క చినుకు లేదా వూళ్లో.

అయినా, జీవనది ప్రవహిస్తోంది కాబట్టి — ప్రజకీ పైర్లకీ నీటి ఎద్దడి అంటే ఏమిటో తెలీలేదు.

దేవుడ్ని — దేవుడిలాంటి మనిషిని అగౌరవ పరచడమే దీ... కారణమని వృద్ధులు సెలవిచ్చారు.

దీక్షలో కూర్చుని నెలరోజులు దాటిన తర్వాత ...

ఒకనాటి శుభోదయాన — అందరూ ఆశ్చర్యపోయే విధంగా, అతి చక్కగా — శివాలయానికి ఎదురుగా, నిర్ణీతమైన స్థలంలోనే ధ్వజస్థంభం ప్రతిష్ఠించ బడి వుంది.

"ఈ కలికాలంలో కూడా దేవతలు మహిమలు చూపిస్తున్నారా ...?"

"లే పోతే, ఏమిటది? ... కనీసం ముగ్గురైనా సాయం పట్టనిదే, సామాన్యులు ఎత్తడానికి శక్యంగాని ధ్వజస్థంభాన్ని ఎవరు — ఎలా ప్రతిష్ఠించ గలుగుతారు? ఇది తప్పకుండా దైవ ఘటనే కాని, వేరేం కాదు ..." అనీ —

"దేవతల చేత సైతం కంటతడి పెట్టించి ప్రతిష్ఠ జరిపించిన చిదంబర శాస్త్రులు కూడా, దేవుడు తప్ప సామాన్యుడు కాదనీ" ప్రజలు వేనోళ్ళ పొగడసాగారు.

నీరసంతో గత అర్ధరాత్రి సొమ్మసిల్లి పడిపోయిన చిదంబర శాస్త్రుల వారికి, స్పృహ తెప్పించి, ప్రతిష్ఠ జరిగిన ధ్వజస్థంభాన్ని చూపించి, దీక్ష విరమించవలసిందిగా కోరారు గ్రామ ప్రజలూ — పెద్దలూ.

పురజనుల కోరిక మేరకు, ఆ వృద్ధ బ్రాహ్మడు ఫలహారం స్వీకరించాడు.

తమ అల్పత్వానికి సిగ్గిల్లిన పెద్ద మనుషులు, చిదంబర శాస్త్రులను క్షమాపణ కోరుకుంటూండగా, ధ్వజస్థంభం చాటున చెమ్మగిల్లిన కళ్ళు వొత్తుకుంటూ నిలబడ్డాడు — వీరభద్రాచార్యులు.

అవును మరి! అతడేకదా — ఈ ప్రతిష్ఠకి సూత్రధారుడు!

## శ్రీ చేకూరి రామారావు

# స్త్రీ విముక్తి పథంలో రంగనాయకమ్మగారు

ఈ కాలపు నవలా రచయితలలో విశిష్టమైన వ్యక్తిత్వమూ, స్పష్టమైన లక్ష్యమూ, విరతి లేని పోరాట దృష్టి, తనదైన ప్రత్యేక వచనశైలీ ఉన్న రచయిత రంగనాయకమ్మగారు. ఈమె కేవలం స్త్రీ రచయిత మాత్రమే కాదు. స్త్రీల విముక్తి కోసం బలంగా కలం పట్టుకొని శక్తిమంతమైన రచనలు చేస్తున్న రచయిత. ఆమె రచనలకు పాఠకుల్లో ఉన్న ప్రచారం గురించి ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. పాఠకుల మీద కలిగించిన ప్రభావమే చెప్పుకోదగింది. మార్క్సిస్టు సిద్ధాంత పరిధిలోకి రాక ముందు కూడా ఈమెను స్త్రీసమస్యలు బాధించాయి. అందుకు పూర్వుల రచనలు స్వీయానుభవాలు, ప్రత్యక్ష పరిశీలన, పరోక్ష గ్రహణ దోహదం చేశాయి. ఆయా సమస్యలకు ఆమె స్పందించిన తీరు అన్ని రచనలలోనూ ఒకే రకంగా లేదు. అందుకు కారణం ఆమె అభిప్రాయాల్లో వచ్చిన క్రమ పరిణామం.

సమాజంలో స్త్రీల దోపిడి ఈనాటిది కాదు. అన్ని ప్రాచీన సమాజాల్లోనూ స్త్రీ పీడనకు గురి అయింది. విశేషమేమంటే పీడిత వర్గంలోనే కాక పీడక వర్గంలో కూడా స్త్రీ పీడితురాలే. అన్ని వర్గాల్లోనూ "భార్య అనే బానిసకు యజమాని భర్త" అయితే రంగనాయకమ్మగారి నవలల్లో చిత్రితమైంది మధ్య తరగతి స్త్రీ మాత్రమే. రచయిత వర్గం అదే కావటం వల్ల ఆమెకు ఎక్కువగా పరిచితమయింది ఆ జీవితమే. అదీగాక నవల అనే ఆధునిక సాహిత్య ప్రక్రియ మధ్య తరగతి వారిదే. శ్రామిక వర్గానికి నవలలు చదివే సౌకర్యమూ, సావకాశమూ ఉండవు. తెలుగు సాహిత్యంలో చాలా నవలల్లో (ఆ మాటకొస్తే కథల్లో కూడా) కనిపించేది మధ్య తరగతి జీవితమే. రంగనాయకమ్మగారి నవలలకూ ఈ పరిమితి తప్పలేదు, శ్రామిక వర్గం నుంచి రచయితలు వచ్చినప్పుడే ఆ వర్గానికి సన్నిహితమైన నవలలు వస్తాయనుకుంటాను.

ఈ వ్యాస పరిశీలనకు తీసుకొన్న నవలల్లో ప్రధాన వస్తువు వివాహిత స్త్రీల ఆత్మ గౌరవం.

రంగనాయకమ్మగారు తమ నవలల్లో భార్యా భర్తల సంబంధాల్లో ఉన్న అసమానతను ప్రదర్శించటం ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్నారు. ఇంతకు ముందు రచయితలెవ్వరూ ఆ పని చెయ్యలేదా అంటే, చేశారు. ముఖ్యంగా చలంగారిని ఈ సందర్భంలో మరచిపోలేము. ఆ తరువాత కుటుంబరావు, గోపీచంద్, ధనికొండ హనుమంతరావులు కూడా ఈ పని చేశారు. అయితే ఈ పై రచయితలు స్త్రీ సమస్యలను పురుష దృష్టితో చూశారు. స్త్రీ ఆత్మ గౌరవం ఎన్ని విధాలుగా భంగపడుతున్నదో, నిత్య జీవితంలో స్త్రీ ఎన్ని రకాలుగా అవమానాలకు గురి అవుతున్నదో, తమ తమ చైతన్యస్థాయి భేదాలను బట్టి స్త్రీలు ఏ మేరకు ఏ రకమైన పరిష్కారాలు ఆలోచిస్తారో రంగనాయకమ్మగారి నవల్లు చదివితే తెలిసినంతగా ఇతరుల నవల్లు చదివితే తెలీదు. వైవాహిక బంధాల్లో ఉన్న బోలుతనాన్నీ అసమానతనీ మొదటిసారి శక్తిమంతంగా చూపిన రచయిత చలంగారు. దాంట్లో అనుమానం లేదు. అయితే సమస్యను వివిధ కోణాల్లో అతి వివరంగా స్త్రీ దృక్పథం నుంచి చిత్రించింది రంగనాయకమ్మగారే. ఆ సమస్యను లోతుగా తర్కించింది కూడా ఈమే. వాటికి సాధ్యమైన (అన్నీ సరైనవి కాకపోవచ్చు, సరి అయినవి ప్రస్తుతం ఆచరణ సాధ్యం కాకపోవచ్చు) వివిధ పరిష్కార మార్గాలను ప్రదర్శించిందీ ఈమే. ఈ పరిష్కార మార్గాలు అన్ని రచనల్లో ఒకే రకంగా లేకపోవటం విశేషం – రచయిత భావాల్లో అనుభవాల్లో, ఆలోచనల్లో అవగాహనలో, జ్ఞానంలో వచ్చిన మార్పులు ఈ రచనల్లో కనిపిస్తాయి. చలనశీలమైన (డైనమిక్) రచనా వ్యాసంగానికిది గుర్తు. పాత నవల్లకు రాసిన కొత్త ముందు మాటల్లో తన రచనలను స్వయం పరిశీలన (ఇంట్రాస్పెక్టు) చేసుకోటం వల్ల కూడా ఈమె ఆలోచనా క్రమంలో వచ్చిన పరిణామం తెలుస్తుంది. తన మీద తాను నిష్కర్షగా నిర్మొహమాటంగానే విమర్శ చేసుకున్నారు.

## మంచి పాత్రలూ, చెడ్డ పాత్రలూ

రంగనాయకమ్మగారి నవల్లో ఒక చిత్రం కనిపిస్తుంది. భార్యా భర్తల సమస్యలను తీసుకొని రాసిన నవలల్లో ప్రధాన స్త్రీ పాత్రకు కేవలం సానుభూతి చూపేవాడుగా గాని, సపోర్టు ఇచ్చేవాడుగా గాని, పూర్తిగా అండగా ఉండేవాడుగా గాని ఒక అన్న పాత్ర (లేక వరసకు అన్న అయ్యే పాత్ర) కూడా విధిగా ఉండటం మనం గుర్తించకుండా ఉండలేం.

పేక మేడలు నవల్లో భానుతో బాటు వాళ్ళ పెద్దమ్మ కొడుకు కేశవరావు చదువుకొంటాడు. భాను ఆర్థిక పరిస్థితి వల్ల ఆమె చదువు మానుకొని పెళ్ళి చేసుకోవాల్సి వస్తుంది. భర్త పేరు రాజశేఖరం. అతను సిగరెట్లు కాలుస్తాడు. రంగనాయకమ్మగారి నవల్లో దుర్మార్గపు భర్తలు సిగరెట్టు కాలుస్తారు. రచయిత సానుభూతి చూపే పాత్రల్లో ఈ అలవాటుండదు. ప్రధాన స్త్రీ పాత్రకు సానుభూతి చూపే అన్నలు సిగరెట్లు కాల్చరు. దుర్మార్గపు భర్తలు పేకాట ఆడతారు. 'పేకమేడ'ల్లో భాను భర్త రాజశేఖరం ఆడతాడు. ('జానకి విముక్తి'లో, వెంకట్రావు ఆడతాడు.) పేకాట ఆడే రాజశేఖరం భార్య భానును నిర్లక్ష్యం చేస్తాడు. భాను ఈ విషయంలో భర్త రాజశేఖరాన్ని మార్చాలని చూస్తుంది. అతను మారడు, పైగా భార్య తన్ను ఆశించినంత శ్రద్ధగా చూడటం లేదనుకుంటాడు. ఇంట్లో అవసరాలు చూడడు. పిల్లాడికి జ్వరం వచ్చినా పట్టించుకోడు. పైగా పిల్లవాణ్ణి కూడా విసుక్కుంటాడు. భార్యకు జ్వరం వచ్చినా పట్టించుకోడు.

దుర్మార్గపు భర్తలకు వంకరమాటల ప్రతాపం కూడా ఉంటుంది. 'పేకమేడ'ల్లో రాజశేఖరం, 'రచయిత్రి' లో మోహన్ 'జానకి విముక్తి' లో వెంకట్రావు ఇట్లాంటివాళ్ళే. రాజశేఖరంలో కొంత మంచితనం కూడా ఉన్నట్టు భాను అన్న కేశవరావు గుర్తిస్తాడు. ఈ భర్తలకు చలంగారి పుస్తకాలు సరిపడవు. భాను చలంగారి 'స్త్రీ' చదువుతుంటే రాజశేఖరం భరించలేడు. (పేకమేడలు. పే. 93) జానకి చలంగారి 'మైదానం' చదివితే దాన్ని ముక్కలు ముక్కలుగా చింపేశాడు వెంకట్రావు (జానకి విముక్తి – 2).

## 'పేక మేడలు' లో

దుర్మార్గపు భర్తలాగా రాజశేఖరం అలుగుతాడు. భార్యను వెటకారం చేస్తాడు. అప్పుడప్పుడు లెంపకాయలు వేస్తాడు. సమయం దొరికినప్పుడల్లా అవమానిస్తాడు. మోసగించటానికి అప్పుడప్పుడు ప్రేమ కబుర్లు చెబుతాడు.

భానుమతి ఆత్మాభిమానమున్న స్త్రీ. రాజశేఖరం దారికొస్తాడని ఎదురుచూసింది. ఆ ఆశ నిరాశకాగా ఆత్మహత్య చేసుకుంది. బహుశా భానుమతి ఉన్న చైతన్యస్థాయికి ఆత్మాభిమానం నిలుపుకోటానికి అంతకన్నా ఇంకో మార్గం దొరికి ఉండదు.

'పేకమేడలు' ఇప్పటికీ చాలా ఆదరణ పొందుతున్న నవల. 1982 ఏప్రిల్ నాటికి ఏడు ముద్రణలు పడింది. ఈ నవల వివాహ విచ్ఛిత్తిని కోరదు. ఆ పరిధిలోనే భర్త న్యాయంగా ఉండకూడదా? భార్యను గౌరవించకూడదా? అని మాత్రమే ప్రశ్నిస్తుంది. ఆ రకమైన అవమానాలకు గురి అయిన స్త్రీల వేదనను సరిగ్గా వ్యక్తీకరించటం వల్ల ఈ నవల బాగా ఆదరణ పొందింది. అయితే స్త్రీ పురుష సంబంధాల్లో వచ్చిన ఈ అసమానతల కారణాల జోలికి ఈ నవల పోదు. పురుషాధిక్యాన్ని పూర్తిగా ప్రశ్నించినట్టు కనపడదు. ఉదాహరణకు ఈ క్రింది సంఘటనలు పరిశీలించండి.

కేశవరావు భానుమతి కొడుక్కి బిస్కట్లు అందిస్తూ చెల్లెలు భానుమతితో "అయితే నీ కొడుక్కి ఈ బిస్కట్ల కట్నం చాలంటావా?" అని అడుగుతాడు. అందుకు సమాధానంగా భానుమతి 'ఇప్పటికి చాలు' అంటుంది

గొప్పగా. "మగపిల్లవాడి తల్లి మరి" - ఈ వ్యాఖ్య కేశవరావుది. అతను చెపుతున్నట్టే కథ నడుస్తుంది. భానుమతికి సానుభూతి చూపే పాత్ర ఇది.

## ఇంకో ఘట్టంలో —

"అన్నయ్యా కాదు అక్కా అని పిలు. నీ అన్న కూడా ఒక మగవాడే అనుకుంటున్నావేమిటి?" అంటాడు భర్త రాజశేఖరం అన్న కేశవరావును గురించి. "మీరు మీ జారిని బాగా పోల్చగలరు సుమండీ" అంటుంది భార్య భానుమతి. పురుషుని స్త్రీతో పోల్చటం అవమానం అని భర్త రాజశేఖరం అనుకోవటంలో ఆశ్చర్యంలేదు. భార్య భానుమతి అదే ధోరణిలో మాట్లాట్టం అపరిణత ఆలోచనకు గుర్తు.

మరో ఘట్టంలో - భర్త రాజశేఖరం భానుమతిని మోసంచేసే దృష్టితో బలిమాలుతున్న ఫోజుపెడితే ఆమె - "మీరు అంతగా దిగజారిపోకండి. ఆడదాన్ని పోషించి, ఆడదాన్ని రక్షించి, ఆడదాన్ని పాలించే పురుషుడు ఒక ఆడదాన్ని ఇంత దేవిరించటమా? నేను భార్యనే కావచ్చు, ఆడదాన్ని. మీ వ్యక్తిత్వాన్ని మీరు కాపాడుకోవాలనే నా కోరిక" అంటుంది. ఈ మాటల్లో ఎత్తిపొడుపులాంటిదాన్ని ఉద్దేశించినట్టు అనిపించదు.

అంటే - ఈ నవల్లో కథానాయిక భర్త నుంచి కోరేది రక్షణ మాత్రమే. సమానత్వం కాదు. అయితే నవల రచనాకాలం రెండు దశాబ్దాల కిందట (1962) అని తెలుసుకున్నప్పుడు అప్పటి రచయిత వయస్సు ఊహిస్తే (సుమారు 20-22 సంవత్సరాలమధ్య ఉండవచ్చు) పై ఘటనలలో ఉన్న అసంబద్ధతను అర్థం చేసుకోవచ్చు.

ఇక్కడ గమనించాల్సిందేమిటంటే రంగనాయకమ్మగారు తొలిరోజుల నుంచీ వివాహిత స్త్రీ భర్తవల్ల పొందే అవమానాలను సెన్సిటివ్‌గా చిత్రిస్తున్నారని, వీటి నివారణోపాయాలను తమ రచనలద్వారా అన్వేషిస్తున్నారనీ.

## 'రచయిత్రి' లో

'రచయిత్రి' అనే నవలలో భర్త మోహన్ భార్య విజయ సమానంగా చదువుకున్నారు (బి. ఏ.). విజయను పెళ్ళి చేసుకోటానికి మోహన్ సంకోచించాడుకూడా. భార్య పైచదువు చదువుకోటానికి ఇష్టపడడు. విజయ రచయిత్రి. కథలూ, నవల్లూ రాస్తుంది. భార్య రచయిత్రి అన్న మురిపెంతోపాటు భరించలేనితనంకూడా ఉంటుంది. విపరీతమైన ఆత్మ న్యూనతాభావం (ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు) భార్యను గౌరవించే వాళ్ళను కూడా భరించలేడు. రచయిత్రిగా భార్యను సహించలేడు. తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకునే ఆమె ప్రతిచర్య మోహన్‌కు కంటకమవుతుంది. ప్రతిదీ ఆమె తనకు చెప్పి చెయ్యాలనుకుంటాడు. ఆమె రచన చేసినా తన అనుమతి కావాలంటాడు. 'పేక మేడలు'లో లాగా కాకపోయినా ఇక్కడి భర్తా భార్యను ఇతరుల ముందు అవమానిస్తాడు వెటకారాలు చేస్తాడు. ఆఖరికి లెంపకాయలు వేస్తాడు.

ఈ నవల్లో ప్రధాన స్త్రీ పాత్రకు సానుభూతి పరుడైన అన్న ఉంటాడు. తన రచనలకు వచ్చే డబ్బుల జమా ఖర్చులు చూసి పెడతాడు.

ఇందులో విజయకు తోడుగా సానుభూతి పరురాలైన తోడికోడలు ఉంటుంది. అయినా మోహన్ మారడు. చివరికి విజయ భర్తను వదలి పుట్టింటికి పోతుంది. అయితే భర్త పశ్చాత్తాప పడి భార్య దగ్గరికి వెళతాడు. ఆమె కరిగిపోతుంది. ఈ ముగింపు అసహజంగా ఉన్న సంగతి రంగనాయకమ్మ గారే గుర్తించారు. ఇందులోనూ విజయకు - అంటే భార్యకు తాను కోరే సమానత్వం మీద సరైన అవగాహనలేదు.

భర్త మీద జాలి కలిగినపుడు విజయ భర్త పాదాలు నిమురుతుంది. (పే. 133) లేదా ఒత్తుతుంది. (పే. 178).

రాధాకృష్ణుల సంబంధం మీద కథానాయిక ఊహలు చాలా అవాస్తవికంగా (రొమాంటిక్‌గా) ఉన్నాయి. రాధాకృష్ణుల ప్రేమ పవిత్ర ప్రేమ అనుకుంటుంది. విజయ చాలా విషయాల్లో ఈ నాయికకు పాతకాలపు భావసభావాలు మిగిలి ఉన్నా ఆత్మాభిమానం, సొంత వ్యక్తిత్వం కోసం తపన ఈ నవలలో కనిపిస్తాయి. ఇందులోనూ సమానత్వం కోసం పోరాటం కాకుండా తన వ్యక్తిత్వానికి గుర్తింపు కావాలనే తపనే కనిపిస్తుంది. అయితే పుట్టింటికి వెళ్ళటమే పరిష్కారమవుతుంది. అంత ఆత్మాభిమానమున్న స్త్రీ పుట్టింట్లో ఇముడుతుందను కోవటం అసహజం. స్వతంత్రంగా జీవించే స్థాయి ఉన్నా విజయ ఆ ప్రయత్నం చెయ్యదు. మోహన్ పశ్చాత్తాప పడటం అతని చిత్త సంస్కారానికి సంబంధించింది: సమస్యా పరిష్కార మార్గంగా దానికి అస్తిత్వం లేదు.

రంగనాయకమ్మ గారికి కథానాయిక మీద సానుభూతి ఉండటంలో ఆశ్చర్యం లేదు. అయితే కథానాయిక అన్న మీద కూడా అంతే సానుభూతి ఉంటుంది. ఆమె అంతశ్చేతనలోనే అవ్యక్తంగా ఈ సానుభూతి ఉండి ఉండాలి. ఈ నవల్లో ('రచయిత్రి') విజయ తన తోడి కోడలు కూతురు సరోజ అనే చిన్నపిల్లకు కథ చెపుతుంది. ఆ కథలో ఒక అమ్మాయిని రాక్షసుడెత్తుకుపోతే ఆ అన్నయ్య కత్తి పట్టుకొని రాక్షసుడి బారినుంచి చెల్లెల్ని రక్షిస్తాడు. చెల్లెలి సంరక్షకుడిగా అన్నను రంగనాయకమ్మగారు అత్యంత గాఢమైన అంతస్థాయిలో ఊహించి ఉండాలి. ఈ నవలల్లో కథానాయికల అన్నలు దాదాపు సంరక్షక పాత్రనే నిర్వహిస్తారు. అన్నలంతా అట్లా నిర్వహిస్తారా? పురుషాధిక్య సమాజంలో అన్నలూ పురుషులేనన్న సంగతి విస్మరించగూడనిది. పురుషులందరికీ ఉండే స్వార్థ చింతన 'అన్న' లకూ ఉండటం సహజం. రంగనాయకమ్మగారు ఈ విషయాన్ని గుర్తించినట్టు లేదు.

సంరక్షకులైన అన్నలున్న భానుమతి (పేక మేడలు), విజయ (రచయిత్రి), జానకి (జానకి విముక్తి) వంటి వాళ్ళకు అంతో ఇంతో సహాయం అందుతుంది. ఆ అవకాశం లేని విశాలాక్షి, సుశీలల (జానకి విముక్తి) గతి ఏమిటి? రచయితకు వాళ్ళ మీద చాలా సానుభూతి ఉన్నా వాళ్ళను వాళ్ళ విధికి వదిలేశారు రచయిత. వాళ్ళు తమ వ్యక్తిత్వం కోసం పోరాడరా? వాళ్ళ సమస్యలకు పరిష్కార మార్గం ఏమిటి? రంగనాయకమ్మ గారు ఈ ప్రశ్నలను ఏమంత పట్టించుకున్నట్టు లేదు.

'రచయిత్రి' అనే నవల రచనా కాలం 1965. వ్యక్తిత్వం విషయంలో విజయ (రచయిత్రి) భానుమతి (పేక మేడలు 1962) కన్నా కొంత మెరుగైనా సామాజిక దృక్పథంలో సమస్యావగాహనలో ఏమంత మెరుగైనట్టు కనపడదు. రెంటి మధ్యా కాల వ్యవధి ఎక్కువ లేకపోవటం కూడా మనం గుర్తించగలం.

ఈ రెండు నవలల రచన కాలానికి రంగనాయకమ్మ గారికి మార్క్సిస్టు సిద్ధాంత పరిచయం ఏర్పడలేదు.

## 'జానకి విముక్తి' లో

రంగనాయకమ్మ గారి ప్రస్తుత అభిప్రాయాలకు 'జానకి విముక్తి' అనే నవల (మూడు భాగాలు - నాలుగు వాల్యూములు) ప్రతినిధి. భావాల పరిణతిలో, శైలి విషయంలో, ముఖ్యంగా పాత్ర చిత్రణలో ఈ నవల ఆమె రచనల్లో ఉత్తమమైనది. కాలక్షేపానికే నవల్లు అనే భావం బాగా బలపడుతున్న కాలంలో నిర్దిష్ట లక్ష్యంతో, విస్పష్ట సాహిత్య ప్రయోజనంతో వచ్చిన పెద్ద నవల ఇది. సమగ్ర జీవిత చిత్రణకు అనువైన సాహిత్య రూపం నవల. కాని ఇటీవల కాలంలో ఇది బక్క చిక్కి మాస పత్రికలకు అంటుకు పోయింది. మళ్ళీ తొలినాటి తెలుగు నవలల సంప్రదాయాన్ని పునరుద్ధరించిన గౌరవం ఈ నవలకుంది.

పాత్ర చిత్రణ విషయంలో గురజాడ అప్పారావుగారి గిరీశం తరువాత చెప్పుకో దగిన పాత్ర ఈ నవల్లో వెంకట్రావు అనే భర్త పాత్ర. గిరీశమైనా, వెంకట్రావైనా క్యారక్టర్లు కావు. క్యారికేచర్లు క్యారక్టరును తెలుగులో పాత్ర అంటున్నాం. క్యారికేచర్‌కి ప్రసిద్ధమైన పదం లేదు. పాత్రలో కొన్ని లక్షణాలను అతిశయంగా చేసి చూపిస్తే క్యారికేచరు అవుతుంది. క్యారికేచరుకు తెలుగు మాటే వాడుకోవాలంటే 'అతిశయ పాత్ర' అనుకోవచ్చు.

ఒక పాత్రమీద రచయిత దృష్టి అధికమైతే అతిశయ పాత్ర తయారవుతుంది. (ఈ అతిశయం ఉత్తమ పాత్రలకు వర్తించదు) వెంకట్రావు అతిశయీకృత, వికృతీకృత పాత్ర భర్త అనే భావంమీద ఎంత అసహ్యం కలగటానికి వీలుంటుందో అంత అసహ్యం వెంకట్రావుమీద కలుగుతుంది. ఈ సమాజంలో మూర్తీభవించిన సర్వ భర్తల సర్వ అవలక్షణాలకు వెంకట్రావు ప్రతీక.

ఒక్కో అవలక్షణానికి ఒక పాత్రను చిత్రించే బదులు అన్ని అవలక్షణాలు ఒక పాత్రలోనే ప్రవేశపెడితే పాత్రల సంఖ్యలో పొదుపు సాధించవచ్చు. వెంకట్రావు పాత్రద్వారా రంగనాయకమ్మగారు సాధించిందదే.

వెంకట్రావు పీనాసి పెళ్ళానికి అరటిపండ్లు ఇస్తే, ఆమె తినకపోతే తినలేదని బాధపడే బదులు డబ్బు వేస్టు అయిందని బాధపడతాడు రిక్షాలాగే అతనితో అయిదు పైసలకోసం బేరం ఆడతాడు

వెంకట్రావు తిండిబోతు భార్య పుట్టింటివారు పంపిన మిఠాయి, కారప్పూస తినమని జానకి పెట్టినపుడు బింకానికిపోయి చాటుగా తింటాడు. భార్య ఉత్తరాలు ఆమెకు తెలియకుండా చదువుతాడు. ఆమె పెట్టెలో డబ్బు కొట్టేస్తుంటాడు. క్లెప్టోమేనియాక్ లక్షణాలు కనిపిస్తాయి అతనిలో.

వెంకట్రావు తల్లిలా మాట్లాడతాడు తల్లిని వెనకేసుకొచ్చి భార్యను తిడతాడు, కొడతాడు "అమ్మకూచి కొడుకు" ఈలక్షణాల్ని 'ఎడిపస్ కాంప్లెక్సు'గా మనస్తత్వ శాస్త్రవేత్తలు గుర్తిస్తారు

అతి చిన్న కారణానికి కూడా భార్యను కొడతాడు రచయిత మాటల్లో "కుట్టటానికి వీల్లేకపోతే తేలు యాతనపడుతుందో లేదోగాని ఏదో ఒక మురికిమాట విసరటానికి వల్లగాకపోతే మాత్రం వెంకట్రావు యమ యాతన పడతాడు. ఊపిరాడని రోగిలా గిజగిజ లాడతాడు" వెంకట్రావు జానకిని హింసించి ఆనందిస్తాడు. అతను 'శాడిస్టు' రెండు రోజులుగా అన్నం తినని జానకిని ఆ కారణంగా రెండు చెంపదెబ్బలు వేస్తాడు

వెంకట్రావు తన అందాన్ని చూసి మురిసిపోతాడు రచయిత మాటల్లో "పది నిమిషాలసేపు అద్దాన్ని అన్ని కోణాల్లోకి తిప్పి తల దువ్వుకొని, మొహానికి స్నోరాసి, పౌడరద్ది జానకి వుతికి ఇస్త్రీ చేసి పెట్టిన రుమాలు జేబులో పెట్టుకొని చివరసారి మళ్ళీ అద్దం చూసుకొని ..." [జానకి విముక్తి - 2, పేజీ. 165] దీన్నిబట్టి వెంకట్రావు తన్ను తాను ప్రేమించుకునే వ్యక్తిగా గుర్తు పట్టగలం ఇట్లాంటివాడ్ని సైకాలజిస్టులు 'నార్సిసిస్టు' అంటారు.

అస్తమానం పాఠకులకు విసుగొచ్చేంతగా వెండి పళ్లెం కోసం భార్యను దెప్పుతాడు

అతన్ని వర్ణించటానికి రంగనాయకమ్మగారు తెచ్చిన పోలికలు : పక్షుల్ని వేటాడే వేటగాడు, మనిషి రక్తం రుచిమరగిన పులి.

సరిగ్గా కూర్చో అంటూ వెంకట్రావు కాళ్ళు రెండూ జానకి వొళ్లో పెడితే అది అతడి శృంగార కలాపానికి నాంది. వెటకారాలు, వేళాకోళాలు మాత్రమే ఉన్నై. సున్నితత్వం ఏ కోశానా లేదు మోటు సరసాలు మాత్రమే చేతనవును.

వెంకట్రావు నవలలు చదవడు. సినిమా పత్రికలు చదువుతాడు తెలుగుకూడా సరిగ్గా రాదు "తలచి మురిసేను మనము" అనే వాక్య భాగములో మనము అంటే మనస్సు అని తెలీదు.

వెంకట్రావు సిగిరెట్లు కాలుస్తాడు వ్యభిచారం చేసినట్లు ప్రత్యక్ష సాక్ష్యం లేదగాని పరాయి ఆడవాళ్ళతో రిక్షాలో కూర్చుని సినిమాకి వెళతాడు. [రంగనాయకమ్మగారి నవలల్లో చెడ్డ పాత్రలు ఎందుకో మద్యపానం చెయ్యవు.]

రచయిత అక్కడక్కడ మైమరచి వర్ణించిన ఘట్టాలు నిజంగా రసవంతమైనవి రంగనాయకమ్మగారి వచనశైలి ఉన్నతదశకు వెళ్ళిన ఘట్టాలివి. ఇవి చూడండి

"ఎన్ని చదివినా, ఎన్ని విన్నా, ఎన్ని చూసినా చచ్చేదాకా బుద్ధిరాని వాళ్ళలో వెంకట్రావు మొట్ట మొదటి వాడు వందమంది వెంకట్రావుల్ని ఏరి అందులోంచి తీస్తే ఈయనే ప్రథముడు. ప్రథములందర్నీ కలిపి మళ్ళీ తీస్తే ఈయనే ప్రథముడు." [జా వి - 2, పే 229]

వెంకట్రావుకి మనుషుల్ని చూస్తేనే వెడల్పాటి రోడ్లని చూసినా, పెద్దపెద్ద బిల్డింగుల్ని చూసినా నాగరికమైన సినిమా థియేటర్లని చూసినా, పక్షుల్లా యెగిరే విమానాల్ని చూసినా దేన్ని చూసినా అసూయే దేని అందాన్నీ ఒప్పుకోలేడు, దేని ఔన్నత్యాన్నీ భరించలేడు" (జా వి - 2, పే 284)

గురజాడ అప్పారావు గారు కన్యాశుల్కం నాటకంగా రాశారు. అందువల్ల నాటక కర్త గిరీశం గురించి ఏమీ చెప్పరు. నవలల్లో రచయితలకు చాలా స్వేచ్ఛ ఉంది. అందువల్ల రంగనాయకమ్మగారు స్వయంగా కల్పించుకొని వెంకట్రావు మీద పాఠకులకు అసహ్యం పెంచటానికి ప్రయత్నించారు. వెంకట్రావు మీద అసహ్యం పెంచుకోటానికి అతని ప్రస్తుతం చాలు కాని రచయితకి తృప్తికలక్క అతని బాల్యాన్ని కూడా వర్ణిస్తారు అతనికి చిన్నప్పుడు చుప్పనాతి సూరయ్య అనే బిరుదుండేదట ! ఆటల్లో మోసం చేసేవాడట, వెంకట్రావు అదృష్టం కొద్దీ చాలా మంచి స్నేహితులే తగిలారు చిన్నప్పటి నించీ వాళ్ళ అదృష్టం కొద్దీ వాళ్ళు చాలా తొందరగానే వెంకట్రావుని గుర్తించి వొదిలేశారు" ఇట్లా చెప్పటం వలన వెంకట్రావు పుట్టుకతోటే చెడ్డవాడు అని చెప్పదలచుకున్నారా రచయిత ? ఇంకా చాలా చోట్ల రచయిత జోక్యం అనవసరం. వెంకట్రావు "ఏడిశావ్లే ! నీ మొహంలే ? పళ్ళురాల గొడితే సరి ! నోరుమూసుకో !" లాంటి మాటలు నిస్సంకోచంగా అనేవాడు. (జా వి - 2, పే 236) అని రచయిత జోక్యం చేసుకొని వర్ణించాల్సిన అవసరం లేదు. అతని మాటలే ఉన్నాయిగా.

జానకి విముక్తిలో జానకి నిజంగా విముక్తి పొందిన స్త్రీ, భర్త పెట్టే బాధలను సహించి క్రమక్రమంగా తన అన్న, మూర్తిగార్ల సహాయంతో విజ్ఞానం, ధైర్యం సంపాయించుకొని ముందుకు పోతుంది తన దారి చూసుకోగలుగుతుంది. మార్క్సిస్టు దృక్కోణం అర్థం చేసుకుంటుంది. ధైర్యంగా ఇంట్లోంచి బయటికి వెళ్ళిపోతుంది. తరవాత తన జీవితాన్ని సరిదిద్దుకోటం సమాజం మీద ఆధార పడిలేదు. వ్యవస్థకెదురు తిరిగిన తనలాంటి వాళ్ళ మీద ఆధారపడి ఉంది.

వివాహ వ్యవస్థ అవసరం లేని సమాజం ఇంకా రాలేదు. వ్యవస్థను ధిక్కరించిన జానకీ, సత్యం (జానకి అన్న) లాంటి వాళ్ళు కొద్దిమంది తమకు నచ్చిన స్త్రీ పురుషులతో పెళ్ళి తంతులేకుండా కలిసి నివసించగలుగుతారు జానకి విముక్తి అయిన తరవాత కథ నిజమైన కల్పన నిజం కావాల్సిన కల్పన నిజం అయితే బాగుండుననిపించే కల్పన అయితే కొందరి విషయంలో, అంటే వ్యవస్థను ధిక్కరించిన వారి విషయంలో అసాధ్యమైన దేమీకాదు. రాబోయే సమాజానికి తొలి దూతలు వీళ్ళు.

ఈ సమాజంలో భర్త పీడకుడు భార్య పీడితురాలు అయిన మాట నిజమే అయితే మిగతా పీడిత పీడకుల వైరుధ్యంలాంటిదేనా భార్యా భర్తల మధ్య వైరుధ్యం ? భార్యా భర్తల మధ్య వచ్చే కలహాలకే మిత్ర వైఖరీ, శత్రు వైఖరీ ఉంటయ్యంటాడు డాక్టరు మూర్తి (జానకి అన్న అయిన సత్యానికి స్నేహితుడు) జానక్కి రాసిన ఉత్తరంలో రాజకీయాల్లో మిత్రుల మధ్య శత్రువుల మధ్య స్పష్టమైన గీతలుంటాయి, వ్యక్తుల మధ్య సంబంధాల్లో ముఖ్యంగా భార్యా భర్తల మధ్య సంబంధాల్లో మిత్రవైఖరీ, శత్రువైఖరీ సాధారణ పరిస్థితుల్లో తేలదు రెండూ కలగలిసే ఉండొచ్చు

భర్త దుర్మార్గుడైనప్పుడు భర్తను దారికి తీసుకొచ్చే వ్యర్థ ప్రయత్నాలు చేసి అవమానాలు పాలవటం కన్న ఆ బంధాన్ని తెంచుకొని బయట పడమని 'జానకి విముక్తి' ఇచ్చే సందేశం ఆ దృష్ట్యా మిగతా నవలలకన్నా ఇది ఉన్నతమైంది. అయితే సత్యం లాంటి అన్న, మూర్తిగారి లాంటి స్నేహితుడూ ఉన్నవాళ్ళకే విముక్తి సాధ్యమవుతుంది ప్రభాకర్ లాంటి వాళ్ళు ఎంత మంది ఉంటారు, జానకిని కొడుకుతో సహా జీవిత భాగస్వామినిగా స్వీకరించటానికి. అట్లాంటి సహాయం లేనివాళ్ళ మాటేమిటి ? అందుకు ప్రత్యక్ష సమాధానం ఈ నవల్లో దొరకదు. విశాలాక్షి, సుశీలలను పరోక్ష సమాధానాలుగా గ్రహించవచ్చు

జానకి విముక్తిలో ప్రస్తుత కమ్యూనిస్టు గ్రూపుల మధ్య విభేదాలను గురించి విస్తారంగానే ఉంది. అయితే కథల్లో సమస్యల పరిష్కారానికి ఈ చర్చ ఏ విధంగా ఉపయోగపడిందో చెప్పటం కష్టం. రచయిత అభిప్రాయాలు మాత్రమే తెలుస్తాయి. తొలినాటి నవలల్లో కూడా ఈ లోపాలు కనపడతాయి వేయి పడగల్లో కాని, బాపిరాజుగారి నవలలో గాని, బుచ్చిబాబుగారి చివరకు మిగిలేదిలోగాని విస్తారమైన తాత్విక చర్చలు కనిపిస్తాయి. ఈ జానకి విముక్తిలో కమ్యూనిస్టు సిద్ధాంత విభేదాల చర్చ సామాన్య పాఠకుడికి ఏ విధంగా పైవాటి కన్నా భిన్నంగా కనిపిస్తుంది ? కమ్యూనిస్టు పాఠకుడికైనా ఈ చర్చ ఆసక్తి కలిగిస్తుందనుకోను

రంగనాయకమ్మగారి నవలల్లో స్త్రీలు మంచి స్థితి కోసం కాని, తగిన గుర్తింపు కోసం కాని, తగిన స్థానం కోసం కాని, సమానత్వం కోసం కాని, ఆఖరికి విముక్తి కోసం కాని వ్యక్తులుగానే వ్యక్తుల సాయంతోనే ప్రయత్నిస్తారు. సత్యం లాంటి అన్నో, మూర్తిగారి లాంటి అన్నగారి స్నేహితుడో జానకి లాంటి వాళ్ళకి ఉండబట్టి సాయం చేస్తారు. అట్లాంటి సహాయకులు లేని బాధితులైన స్త్రీలు

# వొంగిన ఆకాశం

**శిఖామణి**

ఎక్కడ ఏ వనంలో
ఏ కోయిల ఎలుగెత్తి కూసిందో
ఇక్కడ నా కుటీరంలో
ద్వారాలు కిటికీలు
చిగురిస్తున్నాయి
ఎక్కడ ఏ అరణ్యంలో
ఏ వెదురు పొద
గాలికి తలూచిందో
ఇక్కడ ఏమీ రాయకుండానే
నా కాగితాలు
పులకించి పాడుతున్నాయి
ఏ ప్రత్తి తోటలో ఏ పువ్వు
విచ్చుకుని నిండార నవ్వు కుందో
నా వొంటి మీది చొక్కా
గిలిగింతలు పెడుతుంది.
ఏ సముద్రంలో ఏ కెరటాన్ని
ఏ సూర్య కిరణం ముద్దిడిందో
ఇంట్లో మట్టి కుండలోని
ఉప్పు ముసి ముసిగా నవ్వు కుంటోంది.
ఎండిన ఈ సెలయేరును
ఏ మబ్బు తునక పలకరించిందో
యౌవన భారంతో
వొడ్డును వొరుసుకుంటూ
పరుగులు తీస్తుంది.
ఏ పడవ
ఈ ప్రవాహాల కాగితాల మీద
ఏ తీరం కోసం
కెరటాల ప్రేమ లేఖలు రాసిందో
ప్రతీ తీరమూ
నావే నంటుంది
కాలికి గొప్పు తగిలి
తల్లిలేని ఏ పసిపిల్లాడు
అప్రయత్నంగా
"అమ్మా" అని అన్నాడో
శ్మశానంలో
ఓ తల్లి సమాధిమీద
తులసి మొక్క
చిగురు తొడిగింది
ఒక్క వాన చినుకు కోసం
ఈ విత్తనం
ఎంత కఠోర తపస్సు చేసిందో
ఆనందంలో
తనను తాను పగుల గొట్టుకుని
పైకి వచ్చి భూమి నంతా,
కలయ జూస్తుంది.
ఏ దివ్య స్వప్న సుందరి
ముని పంటితో
పెదవి నొక్కి పట్టి
ఓర చూపుతో
దొరగా నవ్విందో
ఫలించిన వృక్షంలా
ఆకాశం ఇంత క్రిందకి వొంగింది
చంద్ర దీపం చుట్టూ
తిరుగుతున్న నక్షత్రపు పురుగుల్లా
మనోజలధి లోని
ఉత్తుంగ తరంగాల్లాంటి
ఆలోచనలు
వేణువును
తయారు చేసుకోడానికి
వెదురు కోసం కృష్ణుడు
పొద ముందు నిలబడితే
పొద పొదంతా
ఒక్క వెదురుగా అయిపోయినట్టు
నీ తలపు వచ్చే నరికి
ఛిన్నంగా వున్న లోకం
ఏకత్వం నంతరించు కుంటోంది.

---

ఏం చెయ్యాలి ? ఒంటరిగా పోరాడాలా ? పోరాడి బయట కొస్తాననుకుందాం వచ్చి ఏం చెయ్యాలి ? అంటే బ్రతుకు తెరువు కోసం ఏం చెయ్యాలి ? ప్రస్తుత సమాజంలో ఎవరి నాశ్రయించాలి ? వెంకట్రావు లాంటి ఇంకో సుబ్బారావునా ? ఈ పుస్తకంలో ఇట్లాంటి ప్రశ్నలకు సమాధానాలు దొరకవు. అన్ని ప్రశ్నలకు ఒకే పుస్తకంలో సమాధానం దొరకాలనిలేదు. ఈ ప్రశ్నలకు సమాధానాలు మాత్రం కావాలి. రంగనాయకమ్మగారి లాంటి వారి మీద ఈ బాధ్యత ఉందని కొందరమైనా అనుకుంటాం.

సంఘటిత ప్రతిఘటన, ఉద్యమం స్త్రీలకు అవసరం అన్న సంగతి రంగనాయకమ్మగారు ఎక్కడా గుర్తించినట్టు కనపడదు.

కమ్యూనిస్టు సమాజంలో ఏ సమస్యలు ఎట్లా పరిష్కృతమవుతాయో ఇప్పుడప్పుడే ఊహించలేం. ప్రపంచంలో ఏ దేశంలోనూ ఈ సమాజం లేదు, ఆ మాట కొస్తే రంగనాయకమ్మగారి ప్రకారం ప్రస్తుతం ప్రపంచంలో ఏ దేశం లోనూ నిజమైన కమ్యూనిస్టు పార్టీ అధికారంలో లేదు. ఉన్నవి కొన్ని రివిజనిస్టు ప్రభుత్వాలే ఈ లెక్కన సరైన దారిలో కమ్యూనిస్టు సమాజం ఏర్పడే దెన్నటికో ! అంచనా వెయ్యటం కష్టం. అందాకా స్త్రీలు తమ హక్కుల కోసం ఏ రకంగా పోరాడాలి ? ఇది రంగనాయకమ్మ గారే కాక స్త్రీ విముక్తిని కోరే స్త్రీ పురుషులంతా ఆలోచించాల్సిన సమస్య.

రంగనాయకమ్మగారి నవలల ప్రభావం దేశంలో ఎంతో కొంత పరిమితిలో ఉందనే అనుకుంటున్నాను. ఇటీవల కాలంలో పెళ్ళి అయిన స్త్రీలు భర్తలు చేసే అవమానాలను సహించలేక పోవటం నేను ఎరుగుదును. అవసర మయితే వివాహబంధాల్ని కూడా తెంచుకోటానికి సందేహించటం లేదు. వివాహ బంధానికి ఒకప్పుడున్న పవిత్రత ఇప్పుడు లేదు. పాత వాళ్ళు కూడా కొందరు చైతన్య వంతులవుతున్నారు. హేతువాదులైన మగవాళ్ళు తమ ప్రవర్తనను పునః పరిశీలించుకుంటున్నారు. ఇది తప్పకుండా అభివృద్ధి దశగా జరిగే పరిణామమే.

ఈ జరుగుతున్న పరిణామంలో రంగనాయకమ్మ గారి రచనలు తమ వంతు పాత్ర నిర్వహిస్తున్నాయని పరిశీలకులు గుర్తిస్తూనే ఉన్నారు.

**[1983 మార్చి 6న స్త్రీ శక్తి సంఘటన, హైదరాబాదు శాఖ వారు ఏర్పాటుచేసిన సెమినారులో చదివిన వ్యాసం – కొన్ని స్వల్పమైన మార్పులతో.**

**ఇంతకన్నా సమగ్రం చేసే ఉద్దేశంతో ఈ వ్యాసం ఇంతవరకూ ప్రచురించలేదు.**

**సమగ్ర వ్యాసానికి ప్రేరణగా ఇది ఉపయోగిస్తుందనే ఆశతో ఇప్పుడు ప్రచురితమవుతున్నది [చేరా]** ◇


అవినీతి ఎక్కడుంది?
గుమస్తాలు
అధికారులు
?
రాజకీయాలు
లోనికి రాకూడదు

# ప్రాణం ఖరీదు

## బెహరా వెంకటసుబ్బారావు

రాత్రి తొమ్మిదిన్నరైంది తాలూకా కేంద్రమైన ధర్మవరంలో బయలుదేరింది విజయనగరం పోయే ఆఖరి బస్సు ఆ గ్రామం వదలి వేగాన్ని పుంజుకొంది ఆకాశము మేఘావృతమై వుంది చల్లని గాలి వీస్తోంది బస్సులో ప్రయాణీకుల సంఖ్య చాలా తక్కువగా వుంది సీటుకి ఒకరిద్దరు చొప్పున వున్నారు. డ్రైవర్ వెనుక నున్న సీటులో ఒకే ఒక వ్యక్తి కూర్చున్నాడు. ఫుల్ సూట్‌లో వున్నాడు బ్రీఫ్‌కేస్‌ని పక్కనే పెట్టుకొని కిటికీ లోంచి బయటకు చూస్తున్నాడు ఆ చీకటిలో. కొందరు పాసింజర్లు కునుకుపాట్లు పడ్తున్నారు కండక్టరు తన నెత్తిమీద వున్న లైటార్పి సీటుకి జారబడి కూర్చున్నాడు నిశ్చింతంగా.

సూటులో వున్న వ్యక్తికి మాత్రం మనసు కుదటలేదు ! అతని వయసు నలభై దగ్గర వుంటుంది అతని మస్తిష్కంలో ఎన్నో ఆలోచనలు !

లేక లేక పుట్టిన మేనల్లుని బారసాల వేడుక చూడ్డానికి పది రోజుల క్రితం హైదరాబాద్ వెళ్ళింది అతని అర్ధాంగి శైలజ ఆమె రాక కోసం అతను అనుక్షణం నిరీక్షిస్తూండగా, ఆ రోజు రాత్రి అతని బావమరది హైదరాబాద్ నుంచి ఫోన్‌లో మాట్లాడాడు తనూ, తన భార్యా, అక్క శైలజా మాటనీ షో చూసి ఆటోలో తిరిగి వస్తున్నారుట ఆర్టీసీ క్రాస్ రోడ్‌లో ఓ లారీ వచ్చి ఆటోని గుద్ది ఏక్సిడెంటు చేసిందిట. తమకు పెద్ద దెబ్బలు తగల్లేదుగానీ అక్కకి తల మీద పెద్ద గాయం అయిందనీ స్పృహలేని స్థితిలో దగ్గరలోనే వున్న ప్రయివేటు నర్సింగ్ హోంలో జాయిన్ చేశామనీ, బాగా రక్తం పోయిందనీ, పరిస్థితి బాగులేదనీ అర్జంటుగా రమ్మని చెప్పాడు

ఆ వార్త విన్నాక కాళ్ళూ చేతులూ ఆడలేదతనికి చివాల్న లేచి బస్ స్టాండ్ చేరుకున్నాడు అదృష్టవశాత్తూ ఆఖరి బస్సు అందింది. విజయనగరం వెళ్ళి రాత్రి పన్నెండున్నరకి బయలుదేరే కోణార్క్ ఎక్స్‌ప్రెస్ అందుకొని హైదరాబాద్ చేరుకోవాలి.

బస్ స్పీడ్‌గా పోతున్నా నత్తనడకలా తోస్తోం దతనికి

పదిమైళ్ళు పరుగెత్తి సడన్‌గా ఆగింది డ్రైవర్ సీటులోంచి లేచాడు ఇంజన్ మూత తీశాడు ఏదో చేశాడు స్టార్ట్ చేయాలని ప్రయత్నించాడు స్టార్ట్ కాలేదు. ఇంజన్‌తో రమారమి గంటసేపు హోరా హోరి పోరాడి ఓటమిని అంగీకరించాడు డ్రైవర్. ఆ సూటు వాలా నిముష నిమిషానికి చేతి వాచీ చూసుకొంటున్నాడు

"ఇంజన్ స్టార్ట్ కాదా ?" ఆత్రుతగా అడిగాడు డ్రైవర్ని.

"లేద్సార్ ! విజయనగరం నుంచి మెకానిక్‌ని తెప్పించాలి ! ఇంజన్ పూర్తిగా విప్పాలి !"

తన అశక్తత్వాన్ని, అసహాయతనీ వ్యక్తం చేశాడు డ్రైవర్ చివాల్న లేచి నిలబడ్డాడా వ్యక్తి.



కండక్టరు బండిలోని పాసింజర్ల నుద్దేశించి అన్నాడు.

"ఉదయంగానీ బండి బయలుదేరదు ! తలుపులూ, కిటికీలూ మూసేసి జాగ్రత్తగా పడుకోండి !"

మరోసారి టైము చూసుకొన్నాడా వ్యక్తి, పదిన్నర అయింది.

"ఈ రాత్రి విజయనగరం పోయి కోణార్క్‌లో హైద్రాబాద్ వెళ్ళాలి ! ఎలా ?" కండక్టర్ని అడిగాడతను పిలవిల్లాడ్తూ చిన్న పిల్లాడిలా

"క్షమించండ్సార్ ! చూశారుకదా ! డ్రైవరు ఎంతసేపు శ్రమించాడో ! అతని వల్ల కాలేదు !" అన్నాడు కండక్టరు

నిరాశా నిశ్స్పృహల్తో తన వైపే చూస్తూన్న ఆ వ్యక్తిపట్ల జాలికలిగి ఓ సూచన చేశాడు కండక్టరు.

"ముందు ఓ ఫర్లాంగు దూరంలో ఓ గ్రామం వుంది, దీన దయాళు పాలెం ! అక్కడ రోడ్డు మీద రావులు రిక్షా వుంటుంది విజయనగరం పదిమైళ్లే కదా ! మరో అయిదో పదో ఎక్కువిస్తానంటే వస్తాడు ! అర్జంటు అంటున్నారు కదా అని చెబుతున్నా ! ప్రయత్నం చెయ్యండి !" ఉపాయం చెప్పాడు.

ఒక్క నిముషం కూడా ఆలస్యం చేయలేదా వ్యక్తి. బస్ దిగి ముందుకు నడక సాగించాడు ఆ చీకటిలో. వాతావరణం అనుకూలంగా లేదు. ఏ క్షణాన్నైనా వానపడేలా కన్పిస్తోంది అయిదు నిమిషాలు నడిచాక చిన్న గ్రామం కన్పించింది రోడ్డునానుకొని నాలుగైదు పాకలున్నాయ్ లోపల మిణుకు మిణుకు మంటూ దీపాలు వెలుగుతున్నాయ్. దగ్గరగా వెళ్ళి ఆ పాకల్ని పరీక్షగా చూశాడా వ్యక్తి

రెండు పాకలు వరసగా వున్నాయ్ తర్వాత చిన్న కిళ్ళీబడ్డీ బడ్డీకి పాకకి మధ్యలో ఓ రిక్షా కన్పించింది. ఒక అసామీ రిక్షాలో కూర్చొని చుట్ట కాలుస్తున్నాడు రిక్షాని చూశాక అతని ప్రాణం లేచొచ్చింది.

"అర్జంటుగా విజయనగరము వెళ్ళాలి !" అన్నాడు దగ్గరగా వెళ్ళి.

నోటిలో చుట్టని బయటకు తీసి రిక్షా దిగకుండానే న్రమతిగా జవాబిచ్చాడు రిక్షా వాలా, రాములు

"రాలేను బాబూ ! ఒంట్లో సుఖంగా లేదు !"

"నువ్వడిగినంతిస్తా ! అర్జంటుగా వెళ్ళాలి !" అన్నాడు.

రిక్షా డ్రైవరాశ పడలేదు.

"చమించండి బాబూ ! ఆరోగ్యం బావులేదు !" అంత దూరం బండి తొక్కలేను !"

వాళ్ళ మాటలు విని పక్కనే పాకలో నిద్రపోతున్న సింహాచలం లేచాడు. అతనితో బాటే లేచింది ఆ టీ కొట్టు యజమానురాలూ మరియూ అతని అర్ధాంగీ అయిన పైడితల్లి రిక్షా దగ్గరి కెళ్లారిద్దరూ.

"ఎక్కడి కెళ్లాలి బాబూ ?" అడిగాడు సింహాచలం.

"అర్జంటుగా విజయనగరం కెళ్ళి కోణార్క్ అందుకొని హైద్రాబాద్ వెళ్ళాలి ! అతను అడిగినంత డబ్బిస్తా !" అన్నాడా వ్యక్తి.

"పెద్దవసరవే పడివుంటాది ! అడిగినంతిస్తానంటున్నాడా బాబు ! నెమ్మదిగా ఎళ్ళి రాకూడదమా !" సిఫారుసు చేశాడు, సింహాచలం.

ఆ వ్యక్తిలో ఆశ చివురించింది రావులు మాట్లాడ్లేదు. చిన్నగా దగ్గాడు. వెనుకనే నిలబడి వున్న పైడితల్లి భర్తని మందలించింది.

"ఆసుపత్రిల్లో ఆరు వారాలుండి నాలుగు రోజుల క్రితమే గదా వచ్చాడు ! పెళ్లానికి పురుడు రాక అడు మతోయి కూకున్నాడు ! ఇపుడాడేటి యిజానగరం ఎళ్ళగలడు ! నీ కేం మతిలేదేటి !"

వాళ్ళని బ్రతిమాలడానికి సమయంగానీ, బేరం చేయడానికి వ్యవధి గానీ లేదా వ్యక్తికి. మరో రెండు గంటల్లోగా స్టేషన్ చేరుకోకపోతే కోణార్క్ అందదు ! అయిదు నిమిషాలు ఆలస్యం అయితే ఒక రోజు అతను నష్టపోతాడు. ఎక్కువ డబ్బు గుంజడానికే వారలా నాటకం ఆడుతున్నారని గ్రహించాడు.

"పాతిక రూపాయిలిస్తా !" అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. ఆ చీకటిలో ఒకరి మొహం లొకరికి కనబడ్డం లేదు. ఆ దూరానికి అంత డబ్బు ఎక్కువే ! వెళ్లే శక్తి లేక మౌనం వహించాడు రావులు.

"ఏభై యిస్తా ! ఊ ! పద ! నా అవసరం అలాంటిది !" తొందర చేశాడా వ్యక్తి

"అడిక్కైతే రావాలనే వుండగానీ వంట్లో సుఖంగాలేదు బాబూ ! అంత దూరం తొక్కలేడు !" ఈడిస్తూ అంది పైడితల్లి

"వందరూపాయిలిస్తా ! రేపు హైదరాబాద్‌లో వుండాలి. చాలా అవసరం ఇంకా ఆలోచించకు ! ప్లీజ్ !" బ్రతిమాలడం ప్రారంభించాడా వ్యక్తి.

"ఏరా రావులూ ! ఎళ్ళగలవా ? శానా అరిజంటులా వుంది ! లేపాతే అంత డబ్బిస్తానంటారా !" మెత్తబడింది పైడితల్లి తర్వాత సింహాచలం అందు కొన్నాడు.

"అవున్రా రావులూ ! కాస్తంత కష్టబడితే వందరూపాయిలొస్తాయ్ ! ఫలితం దక్కుతుంది ! ముచ్చెల్ని రేపు ఆసుపత్రిక్కి తీసుకెళ్లొచ్చు ! నెమ్మదిగా లాక్కెళ్ళి తెల్లారే సరికి తిరిగి రా ! ఆ బాబు అవుసరం కూడా తీరుద్ది !"

బండి దిగాడు రావులు వాడిక్కావల్సింది డబ్బు ! ఆరోగ్యం కాదు ! ఆ డబ్బుతో ముత్యాల్ని బతికించుకోవాలి !

"అడిక్కి సెత్తిలేపోయినా తవరి కోసం వత్తున్నాడు ! ఎంతిస్తావన్నారు! బాబూ?" కంగించింది. పైడితల్లి.

"వందిస్తానన్నా అన్నాడా వ్యక్తి తొణక్కుండా.

"నిజవేనా బాబూ !" నమ్మశక్యంగాక అనుమానంగా అడిగింది పైడితల్లి.

"ఏం ? అనుమానమా ?" చీకాకు పడ్డాడా వ్యక్తి.

"తవరు పెద్దింటోరు ! డబ్బు మడుసులు !" అని తడబడి మాట సర్దుకొంది పైడితల్లి.

"అదే ! డబ్బున్న మా రాజులు ! తీరా అక్కడి కెళ్ళాక అడి సేతిలో పాతికో పరకో పెట్టి 'పోరా పో !' అంటే ఆడేటి సెయ్యగల్డు సెప్పండి ! అక్కడందరూ తవరి మాటే పలుకుతారు !" మనసులోని మాటల్ని బయట పెట్టింది పైడితల్లి

"నువ్వన్నట్లు డబ్బు మనిషినే అయినా మాట తప్పేది లేదు ! మాటకున్న విలువ డబ్బుకి లేదు ! నిస్సహాయ స్థితిలో వున్న వానికి చేసిన సహాయానికి డబ్బుతో విలువ కట్టలేం ! ఇప్పుడు నా అవసరం అలాంటిది ! మీ సహాయం కావాలి ! ఆ సహాయనికి ప్రతిఫలంగా వందరూపాయలిస్తానన్నా ! అతను పడిన కష్టానికి కాదు !" అతని మాటలకి అంతా ఆశ్చర్యపోయారు. పశ్చాత్తాపం చెందింది పైడి తల్లి

"మరోలా అనుకోకండి బాబూ ! పాసింజర్లతో అనేక రకాల తగూలొత్తూ వుంటాయ్ ! డబ్బు సమయం గదా అని మరోసారడిగా ! అయినా తవర్ని సూత్తేనే తెలుస్తోంది మాట తప్పే మడిసి కాదని !" సన్నాయి నొక్కులు నొక్కింది

"ఎక్కు రావులూ ! తొందరగా తీసుకెళ్ళి ఆ బాబుకి కోణార్క్ అందించేయ్ !" తొందర చేశాడు సింహాచలం.

రిక్షా బయలుదేరి చీకటిలో కల్సిపోయింది రిక్షా చప్పుడు తప్పించి మరో శబ్దం లేదు ! రిక్షాలోని పాసింజరూ డ్రైవరూ ఎవరి ఆలోచనల్లో వారున్నారు.

"శైలజను ఏ పరిస్థితిలో చూడాల్సి వస్తుందో ! వెళ్ళిన వెంటనే ఆమెను ఉస్మానియా హాస్పటల్‌కి తరలించాలి ! అక్కడ తన గురువుగారు ఉన్నారు ! ఆమెకు ఎలాంటి దెబ్బలు తగిలాయో ఎక్కడెక్కడ తగిలాయో వివరంగా తెల్సుకోలేక పోయాడు ! అంతా ఆత్రుత ! కంగారు ! భయం ! బావ మరిది వెంటనే బయలుదేరి రమ్మన్నాడు ! తాను వస్తున్నానన్నాడు ! వివరంగా తెల్సు కోనందుకు విచారించాడు ! ఆమెకు బ్లీడింగ్ కంట్రోలైందో లేదో ! పరిస్థితి ఎలా వుందో ! శైలజ తనకు దక్కుతుందా ? మనసు పరి పరి విధాల పోతోంది. కీడుని శంకిస్తోంది."

దుఃఖాక్రాంతుడయ్యాడా వ్యక్తి.

ఇక రావులు పరిస్థితి !

భార్య ముత్యాలు తప్పించి రావులికి నా అన్న వారెవరూ లేరు. వయసు ముప్పై వుంటుంది. చదువుకోలేదు. ధర్మవరంలో ఓ షావుకారి దగ్గర రిక్షా అద్దికి తీసుకొని దీనదయాళుపాలెంకి ధర్మవరంకి మధ్య తిరుగుతూ

వుంటాడు. అప్పుడప్పుడు విజయనగరం కూడా వెళ్తూవుంటాడు. రావులికి సంతానం లేదు భార్యకి మూడు సార్లు గర్భంపోయింది. నాలుగోసారి గర్భవతి అయింది. నెల తప్పిన దగ్గరనుంచీ రెండు వారాల కోసారి ముత్యాల్ని ధర్మవరం తీసుకెళ్ళి డాక్టరు ధర్మరాజు గారికి చూపిస్తూ వస్తున్నాడు. ఈ సారి గర్భ స్రావం జరగకుండా చూసే పూచీ నాదని మొదటనుంచీ హామీయిస్తూ ఆ దంపతులకి ధైర్యం చెప్తూనే వున్నారు డాక్టరుగారు ఆయన చేతి చలువ వల్లనే యే యిబ్బందీ లేకుండా ముత్యాలుకి తొమ్మిది నెలలూ నిండాయ్.

డా॥ ధర్మరాజుగారంటే అక్షరాలా ధర్మరాజుగారే. ఆ గ్రామంలో ప్రభుత్వ హాస్పిటలున్నా ఎక్కువగా ముఖ్యంగా బీదా బిక్కీ ప్రయివేటు హాస్పిటలు అయిన డాక్టరు ధర్మరాజుగారి దగ్గరకే పోతారు. ఆయనంటే ఆ తాలూకాలోని ప్రజలందరికీ పెద్ద గురి ! ఆయన హస్తవాసి మంచిదని అందరికీ నమ్మకం ధర్మరాజుగారు పేషంట్లు ఎంతిస్తే అంత తీసుకొంటారు ఇచ్చిన సొమ్ముని లెక్కపెట్టకుండానే జేబులో పెట్టుకొంటారు ఎవరైనా యివ్వలేకపోతే ఏమీ అడగరు.' ఇతర డాక్టర్లలా కేసుకి యింత అని ఖరాఖండి చేయరు. బీద ప్రజల దృష్టిలో ఆయన దేముడు !

ఆరు వారాల క్రింతం పచ్చకామెర్ల రోగం వచ్చింది రావులికి. మొదట్లో తెలుసుకోలేక పోయాడు. తెల్సుకొన్నాక కొన్నాళ్ళు నిర్లక్ష్యం చేశాడు. ఆ పసర ఈ పసర వేసుకొన్నాడు వ్యాధి ముదిరింది. మంచం పట్టాడు. టీ కొట్టు యజమానురాలు పైడితల్లి పట్టు పట్టి బలవంతాన ధర్మరాజుగారి హాస్పిటల్లో చేర్పించింది వ్యాధి నయం అయింది. నాలుగు రోజుల క్రితమే యింటికొచ్చాడు. నెలలు నిండిన ముత్యాలుకి రెండు రోజుల క్రితం పురిటి నెప్పులు ఆరంభించాయ్. ఆ గ్రామంలో అందరికీ పురుళ్ళు పోసే నాటు మంత్రసాని రాములమ్మని పిలిచాడు రావులు ఒకరోజల్లా రాములమ్మ పాటుపడింది ముత్యాలుకి పురుడు రాలేదు. అధైర్య పడింది రాములమ్మ కూడా.

"ముప్పై యేళ్ళ నుంచీ పురుళ్ళు పోస్తున్నా ఇలాంటి కేసు తగల్లేదు ! ఆసుపత్రికి తీసుకెళ్తే మంచిది ! ఆపరేషన్ చేయాల్సి వస్తుందేమో !" అంది పక్క గుడిసెలో వుంటున్న విమలమ్మని తోడు తీసుకొని భార్యని రిక్షా మీద ధర్మరాజుగారి హాస్పిటల్‌కు తీసుకెళ్ళాడు రావులు. అతనిదురదృష్టం! ధర్మరాజుగారు వూళ్లో లేరు ! హైదరాబాద్ వెళ్ళారనీ వారం రోజుల వరకూ తిరిగి రారని తెల్సింది. రావులికి నవనాడులూ కృంగిపోయాయ్.

"గవర్నమెంటాసుపత్రికి తీసుకెళ్దాం !" తొందర చేసింది విమలమ్మ. రిక్షా కదిలింది

ప్రభుత్వ ధర్మాసుపత్రి డాక్టరుగారు ముత్యాలుని తణికీ చేశారు. ఆపరేషన్ చేయాలన్నారు. కాంపౌండరు విమలమ్మని పక్కకి పిల్చి మాట్లాడాడు.

విమలమ్మ చెప్పిన మాటలు విన్న రాములు అయోమయ స్థితిలో పడ్డాడు. నోట మాటరాలేదు. ఆలోచనలో పడ్డాడు.

"మరేవీ ! ఆలోసించక రావులూ ! ముచ్చేలు బతకడం మనకి ముఖ్యం ! రెండొందలు కోసం ఆలోసించక !"

"రెణ్ణెళ్ళ నుంచీ బండేయ లేదు ! నా జబ్బు కోసమే దొరికిన చోటల్లా అప్పులు సేశా !" నీరుగారి పోయాడు రావులు.

"దాని శతమానాలమ్మేసేనా దాన్ని రచ్చించు కోవాల !" వుపాయం చెప్పింది విమలమ్మ

"ముచ్చేలు శతమానాలు ఎప్పుడో అమ్మేసా ! దాని మెడలో వున్నవి. సంతలో కొన్న శతమానాలు ! దాని పేణం రిక్షించుకోడానికి నా దగ్గర రెండొందలు లేవు ! నా అదృష్టం ఎలావుంటే అలా జరుగుద్ది ! మన రావులమ్మే నాకు దిక్కు ! దాని చేతుల్లోనే ముచ్చేల్ని పెడతాను ! భగవంతుని దయ !" తన నిర్ణయాన్ని తెలియజేశాడు, రావులు.

"రావులమ్మా ! ముచ్చేలు నా ప్రేణం ! దాన్ని నీ చేతుల్లో పెడ్తున్నా రెండొందలు పెట్టి దాని ప్రేణం కొనుక్కోలేను !" రావులమ్మ కాళ్ళ మీద పడి వల వల యేడ్చాడు రావులు.

ముత్యాలు బాధ పడ్తూంటే వినలేక రోడ్డు మీద కొచ్చాడు రావులు. రిక్షాలో కూర్చుని జాగరం చేస్తున్నాడు. ఏ క్షణం ఎలాంటి వార్త వినాల్సి వస్తుందో నన్న భయం ! ముచ్చేలుకి అపరేషన్ చేయించాలంటే రెండొందలు కావాలి ! ఎలా ఎలా సంపాదించడం ? ఇదే ఆలోచనతో రిక్షాలో కూర్చొని జాగరం చేస్తున్నాడు. అనుకోకుండా పెద్ద బేరం తగిలింది. శక్తి లేకపోయినా తొక్కుకున్నాడు.

రావులికి మరో ఆలోచన వచ్చింది ఆ ఆలోచన అతన్ని భయ భ్రాంతున్ని చేసింది. నరాల పట్టు సడలింది. రిక్షా వేగం తగ్గింది.

కొంతమంది ఏ దొంగతనమో, హత్యో చేసి యిలా రిక్షా డ్రైవర్లకి, టాక్సీ డ్రైవర్లకి బోలెడు డబ్బు ఆశపెట్టి తప్పించుకు పారిపోతారు ! ఒక్కొక్కప్పుడు సాక్ష్యం దొరక్కుండా వుండేందుకు డ్రైవర్ని కూడా ఏ కత్తితోనో పొడిచి పారిపోతారు ఈ పాసింజరు అలాంటివాడు కాదు కదా ! అలా అయితే తాను ప్రాణాన్నైనా పోగొట్టుకోవాల్సి వస్తుంది. లేదా ! పోలీస్టేషన్లో పడి వుండాల్సి వస్తుంది అలా జరిగితే తన గతేంగాను ! ముచ్చేల్ని ఎవరు చూస్తారు! అది చావు బతుకుల మధ్య వుంది. భయంతో వణికిపోతున్న రావులుకి కాళ్ళాడలేదు. నెమ్మదిగా పోతోంది రిక్షా.

ఇంతలో టప టప చినుకుల్తో ప్రారంభించి వాన పెద్దదైంది. రిక్షా ఆపాడు రావులు. పాసింజరు చేతి వాచీ చూసుకొన్నాడు "పావు తక్కువ పన్నెండు ! నలభై అయిదు నిమిషాలే టైముంది. ఇంక రెండు మైళ్ళు మాత్రమే పోవాలి ! వానకి జడిసి ఆగిపోతే ఎలా?" ఆందోళన చెందాడు పాసింజరు. సీటు కింద వున్న పెద్ద పోలితిన్ పేపర్ని బయటకు తీసి కోటులా తగిలించుకొన్నాడు రావులు.

తిరిగి రిక్షా కదిలింది వాన పడుతూనే వుంది. రిక్షా వేగంగా పోవడం లేదు.

"వేగంగా పోనీయ్ ! కోణార్క్ అందకపోతే మనం పడ్డ శ్రమంతా వృధా అవుతుంది ! ఉదయం టిఫిన్ చేయడానికి మరో అయిదు రూపాయ లిస్తా !" తొందర చేశాడా వ్యక్తి.

'అర్జంటుగా కోణార్కెక్కి ఏ హైదరాబాదో, బొంబాయో పారి పోదావనుకొంటున్నాడు ! ఇతగాడే పనిసేశాడో ! ఈ కేసులో అనవసరంగా సిక్కుకొన్నా !'

రావులి అనుమానం బలపడింది ! భయం చిక్కబడింది.

"అంతరిజెంటుగా ఎళ్లాలేటి బాబూ !" అడిగాడు ధైర్యంచేసి అవసరం ఏవిటో వివరంగా చెబుతాడని ఆశించాడు.

తాను తొందరపడ్డానికి గల కారణం, తాను అర్జంటుగా ఎందుకు వెళ్ళాల్సి వస్తోందీ అంతా వివరంగా చెబితే తొందరగా పోనిస్తాడనుకొన్నాడా పాసింజరు.

ఆ రోజు సాయంత్రం హైదరాబాద్‌లో నున్న తన భార్యకు ఏక్సిడెంట్ అయిందనీ, హాస్పిటల్లో చావు బతుకుల మధ్య వుందనీ, అందుకే తాన ర్జంటుగా వెళ్తున్నాననీ చెప్పాడా వ్యక్తి

అతని పరిస్థితికి జాలి పడ్డాడు రావులు

"తొందరగా ఎల్లి పెద్ద డాక్టరు చేత వైద్యం చేయించండి బాబూ ! తప్పక కోణార్క్ అందించే పూచీ నాది !" అంటూ రిక్షా స్పీడు హెచ్చించాడు రావులు. వారి అదృష్టం కొద్దీ వాన జోరు తగ్గి తగ్గి పూర్తిగా ఆగింది

రిక్షా స్టేషన్ చేరే సరికి పన్నెండు దాటింది. గేటులో రిక్షాని ఆపాడు రావులు. ఆ బాబు రిక్షా దిగాడు. లైట్ల వెలుగులో ఆ వ్యక్తి మొహం చూశాడు రావులు. ఆయన డాక్టరు బాబు ! గవర్నమెంటు ధర్మాసుపత్రి డాక్టరు ! ఉదయం తన ముత్యాల్ని చూసిన డాక్టరు ! రావులులో అంతవరకూ వున్న జాలి, సానుభూతి మాయమయ్యాయ్ ! తన భార్య ప్రాణాన్ని కాపాడ్డానికి రెండు వందలు అడిగిన అతన్ని కసిగా చూశాడు! అసహ్యం, ద్వేషం, పగ అతని మొహంలో చోటు చేసుకొన్నాయ్. తన పెళ్లాం ప్రాణం ఖరీదు రెండు వందలు ! అతని భార్య ప్రాణం విలువ వేలు ! లక్షలూ ! ఎంతైనా ఖర్చు చేయడానికి సిద్ధంగా వున్నాడు.

అతనందిస్తూన్న వంద రూపాయల నోటుని అందుకోలేదు రావులు ! ఆ నోటు వైపు చూస్తూ వుండిపోయాడు. మరు క్షణంలో దుఃఖం ముంచుకొచ్చింది.

"నా ముచ్చేలు కింకా పురుడు రాలేదు బాబూ ! సావు బతుకుల మద్దె నుంది !" అంటూ భోరున ఏడ్చాడు. కాళ్ళ మీద పడ్డాడు. రావుల్ని పరీక్షగా చూశారు డాక్టరుగారు. జ్ఞాపకం వచ్చింది. ఉదయం భార్యని డెలివరీ కోసం

# నాకు అనిపిస్తుంది

రోజులో సగం సమయం బస్తాపులో ముగిసినప్పుడు
పలకాబలపంకన్న జాగ్రత్తగా విద్యార్థులు కంచాలు
తెచ్చినప్పుడు
కథలు చెప్పినప్పుడు లేని ఆనందం —
పిడికెడు మెతుకులు చూడగా వారు పొందడం
గమనించినప్పుడు
బాలుర నోళ్లు కొట్టి నడి హస్తాలు దోచి కుంటిసాకులు
చెప్పినప్పుడు
ఖాళీ ప్లేట్ల ముందు పిల్లల నైరాశ్యం అర్ధమయినప్పుడు
ఆఫీసులో ఎల్. డి. సి. ల ముందు నా ప్రవర్తనను
సమీక్షించు కొన్నప్పుడు
వారి అవినీతిని అంచనా వేయలేక పోయినప్పుడు
ఇంట్లో కోరికల లిస్టు విన్నప్పుడు
మార్కెట్టు ధరలు పాకెట్‌తో ఈక్వల్ కానప్పుడు
పత్రికల్లో కవితలు చదివినప్పుడు
పరిష్కారాన్వేషణలో తల వేడెక్కినప్పుడు
దానిని కలంతూడా వ్యక్తం చేయలేక పోయినప్పుడు
నాకు అనిపిస్తుంది
ఈ బుర్రలో ఆలోచనలే లేకుంటే !
ఈ కళ్లకు నిజానిజాలు తెలుసుకొనే శక్తి లేకుంటే !
ఎంత బాగుండేదో ! ! అని

# నేను-నీవు

నీ చూపు లటువైపు
నా చూపు లిటువైపు
యుగ యుగాల మనుగడలో
ఏకమైన దాఖలాలు లేవు చరిత్రలో
ఐక్యతా నినాదాలకు కొదువ లేదు ధరిత్రిలో
అటు చూడు వారు —
నిత్య ప్రజా సేవా తత్పరులు
దేశనాయక వేషభూషణులు
శాంతి మారణాయుధా ధరులు
సమతామత వాక్పారాయణులు
బొమ్మా - బొరుసుల్లా మనలను
సమాజ నాణ్యంలో చిత్రించి
చలామణి చేసేసూ
బ్రతుకుతున్నారు — బ్రతికి పోతున్నారు
ఉత్తర దక్షిణ ధృవాల్లా మనలను
భూగోళంలో విడగొట్టి
పరిశోధనా గ్రంథాలు వ్రాసేస్తూ
శాస్త్రజ్ఞులౌతున్నారు — బిరుదులందు తున్నారు
సమాంతర రేఖల్లా మనలను
పదిలంగా ఉంచి
ఎన్నికల వ్యాపారాలు చేస్తూ
పురోగమన గీతాలు పాడు తున్నారు — నిద్ర
పుచ్చుతున్నారు.
కలిమిలేములైన మనలను
పదవీ సోపానాలుగా పేర్చి
ఎక్కిపోతున్నారు
అధికార పదాంధులౌతున్నారు
వాక్ప్రియులైన మనలకు
వాగ్దానాల మంత్రాలు వినిపిస్తూ
సౌందర్యారాధకులైన మనలకు
ప్రణాళికల వర్ణచిత్రాలు చూపిస్తూ
హిప్నాటైజ్ చేస్తున్నారు
ఇదే బాగుందను కొంటే
"ఎక్కడున్నావ్ గొంగళీ" అన్నట్టు
నీ వక్కడే నేనిక్కడే ఉందాం
వద్దను కుంటే
చేయి చేయి కలుపుదాం
నడుంకట్టి కదుల్దాం !

శ్రీ సడ్లపల్లె చిదంబరరెడ్డి

హాస్పిటల్కి రిక్షాలో తీసుకొచ్చాడు. అలవాటు ప్రకారం కాంపౌండర్ని మాట్లాడమన్నాడు తను. ఇప్పుడిద్దరూ ఒకే స్థితిలో వున్నారు.

"హాస్పిటల్లో ఎడ్మిట్ చేయకుండా ఎందుకు తీసుకు పోయావ్ ?" ప్రశ్నించారు.

ఆయన ప్రశ్నకి అవాక్కయ్యాడు రావులు పెద్ద వారు సమయానుకూలంగా మాట్లాడరని అంతవరకూ అనుకొనే వాడు. చివాల్న లేచి ఆయన మొహంలోకి చూశాడు.

"నీ భార్యకి ప్రాణభయం లేదు ! అపరేషన్ అవసరం అవుతుందేమోనన్న అనుమానం కొద్దీ అలా అన్నాను ! కొంచెం కష్టంగా డెలివరీ అవుతుంది ! భయపడకు !"

తన్ను ఓదార్చడానికే ఆయనలా అంటున్నారని గ్రహించాడు రావులు.

"డబ్బుతీసుకో !" నూరు రూపాయల నోటు అందించబోయాడు.

రావులు చేయి చాచలేదు !

"పాతిక రూపాయలిప్పించండి చాలు !" అన్నాడు దృఢంగా.

"వంద రూపాయలు నే నివ్వనేమోనని ఆమె ఎవరో శంకించింది కూడా ! తీసుకో ! అవసరానికి పనికొస్తుంది "

"వద్దు బాబూ ! నేను పడ్డ కష్టానికి పాతిక వెళ్లిస్తే సరిపోద్ది ! పాసింజర్ల అవసరాన్ని, ఆపదని ఆసరాగా తీసుకొని ఎక్కువ డబ్బు గుంజితే యిలాంటి ఆపదలే వస్తాయ్ ! నా ముచ్చేలు ప్రాణం ఆ భగమంతుని చేతుల్లో వుంది. ఆయనే కాపాడతడు !"

రావులి మాటలు చెరణాకోల దెబ్బల్లా తగిలాయి ఆ డాక్టరు బాబుకి.

'తానెంత డాక్టరైనా భార్య ప్రాణాన్ని కాపాడలేడు ! రావులన్నట్టు అంతా భగవంతుని చేతుల్లోనే వుంది ! ప్రాణాన్ని డబ్బుతో కొనలేం ! అది అమూల్యం !' అనుకొన్నాడు

అవతల బ్రెయిన్ టైమవుతోంది. అతను కోరిన పాతిక రూపాయలు తీసి అందించాడు. డబ్బు తీసుకొని కళ్ళ కద్దుకొని డాక్టరుగారికి నమస్కరించాడు. రావులు రిక్షా లాక్కొని ఊరంగా పోయాడు

తెల తెలవారుతుండగా తిరిగి గ్రామం చేరుకొన్నాడు. టీ కొట్టు పైడి తల్లి ఎదురుగా వచ్చింది. ఆమె మొహం ఆనందంతో నిండిపోయింది

"నీ కోసమే ఎదురుసూత్తున్నా ! పనసపండు లాంటి కొడుకు పుట్టాడు ! ముచ్చేలు సుఖంగా వుంది ! రా [illegible] సందువుగాని !"

చల్లని కబురు చెబుతూ ఆహ్వానించింది పైడితల్లి □

శ్రీ ఎన్. ఎస్. సుందరేశ్వరరావు

# ఆంధ్ర దేశంలో వీరశైవం

(గ్రంథ విమర్శ)

[వీరశైవిజం ఇన్ ఆంధ్రా శ్రీమతి టి కె లలితాంబ పబ్లిషర్ శ్రీ సి ఆర్ కృష్ణమూర్తి బ్రాడీపేట గుంటూరు- 2 ]

ఆంధ్రదేశంలోని వీరశైవ మతం గూర్చి తెలుసుకోవడానికి ముందుగా ఆ మతం పుట్టిన కర్ణాటకదేశంలో విద్వాంసులు చెప్పిన వీరశైవమత లక్షణాలను గూర్చి తెలుసుకోవటం ముఖ్యావసరం

## అష్టావరణాలు-గురువు

అష్టవిధ ఆధ్యాత్మికా చరణాలకు అవరణాలని పేరు. ఇందు ప్రధానావరణ గురువు. పశువులయినా మానవులను పాశాలయిన కర్మబంధాలనుండి తొలగించి శివైక్యం బోధించేవాడే గురువు. దీక్షాగురువు శిక్షాగురువు మోక్షగురువు అని గురువులు త్రివర్గాలకు చెందినవారు, శివతత్వోపదేశం చేసి దీక్ష ఇచ్చేవాడే దీక్షాగురువు. వీరుముగ్గురు ఒకరైనా కావచ్చు. శిష్యుని దీక్షామార్గంలో శిక్షించువాడు శిక్షాగురువు శాస్త్రస్థితమైన శైవరహస్యార్థాలను బోధించి శిష్యుల సంశయాలను నివారించువాడు జ్ఞానగురువు లేదా మోక్షగురువు

## లింగం

దీక్షాకాలంలో శిష్యునికి మంత్రోపదేశంచేసి ఏలింగాన్ని శిష్యునికి ప్రసాదిస్తున్నాడో ఆలింగం ఇష్టలింగం. శివుని యందే మనస్సు లయింపజేసి ధ్యానించే లింగం ప్రాణలింగం. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలో మనస్సు అజ్ఞాన నివృత్తి పొందునో అట్టి జ్యోతిర్లింగం భావలింగం. గురుదత్తమైనది. ఇష్టలింగం జీవమే ప్రాణలింగం, ఆత్మే భావలింగం ఇష్టలింగాన్నే పూజించాలి. కరపీఠస్థ లింగార్చకులే వీరశైవులు కాదేని శైవులు. వామ హస్తంలో ఇష్టలింగాన్ని పెట్టి పూజించాలి. శివలింగాన్ని ఎక్కడైనా ధరించవచ్చు. శిరస్సు కంఠం, బాహువు, వక్షస్థలం హస్తం నాభి, హృదయం ఇష్టలింగాన్ని ఎన్నటికీ ఏ అవస్థలోనూ విడవరాదు.

## జంగమ

జంగముడనగా సంచరించే శివయోగి. స్థిరలింగం కంటె చరించే శివలింగ రూపమే జంగమావతారం. కామక్రోధాద్యరిషడ్వర్గ రహితుడు, అంతర్ బహిరింద్రియనిగ్రహుడు. ఒకడే అయిన పరశివుడు గురు, లింగ. జంగమ అనేపర్యాయ వాచకాలచే పిలవబడును. విభూతి పూసుకొని, జడలు పెంచి, రుద్రాక్షలు ధరించినంతమాత్రాన జంగముడు కానేరడు. శివజీవైక జ్ఞానయోగే జంగముడు.

## పాదోదకం

గురుపాద ప్రక్షాళనానంతరం శిరస్సున జల్లుకొనే ఉదకం అభిషేకార్పిత జలంకూడా పాదోదకమే. అది సర్వరోగ నివారణౌషధం గురువుకాని. జంగమం కాని లింగపూజావసర కాలంలో తెచ్చిన జలమని కొందరు, "పరమానంద ఏవోక్తః పాదశబ్దేన నిర్మలః, జ్ఞానం చోదక శబ్దేన తయోరైక్యంతు దీక్షయా॥" (సి॥శి 19-7) పాదశబ్దంచేత పరమానందం, ఉదక శబ్దంచేత జ్ఞానం, ఈ రెండింటి సంబంధమే పాదోదకమని విశేషార్థం

## ప్రసాదం

శివుని అర్పించని వస్తువు ఏదైనా స్వీకరించరాదు. భుజించరాదు. మనోనైర్మల్యమే ప్రసాదం.

## విభూతి

ఇది ఐశ్వర్యవాచకమైన ఆర్షశబ్దమైనా శైవపరిభాషలో భస్మమనే అర్థం. భసితం, క్షార, రక్షా అని విభూతి 5 రకాలు. అణిమాద్యష్టసిద్ధిత్వానికి శివతత్వఆత్మానికి, మనోవాక్కాయక పాపభయోత్పాత భంగానికి, ఆధ్యాత్మికాది తాపత్రయాత్మక దుఃఖవినాశానికి గ్రహాది పీడల విముక్తికి శైవులు భస్మధారణ చేస్తారు. త్రికాలాల్లో భస్మ త్రిపుండ్రధారణం విధిగా చెయ్యాలి. ఈ భస్మాన్ని తయారుచేయటానికి బోలెడంత సాహిత్యం ఉంది.

## రుద్రాక్ష

రుద్రాక్ష అంటే శివుడి కంటినుండి పుట్టిన బిందువులు (విత్తనాలు) ఎలియో కార్పస్ గెన్నిట్రస్ అనే రుద్రాక్షచెట్టు విత్తనాలు. రుద్రాక్ష ధారణ శైవులందరికి సమ్మతం. జపమాలలో వీటిని సంఖ్యా పరిమితంగా చుట్టి జపంచేస్తారు.

## మంత్ర

పంచాక్షరీ మహామంత్రం నమశ్శివాయ దీనికి ఓంకారం ముందుచేర్చితే షడక్షరి ప్రణవంతో ప్రణవ పంచాక్షరి. నమశ్శబ్దవల్ల ఉపసకమైన జీవత్వం. శివశబ్దంవల్ల నమస్కారపాత్రమైన పరబ్రహ్మత్వం 'ఆయ' శబ్దం వల్ల 'అయగతే' అను ధాత్వర్థం అనుసరించి ఐక్యార్థం సిద్ధిస్తుంది.

## ఆచారవ్యవహారాలు-దీక్ష

వీరశైవులకు వైదికాచారాలు చాలా తక్కువనే చెప్పాలి. వారి కర్మకాండలలో అగ్నికి, పురోహితుడికి ఆస్కారం లేదు. గృహ్యసూత్రాల్లో చెప్పబడిన నామకరణ, చౌల కర్మలు ఉన్నా వారికి బ్రాహ్మణ పురోహితుడువచ్చి మంత్రాలు చదవడు. జంగమ గురువుని పిలుస్తారు. భోజనం పెడతారు. కొద్దినిముషాల్లో అంతా ముగిసిపోతుంది. వీరశైవంలో దీక్షకున్న ప్రాధాన్యం దేనికి ఉండదు. దీక్షతోనే లింగధారణ జరుగుతుంది. దీక్షలేని వ్యక్తికి వీరశైవంలో తావులేదు.

దీక్ష జీవితం తొలిదశలో జరుగుతుంది. పుట్టగానే దీక్షఇవ్వడం కద్దు. అయితే ఉపనయనం లాగే గర్భాష్టకం వచ్చేసరికి మరోదీక్ష ఉంటుంది ఇది ఆరాధ్యుల ప్రభావం వల్ల వచ్చి ఉండవచ్చు. కాని వీరశైవ ప్రమాణిక గ్రంథాల్లో పుట్టగానే ఇచ్చిన దీక్షకే ప్రామాణికత ఉంది. అగ్ని స్థానంలో లింగం. కలశస్థాపన దీక్షకి, వివాహానికి తప్పదు. ముందుగా వేదికపై స్వస్తికా కారంలో ముగ్గులు పెడతారు. 4 మూలలా 4 కాంస్యపాత్రలుకాని, మట్టితోచేసిన పాత్రలుకాని ఉంచుతారు. మధ్యను మరోపాత్ర ఉంటుంది. ఈ 5కలశాలు పంచారాధ్యులకు ప్రతీకలు. సద్యాశివుని పంచముఖాలనుండి వీరుద్భవించి నట్లుచెబుతారు. మధ్యకలశం విశ్వేశ్వరారాధ్య (ఈశానముఖం) దీనికి తూర్పుగావుండే కలశం రేవణారాధ్యులు (తత్పురుష) దక్షిణ కలశం, మరుళారాధ్య (అఘోర), పశ్చిమదిశలో కలశం పండితారాధ్య (వామదేవ) ఉత్తరాన ఉన్నకలశం ఎకోరామ (సద్యోజాత), ఈ కలశాలలో చందన మిశ్రిత గంగాజలం, 5రకాల ఆభరణాలు, 5రకాల చెట్లు, బెరడులు మొలకలు 5రకాలమన్ను చేర్చి ఉంచుతారు. పారమేశ్వరాగమంలో చెప్పిన ప్రకారం 5మంత్రాలు ఒక్కొక్క కలశంలో పైనచెప్పిన మిశ్రితజలాన్ని పోస్తూ ఒక్కొక్క మంత్రాన్ని చదువుతారు. పంచారాధ్యుల గోత్రాలకు చెందినవారిని నియమిస్తారు వారు వారి కలశాల

వద్ద ఆసీనులై ఉంటారు. చేతితో తీసిన దారాన్ని కలశాలచుట్టూ. గురువు శిష్యుని చుట్టూ ఉండేటట్టు ఏర్పాటు చేస్తారు. వీరశైవులు దీనినే కలశస్థాపన అంటారు. చిన్నపిల్లలకు స్నానంతో శుద్ధి. పెద్దవారికి ఉపవాసాది విధులు ఉంటాయి. "మంచి మార్గాన్ని నడుస్తాను" అని గురువునుండి బదులు చెప్పిస్తాడు. ఇది ఆజ్ఞాదీక్ష, "సన్మార్గంతో జీవిస్తూ పూర్వాచార్యులను గౌరవిస్తూ పూర్వ సంప్రదాయాలను గౌరవిస్తూ ఉండు" అని గురువు బోధిస్తే 'అట్లాగే' అని శిష్యుడు బదులుచెబితే అది ఉపమా దీక్ష తరువాత గురువు పంచగవ్యాలను శిష్యునికి ఇస్తాడు. గురువు యోగ దృష్టితో శిష్యుని కళ్ళలోకిచూస్తూ తనహస్తాన్ని శిష్యుని మస్తకంపై ఉంచుతాడు భావ, ప్రాణ లింగావస్థలను బోధిస్తాడు. అష్టావరణాల ప్రకారం శివలింగంతో సహా విభూతి, ప్రసాద పాదోదకం రుద్రాక్షలు ఇస్తాడు. ఇక్కడ గురువే జంగమం. విభూతి నొసటపూసి శిష్యునిచే రుద్రాక్షలు ధరింపచేస్తాడు మంత్రాన్ని చెవులో చెబుతాడు. శిష్యుడు వీరశైవుడవుతాడు

## వివాహం

వరాన్వేషణం అందరిలాగే వీరశైవుల్లో కూడా ఉంటుంది. పెళ్ళి ఎక్కడయినా జరగవచ్చు మఠాల్లో జరిగే పెళ్ళిళ్ళు తక్కువ. వివాహ వేదికను అలంకరించి కలశస్థాపన చేస్తారు. దీక్షావిధానంలోలా కాకుండా కలశాలను వేదికపై నలుమూలల్లో ఉంచుతారు ఐగురు పునిస్త్రీలు వివాహ వేదికను అలంకరిస్తారు ఇంతలో ఒక్క పక్క వధూవరుల అలంకరణ జరుగుతూ ఉంటుంది వరుడి నుదుట 'బాసింగ' కడతారు వధూవరులను వివాహవేదికకు ఊరేగింపుగా గుర్రంపైనో మరేవాహనంపైనో తెస్తారు. వరపూజ జరుగుతుంది. వధువు తల్లిదండ్రులు తమ కన్యను వివాహం చేసుకోవాలని వరుడిని అడుగుతారు అతనికి బట్టలు, పాత్రలు పెడతారు. వరుడు వివాహ వేదికను వధువుతో అలంకరిస్తాడు కలశాలను తెంచి జంగమ గురువు చుట్టూ కట్టిన తెలదారాలను వధువు చేతిలో పెడతాడు ఆమె వరుడి చేతుల్లో ఆ నూలు పోగులను పెడుతుంది. జంగమ గురువు మంత్రాలు చదువుతాడు.

1 శివుని, అతని భక్తబృందం ఎదుట వధూవరుల వివాహం జరుగుతుంది. ఆ జన్మపర్యంతరం వారిద్దరు కలిసిమెలసి ఉండాలి, శివుడు వారికి సర్వశుభాలను ప్రసాదించుగాక ! అని జంగమ గురువు మంత్రాలు చదువుతూ చెబుతాడు. మంగళ సూత్రధారణ. మట్టెలధారణ అయిన తరవాత వధువు ఎడమ పక్కకు మారుతుంది వరుని విడిదికి వచ్చి పిల్లని అప్పజెబుతారు నూతనవధూవరులు విడిది నుంచి బయలుదేరి వేరే బంధువుల ఇంట్లో రాత్రులు గడుపుతారు సప్తపది లేదు సనికెలు తొక్కించడం లేదు. హోమం ఉండేగా ఇవి ఉండటానికి.

అతిబాల్య వివాహాలు లేవు. వితంతూద్వాహాలు ఉన్నాయి. వైవాహితుడైన వీరశైవుడు. పంచాచారాలు విధిగా పాటించాలి లింగాచారం, సదాచారం భక్తాచారం, శివాచారం, గణాచారం, ఇవివరసగా లింగపూజ సదాచారమైన నడవడిక శివభక్తులయెడ సానుభూతి, ప్రమధులయెడ భక్తి అనుసరించాలి. ఇవి అష్టావరణాలలాగే అతిముఖ్యమైనవి.

## సమాధి-లింగైక్యం

దహనం లేదు-ఖననం తప్ప. మృతాశౌచం లేదు.
శివునిలో లీనమైన వ్యక్తి మృతిపట్ల దుఃఖం లేదు.
అంతా ఆనందోత్సవమే ప్రాణావసానం సమయంలో

జంగమ గురువువచ్చి వీరశైవుని తలదగ్గర కూర్చుంటాడు. చెవిలో పంచాక్షరీ మంత్రం చెబుతారు. విభూతితో పంచాక్షరీ అక్షరాలను ఒంటినిండా రాస్తాడు అతని తల గురుపాదాలకు తగులుతుంది 11రుద్రాక్షలు శరీరంపై గురువు 11 చోట్లపెడతారు. ప్రసాదం ఇస్తాడు అందరూఖిందారగిస్తారు. [దీనిని విభూతి వీళ.]

శవాన్ని పెళ్ళికొడుకులా తయారుచేస్తారు. పద్మాసనాసీనుడై చేతిలో శివలింగం ఉండేటట్టు శవాన్ని కుర్చీలో కూర్చోబెడతారు. పుష్పాంజలి అనే కార్యక్రమంతో పాట పాడుతూ పాట పాటకీ పువ్వులు జల్లుతారు.

శివునిలో నుండి వచ్చిన ఆత్మ అతనిలో ఐక్యమవుతుందనే అర్థంలో ఆ పాట వ్రాయబడి ది. సమాధి స్థలం చేరేవరకు మేళతాళాలతో, బాణాసంచా ప్రేలుళ్ళతో ఊరేగింపు తీస్తారు. సమాధి వాటికలో గుహాకారంలో గొయ్యి తవ్వుతారు. దిగడానికి మెట్లుంటాయి. గుహలో ఒకగది తొలుస్తారు. అందులో, పద్మాసనస్థ కరలింగ మృతకళేబరాన్నిదించి మన్నుకప్పుతారు. ఆ మంటిదిబ్బపై గురువు నిలబడగా ఆయన పాదాల మీద నీళ్లుపోస్తారు. టెంకాయకొడతారు. కొబ్బరిపంచి పెడతారు. దానధర్మాలు జరుగుతాయి. వీరశైవ పరిభాషలో లింగైక్యం అంటే మృతి. మృతుడు ధ్యానయోగంలో ఉన్నట్లు వారు భావిస్తారు. అదే సమాధిస్థితి. అందుకనే దానిని సమాధి అన్నారు.

## సమాజ జీవనం ॥

వైదిక కులవ్యవస్థలేదు. స్త్రీ పురుష విభేదం లేదు. అంత్యజులైన ఆమెకు సంఘంలో సమాన ప్రతిపత్తి ఉంటుంది. స్త్రీలకు సంస్కారం వివాహంతోనే జరుగుతుంది. పంచసూతకాలు పాటించరు. రజస్సూతకం లేదన్నమాట పుట్టుకలో, మృతిలో, నెలవారి రజోదర్శనంలో అశౌచంలేదు అన్ని అశౌచాలు ధరించిన లింగంతోనే క రాహిత్యాన్ని చెందుతాయి.

వీరశైవులకు గోత్రం ముఖ్యంకాదు. అయినా గోత్రాలు లేకపోలేదు, నంది, భృంగి, వీర, వృషభస్కంద వీరి గోత్రాలు. వీరి గోత్రోద్భవులే పంచాచార్యులు 'అహింసా పరమోధర్మః' అనే ధర్మాన్ని పరిపాలిస్తారు. వీరు శాకాహారులు. సిద్ధాంతశైవంలోని 63 నయన్మారులను 'పురాతనులు'గా భావిస్తారు. వీరు భక్తితో గానం చేస్తారు. వీరశైవం వీరి భక్త్యావేశాన్ని జీర్ణించుకొంది. బసవేశ్వరుడు, తదనునాయులు వేనోళ్ల వీరిని గానంచేశారు. మాణిక్యవాచగరే తిరువాచకంలో ప్రవచించిన భావాలకు ఛాయలు ఎన్నో పరమ ప్రామాణికమైన 'వచన శాస్త్రం'లో ప్రతిబింబిస్తాయి

నిత్యజీవితంలో వీరశైవగృహస్థులు పంచాచారాలను పాటిస్తూ ఉంటారు. ఇక వీరి గురువులు ముండితోపశిరస్కులై, సంసారవర్జితులై ఏ మఠానికి చెందక ప్రజావాహినికి దూరంగా ఉంటారు. వారు సమ్యగ్శీలంతో జీవితం నడుపుతారు వారి సంచారానికి నిషేధాజ్ఞలు లేవు. వీరినే విరక్తులంటారు. ఏ భారం లేని వారికి నిరాభారులు అనిపేరు. కొందరు జంగములు బ్రహ్మచారులై పవిత్ర ధార్మిక జీవనం గడుపుతూ మఠాధిపతులయి ఉంటారు. వారు వీరశైవమతానికి సంబంధించి పట్టణాలో అన్ని శుభాశుభకార్యాలను నిర్వర్తిస్తారు. వీరిని 'పట్టదదేవర్లు' అని పిలుస్తారు. సంసారి సామాన్య వీరశైవులు. గురువులు 'విశేష' గురుస్థానీయులు.

## వేదాంత శోపానాలు. షట్‌స్థలాలు.

ప్రపంచమంతా శివసంకల్ప వికాసం, శక్తి నాయకుడు శివుడు. శివశక్తులకు సత్యసంకల్పాలకు లింగజంగములకు అన్యోన్య ప్రబల సంబంధం నొక్కి చెప్పేది



వీరశైవాద్వైతం దీనికి శక్తి విశిష్టాద్వైతం అని మరోపేరు.

"షట్‌స్థలయోగమే జీవయాత్మికుని స్వస్వరూపలబ్ధి అనే సర్వోన్నత శిఖరానికి ఒడిదుడుకులకు లోబడనీయకుండా ఎక్కించు సుఖనిశ్రేణిక," వీరశైవులు భక్త, మహేశ్వర ప్రసాది, ప్రాణలింగి శరణ, ఐక్యస్థలాలనే స్థలనామక భేదం వల్ల అవిధాలయినారు. 'స్థలం' అంటే పరశివబ్రహ్మం. శివజీవుల ఐక్యమే లింగాంగ సామరస్యం గురులింగ జంగమములను పూజించువాడు భక్తుడు లింగపూజానిష్ఠుడై జంగమమూర్తులను పూజించువాడు మాహేశ్వరుడు. జంగములను అర్చించక, లింగార్పితం కాకుండా భుజింపనివాడు ప్రసాది. ప్రాణ, లింగ, శివుల యందు ఏకబుద్ధికలవాడు ఏకలింగి, ఈషణత్రయం వదలి, ఏకాంత వాసియై సదా శివధ్యాన చింతానిమగ్నుడు శరణుడు పూజా, ధ్యాన, యోగాలు అనువదలి 'శివోహం' అనేభావం దృఢంగా గలిగిన వాడే లింగైక్యుడు శివుడు-జీవుడు అనే ద్వైతభావననుండి 'నేనేశివుణ్ని' అనే అద్వైత భావన భక్తుడిలో కలగడానికి మెట్టుపై మెట్టుగా షట్‌స్థల నిశ్రేణిక ఏర్పాటు చేయబడింది.

ఏవం విధలక్షణలక్షితమైన కర్ణాటక వీరశైవ ప్రభావం తెలుగుదేశంపై ఎంత ఉంది ? అనేదే ప్రస్తుత వర్ణనీయాంశం.

ధార్వాడ కర్ణాటక విశ్వవిద్యాలయానికి పిహెచ్‌డి. నిమిత్తం అనకాపల్లి శ్రీ సత్యనారాయణ మహిళా కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి కె లలితాంబగారు 'వీరశైవిజమ్ ఇన్ ఆంధ్రా' అనే అంశాన్ని పరిశోధించి 1976లో పట్టం పుచ్చుకున్నారు. ఈ సిద్ధాంత గ్రంథాన్ని ఆమె ఆంగ్లేయభాషలో రచించారు శ్రీమతి లలితాంబగారు వీరశైవశాఖకు చెందినవారని పీఠికలో తెలిపారు

అచ్చుపడిన గ్రంథం ముఖపత్రం మీద గాని వేరొంకు చోటగాని ముద్రణ తేదీ లేదు ఫోర్‌వర్డ్‌రాసిన శ్రీ జి. ఎస్. దీక్షిత్‌గారు ఇచ్చిన తేది 30-9-81 ప్రకారం 81లోగాని ఆ తరవాతనో పుస్తకం ప్రకాశితమై ఉండాలి దీనిని ఆమె రీసెర్చ్ పేపర్స్' అన్నారు 4 అధ్యాయాలుగా విభజింపబడిన గ్రంథంలో వీర' శైవ సముత్పత్తి ఆధారగ్రంథాలు రాజకీయ, ధార్మికపరిస్థితులు, పండితత్రయం, మల్లికార్జున పండితారాధ్యుని జీవితం, బోధనలు, వీరశైవమతావిర్భావం, సోమనాథుని తరవాత వీరశైవమతం అనే శీర్షికలు ఉన్నాయి

రచయిత్రి వీరశైవశాఖకు చెందటం, రచన ఆంగ్లభాషలో సాగడం, వీరశైవమత పరిశోధనకు ప్రోత్సహించే కర్ణాటక ధార్వాడ విశ్వవిద్యాలయం పట్ట ప్రదానం చేయటం గ్రంథప్రామాణికతను ఇనుమడింపజేశాయి.

బ్రాహ్మణేతరులై వీరశైవం పుచ్చుకున్నవారు కర్ణాటక సరిహద్దులోని ఆంధ్రప్రదేశ్ జిల్లాలో ఉన్నారని, సర్కారు జిల్లాల్లో కొన్ని కుటుంబాలు లేకపోలేదని మొదట చెప్పబడినవారు లింగాయతులని, రెండవవారు లింగబలిజలని రచయిత్రి తెలిపారు (పుట 69). ఈ లింగబలిజలలో- తోట బలిజలు (కాయగూర లమ్మేవారు), పత్తిబలిజలు (పత్తి వ్యాపారస్తులు), గాజులబలిజలు (గాజుల వ్యాపారం) అన్నారు వీరిలో ఒకరుకంటె ఒకరు గొప్పవారను కొంటారు. నిన్నమొన్నటివరకు సహపంక్తి భోజనాలే లేవు. ప్రతి తెగకీ గురుపరంపర ఉంది (69), మొత్తం మీద ఆంధ్రదేశంలోని వీరశైవులు ద్విధావిభక్తమై ఉన్నారు. ఒకరు గురువర్గానికి చెందినవారు. రెండోవారు భక్తవర్గానికి చెందినవారు. గురువర్గానికి చెందినవారు జంగములు, మాహేశ్వరులు, లేదా అయ్యవార్లు, కర్ణాటక సరిహద్దు జిల్లాలలో వీరశైవ గురువులు 'అయ్య' అని, భక్తులు 'అప్ప' అనే సంబోధనతో పిలువబడతారని రచయిత్రి తెలిపారు (69).

వీరశైవులు కేవలం బలిజలకే పరిమితం కాలేదు. వైశ్య, రెడ్డి, విశ్వకర్మ దేవాంగ, కన్నాభక్తులు కరికాళభక్తులు, చేనేత వృత్తివారు లింగధారణ దీక్ష గ్రహించారు . తూర్పుగోదావరి, విశాఖపట్నం ఏజన్సీ ప్రాంతాలలో రజకులు కోయ జాతివారు, వీరశైవ దీక్ష పొందినవారున్నారు (పుట 70) వీ ందరలా కాకపోయినా కొంతమందైనా శాకాహారులు. శీలవంతులనే తెగవారితో లింగబలిజలు సహపంక్తి భోజనాలు చేస్తారు. పెళ్ళిళ్లు జరుపుతారు స్థలపతి జంగాలు అనే దర్జీపనివారు ఉన్నారు. వారు శాకాహారులు కారు. మరికొందరు భస్మలిప్తాంగులై శంఖనాదం చేస్తూ భిక్షావృత్తిలో ఉన్నారు. కులాతీత సామాజిక స్థాపనకు దీక్షవూనిన వీరశైవులలో మరో కొన్ని శాఖలు చేరాయి. ఈ విధంగా ఈశ్వరకులజులమని చెప్పుకొనేవారిలో అవాంతర శాఖలు వెలిసినందుకు ఆమె ఖిన్నులయ్యారు (పుట 70).

## మల్లికార్జున పండితుడు ఆరాధ్యశాఖ ప్రవర్తకుడు.

పండితత్రయంలో శ్రీపతి పండితారాధ్య, శివలెంక మంచెనాదులు వీరశైవులు కారని మల్లికార్జున పండితారాధ్యుడే తెలుగుదేశంలో ఆరాధ్య సంప్రదాయానికి మూలపురుషుడని ఆమె అభిప్రాయపడ్డారు. మల్లికార్జునుడు వీరశైవుడు కాదు అతని గురువులు ఈ దీక్షనిచ్చిన వారు కారు. అతని చరిత్ర రాసిన సోమనాథుడు షట్‌స్థల సిద్ధాంతాన్ని చెప్పలేదు ఔత్తరాహితమైన పాశుపతాన్ని, దాక్షిణాత్యమైన సిద్ధాంత శైవాన్ని సమ్మిళితం చేసి వీరశైవం కంటె మధ్యేమార్గాన్ని రూపొందించాడు. వీరశైవం స్థిరపడినతరవాత సోమనాథుడు ఆ మతావేశంలో ఆ లక్షణాలను చాలామట్టుకు పండితునికి అంటగట్టడానికి ప్రయత్నించాడు. పండితుడు దీక్షస్వీకరిస్తే ఆ దీక్ష పాశుపతానికి చెందినదై ఉంటుందని ఆమె సిద్ధాంతం (పుటలు 45, 46).

## సిద్ధాంత శైవం

**మల్లికార్జునుడు ఆరాధ్యుడని సిద్ధాంతీకరించిన తరవాత శైవ సిద్ధాంతం ప్రసక్తి అతిశయోక్తి అవుతుంది.**

ప్రాచీన తమిళ శైవ రచనలలో అందరి దేవుళ్లను సమానంగా ఆదరించినట్లు కన్పిస్తోంది. నక్కీరుడు (నక్కీరర్) తనరాజును శివ, బలరామ విష్ణు సుబ్రహ్మణ్య దేవర్లు ఆశీర్వదించాలని కోరాడు భారతం పాడిన పేరుందేవనార్ విష్ణు సహస్రనామంలోని నామాలను అవలీలలో తమిళీకరించుకొన్నాడు. శివ, విష్ణువులను సమానంగా పూజించారు. ఆనాడు వైదిక మతానికి కూడా ప్రచారం ఉండేది

## నయన్మారులు

శివ నయన్మారుల కాలంలో వర్ణాశ్రమ ధర్మాలను అనుసరణను వెనక్కినెట్టి శివభక్తిని ప్రధానం చేసుకొని నయన్మారులు వీరభక్తితో పాటలు పాడారు. ఈ విషయంలో శివభక్తులలో జాతి వర్ణ ఆశ్రమ విచక్షతలేదు ఆదిశైవ బ్రాహ్మణ సుందరమూర్తి చేరమాన్ పెరుమాళ్ నయన్మారు ఇంట భోజనం చేశాడు శ్రీపతి పండితుడు ఇట్లా చేస్తే బెజవాడ బ్రాహ్మణులు మండిపడ్డారు. శుద్ధమైన భక్తికి వర్ణాలు అడ్డుగావు శివయోగులకు సేవ ప్రధానం; శివభక్తులలో వర్ణ విభేదాలులేవు.

చిరుత్తొండ నయన్మార్ తెలుగువారికి పరిచితుడే అతనికి ఆయుర్వేదం తెలుసు. ఉత్తరాది సంస్కృత గ్రంథాలు చదివాడు. పల్లవుల కతడు సేనాధ్యక్షుడు. పశ్చిమ చాళుక్యుల వాతాపి నగరాన్ని జయించాడు . వాతాపి రెండోపులకేశి రాజధాని. ఈ సంఘటన క్రీ॥శ॥ 642లో జరిగింది.

పల్లవ నరసింహవర్మ సేనాధ్యక్షుడైన చిరుత్తొండ నంబిని శైవభక్తునిగా గుర్తించి తన ఆశ్రయంనుండి విముక్తుణ్ని చేశాడు. చిరుత్తొండర్ స్వేచ్ఛగా తన గ్రామమైన తిరుచ్చెంగాట్టన్ గుడిలో గణపతీశ్వర దేవాలయంలో గణపతిని, శివుడిని పూజిస్తూ తనపంక్తిని శివయోగిలేనిదే భుజించని వీరవ్రతాన్ని చేబట్టాడు. భైరవ రూపంలో శివుడు వచ్చి చిరుత్తొండర్‌ను పరీక్ష చేయడం మొదలయిన ఆవలి కథా వృత్తాంతం మనకు తెలుసు.

ఇంతకీ చెప్పదలచుకొన్నది వీరశైవం అనే వర్గం లేని ఆనాటి చిరుత్తొండర్‌ని వీరశైవునిగా చిత్రించి అతని చేత హస్తలింగార్చన చేయించాడు మన శ్రీనాథుడు హరవిలాసంలో తమిళ అరువత్తి మూవర్ నయన్మారులను పురాతనులపేర సోమనాథుడు వీరశైవుల్లో కలిపివేశాడు

## తిరుమూలర్ - తిరుమందిరం

నయన్మారులు తరవాత వచ్చిన తిరుమూలర్ తిరుమందిరం అనే మూల సిద్ధాంత శైవ గ్రంథాన్ని రచించారు. వాస్తవానికి ఇతను కాశ్మీరదేశస్థుడు కాశ్మీర శైవం ఆగమ గ్రంథాలు సంస్కృత భాషలో ఉన్నాయి. వాటిని తమిళదేశంలో ప్రచారం చెయ్యడానికి తమిళం నేర్చుకొని తిరుమందిరం రాశాడు. ఇతని కాలం 6వ శతాబ్దం.

తిరుమందిరంలో 9 తంత్రాలు ఉన్నాయి. అధ్యాయాలకు తంత్రాలని పేరు పెట్టుకున్నాడు. మొదటిదాలో ఉపదేశం రెండో తంత్రంలో శివపురాణ కథలు, 3వ దానిలో యోగం పతంజలి. యోగాన్ని స్వానుభవం మీద సంస్కరించాడు. నాల్గోది మంత్రశాస్త్రం, అయిదవ తంత్రంలో శుద్ధశైవం, అశుద్ధశైవం, మార్గం శైవం, కడుంశుద్ధశైవం అని 4 భాగాలుగా శైవాన్ని విభజించాడు. చర్య, క్రియ, జ్ఞాన, యోగ అనే నాల్గు సాధనాలను పేర్కొన్నాడు.

సన్మార్గం అంటే ఏమిటో చెబుతూ దైవాన్ని మిత్రుడుగా చూడటం సఖా మార్గమని దైవాన్ని తండ్రిగా కొలిచేవానిని సత్పుత్రమార్గమని, దాసుడుగా దైవాన్ని పూజించడం దాసమార్గమని చెప్పాడు. సాలోక, సామీప్య, స్వారూప్య సాయుజ్యాలను గూర్చికూడా చెప్పేడు. 6వ తంత్రంలో శివగురువర్ణనం 7వ దానిలో ఆధార చక్రాలు షట్‌స్థలాలు, ఆత్మలింగార్చన అంటే శివుణ్ని గురువుగా, మహేశ్వరుడుగా ధ్యానించడం. 8వ తంత్రంలో అడియార్‌లు (అర్చకులు) లక్షణాలు, యోగ్యతలు, పతి, పాశం, పశుజ్ఞానం. 9వ తంత్రంలో మఠాలు మొదలైనవాటినిగూర్చి ఉన్నాయి.

తిరుమూలర్ దృష్టిలో శుద్ధ శైవులు వేదాలను ఆధారంగా తీసుకుంటారు. తిరుమూలర్ చెప్పడం వేదాంతమే శుద్ధశైవ సిద్ధాంతం అంటాడు. దీనివల్ల జ్ఞానం కలుగతుందని అతని నమ్మకం ఇదే నిజమైన సిద్ధాంత శైవమని తిరుమూలర్ అంటాడు.

ఆగమాలనుండి భైరవం, వామనం, కాలాముఖం, మహావ్రతం, పాశుపతం. శైవం ఆవిర్భవించాయని 6వ శతాబ్దంలో పల్లవ మహేంద్రవర్మ రచించిన మత్తవిలాస ప్రహసనంలో దొంగసన్యాసులు లాంటి గురువుల చేష్టలను వెక్కిరించడం జరిగింది. అప్పటి పరిస్థితి అది.

తిరుమూలర్ చెప్పిన దీక్షలు- సమయదీక్ష, విశేషదీక్ష, నిర్వాణదీక్ష.

దైవకటాక్షమే శక్తినిపాతం ఇది మందంతరతీవ్ర తీవ్రతరస్థాయిలో ఉంటుంది భగవంతుని అనుగ్రహం భక్తినిబట్టి ఆ స్థాయిల్లో ఉంటుదన్నమాట.

జీవుడుకి దేవుడున్నాడనే జ్ఞానంకలిగినప్పుడు అదిద్వైతమే అవుతుంది. ఈ జ్ఞానం పోనుపోను విశ్వాత్మకుడైన శివునిలో ఐక్యం అయినప్పుడు అద్వైతస్థితి చేకూరుతుంది.

అందుకనే కర్ణాటక వీరశైవ ధర్మపరిశోధకులు వీరశైవం మొదట్లో ద్వైతమే అని షట్‌స్థలాల ద్వారా అద్వైతసిద్ధి చేకూరుతుందని అన్నారు. ఇదో విశిష్టతకనుకనే విశిష్టాద్వైతం. అప్పటికి రామానుజుల విశిష్టాద్వైతం ప్రచారంలో ఉండబట్టి దీనిని ప్రత్యేకంగా శివాద్వైతమని, సర్వాద్వైతమని భేదాభేదమని, శక్తి విశిష్టాద్వైతమని అన్నారు.

శ్రీకంఠుడు రాసిన శ్రీకంఠభాష్యం రామానుజుల తరవాత వెనువెంటనే వెలువడిందని ఎస్. సూర్యనారాయణశాస్త్రి తమ గ్రంథం అయిన "శ్రీకంఠ అండ్ శివాద్వైత"లో రాశారు. ఇదే ఆరాధ్యులకు ప్రామాణిక గ్రంథమని శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారి వాదం. అయితే దీనిలో లింగధారణలేదు.

ఆరిజిన్ అండ్ ఎర్లీ హిస్టరీ ఆఫ్ శైవిజం ఇన్ సౌత్ ఇండియా సి. వి నారాయణ అయ్యార్. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రకటన 1974 రీ ప్రింట్

---

### " హృదయ గానం "

మూర్తి రాజా,
శ్రీ ఎ.వి.వి. యస్.యస్. ప్రసాద్

ఒక పిల్లవాయువు తాకిన
పులకరింత —
ఒక చిన్న కిరణం సోకిన
వెచ్చదనం —
ఒక నీలి కెరటం తడిపిన
పలకరింత
ఒక కోయిల కూసిన
పచ్చదనం —
ఆ అనుభూతి !
ఆ ఆర్ద్రత
స్పందన !
చెలి చూపులోనే కాదు
చెల్లి ప్రేమలోనే కాదు
అమ్మ ఆప్యాయతలో కూడ

## మెయికండర్ - శివజ్ఞానబోధం గోళగి పాశుపతమ్

తిరుమూలర్ గ్రంథం దక్షిణాది సిద్ధాంతశైవానికి తొలిగ్రంథమైనా క్రీ. శ. 1282లో మెయికండర్ రచించిన శివజ్ఞానబోధమ్ సిద్ధాంతశైవానికి పరమప్రామాణికమైన పార్శ్వగ్రంథం. మెయికండర్ గోళగి మఠానికి చెందిన వాడని తమిళనాడులో లక్ష్మ్యధ్యాయి గురుపరంపరలోని వాడని స్వర్గీయ ప్రొఫెసర్ బి. జి. ఎల్ స్వామిగారు సప్రమాణంగా నిర్ధారించారు. మెయికండర్ కంటె ముందుగా తిరుమూలర్ తరవాత తిరువందియార్ సిద్ధాంత శైవంమీద పుస్తకాలు రాశాడు. మెయికండర్ తిరుజ్ఞానబోదమ్ రౌరవాగమాన్ని ఆధారంగా చేసుకొని రాసింది.

గోళగిమఠం వారు పాశుపత మతాన్ని కొన్ని మార్పులతో స్వీకరించారు వీరిపేర్లలలో శంభు, శివ అనేపదాలు ద్వితీయావయాలుగా కనిపిస్తాయి, క్రీ.శ. తొలిపాదంలో లకులీశుడు పురాణ అంటే పురాతన పాశుపతాన్ని సంస్కరించాడు. ఆయన శిష్యవర్గం దేశం అతంటా విస్తరించి కర్ణాటాంధ్ర దేశాల్లో 13వ శతాబ్దం వరకు నిలిచారు. కర్ణాటకంలో కేదారమఠం వీరు స్థాపించిందే. సింహపరిషత్ అనే వేరొక పాశుపత శాఖకు చెందిన వారికి రాసి ముప్వార్ లోనయ శాఖకు చెందిన వారికి శక్తి అనే పేర్లు. ఆశ్రమ స్వీకారం తరవాత ఏర్పడ్డవి. కాలాముఖులనేశాఖ దీనిలోని అంతర్భాగమే. వీరిలో కొంతమందిని పండిత, ఆరాధ్య శబ్దాలతో పిలుస్తారు.

తెలుగుదేశంలో 8వ శతాబ్దం నుండి వీరి ప్రభావం ఉంది. అనేక దేవాలయాలకు వీరు స్థానాపతులుగా, అనేక మఠాలకు అధిపతులుగా అనేకమంది రాజులకు రాజగురువులుగా విలసిల్లారు కాకతి రుద్రమకాలంలో వీరిప్రభ అణగిపోయింది. పురాతన శైవానికి మరోభారతం, సూతసంహిత ఆధారంకాగా లోకులీ శైవశాఖకు పాశుపత సూత్రాలకు రాసీకర కౌండిన్యుడు రాసిన భాష్యం కొంతఆధారం. కాలాముఖులకు మాత్రం ఏగ్రంథం ఆధారమో ఇంతవరకు తెలియదు

మల్లికార్జునుడు సిద్ధాంతశైవాన్ని ఆదరించేడని చెప్పడానికి ఆధారం ఏమీ లేదు. శ్రీమతి లలితాంబగారుకూడా ఏదోమాటవాసిగా రాశారు కానిసిద్ధాంతం చెయ్యలేదు. సిద్ధాంతశైవంలో ఆండియారులు, దీక్షితులు, ఆదిశైవులు దేవాలయాలకు పూజార్లుగా ఉండేవారు. వీరు బ్రాహ్మణులై ఉండాలనే నిష్కర్షఉంది. తెలుగు దేశంలో ఆదిశైవులు,ఆ తరువాత గోళగి గురువులు పూజారులుగా ఉంటూవచ్చారు. ఆ తరువాత వెలనాటి పూజారులు అర్చకు లయ్యారు.

దక్షిణాది సిద్ధాంత శైవసిద్ధాంతం నుంచి వీరశైవం ఆవిర్భవించిందని డా॥ జె. చెన్నారెడ్డిగారు నిరూపించడానికి ప్రయత్నించారు.[1] ఇరువర్గాల వారికి భక్తి ప్రధానం. భక్తుకు భక్తి ఉద్రేకంలో ఏదైనా చివరికి తనశరీర ప్రాణాలనయినా త్యాగం చెయ్యడానికి సిద్ధంగా ఉంటాడు. ఇదే వీరత్వం వీరశైవంలో వీరశబ్దానికి అర్థం అన్నారు. పెరియపురాణంలోని 63 నయన్మారులు వీరభక్తులు. వీరినే వీరశైవులు పురాతనులుగా కీర్తించి వారిలో కలుపుకున్నారు.

సిద్ధాంత శైవంలో దీక్షితులు గురువు వద్దనుండి దీక్షపొందిన వారే దేవాలయాల్లో పూజకు అర్హులు. కాబట్టి ఒక విధమైన వర్ణాశ్రమ ధర్మం వారు పాటించారు. వీరశైవం ఈ కట్టడిని తొలగించింది. అసలు దేవాలయాల అవసరమేలేదు ఇక దీక్షితుల అవసరం ఏముంది? శివలింగ ధారులందరూ ఒకేజాతివారు. జంగముదే వీరికి దీక్షితుడు.

1. ఎస్.వి. యూనివర్సిటీ ఓరియంటల్ జర్నల్ పుటలు 21- 25 'ఆఫ్ ప్రింట్' లోని వివరాలు లేవు. సామాన్య, విశేష, నిరాభార, పరమ, అఖండ, అనాది శైవాలని వీరశైవంలో ఉన్నా అవి జాతులు కావు. సిద్ధాంతశైవంలో ఇటు వంటి విభజనలేదు. సిద్ధాంత శైవంలో వీరశైవులు విసర్జించిన జాతి, జనన, జాతాశౌచ, ఉచ్ఛిష్ట, రజోఆశౌచ, మృతాశౌచం ఉన్నాయి అని చెన్నారెడ్డిగారు రాశారు

ఈ వ్యాసంలో శ్రీ రెడ్డిగారు ఉద్దేశించిన లక్ష్యం చేకూరలేదు. సిద్ధాంత శైవంలో వీరశైవంవలె వీరభక్తి ప్రధానమైనా దేవాలయ పూజవిధిగా ఉంది. అర్చకులు లేదా దీక్షితులు దీక్షపుచ్చుకున్న బ్రాహ్మణులై ఉండాలి. వర్ణాశ్రమ ధర్మం జోలికిపోలేదు. వారికిభక్తే ప్రధానం వర్ణాశ్రమ గౌరవం, స్థావర పూజా వీరశైవానికి విరుద్ధం. దేవాలయార్చకులైన దీక్షితులలో రెండురకాలవారున్నారు అగ్రకుల దీక్షితులు. అగ్రకులం వారినుండి దీక్షపొంది ఇతర శాఖలవారికి కులాల వారికి ఇచ్చేదీక్ష సామాన్య క్రియాగమ దీక్ష అని ఈశాన గురుపద్ధతిలో చెప్పబడింది. ఇందులూరి అన్నయ రెడ్డిరాజులు ఈ దీక్ష పుచ్చుకున్నవారు.

### ఆరాధ్యులు

పండితారాధ్యుడు ఆరాధ్యశాఖను సిద్ధాంతపరంగాచేశాడని అన్నారు. మొదట పాశుపత బ్రాహ్మణుడైన పిదప ఆరాధ్యుడయినట్లు చెప్పారు, ఇది నిజమే కావచ్చు. సోమనాథుడు పండిత త్రయాన్ని ఆరాధ్య వర్యులుగా చెప్పేవరకు తెలుగుదేశములో ఆరాధ్యశాఖ లేదు. కర్ణాటకలో కేదార మఠానికి చెందినవారిలో కొంతమంది పేర్లకు ఆరాధ్య శబ్దము కూడా అతికి ఉంది.

అనంతానందగిరి శంకరవిజయంలో ఆరాధ్యులు అనే తెగ ఉన్నట్లు భండార్కర్" తెలుపుతూ మాధవుని శంకరవిజయంలో అటువంటితెగ ఆ సందర్భంలో చెప్పలేదని అన్నారు.

ఆరాధ్యులు అనేవారు శంకరాచార్యులకు అనగా 9వ శతాబ్దికి ముందున్నారో కాదో స్పష్టంగా తెలియదు. ఉంటే వీరశైవం స్థిరపడిన తరువాత ఆరాధ్యులు ఆ మతంలోని ముఖ్యాంశములను గ్రహించి వీరశైవానికి కొంతపుష్టిని చేకూర్చి ఉంటారు. ఆరాధ్యులు వీరశైవుల లింగధారణ, దీక్ష ఇనాది ముఖ్యాంగాలను గ్రహించినా వేదాచారాన్ని విడనాడినవారుకారు - అని ఆర్. జి. భండార్కర్ అభిప్రాయం.

### కోటిఫలిమఠం

తూర్పుగోదావరిజిల్లాలో కోటిఫలి (కోటిపల్లి)లో చంద్రమౌళీశ్వరపీఠం శ్రీకంఠమఠం ఉండేవి ఇది గోళకి ఆచార్యులకు చెందిన ఆమర్దకపీఠం. సదాశివునివలన అనంతేశ్వరుడు మొదలయిన అష్ట విద్యేశ్వరులు పుట్టారు ఆ విద్యేశ్వరులు మఠాధిపతులవుతూ ఉంటారు. రెండో అమ్మరాజు వేయించిన తాడికొండ శాసనంలో విజయవాడలో విద్యేశ్వరులు వాసంచేసినట్లు వీరికి పాశుపతవ్రతం ముఖ్యం కాతిలికాడి ఆగమాలలో చెప్పిన శాంభవదీక్ష పాశుపాతాంతర్గతమే.

పండితారాధ్యుల గురుపరంపరలో అవాంతర, దేశికులు, కోటిఫలి ఆరాధ్యుల పేర్లు సోమనాథుడు పం.చ. అవతారికలో చెప్పాడు. పండితుడు శివతత్వసారంలో, సోమన బసవపురాణ, పం. చ. లో శాంబరదీక్ష స్పృశించారు. ఎర్రన హరివంశంలో శాంబవదీక్ష పేర్కొన్నారు. ముదిగొండ నాగలింగశాస్త్రి గారు శాంబవదీక్షపై గ్రంథం వ్రాశారు.

మల్లికార్జునుడు శ్రీశైలంనుండి ద్రాక్షారామంచేరుకుని కోటిఫలి ఆరాధ్యుల వద్ద శాంబవదీక్షనేపొంది ఉంటాడు. పాల్కురికి సోమన దానిని వీర మాహేశ్వర దీక్షగా మార్చాడు. దక్షిణదేశ శివభక్తులను వీర శైవులుగా మార్చివేసిన సోమనకి ఇది ఒక లెక్కా.

క్రీ. శ 9వ శతాబ్దం నుండి గోళగిమఠాధిపతులులకులీశ, కాలాముఖ పాశుపతులు తెలుగుదేశం దేవాలయాలకి స్థానాపతులుగా ఉండేవారని క్రీ. శ. 12వ శతాబ్దం తుదిపాదంలో ఆరాధ్యులశాఖ ఆవిర్భవించిందని నిరాఘాటంగా చెప్పవచ్చు. అంతవరకు శాసనాల్లో గౌరవలు శివయోగులే ప్రత్యక్షమయ్యేవారు కాని వీరశైవ జంగముల ప్రసక్తి ఉండేదికాదు. ఈ విషయాన్ని ఆంధ్రదేశంలోని గోళగిమఠాలను గూర్చి భారతి 1977 సెప్టెంబరు, అక్టోబరు సంచికలలో పూర్తిగా ఈ వ్యాస కర్తచే చర్చించడం అయింది.

### శ్రీపతి పండితుడు

"శ్రీపతి అనంత పాలుని గురువనియు వారిరువురును క్రీ. శ. 1120–1180 ప్రాంతమున మని యుండిరనియుం దలంచుట సమంజసము" అని అన్నారు

చారిత్రకులు ! శ్రీపతి పండితుని గూర్చి మల్లికార్జున పండితారాధ్యుడు

> ఒక్కఁడె దైవము శివుఁడని
> నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు చీరన్
> స్రుక్కక శ్రీపతి పండితుఁ
> డక్కజముగ విజయవాడ నల జమ్మి శివా ! [2]

ఇందులో అనంతపాలుని ప్రశస్తి లేకపోయినా

> "అనంత పాలుని సభాస్థలిని
> నెక్కొనఁగాఁబండ్ర నిప్పులుగాదె
> చక్కన పొత్తి పచ్చడమునననిచె॥ అని

సోమన బసవపురాణంలో చెప్పాడు[3] బెజవాడ మల్లేశ్వరాలయంలోని ఏల్లకేతుని శాసనంలో "తతః శ్రీ పండితారాధ్యనామ్నా భక్తోత్తమే" అని కొంగున నిప్పులు ముడిచిన కథ చెప్పబడింది కాని దీని కాలం తెలియదు.

. వ్యా. మం. పుట. 13 2 శి. సా. 406. 3 బ పు. 7-57 + 59

శ్రీపతి పండితుడు పండితత్రయంలో మొదటివాడు బ్రహ్మాదులతో కర్మించి హరభక్తి యుత్పత్తి కధిపతి అని నిరూపించి సృష్టికర్త బ్రహ్మకాదు శివుడని నిరూపించాడు. ఇతనిని శివకవిగా సోమన చెప్పాడు!

ఇతని శిష్యసంతానం ఇతని పేరే ఇంటి పేరుగా పెట్టుకున్నారు శ్రీపతి పండితారాధ్యులనే ఇంటిపేరు కల ఆరాధ్య బ్రహ్మణులది కౌశికగోత్రం. శ్రీపతి పండితుడు దీక్షపుచ్చుకొన్న వీరశైవుడు కాదని శ్రీలలితాంబగారి వాదం అతడు దీక్షపుచ్చుకున్నట్లు లేదు. అది వాస్తవమే కాని నేటి వారి వంశీయులు దీక్షాదక్షులే ఇతను శ్రీకర భాష్యం రాయలేదని లోగడ ముదిగొండ నాగలింగ శాస్త్రి స్పష్టంగా రాశారు. [2]

(ఏకక్కడత్రయం అంటే బ్రహ్మ, విష్ణువు, శివుడనే సోమన భావం)

1. పం. చ. పుట 7. 2. శైవరహస్య బోధిని శైవభాష్య నిర్ణయం (1923)

శ్రీపతి పండితుని వంశంలోనుండి కాశీనాథునివారు ఎప్పుడు చీలిపోయారో తెలియదు. వీరిది ఆత్రేయ గోత్రం. ఇది పరిశోధింపదగిన అంశం.

## శివలెంక మంచెన

పండిత త్రయంలో రెండోవాడు

బసవపురాణంలో 6వ ఆశ్వాసంలో శివలెంక మంచెన కథ ఉంది. ఇతను కాశీలో ఉండేవాడు విశ్వేశ్వరుడిని మూడుపూటలు తన పది వేళ్ళతో పూజించి ఆ వేళ్ళను అర్పించి అప్పటికప్పడే తిరిగిపొందేవాడు. విష్ణువుని విశ్వేశ్వరుని కి మొక్కించి శివాధిక్యం చాటిచెప్పాడు ఇప్పుడు కూడా (సోమనకాలానికి) విశ్వేశ్వర ఆలయంలో విష్ణువు సాష్టాంగ ప్రమాణంచేస్తూ నేలపై వున్నాడని ఏ మతవాదులు తిరిగి అతన్ని లేవనెత్తలేక పోయారని సోమన రాశాడు.

పండితారాధ్య చరిత్రలో విష్ణువాదుల గటడగించి భక్తిక్రియా స్థితికర్త అని మంచెన కీర్తింపబడ్డాడు. శివలెంక మందెనను లెంకమంచెన అని కూడా సోమన పేర్కొన్నాడు. శివలెంక మంచనగారి వచనాలు కన్నడంలో ఉన్నాయి. వాటివల్ల ఈ మంచెనగురించి తెలుసుకోదగింది లేదు.

శివలెంకవారు నేడు శాలంకాయన గోత్రులుగా తెలుగుదేశంలో ఉన్నారని చెప్పటానికి నేటి భారతి పత్రికాధిపతులే నిదర్శనం.

కన్నడదేశంలో శివలెంక మంచెన గురుపరంపర ఉంది. కాని వారే గోత్ర జులో తెలియదు.

కాశకృత్స్న శబ్దధాతు కలాపః అనే గ్రంథంలో "శ్రీ యాగంటి శంభు లింగ ప్రసాదిన స్తిత్తిర యజుశ్శాఖా ధ్యాయనస్య వామదేవ ముఖోద్భూతస్య, గణ కర్ణ పుత్రస్యా త్రిగోత్రస్య వీరమాహేశ్వర సూత్రస్య శివలెంక మంచెణ పండితా రాధ్య ప్రవరస్య కాశీకొండ చెన్నెపర కృతా" అని ఉంది.

నేటి శివలెంక వారి ప్రవరలో విశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక అనే ఋషులు ఉన్నారు.

బసవపురాణంలోని సంగమేశ్వరుడు బసవని మూడో కన్ను అడిగే కథలో సకల నియోగాలవారిని చెబుతూ "లెంకదా మంచయ్య మీనగరి, సుంకిఁడు సుంకిశు బంకయ్యగారు" సోమన చెప్పిన దానినిబట్టి చూస్తే సుంకాలు సేకరించేవాడు. సుంకేశు బంకయ్యగారిని, లెక్కలు రాసేవాడు మంచెన అని అర్థమవుతుంది.

లెంక అంటే సేవకుడు. భటుడు అని అర్థాలున్నా శివలెంక అంటే శివుని బంటని అనుకున్నా, బహువ్రీహిగా గ్రహించి విష్ణుమూర్తి అని అర్థం సాగ దియ్యొచ్చు. శివలెంక మంచన కాశీలో విశ్వేశ్వరుడికి కేశవునిచేత "శివభక్త ప్రథు ర్మమ" అని చెప్పించాడు.

శివలెంక మంచెనకథ ఇంకా ఉంది. ఇతని తాత సోమశంభువు తండ్రి కామికాద్యఖిల శివకథిత తంత్రావళికి వృత్తి దీపికలు రచించిన సకలాగమాచార్యుడు. క్రి. శ. 1485లో నీలకంఠాచార్యుడు అనే కన్నడకవి 'ఆరాధ్య చారిత్ర' అనే గ్రంథాన్ని రాశాడు. అది సోమనాథుని పండితారాధ్య చరిత్రకు కన్నడానువాదం. (అంతకు నూరేండ్లముందు శ్రీనాథుడు జగము నుతింపగ నిగమార్థసార సంగ్రహ మగు నారాధ్యచరిత్ర'ను చంపూకావ్యంగా రాశాడు.)

నీలకంఠాచార్యులు సోమశంభువును తన వంశానికి మూలపురుషుడుగా చెప్పుకున్నాడు. ఇతని కుమారుడు సకలాగమాచార్యుడు కామికాద్యఖిల శివకథిత తంత్రావళికి వృత్తిదీపికలు రచించాడు. సోమధర అనే సమదాయాన్ని స్థాపించాడు. ఇతని కుమారుడే శివలెంక మంచెన. ఇతనికి నీలకంఠాచార్యులకు మధ్య 15 తరాలు దొర్లిపోయాయి. ఈ పేర్లనే చిలుకూరి నారాయణరావుగారు పం. చ. పీఠిక (పుట 70) లో ఇచ్చారు తరానికి 25 సంవత్సరాలు లెక్కకడితే శివలెంక మంచన క్రి. శ. 1110లో ఉన్నట్లు చెప్పవచ్చు. నీలకంఠాచార్యుని కాలం క్రి. శ. 1485.

సోమశంభువు కర్మక్రియాకాండ అనే గ్రంథం రాసినట్లు ఆ గ్రంథంలోని విషయాలు అఘోర శివుడు, ఈశాన శివుడు, సర్వదర్శన సంగ్రహకర్త మాధవాచార్యులు ఉటంకించారని ఇతనికాలం క్రి. శ. 1073 అని స్వర్గీయ ప్రొఫెసర్

బి. జి. ఎల్. స్వామిగారు రాశారు. (జర్నల్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ ఏప్రిల్ 1975 పుట 192 సోమశంభుగురువు సశివుడని ఇతని గురువు ఈశాన శివుడని ఆయన తెలిపారు. సశివ అంటే సద్భావశంభుపని గోళకి మఠస్థాప కుడని కూడా ప్రొఫెసర్ స్వామిగారు రాశారు. ఈశాన శివుడు చోళరాజరాజుకు కూడా గురువే అని ప్రొఫెసర్‌గారు అన్నారు. సోమశంభు పద్ధతిని పాల్కురికి సోమన, తన సోమనాథ భాష్యంలో పేర్కొన్నాడు. ఈశాన గురుపద్ధతిని తిరువాన్కూర్ సంస్కృతగ్రంథ పరంపరలోను, సోమశంభు పద్ధతిని పాండిచెరిలోని అరవింద పరిశోధన సంస్థవారు ప్రకటించారు.

శివలెంక మంచెన వీరశైవుడు కాడని శ్రీ లలితాంబగారు రాశారు. అది నిజమే కావచ్చు. కాశీలోనుండి ఇతడు కళ్యాణికి వచ్చినట్లు చెబుతున్నారు. అదీ నిజమే కావచ్చు. కాకపోతే అక్కడ శివలెంక మంచెన గురుపరంపరలో చేరడు కదా! కల్యాణికి వచ్చిన తరవాత వీరశైవుడై ఉండి ఉండవచ్చును.

సోమశంభులోని 'శంభూ' అనేది చేదిదేశంలో యువరాజువర్షుని కాలంనాటి బాలేహూట్ గోళగిమఠాచార్యుల పేర్లలో ఎక్కువగా కన్పిస్తుంది. గోళగిగురువులు శక్తి ఉపాసులు. ఎక్కువగా బెంగాలులోని దక్షిణరాఢా మండలం నుండి వచ్చి చేరారు మాల్కాపురం శాసనంలో సోమశంభువు పేరు కనబడుతుంది.

నేటి శివలెంకవారి వంశంలో ఎక్కువగా శంభులింగం పేరున్నవారు ఉన్నారు. కైలాసవాసి శంభుప్రసాద్‌గారి పేరుకూడా గోళగిమఠాధిపతుల పేరులా వినవస్తుంది.

## మల్లికార్జున పండితారాధ్యుడు.

శ్రీపతి పండిత శివలెంక పండిత, మల్లికార్జున పండితులు ముగ్గురు వీరశైవదీక్ష పొందినవారుకారని, సోమనాథుడు తన భక్త్యావేశంలో మల్లికార్జున పండితునికి వీరశైవ లక్షణాలు రూపించేడని శ్రీమతి లలితాంబగారు రాశారు (పుటలు 45, 46), పండితుడు పాశుపతదీక్ష పొంది ఉంటాడని ఆమెగారి అభిప్రాయం.

ఇదొకగడ్డుసమస్య. మల్లికార్జునుని కాలంనాటికి ఆ వెనుక మరో వంద సంవత్సరాలు ఆంధ్రదేశం మొత్తంమీద గోళగి గురువులే దేవాలయాలకు స్థానాపతులుగా ఉన్నారు. గణపతి దేవునికి దీక్షనిచ్చినవాడు విశ్వేశ్వర శివదేశికులు పండితారాధ్యుల మనవడి కాళ్లు కడిగి దీక్షపుచ్చుకున్నాడన్న సిద్ధేశ్వరచరిత్ర పంక్తులు (పుట 121) నమ్మదగినవికావు.

గణపతి దేవుడు ఘనత వహించిన కాకతీయ చక్రవర్తి ఇష్టాపూర్తం రాజధర్మం. శివుడికే కాకుండా విష్ణువు (కేశవుడికి)కి కూడా గుడులు కట్టించాడు దేవాలయస్థాపన వీరశైవ విరుద్ధం తన గురువు విశ్వేశ్వరశివాచార్యులు కట్టించి. మందడంలోని మఠం గణపతి రుద్రమదేవుల విశాల హృదయాలకు నిదర్శనం.




వారు స్వయంభు స్థావరలింగ పూజానిష్ఠులు.

మల్లికార్జున చరిత్రకుగాని, మతాశయాలకు గాని రెండేరెండు గ్రంథాలు మనకు శరణ్యం. ఒకటి పండితునికృతి అసంపూర్ణ శివతత్త్వసారం. రెండోది సోమన కృతమల్లికార్జున పండితారాధ్య చరిత్రం.

సోమనకు కర్ణాటక లింగాయతమతవీరుడు బసవన్నను గూర్చివిన్నదేకాని కన్నదికాదు త్రిపురాంతకంలో శివయోగులగోష్ఠిలో అనుషంగికంగా పుట్టిందే బసవపురాణం సోమన్నే స్వయంగా చెప్పుకున్నాడు

ఇక పండితారాధ్యులను గురించి తెలుసును కాబట్టే కథాసూత్రం ఎవరినీ అడగలేదు.

పండితుడు శ్రీశైలంలో పుట్టాడు. ద్రాక్షారామంలో పుట్టాడన్నది అసంబద్ధం.

తలిదండ్రులు గౌరాంబా భీమయ పండితులు అప్పటికి శ్రీశైలంలో ఉన్నారు ఆ దేవుని కృపవల్ల కుమారుడు పుట్టాడు. అందుకనే అతని పేరు పెట్టారు.

"అగణిత ప్రీతిదక్షారామమునకు
జని"

అని సోమన స్పష్టంగా రాశాడు. అనుభవసారంలో పండితయ్యగారిని మూడు పద్యాలలో ప్రస్తుతించాడు. పాలకుర్తి వీడి సోమన శ్రీశైలం చేరుకున్న తరవాత పండితారాధ్యుని గురించి అక్కడ పరిచయమై ఉంటుంది.

దాక్షారామం చేరేవరకు పండితారాధ్యుడికి దీక్షలేనట్లు అనుకోవాలి. అప్పటికి సకలవిద్యలు గ్రహించాడు. కోటిఫలి (కోటిపల్లి) ఆరాధ్యదేవుచేత 'వీరశైవోక్తంగా (పుట 80) ప్రాణ లింగం పొందాడని సోమన చెప్పాడు, పండితుడు హస్త లింగార్చన చేసినట్లు.

అభిరమ్యలీల లింగార్చనసేయ
నభిముఖుండై హృదయాబ్జకర్ణికను
లెప్పమౌ తన ప్రాణలింగంబు సజ్జ
నుప్పతింపుడు (పం. చ. పుట 178)

అని సోమన స్పష్టంగా చెప్పాడు. ఆ తరవాత బెజ్జేవి వేమనారాధ్యులు మొదలయినవారు తనను దర్శించడానికి వచ్చినప్పుడు పండితుని మహిమవల్ల కరస్థలంలోని లింగం అంతరిక్షంలో కొంతసేపు నిలిచి ఉంది. (పుట దీక్షా. 152) సోమన ఇంతస్పష్టంగా చెప్పినా శ్రీమతి లలితాంబగారు పండితునికి ఇవి ఆరోపింపబడ్డాయని అంటున్నారు.

## బ్రహ్మాంబుతో పొత్తు

మల్లికార్జునుడి తండ్రి భీమన పండితుడు
"విద్వన్మహిష్ఠుండు, సద్బ్రాహ్మణోత్తముడు."

సోమన చెప్పిన ఈ రెండు విశేషణాలు అంగీకరించవచ్చు. అతడు భీమన పండితునకు కలిగిన 'వీరభక్తి సత్తముడు' అన్న విశేషణం మాత్రం సోమన్నకు ఇష్టమై ఉండొచ్చు. అది చారిత్రక విరుద్ధం. దాక్షారామంలోని బ్రాహ్మణులు భీమన పండితునే విమర్శించేవారు. కాని వారు వేలెత్తి చూపింది కొడుకు మల్లికార్జునుని మాత్రమే. వీరభక్తి తమిళం దేశం నయన్మారులది. అంతకుముందు శైవభక్తులది. ఈ వీరభక్తిని పునరుద్ధరించిన వారే బసవేశ్వరుడు-మల్లికార్జునుడు. బసవేశ్వరుని వచనాల్లో, నిత్యజీవితంలో ఇది సాక్షాత్కారం చెందుతూనే ఉంటుంది అయితే మల్లికార్జున పండితుడు కూడా కోటిఫల ఆరాధ్యుల నుండి వీరభక్తి దీక్షాది వివిధ సంస్కారాలు పొందాడని సోమన చెప్పాడు. (పం. చ పుట 29), శివుడు కూడా "వీరభక్తిస్థం విశ్రుతాచార సార్వతాది నిష్ఠాపరత్వం" పండితుడికి ప్రసాదించాడు.

మల్లికార్జునుడు వేనాటి చోడని గురువు బౌద్ధాచార్యుని సవాలును ఎదుర్కొనుటకు ద్రాక్షారామం నుండి చందవోలుకి బయలుదేరాడు. ఆయన వెంట

పరమ లింగార్చనాపరులు స్వాధ్యాయ
పరులనై చను బ్రాహ్మణోత్తములు
సదువుచు వేదభాష్యముల్ చెప్పుచు
ముదమున నిరుదెసమొక్కుచునదర (పం. చ. వాదం పుట 516)

అంతేకాదు, నాలుగు వేదాలు, ఉపనిషత్తులు కూడా వల్లిస్తూ పై బ్రాహ్మణోత్తములు వచ్చినట్లు ముందు పుటల్లో వర్ణితమైంది, పరిశోధకులు పై నాలుగు పంక్తులే ఉదాహరిస్తూ వచ్చారు. అసలు ఇక్కడ చెప్పవలసినది లింగార్చనాపరులైన బ్రాహ్మణోత్తములు అని అర్థం. పండితారాధ్యుని వీరభక్తి సవైదికం అని చెప్పటానికి ఇంతకంటె వేరే ప్రమాణాలు చూపనక్కరలేదు.

ఇక్కడ ఉటంకించిన ముఖ్యాంశాలు ఉన్నాయి. మల్లికార్జునిని తండ్రి భీమయ సద్బ్రాహ్మణోత్తముడు అదే విధంగా దాక్షారామం విప్రులు కూడా పండితయ్యను సంభావించారు. మల్లికార్జునిని చూడటానికి తెలంగాణం నుండి వచ్చిన బెలిదేవి వేమనారాధ్యులు చతుర్వేద పారగుడు (పం. చ. పురాతన పుట 480) అతనిని అయ్యవారనే పిలిచేవారు (431వ పుట)

"ఘంటికిలపాశుపతి జ్ఞానమూర్తి" పరమ వీరవ్రత పదచక్రవర్తి(440 పుట). పోరండ్ల సూరసానమ్మ బ్రాహ్మణ వితంతువు. ఆమె ఉండే బ్రాహ్మణాగ్రహారంలో మాలవాడొచ్చేదనేకదా అచటి వైదికవిప్రులగోల. ఇక మిగిలినవాడు పాల్కురికి సోమన. అతని శ్రోత పాల్కురికిసూరయ్య. సోమన తాను చతుర్వేద పారగుడనని చెప్పుకున్నాడు (పుట 15)

"వీరభక్తి సవైదికంబునను" చతుర్వేదసారం రచించారు. (పుట 11, పండితారాధ్య శ్రోత సూరయ్య ఆపస్తంబ సూత్రుడు, హరితస గోత్రుడని), తనకు ముద్దుమరది, నెచ్చెలికాడని సోమనే చెప్పాడు. అయితే ఆ చెప్పడంలో సూరయ్య బసవాంతరంగుడని, బసవేశునకు దక్కినబంటని, నేత్రాలు శివుని కర్పించి తిరిగి పొంది వీరభక్తి వర్ధనుడని పేరు పొందాడని సోమన చెప్పాడు (పుటలు 15-16)

బసవేశుని సిందార పూజించి ఒడలు తెలియని పారవశ్యంతో బసవపురాణం రాసిన పాల్కురికి సోమన శైవబ్రాహ్మణులను గూర్చి ఎక్కువగా చెప్పాడు. ఇందులో పక్షపాతం చూపెట్టాడు. సోమన దృష్టిలో వీరశైవాన్ని సవైదికం చేయడమే ధ్యేయం. చతుర్వేదసారం అందుకే రచించాడు. మల్లికార్జున పండితారాధ్యుని చరిత్ర అందుకే రచించాడు. స్థావరలింగమైన శ్రీశైలం మల్లికార్జునునిమీద వీరిద్దరికి ఉన్నంతవలపు చెప్పతరంకాదు. శ్రీశైలంలో శివరాత్రి చెల్లింపమని శిష్యుడు దోనయకు ఆదేశించి అతను యాత్రముగించుకుని వచ్చిన తరువాత అసువులను వీడినవాడు మల్లికార్జునుడు. పాశుపతులకు స్థావర లింగపూజ విధిగానున్నట్లు పురాణాలవల్ల తెలుస్తోంది.

## మల్లికార్జున పండితారాధ్య అవతార పరిసమాప్తి

వెల్లటూరులో ఆత్మసంతతితో కులసతీ సమేతంగా పండితుడు లింగైక్యం చెందినట్లు సోమన తెలిపాడు. దానితో పండితారాధ్య వంశంకూడా సమాప్తం చెందినట్లే. అయితే పండితునిచేత దీక్ష పుచ్చుకున్న దోనయ కేదారయ్య అనే "అపూర్వ తనూజుని" ఎక్కడినుండో తెచ్చి లోకారాధ్య పట్టంకట్టాడు.

మల్లికార్జున పండితారాధ్యులవారి చరమదశ తలచుకుంటే తిక్కన చెప్పిన శ్రీకృష్ణనిర్యాణం జ్ఞాపకం వస్తుంది"

శ్రీశైల వల్లభ ! నీయాజ్ఞ ! వచ్చిన పనులు
చెల్లబెట్టితి భక్తి చేవదలిర్ప
వాసనతో బసవనయు నీగర్భ
వాసంబు బొచ్చె దేవా పర్వతేంద్ర మల్లి
కార్జున పండితుడనగ నిచ్చోలు
నుండుటకంటె నెన్నండొకో ప్రమధ
మండలిలో భవన్మహదాజ్ఞ జేసి
యుండంగ గాంతు నొకో"

(అని దీనంగా వృద్ధాప్యంలో తనకు జన్మనిచ్చిన శ్రీశైల వల్లభుని కోరుకున్నాడు పం. చ. పుట పర్వత 5445) శ్రీకృష్ణుడు

తన యగ్రజుడు చన్నయచ్చటు వాసి యం
  తంత గ్రుమ్మరుచు మురారి సకల
లోక పావనకు భూలోకమునందు దా
  బుట్టంగ వలసినయట్టి మేటి
పనులెల్ల దీరుట మనమున దలపోసి
  తను విముక్తికి నిమిత్తంబు దలచి
మునుల వాక్యంబుల తెరంగును తొల్లి దుర్వాసు
  నవయవసమితి పాయసంబుపూయు
నప్పుడు రకాలబూయని నత్తపస్వి
నచట యవిలింఘ్యమై యపాయంబుగలుగు
ననిన మాటయును జర్చించి మనసు నింద్రి
యములు నడగించి గాఢ సమాధి నొందె

(మౌసల 80)

అన్న బలరాముడు పోయినట్టె బసవన కూడలి సంగమ గర్భంలో లీనమైనాడు. తనకు పుట్టంగవలసిన యట్టి మేటి పనులు తీరాయి. పండితుడు వచ్చిన పనులెల్ల చెల్లబెట్టాడు. కృష్ణభగవానుడు తను విముక్తి నిమిత్తాన్ని తలపోసుకున్నాడు. ఇచ్చోట ఉండటంకంటె ప్రమధలోకంలో ఉండటం మేలనుకున్నాడు పండితయ్య ఇక పోతే పండితయ్య తిక్కన వార్ధక్యంలో ఒకే భావనతో ఉన్నట్లు కూడా గోచరిస్తుంది.

జనన మరణాదులైన సంసార దురిత
ములకు నగపడకుండంగ దొలగు తెరువు
గను వెలుంగునకిచ్చితి ననిన లేచి
నిలిచి సంతోష మెదనిండ నిలువుకొ నగ

(విరాట 1-24)

అని తిక్కనకు కావలసిన వరం హరిహరనాథుడు ప్రసాదించాడు.

దొనయ్య శ్రీశైలయాత్ర తన పంపున ముగించుకొని వచ్చినందుకు పరమానందభరితుడై

"దేవ యీ సంసార తీవ్రదుఃఖాబ్ధి
నావాడు వీడు నుండీ వేరుకాడు"

అని పరమేశ్వరుని ప్రార్థించినాడు.



లో వెలి ప్రమథాదిలోకం బెరుంగ

తిక్కన, పాల్కురికి సోమన సంవాద వాక్యాలనుచూస్తే ఎవరుముందా అని ప్రశ్నరాక మానదు.

మల్లికార్జునపండితుడు లింగధారణములేని పాశుపత మత ప్రవర్తకుడు గాని వీర శైవుడు కాడని, తెలుగునాటి ఆరాధ్యులు పూర్వము లింగధారులనుటకుగాని, కృష్ణరాయలకు పూర్వము బ్రాహ్మణులలో లింగధారణ నుండెననుటకు గాని యాధారములు గానరావని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణ పీఠికలో రాశారు.

ఇందుకు ప్రతిగా కైలాసవాసి బండారు తమ్మయగారు విభూతి పత్రికలో 'ఆచార్య పండితుడు' అనే వ్యాసంలో పీరి విమర్శ సాగించారు. వారు ఆరాధ్యలను గూర్చి రాస్తూ.

"అప్పటి ఆరాధ్య బ్రాహ్మణులకు నిప్పటివారికి హస్తిమశకాంతర ముండె ననుట నిర్వివాదము అప్పటివారు బసవేశ్వరునివలె కేవల వీర శైవులలో బూర్తిగ కలియకపోయినను శివులగు బ్రాహ్మణులతో నెట్టి సంపర్కమునులేక కేవల వీర శైవుల తోడనే యెక్కువ సాహచర్యాదులను గలిగియుండిరి. ఇప్పటివారి వర్తన మందుకు గేవలము విపరీతము" అని చెణుకులు తగిలించారు.

కాని వారి రాతలోని అసంగత్వం కొట్టవచ్చినట్లు కనిపిస్తూనే ఉంది. అప్పటి ఆరాధ్యులు "బసవేశ్వరునివలె కేవల వీరశైవులలో బూర్తిగ కలియకపోయినను" అంటే బసవేశ్వరుడు వీరశైవులలో పూర్తిగ కలవలేదను విపరీతార్థం రావటం లేదా. ఇందులో 'కేవల వీరశైవులు' ఎవరో వారు చెప్పలేదు. పైగా బసవేశ్వరుడే వీరశైవులలో కలియకపోతే బసవన వ్యక్తిత్వానికే కళంకంకాదా ?

ఈనాటి ఆరాధ్యులను తమ్మయగారి వంటివారు తేలికగా తీసివేయుట ధర్మంకాదు. వారి ప్రథమవ్యాసం ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక ప్రచురించింది.

వారి వ్యాసాలను 'భారతి' పత్రిక ఆదరించింది. వారికి, వారి వ్యాసాలకు ఆంధ్రపత్రికాధిపతులు ఆరాధ్యశైవులు పరమ ప్రమాణంగా గుర్తించి వారి వీర శైవ సాహిత్యసేవకు దోహదంచేస్తే ఇప్పటివారు (ఆరాధ్యులు) వర్తన బాగు లేదనడం తమ్మయగారి వంటి విద్వత్ప్రకాండులకు తగనిపని. ఇదేవ్యాసంలో తమ్మయగారు ముదిగొండ నాగలింగ శాస్త్రిగారినిగూర్చి రాస్తూ "ఆంధ్ర వీరశైవ లోకము వారికెంతయు కృతజ్ఞత చూపగలదని" కృతజ్ఞతలు తెలిపేరే ! నాగలింగ శాస్త్రిగారు ఆరాధ్యులుకారా ? ఈ కృతజ్ఞతలు దేనికంటె వేటూరివారి బసవపురాణ పీఠికమీద విమర్శ రాసినందుకు వేటూరివారు ఆరాధ్యులు కాకపోయిన తెలుగు దేశంలో ఆరాధనీయులయిన విద్వాంసులు.

"అగమార్థాను సంధాతా
రాగ మోహాది వర్జితః
ధ్యాన, జ్ఞానసమాయుక్తః
ఆరాధ్యస్తే" అనిగదా పూర్వులవచనం.

**ఇవటూరివారు**

పండితారాధ్యుని తరవాత కేదారయ్య లోకారాధ్యపట్టానికి నియమితుడయ్యాడు. ఇతని శైవసంతానంలో ఇవటూరి సోమనాథయ్య ప్రధాన శిష్యుడు. క్రీ. శ. 1215లో పిల్లలమర్రి బేతిరెడ్డి భార్య ఎరకసానమ్మ వేయించిన శాసనంలో ఇవటూరి సోమయ కనబడుతున్నాడు. పిల్లలమర్రిలో ఎరకసానమ్మ ఎరకేశ్వర దేవునికి దానమిచ్చింది. "మూలస్థాన దేవరకు ఇవటూరి సోమయ ప్రతిష్టచేసిన శ్రీ బేతేశ్వర ఎరకేశ్వరదేవరలకు ' కొంత కట్టడిచేసినట్లు ఆ శాసనంలో ఉంది. ఈ సోమయయే సోమనాథయ్య కావచ్చు. ఇవటూరి సోమశేఖరుడొకడు బమ్మెర పోతనామాత్యునికి గురువుగా ఉన్నాడు. వీరభద్ర విజయంలో 'సోమనాథసముడు సోమగురుడు' అని పోతన తనగురువును స్తుతించినాడు. పోతనవంశంలోని కేసన మల్లన కవులు "దాక్షాయణీ వివాహం" అనే గ్రంథంలో తమగురువు "ఇవటూరి ముక్తి నాగేశ సద్గురు భక్తిచేత ఆదిమశైవులయినట్లు" తెలిపారు. వేమన గురువులలో సోమశేఖరుడొకడున్నట్లు తెలుస్తుంది.




ఇవటూరివారుకూడా ఆరాధ్య గురుపీఠాన్ని పొందారు. వీరు మల్లికార్జున పండితారాధ్యుల కోవకు చెందినా మల్లికార్జున పండిత సంతతివారని చెప్పకోలేదు. ఇవటూరి సోమయ్య స్థావర లింగ ప్రతిష్ఠ చేసినట్లు పై శాసనంవల్ల తెలిసింది. ఇతను వీరశైవుడు కాడని స్పష్టమయింది. పాశుపత శాఖీయుడు కానోపు.

ముదిగొండవారికి మూలగురువు ఉద్భటాచార్యుడు. ఇతనికి ఖననంలేదు. దహనమే. ముంజి భోజునికి దీక్ష ఇచ్చినది శాంభవమే. ఉద్భటుని సహాయంతో భోజుడు 'తత్త్వప్రకాశిక' అనే పాశుపత సిద్ధాంత గ్రంథాన్ని రాశాడు.

ములుగువారు వేమనారాధ్యుణ్ణి, మల్లంపల్లివారు ఏకోరాముణ్ణి, కాశీనాథునివారు రేవణున్ని మూలపురుషులుగా స్మరిస్తున్నారు.

సంఖ్యా సూచికాధారాలు

వీరశైవ లక్షణాలను, ఆచార వ్యవహారాలను గూర్చి

అ. ఎ హాండ్‌బుక్ ఆఫ్ వీర శైవిజమ్. ఎస్. సి. నందిమఠ్. రివైజ్‌డ్ ఎడిషన్ 1979. మోతీలాల్ బెనారసీదాస్ ఢిల్లీ-7.

శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మ ఆంధ్ర వివృతి

ఆ. సిద్ధాన్త శిఖామణి-శివయోగి శివాచార్య, సాధన గ్రంథమండలి, తెనాలి, ముద్రణతేది లేదు. పీఠికాకర్తల తేది 28-8-1961.

ఇ. శ్రీ వీరశైవ సిద్ధాంతశిరోమణి-డా. కె. యం. రుద్రప్ప, హైదరాబాద్ దక్కన్, 1938.

బసవపురాణం-పాల్కురికి సోమనాథుడు-పరిష్కర్త, పీఠికాకర్త వేటూరి ప్రభాకరశాస్త్రి, ఆంధ్ర గ్రంథమాల, మదరాసు 1926.

పండితారాధ్య చరిత్ర, ఆంధ్ర గ్రంథమాల, 1939.

పరిష్కర్త, పీఠికాకర్త డా. చిలుకూరి నారాయణరావు.

జర్నల్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ ఏప్రిల్ 1975.

ది గోళక స్కూల్ ఆఫ్ శైవిజం ఇన్ ది టామిల్ కంట్రీ.

వ్యాసకర్త ప్రొ. బి. జి. ఎల్. స్వామి.

బసవేశ్వర వచనాలు – సమగ్ర సమీక్ష – డా. బిడాల రామయ్య సిద్ధాంత వ్యాసం ప్రకాశకులు తరళబాళు జగద్గురు విద్యాసంస్థ, సిరిగెరె, కర్నాటక 1976,

శివతత్త్వ సారము – పరిష్కర్త కొమర్రాజు వేంకటలక్ష్మణరావు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు 1922.

తిక్కన – వివరాలు, మౌసల పర్వాలు వావిళ్ళ ప్రచురణ.

మార్కాపురశాసనము. ఆ. సా. ప. పత్రిక సం. 1. సం. 4. 1924.

# మహాకవిః

## ప్రభంజనః

జ్వాలాశైల ఇవాచిరం జ్వలతి యో౽న్యాయం విలోక్యాభితః,
ప్రాలేయాద్రి రివాచి రాద్ద్రవతి యో దృష్ట్వా దయావంచితాన్,
డోలాడింభక వన్మ హూర్హసతి యః సంవీక్ష్య చిత్రాకృతీః
ప్రత్యంగం స మహాకవిర్భవతి "తే సర్వేపరే" నీరసాః ॥

జానం స్వీయం స్వవాణ్యైవ
విద్యుద్ధ్వంతం కరోతియః ।
స ఏవ కవినామార్హ
శ్శేషాస్సర్వే నిరర్థకాః ॥

స్థానే ధర్మోపదేశం యః
కరోత్యుచ్చైశ్చర్య ధేచ్ఛయా ।
సఏవ కవివాచ్యార్హ
ఇతరే కవి మానినః ।

ఆక్రోశశ్చాపి సీత్కారః
ప్రచారశ్చ చమత్కృతిః ।
కవిత్వం నైవ మన్యన్తే
స్వాత్మా విష్కరణం వినా ॥

దౌర్జన్యమేవ కవ్యగ్నేః
సర్వదా భవతీంధనమ్ ।
కదాపి తద్వినాలోకో
నా భూత్చన భవిష్యతి ॥

కంఠేయేన విభూష్యన్తే
శ్వసన్తం ః పవనాశనాః ।
తేనైవ మూర్ధ్ని బధ్యేతే
స్వర్ణదీచ సుధాకరః ॥

వహ్నిం వర్షంతి యోనేత్రాత్
త్రిలోకీ దహన క్షమమ్ ।
భోక్తుం సఏవ శక్నోతి
బీతావహం హలా హలమ్॥

మహోన్నతం తుషారాద్రే
ర్విశాలం శాంత సాగరాత్ ।
జ్వాలా భీలంచ 'ఎట్నాయాః'
నిస్తులం హృదయం కవేః ॥

[ఎట్నా- సిసిలీలోని అగ్ని పర్వతం)

సుందరం నందనోద్యానాత్
శీతలం మలయానిలాత్ ।
"చాలెంజ"రాచ్చ గంభీర
మనస్వయం మనః కవేః ॥

[ఛాలెంజర్- పసిఫిక్ సముద్రంలోకెల్లా లోతయినచోటు. ఛాలెంజర్ డీప్)

దౌర్జన్యాక్రమపంక నాశనకరం యస్యాస్తి తేజోరవేః
భేరీనాదలయాన్విత స్సుమధురో యస్యాస్తి సింధోర్ధ్వనిః ।
లోకాలోకవణా, త్రికాల గమనా యస్యాస్తి దృష్టిర్మనేః
స్వోపజ్ఞామహితం మహాకవి పదం తస్యైవ సంశోభతే ॥

## ప్రాణకుటి రత్నరుచి

శ్రీ వైకుంఠుని నాల్గు బాహువులు పొల్చెన్ నాల్గు కంబాలుగా
నావక్షః కుట. కందు నిల్చెకరుణా పాంగాభి రామన్ రమన్,
సేవాకాంక్షను కౌస్తుభాంచిత మొనర్చెన్. సామి, హృద్వాటికన్
శ్రీవల్లీ తను వల్లికా రుచికనెన్ సిగ్గందె తానంతటన్ !

రమ్య హర్మ్యాంగణ కనకలతయెకాదొ?
పావమేలనొ, మా స్వామి! దీపమచట?
గుండె గుడి కట్టినాడవు గొప్పగాను
సామి, ఆ భీరతను వీడ,వేమి తెలివి !

నిస్తులానందవల్లికా కౌస్తుభమ్ము
తరణికై చూపు దీపమ్ము కరణితోచె,
అంటుకొన్నదొ నీ లాభమంటుకొనెడి
నిన్ను, నీరూపు చూచుచు-నీటుకాడ !
మచ్చవచ్చెడి పనులేల ? మానుకొమ్ము ! ।

మాధవోరో హరినీల సౌధసోదా
మనికి ఏలనొ మణిదీప మనగ, సామి !
తెలిసికోవేమి? నీ కారునలుపులీను
రూపు మా ప్రాణకుటి రత్నరుచియెకాదొ !

**శ్రీ శ్రీనివాస రామానుజమ్**

## వర్తమానం

చెట్లు కూలుస్తున్నారా.
కూల్చండి కూల్చండి
నాగరికత పేరుతో
నగరాలు పెంచండి.

రాళ్ళు పేలుస్తున్నారా
పేల్చండి పేల్చండి
కలవారి భవనాలు
చెమటోడ్చి కట్టండి.

చచ్చేట్టు చదువుతున్నారా
చదవండి చదవండి
చదువుల్లో సారాన్ని
తెల్లవాడి కమ్మండి.

కవిత అల్లుతున్నారా
అల్లండి అల్లండి
కత్రిమొద్దు సరంబీకి
జరీ రంగు పులమండి.

**శ్రీ కొండవీటి లీలామోహనరావు.**

## డాక్టర్ ఘంటా జవహర్‌లాల్

# రామతీర్థంలో దుర్గమ్మకొండ

రామతీర్థం విజయనగరం జిల్లాలో నున్న చిన్న గ్రామం. ప్రాచీన కట్టడములతోను, చారిత్రి కావశేషములతో నిండి విజయనగర పట్టణమునకు 16 కి. మీ. దూరములో నున్నది. చేరుటకు బస్సు సౌకర్యం కలదు. నేడు రామతీర్థం విజయనగరం జిల్లాలో గల హిందూ పుణ్య స్థలములలో నొకటి. కాని ప్రాచీన చరిత్ర దీనికి భిన్నముగా కన్పడుచున్నది. బౌద్ధ, జైనమతస్థులకు నొకప్పుడు రామతీర్థం పరమ పవిత్ర క్షేత్రం. బౌద్ధ స్థూపములు, జైనగుహలు నేటికి మనం రామతీర్థం కొండపై జూడవచ్చును. కొండపైన, దిగువున గల రామాలయములే నేటికి భక్తులను ఆకర్షించుచున్నవి. ఇవే ప్రస్తుతం ఇక్కడ జీవ దేవాలయాలు.

రామతీర్థం కొండపై గల ముఖ్య ప్రదేశాలలో దుర్గ పంచగుహ ముఖ్యమైనది. (1 వ చిత్రము జూడుము.) దానినే స్థానికులు దుర్గమ్మకొండ అంటారు. ఇది భారత ప్రభుత్వ రక్షిత స్మారక చిహ్నము. భారత ప్రభుత్వ రికార్డులలో దీనిని దుర్గ పంచగుహగా పేర్కొన్నారు. పేరు వినగానే హిందూ మత పరంగా దుర్గాదేవి గుహగా వూహించటం సహజమే. క్షుణ్ణంగా పరికించి పరిశోధించిన ఇది జైనగుహగా గుర్తించనగును. ఈ గుహలో జైనశాసనము, చిత్రించిన జిన ప్రతిమారూపమును నేటికీ మనం జూడవచ్చును. చరిత్ర పరిశోధకులు గూడా జిన శాసనమును గుర్తించిరి. జిన ప్రతిమా రూపాన్ని చూచిరి. (2 - వ చిత్రము జూడుడు.) అయినా దీనిని దుర్గ పంచగుహగా వారి రికార్డులలో పేర్కొన్నారు. అట్లు పేర్కొనుటకు గల కారణాలను, రామతీర్థం జిన క్షేత్రంగా ప్రఖ్యాతిగాంచుటకు గల విశేషాలను పరిశీలిద్దాం.

పూర్వం కల్యాణ కారకం గ్రంథ కర్తయగు ఉగ్రాదిత్యుడు తన గురువగు శ్రీనందుని పర్యవేక్షణలో విజ్ఞాన శాస్త్రములను రామగిరి కొండపై చదువుకొన్నట్లు, శ్రీనందుడు శ్రీవిష్ణురాజ - పరమేశ్వరునికి రాజగురువు. అటువంటి శ్రీనందుని యాజ్ఞాను సారం ఉగ్రాదిత్యుడు. సర్వజనోద్ధరణార్థం కల్యాణ కారకమను గ్రంథమును, జినగుహలతోను, దేవాలయములతో మనోహరముగా ప్రకాశించుచున్న రామగిరి కొండపై నివశించి వ్రాసినట్లు సాహిత్య పరంగా తెలియుచున్నది. రామగిరి వేంగీ దేశములో నున్నట్లు గూడా ఆ గ్రంథము పేర్కొన్నది. పై ఆధారములను క్షుణ్ణంగా పరిశీలించి శ్రీ జె. పి. జైను గారు రామగిరిని విజయనగరం దాపున నున్న రామతీర్థం గాను, విష్ణురాజ పరమేశ్వరుని వేంగీ ప్రభువగు నాల్గవ విష్ణువర్ధనుడుగా (క్రీ.శ. 762-99) గుర్తించిరి.



జైన గుహ దృశ్యము గిచిన జినమునిని చూడవచ్చు



దుర్గమ్మకొండ రామతీర్థం, విజయనగరం జిల్లా

ఆయన విష్ణువర్ధనుని కాలము నాటికి ప్రస్తుత రామతీర్థం జైనక్షేత్రముగా వర్ధిల్లినదని కల్యాణకారకమను గ్రంథమువలన తెలియుచున్నది నేటికీ దుర్గ కొండపై జిన ప్రతిమలు గల గుహ నాటి జిన శోభకు తార్కాణంగా నిల్చియున్నది.

పైన పేర్కొన్నట్లు, జైనగుహలో జిన ప్రతిమ రూపానికి దిగువున జిన శాసనమున్నది (4). ఆ శాసనము మూలంగా విమలాదిత్యుని మత గురువగు త్రికాలయోగి సిద్ధాంతదేవుడు. జినక్షేత్రమగు రామకొండను సందర్శించినట్లు మనకు తెలియుచున్నది. విమలాదిత్యుడు 11-వ శతాబ్దమునకు చెందినవాడు. వారి మతగురువు సిద్ధాంతదేవుడు దేశిగణమునకు చెందినట్లు పై శాసనం పేర్కొనుచున్నది. పైన పేర్కొన్నధారములను బట్టి రామతీర్థం 8-వ శతాబ్దమునుండి 11-వ శతాబ్దమువరకు తూర్పు చాళుక్యుల నేతృత్వములో జైనమత క్షేత్రముగా ప్రసిద్ధిచెంది, విద్యానిలయమైనట్లు బోధపడుచున్నది.

జినక్షేత్రమై జినగుహలున్న కొండను దుర్గమ్మకొండగా, దుర్గపంచ గుహగా పేర్కొనుటకు గల కారణమేమై వుండును ? పరికించి చూడగా, గుహకు కుడివైపున చతుర్భుజములు కల్గి సుఖాశీనురాలై కుడికాలు పీఠము క్రిందికి వ్రేలాడినట్లు శిల్పించిన దేవిమూర్తి విగ్రహమున్నది. (3-వ చిత్రమును జూడుడు) పీఠముపై సింహలాంఛనము చెక్కబడి వుంది బహుశా యీ సింహలాంఛనము గల దేవీమూర్తిని దుర్గగా భ్రమించి జిన గుహను దుర్గ గుహగా చరిత్రకారులు పేర్కొని వుండవచ్చును. తదుపరి చారిత్రక పరిశోధకులు దీనిపై దృష్టి నిలిపినట్లు కన్పించదు. పై దేవీమూర్తిని చూసిన వెంటనే ఎవరికైనా దుర్గగా గోచరించుట సహజం. ఆగమ శాస్త్రాలుగూడా దుర్గకు సింహం, పులి వాహనాలున్నట్లు పేర్కొన్నాయి కాని జిన మతానుసారం పరికించిన ఇది తప్పుగా బోధపడును.

జిన మతానుసారం జైనమతము 24-తీర్థంకరులచే ప్రబోధింపబడినది. జిన మతములో యీ 24 తీర్థంకరులు భగవత్ స్వరూపులు, పూజార్హులు. వీరందరికి హైందవ దేవుళ్ళవలె వాహనాలున్నవి. అట్లే అందరికీ యక్షులు, యక్షిణులు పరివార దేవతలున్నారు. వీరినే శాసన దేవుళ్ళు, మరియు దేవతలుగా వ్యవహరింతురు. రూపమండనములో వీటి వివరణ చాలా విపులంగా వుంది.



దేవి మూర్తి: శిద్ధాయిక?

జినమతములో సింహం లాంఛనముగా గల శాసన దేవతలు ఇద్దరున్నారు. వారు అంబిక మరియు సిద్ధాయిక. అంబికనేమి నాధుని (22-వ తీర్థంకరుడు) శాసన దేవతలు ఈ రెండింటిలో జిన గుహలో గల దేవీమూర్తిని శిద్ధాయికగా గుర్తించుట సమంజసము. ఏలయన శాస్త్ర పరంగా జినాంబిక సింహం లాంఛనం గల్గి రెండుచేతులు కల్గి, మామిడికాయ గుత్తులు, పిల్లలు మొదలగు వివిధ వస్తువులు ధరించి వుండాలి. ఈ వర్గమునకు భిన్నంగా రామతీర్థంలోని జినగుహ యందుగల దేవీమూర్తి శిల్పించబడినది.

ఇక శిద్ధాయక జిన తీర్థంకరులలో కడపటి వాడగు మహావీరుని శాసనదేవత. శాస్త్రపరంగా చతుర్భుజములు కల్గివుండి, విధిగా పుస్తకం కల్గి వుండాలి. ప్రస్తుత జినదేవత శిద్ధాయిక వర్ణనకు కడు సమీపంలోనున్నది. జిన గుహ కడు చీకటి మూలంగా ఛాయాచిత్రం సరిగ్గా లేనందున వివరణలను వివరంగా గుర్తించుట కష్టతరముగా నున్నది. అయినా చతుర్భుజములు కల్గి, సింహ లాంఛనముతో వున్నది. ఇందు సందేహములేదు. అయిన రామతీర్థంలోని జైన గుహ యందున్న దేవీమూర్తిని దుర్గగా భ్రమించి జినగుహను దుర్గమ్మకొండగా గుర్తించి యుండవచ్చును. నిజానికి రూపంలో దుర్గకు సామ్యంలోనున్నా, ఆ దేవీమూర్తిని జినదేవతయగు శిద్ధాయికగా గుర్తించుటే సమంజసము, సహేతుకం. పైగా జినగుహలో దుర్గశిల్పం శిల్పించుట కడు విడ్డూరం, అసంగతం గూడాను. పై పరిశోధన దృష్ట్యా రామతీర్థంలోని దుర్గమ్మ కొండను జిన కొండగా గుర్తించుట చరిత్ర సమ్మతం, సబబుగూడాను.

### పరిశీలించిన గ్రంథాలు


1. దక్షిణ భారత వార్షిక శాసనముల సంపుటి, 1918, అనుబంధం. చి. నం: 831. పుట 188.
2. జె. పి. జైన్; జైన్ సోర్సెస్ ఆఫ్ ది హిస్టరీ ఆఫ్ ఏన్షియన్ట్ ఇండియా పుట 205.
3. అదే పుట 206.
4. దక్షిణ భారత వార్షిక శాసనముల సంపుటి, 1918, పుట 134.
5. రూపమండనము, పుటలు 98 మరియు 99.


### సహగమనం

(29 వ పేజీ తరువాయి)

"పోనీ ఆసంగతి వదలిపెట్టు, నన్నుమరో సందేహం వేధిస్తోంది..."

"యేమిటది ?" రాజేష్ గొంతుకలో అవహేళన తొంగి చూసింది.

"మరి....మానవత్వమని పంచుకోని పనిచేస్తున్నామేమోనని...."

"అంటే ?!"

"జీవించే హక్కున్న ప్రాణిని బలవంతంగా, నిర్దాక్షిణ్యంగా...."

"నీకు పిచ్చిగాని యెక్కలేదుగదా ?" రాజేష్ అసహనంగా అడ్డు తగిలాడు.

సాగర్ బిక్కుబిక్కుమంటూ చూడసాగాడు.

"నీ చెల్లెలి జీవితం యిప్పుడు నాశనమైపోబోతోంది. దాన్నెలాగైనా అరికట్టడం నీ బాధ్యత, నీ డైలమాసిల్లీగా వుంది. నువ్విలా మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చుంటే చేయిదాటిపోతుంది. దేన్నయినా విరిచేయదలచుకున్నప్పుడు మొక్కగా వున్నప్పుడే ప్రయత్నించాలి. చేతులు కాలింతరువాత ఆకులుపట్టుకుంటే లాభం వుండదు...."

"అదికాదు రాజూ...."

"నువ్వడుగుతున్న సహాయం నేను చేయలేను. యీ పెళ్లికి మావాళ్లను వొప్పించడం యెంత కష్టమో నీకూ తెలుసు. యీ సమస్యను మరింత కాంప్లికేటెడ్‌గా మార్చుకోవడం నా కిష్టంలేదు...."

"ప్లీజ్ రాజూ...."

"నన్ను అర్థం చేసుకోవెందుకు నువ్వు ? 'క్లాడియస్'లా బ్రతకడం నా కిష్టంలేదు. అలాంటి జీవితాన్ని తలచుకోవడానికే వణుకుపుడుతోంది నాకు...."

"నువ్వు 'క్లాడియస్' వెలా అవుతావు ? 'హామ్లెట్' తండ్రిని చంపి, అతడి తల్లిని పెళ్లి చేసుకున్నవాడు క్లాడియస్. వాడొక యుజర్పర్, ద్రోహి, కానీ నువ్వు చేస్తున్న పని అదిగాదు. నిస్సహాయురాలైన స్త్రీకి పునర్జన్మ నిస్తున్నావు, ఆమె బిడ్డ నీకు అజన్మాంతం రుణపడి వుంటుంది...."

"నీ వూహ పొరబాటు, తండ్రిచనిపోయిన తరువాత. తన తల్లి మరోవ్యక్తిని పెళ్లిచేసుకున్నదన్న విషయం, ఆ బిడ్డకు తెలిస్తే యేమవుతుంది ? తల్లిపైన అసహ్యం కలుగుతుంది. తండ్రి స్థానంలోని వ్యక్తిపైన ప్రతీకారం తీర్చుకోవాలని అనిపిస్తుంది...."

"అలా యెందు కనుకోవాలి ? తన తల్లిసైతం మానవ మాత్రురాలేనన్న విషయం. ఆ బిడ్డకు తెలియక పోతుందా ?...."

"తల్లి కిచ్చిన స్థానం చాలా విలువైంది సాగర్ ! తన తల్లికి మిగిలిన ప్రపంచంలోని యేవ్యక్తి సాటిరాదని అనుకుంటారందరూ..."

"మరోసారి ఆలోచించి చూడు రాజూ !" సాగర్ ప్రాధేయపడ్డాడు.

"నువ్వేనా పరిస్థితిలో వుంటే యేం చేస్తావో చెప్పుసాగర్ చూద్దాం ! ఆదర్శాలు వల్లించి నంత సులభంగా ఆచరణలో పెట్టడం సాధ్యంగాదు...."

"రాజూ !"

"యెంత ఆదర్శాని కయినా కొన్నిహద్దులున్నాయి. నేను సైతం మానవుడ్నే గదా ! నన్ను మనీషిగా మారమంటున్నావు నువ్వు, నాచేతగాదు....అంటూ తేల్చి చెప్పేశాడు రాజేష్.

ఆనకట్ట తలుపులగుండా దుముకుతున్న జలపాతపు హోరు, సాగర్ చెవులకు కర్ణకఠోరంగా వినబడసాగింది.

( ఇంకా వుంది )

# రగడ

పాలడుగు వెంకటేశ్వరరావు



నయనానంద కరమైన పచ్చని మామిడి గుబుర్లనుండి - చిగుర్లు మెక్కిన కోయిలలు 'కుహూ కుహూ' మని పూ ఇదిగా కూతలు పెడ్తున్నయ్. చూపు ఆనినంత మేరా, పచ్చని తివాచీ పరిచినట్లున్న వరి పొలాల మీదుగా రివ్వు రివ్వున చిరుగాలి వీస్తూ పయనం సాగిస్తున్నది. పంట కాలవల్లో నీరు వొడ్డుల్ని వొరుసుకుంటూ నిండుగా పారుతూ వుంది. చేతిలోని కర్రతో పోటు గొట్టుకుంటూ, రామయ్య చెరువు కట్టనెక్కి వూరుకి అభిముఖంగా సాగబారాడు, మెల్లగా.

తూరుపు తెల తెల్లవార్తా వున్నది. ఉషోదయ ఉదయసంధ్యా సమయాన వూరికి మధ్యలో నిలబడి వున్న గుళ్ళోనుండి భక్తిగీతాలు వినవస్తున్నాయ్.

వూర్లోనుండి కలుపు తీతకని గుంపులు గుంపులుగా జనాలు, పొలాల వయిపుగా, సాగిపోతా వున్నారు - గలగలా కబుర్లు చెప్పుకుంటూ. బుజ్జమీద ఎరువుల బస్తాలు వేసుకుని రయితులు పొలాలకి తోలుకుని పోతా వున్నారు. బరువుగా అడుగులు వేస్తావున్న ఎద్దుల మెడలలో గంటలు గణగణా మోగుతా వున్నయ్.



ఆకులాళ్ళ ఇళ్ళల్లోనుండి కోళ్ళు. తోకలెత్తుకుని పరుగుల్దీస్తూ 'కుక్కురు కుక్కురు'మని అరుస్తా వున్నాయి. వాట్ని చూసి కుక్కలూ, తమ వంతు సందడి చేస్తా వున్నయ్.

ఎరువుల బస్తాని బుజాన కెత్తుకుని ఎదురుగా వచ్చాడు, కోటయ్య. అలుపు దీరటానికని ఎరువుల బస్తాని-గుడి పిట్టగోడ మీద దింపుకుని, ఎదురుగా వస్తా వున్న రామయ్యని ఎగాదిగా జూశాడు కోటయ్య, ముఖందుడుచుకుంటూ.

'వార్నీ! అప్పుడే పొలంబోయి వస్తావున్నావా, రామయ్యన్నా! నీ 'ఇది' దొంగల్దోల! అసలు నీకు రాత్రుళ్ళు నిద్దర బట్టదేంటేః!'- అన్నాడు ఆశ్చర్యంగా.

'అవున్రా! కోటయ్యా! దాయెద్దుల్లాంటి నలుగురు కొడుకుల్ని చేతుల్లో బెట్టుకుని ఇంకా నీకెందుకురా ఈ బరువు పన్లూః' అని రామయ్య అనేసరికి గల గలా నవ్వాడు కోటయ్య.

'ఏంట్రా ఆ నవ్వూః! ఆఁ!'

'మూడుకాళ్ళ ముసలాడివి నీకే ఆ యావ పోలేదు. పైగా నా గురించి ఏదో అంటా వున్నావు. ఇదంతా ఏంటో మరి! అని నవ్వుతున్నా లేవే'

'అంటే! ఏంట్రా నీ మాటల కర్థంః'

'అవునుగాని-ఇంకా పొలాలూ తోటలూ అంటూ పగలనకా రాత్రనకా వాటిని బట్టుక తిరుగుతా వున్నావు. నాకు దెలవకడుగుతాను గానీ నీకెందుకే ఆ తాపత్రయంః అసలు! అది జెప్పు ముందూ'

'ఒరే! ఆ సంగతి ఇప్పుడు నేను నీకు చెపితే తెలవదు. కొన్నేళ్ళు పోయి నాక - నువ్వూ నాలాగా అయినాక గానీ-నీ యంతట నీవు మాత్రమే తెలుసు కోగలవు. 'ఇది' ఈనాటిది గాదురా. నేను పుట్టి బుద్ధెరిగినప్పటినుంచి, ఇదుగో- బ్రతికి బట్ట గట్టగలిగిన ఈ క్షణం వరకూ - ఇన్ని సంవత్సరాలుగా పెరిగిన సంబంధంరా ఇదీ! అటువంటిది ఈనాడు బుజాలమీద జరీకండవాలు వ్రేలాడవేసు కుని పెత్తనాలు చేస్తూ తీర్పులు చెప్పబోయే - మీ మునసబులాంటి కుర్రవాళ్ళ లక్ష మాటలు చెప్పనీ - అంత తేలికనుకుంటున్నావంట్రాః!-"

కోటయ్య చుట్ట ముట్టించుకోవటంలో మునిగి పోయాడు.

'ఎండనకా వాననకా - పగలనకా రాత్రనకా శ్రమపడి నా రక్తం ధార పోశా్రనా నేను! నీకు తెలవదులే. ఎంత చమట ఖర్చయిందో! ఎన్ని తడవలు కన్నీళ్లు వాగులై పారాయోః ఒరే! ఈ పొలాలు నీళ్ళులేక ఎండిపోయి బిక్క మొహం పెట్టుకుని వున్నప్పుడు - చేతికి వచ్చిన పంట నాశనమయే పరిస్థితి ఎదురయినప్పుడు - గిలగిల్లాడి పసివెధవలాగా బావురుమని ఏడ్చాను. ఆ రోజుల్లో ఈ కాలవలు లేవు. ఈ నీళ్ళూ లేవు. వర్షాలు లేక చెరువు ఎండితే పొలాలు బీటలు వెయ్యాల్సిందే. ఇదంతా మొదట్లో ఎట్లా వుండేదనుకున్నావుః రాళ్ళూ రప్పలూ బండలూ తుప్పలూ పిచ్చిచెట్లూ, ఎత్తులూ వల్లాలూ. వీట్ని సరిజేసి ఈ పొలాల్ని పంట పొలాలుగా తయారుజెయ్యటం కన్న పని - ఎంత పనో ఈ కాలవు మనుషులకు తెలవదురా. రక్తం ధారపోసి కష్టపడ్డానురా. వీట్ని కన్నబిడ్డల్లాగా సాకానురా. ఒరే! కొన్ని సంవత్సరాలుపాటు ఏ ఫల సాయమూ లేకపోయినా — గోతికాడ నక్కల్లాగా—వీట్నే నమ్ముకుని కష్టపడి కనిపెట్టుకుని వున్నామురా. ఆ తర్వాత తర్వాతగాని, కాలం కర్మం కలిసి వచ్చి నవధాన్యాలూ, పళ్ళూ ఫలాలూ అందుతూ వుంటే ఆ సంతోషం పట్టలేక పొలి కేకలు పెట్టూ పిచ్చి గంతులు వేసిన సందర్భాలూ - ఎన్నో!'-

'అవునే! ఇంతకీ ఆ మున్సబు ఏమంటాడూః'

'ఏమంటాడు! వాడూ వీడూ ఒకటే! ఏ జాతి పక్షి ఆ జాతి పాట తప్ప మరొకటి ఎలాగ పాడుతుందీః

'నేను గాదుగానీ - ఈ వూర్లో అందరూ అనుకోవటం ఏమిటంటే - ఆ ముసలాడి చాదస్తం గానీ — ఇంకా అతని కెందుకీ తాపత్రయం! ఇన్నాళ్ళూ కష్టజీవిగా బ్రతికాడు. కడుపు గట్టుకుని సంపాదించాడు. దానికి అంతు దరీ అనేది లేదు గదా. వున్నది ఒక్కగానొక్క కొడుకు. ఆడకూతుళ్ల సుఖంగా పిల్లా పాపల్తో తమ దార్ని తాము వుంటున్నారు. ఇక అంతా ఆ కొడుక్కి అప్పగించి కృష్ణా రామా అంటూ కూర్చోక, లేకపోతే ఏ కాశీకో పోక - కొడుకుతో గొడ వలు బెట్టుకుని రగడలు కొని తెచ్చుకుంటాడూః- నేనుగాదు ఈ మాటలన్నది నా మీద పడమాకు-'

రామయ్య రోషంగా అన్నాడు. 'ఒరే! ఆ మాట అన్నవాడ్ని స్టాంపు పేపర్లు కొని తెచ్చుకుంటే — దానిమీద రాసిస్తానని చెప్పు'

'ఏం రాసిస్తావుః చెప్పు వింటాను.'

'ఆ పెళ్ళాం మాట విని నెల రోజుల్లో 'వాడు' ఇదంతా తెగనమ్మి పారేసి బస్తీ ఎక్కి అంతా తగలేసి, అడుక్కుని దింటాడు.'

'నీ కోడలు గట్టి పట్టుదల మీదే వుందటగాః'

'వుండకేం జేస్తుందిః ఆడించినట్టల్లా ఆడే మొగుడు చేతిలో వుంటే అంతే మరి, సాగినమ్మ...ఎత్తివట్టుకొమ్మందంట! నీకు తెలవదాః'

నాకు దెలవకడుగుతాను — కొడుక్కి కోడలుకి ఇవ్వక—ఇదంతా ఎవరి కిస్తావయ్యాః పిత్రార్జితం వాళ్ళకిగాక ఎవరికి పోతుందీః'

'ఇదంతా నా కష్టార్జితం. మా అమ్మ బాబులేం ఇవ్వలేదు నాకు'

'అయితే మాత్రం అది మాత్రం పిత్రార్జితం కాదాః'

రామయ్య కోపంతో వూగిపోతూ అన్నాడు—

'అవున్రా! పిత్రార్జితమే. అయితే దాన్ని తెగనమ్మి తగలెయ్యాలని ఎక్కడ రాసి వుందిరాః దానికోసం వూరూ వాడా అల్లరిచేసి పంచాయితీ పెట్ట మని ఏ పెద్దమనిషి చెప్పాడ్రాః ఇది పద్ధతిగా వుందా నీకుః చెప్పు నువ్వే'

'నీ కొడుకు వ్యాపారం జేసి నష్టాల్లో మునిగి వున్నానని మొత్తుకుంటున్నా డట గదా. ఏదో కొంత పెట్టుబడి పెట్టి — ఆ గండం గడిస్తే మరలా ఆ వ్యాపారం బాగా వుంటుందని అంటున్నాడట గదా.'

'ఒరే. ఈ వ్యాపారాలూ గీపారాలూ మనలాటి వాళ్ళకటరాః. వులిని జూసి నక్క వాతలు బెట్టుకుంటే అది పులి అవుతుందాః మనిషి ముఖ్యంగా భూమిని నమ్ముకొనాలిరా. భూమి తల్లిలాంటిది. ఎప్పటికీ నమ్ముకున్నవాడి కడుపు గొట్టదు- అని నేను నెత్తీ నోరూ మొత్తుకుంటన్నాను. నా మాట అసలు ఎవరూ వినిపించు కోరేమిట్రాః ఇనప్పెట్టిలాటి ఇల్లుంది. బంగారం పండే భూములున్నాయి. గొడ్డూ గోదా, తోటలూ, దొడ్లూ. వాములూ వున్నయి. అన్నీ ఈ క్షణం వాళ్ళ చేతుల్లో పెడతాను. కావాలంటే నేను పశువుల పాకలో కాలక్షేపం చేస్తాను. వాళ్ళని ఇక్కడికి వచ్చి, ఈ వూళ్ళో కాపురం పెట్టి, దర్జాగా కాలు మీద కాలు వేసుకుని కాలక్షేపం జెయ్యమను. అదే నేను కోరేది. వాళ్ళు నా మాట ఎందుకు వినిపించు కోరూః. బంగారంలాటి పల్లెల్ని వదిలిపెట్టి బస్తీల్ని పట్టుకుని వ్రేలాడుతారు. ఏముందిరా అక్కడాః'

'నీ కోడలు బస్తీపిల్ల గదా! ఆవిడకి ఈ ఈగలూ, దోమలూ, ఈ మట్టి వాసనలూ పడవని అంటుందంట.'

'ఆవిడగారి కోసమని సెంటు సువాసనల్ని దెచ్చి గుమ్మరించమందాములే గాల్లోనుండి వూడిపడి వచ్చిందిగావును మరి'

'అయితే - ఇంత గొడవ జరిగినా - నీ పట్టు నీదేనంటావు నువ్వు.'

రామయ్య కనుకొలకుల్లో నీరూరింది. నోట మాటలేక శూన్యంలోకి చూస్తూ వుండిపోయాడు, ఎండిన పెదాల్ని నాలుకతో తడుపుకుంటూ.

'అన్నా! ఈ సంగతి నీకు దెలుసాః ఎంతగా జెప్పించినా నువ్వు మూర్ఖపు పట్టు విడిచి పెట్టడం లేదని — నీ కొడుకు — నీకు చెప్పించటానికిగాను - నీ

పెద్ద కూతుర్ని తీసుకు రావటానికి నిన్న ఆకునూరు వెళ్లాడట గదా! ఆ అమ్మాయి చెప్పితేగానీ నువ్వు దారికి రావని అంతా అనుకుంటూ వున్నారు.'

రామయ్య చంపల మీదకి కన్నీరు జారింది. తప్పు తనదే అంటారేంటి?

'సర్లె. చాలా ఆలస్యమయింది. కాసేపయితే ఎండబడ్తుంది మరి. ఇక నేను వస్తా.' అని - ఎరువుల మూటని బుజానికెత్తుకుని కోటయ్య సాగిపోయాడు. రామయ్యని వదిలేసి.

గుడి ప్రహరీ గోడ ప్రక్కనే వున్న తాటాకుల పాకలో సందడిగా వుంది. కుర్రకారు వేడి వేడి టిఫెన్లు కొనుక్కొని దిని కాఫీలు త్రాగుతున్నారు. అది ముగించిన మరి కొందరు ఆ ప్రక్కన కూర్చుని సిగరెట్లు వూదుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. కొందరు అప్పుడే పేకాటలో పడ్డారు. చెట్టుక్రింద. గుడివాడ నుండి బస్సు వచ్చే సమయం అయింది.

ఆ బస్సులో పేపరు వస్తుంది.

ఆ తర్వాత పేపరు తెచ్చిన వార్తలతో చాలాసేపు వాదులాడుకుని కాలక్షేపం చేసి భోజనాల వేళ అయి, ఆకళ్ళయి కడుపులు కర కర లాడగానే-ఇళ్ళ మొహాలు పట్టారు.

బస్సు వచ్చే వేళయిందనగానే - ఆ ప్రదేశమంతా సందడి సందడిగా అయింది.

నీరసంగా అన్పించి రామయ్య - పిట్టగోడమీద చాలసేపు కూర్చున్నాడు. రామయ్య మనస్సులో ఆలోచనలు సుడిగుండాల్లాగా గిరగిరా తిరుగుతున్నాయ్. గుండెల్లో అగ్నిపర్వతాల ఆవేదనలు ప్రేలుతున్నాయ్. అనుబంధాల లావా ప్రవాహాలు ఎగిరెగిరి పడుతున్నాయి.

శూన్య దృక్కులతో - వెర్రిపడిన మనస్సుతో - గాజు కనులతో - రేగిన గుండె గాయాల్తో - కనపడ్తూ వున్నదాన్ని గమనించకుండా, కనపడని వాటిని గురించిన వెదుకులాటలో, సతమతమయ్యాడు రామయ్య.

ఒక్కసారిగా ఆ ప్రదేశంలో సంచలనం రేగింది. 'పంపాం' అని గోల పెట్టూ బస్సు వచ్చి ఆగింది. దిగేవాళ్లు దిగుతూ వుండగా ఎక్కవలసిన వాళ్ళు హడావుడి పడ్తున్నారు, ఎక్కటానికి.

ఆ సందడికి ఆలోచనలు చెదిరిపోగా—

అటువయిపు చూశాడు రామయ్య నిర్లిప్తంగానే. గుండెలు ఝల్లుమన్నాయ్.

మునసబు వెనకాల్నె రామయ్య కొడుకూ, ఆ వెనుక కోడలూ, ఆ తర్వాత పెద్ద కూతురూ, అల్లుడూ—బస్సు దిగుతున్నారు.

బస్సు దిగి వాళ్ళు-వూర్లోకి సాగిపోయారు. రామయ్య గుండెల్లో గునపాలు దింపినట్లయింది.

కోటయ్య చెప్పింది నిజమేనన్నమాట! తన మాటని కాకుండా చెయ్యటాన్కి, తన నవరంధ్రాల్నీ మూసేయటాన్కి, వాళ్ళు — తను నా అనుకున్న తనవాళ్లు — విశ్వప్రయత్నం చేస్తున్నారు అన్నమాట!

ఒక్కసారిగా నీరసం ఆవరించింది శరీరంలో.

నిస్త్రాణగా అనిపించింది నరాల్లో.

సమస్తం శూన్యంగా అయోమయంగా అన్పించింది రామయ్యకి.

చాలాసేపు అలాగే కూలబడిపోయి — ఆ తర్వాత మెల్లగా లేచి వచ్చిన దిక్కుగానే తిరిగి సాగిపోయాడు రామయ్య నెమ్మదిగా.

మామిడి గుబుర్లనుండి. కోయిలలు 'కుహూ కుహూ' మని వూ ఇదిగా కూతలు పెట్టున్నయ్. చూపు అనినంతమేరా పచ్చని తివాచీ పరచినట్లున్న వరి పొలాల మీదుగా రివ్వు రివ్వున చిరుగాలి వీస్తూ పయనం సాగిస్తున్నది. పంట కాలవల్లో నీరు వొడ్డుల్ని వొరుసుకుంటూ నిండుగా పారుతూ వుంది. ఆ నీటిలో చేపలు ఎదురీతలు సాగిస్తూ వున్నయ్.

సూర్యుడు ఆకాశంలో ఒక బారెడు ఎత్తుకి ఎగబ్రాకాడు.

కాళీ ఎరువుల సంచిని భుజాన్న పెట్టుకుని, నోట్లో వున్న ముఖం వుల్లని నముల్తూ, నాలుగు దిక్కులా పరికిస్తూ, ఇంటిముఖం పట్టి, గొల్లదాని గుబ్బలు అన్న పేరు గల ఆ దిబ్బల్ని ఎక్కి, దిగి — రామయ్యగారి మామిడితోట ప్రక్కనుండే బాటవెంట వస్తూ - గున్నమామిడి బోదె దగ్గర కూలబడి వున్న ఆకారాన్ని గమనించి దగ్గరగా వెళ్ళి పలకరించాడు — కోటయ్య.

'ఎవరయ్యా అక్కడా!?'

బాగా దగ్గరకు వెళ్ళి — అటు దిరిగి కూర్చుని వున్న ఆ ఆకారం బుజం పైన చేయివేసి కదిపాడు. 'ఏంటయ్యో! పెద్దమనిషీ! మాట్లాడవేం?' అంటూ.

ఆ ఆకారం ఆ కుదుపుకి నేలమీదకి ఒరిగిపోయింది.

మొహం అంతా కన్నీటితో తడిసి, అంతకు కొన్ని నిముషాల క్రిందటనే హంస ఆకాశంలోకి ఎగిరిపోగా, నిర్జీవమై వున్న ఆ శరీరపు మాజీ స్వంతదారు అయిన రామయ్యని గుర్తించి — కోటయ్య కెవ్వున ఒక్క పిచ్చికేక పెట్టాడు. ●






డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు

# ఆచార్య విస్సా అప్పారావు

అధ్యాపకతకు దొడ్డతనం చేకూర్చిన మహనీయులలో ఆచార్య విస్సా అప్పారావు పంతులుగారు వరేణ్యుడు. ఈ శతాబ్ది ఆరంభంలో ముప్పది మూడేండ్లపాటు ఉపాధ్యాయుడుగా-ఉపన్యాసకుడుగా-ప్రొఫెసరుగా-ప్రిన్సిపాలుగా వివిధ దశలలో, ఆధ్యాపకవృత్తిని అంకితమైన మనస్సుతో నిర్వహించి విద్యార్థుల-పెద్దల మన్ననలకు పాత్రుడైన మహానుభావుడు. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, సర్ సి.వి. రామన్ తరానికి చెందిన మేధావి. నోబుల్ బహుమతి గ్రహీత డా. చంద్రశేఖర్ ఆచార్య విస్సా అప్పారావుగారికి మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ప్రముఖ శిష్యుడు. అసిధారావ్రతంగా అధ్యాపకతను నిర్వహించిన ధూర్వహుడు. అది అలా వుండగా, సంగీత సాహిత్య సాగరములను కడయిట్ట జూచిన ప్రతిభాశాలి. జాతి అవసరములను గుర్తించిన కాలజ్ఞాని. తెలుగువారి సంస్కృతికి దీపికలెత్తిన ధీశాలి.

నేటికి నూరేండ్ల క్రిందట తారణ చైత్ర బహుళ త్రయోదశీ బుధవారం అనగా 24-4-1884 న తూర్పు గోదావరి జిల్లాలోని పెద్దాపురంలో జన్మించారు. వీరి తల్లి పుణ్యసాధ్వి మాణిక్యాంబ. తండ్రి రామచంద్రుడుగారు పెద్దాపురం రాజుల దివాణంలో కొలువు చేసినారు. రాచకుటుంబాలతో సన్నిహిత సంబంధం మూలాన అప్పారావుగారికి దర్పమూ, రాచఠీవి, దానికి తగిన విద్యా విశేషము-అన్నింటికి వన్నె తెచ్చు లలితకళాభిరుచి అబ్బినవి. వ్యాయామ క్రీడల యందు బాల్యమునుండి ఆసక్తితో పాల్గొనేవారు. బాల్యమునుండి అబ్బిన ఉత్తమ సంస్కార విశేషము-కుటుంబ సత్సంప్రదాయమూ ఉత్తరోత్తర జీవితమునకు ఎంతో వన్నె చేకూర్చినాయి. వీరి వ్యక్తిత్వమును స్వయంకృషి, దీక్ష, సత్సాంగత్యము-ఈశ్వరానుగ్రహ విశేషము తేజస్వంతము చేసినవి.

## అమలాపురంలో

అప్పారావుగారు 1896 డిసెంబరులో పెద్దాపురంలో లోయర్ సెకండరీ పరీక్షయందు త్తీర్ణులయి, నాలుగవ ఫారము చదువుటకు అమలాపురము వెళ్ళి అక్కడ మూడేండ్లు చదివి మెట్రిక్యులేషను పరీక్ష ప్యాసయినారు. ఆ రోజులలో అమలాపురం హైస్కూలుకు మెట్రిక్యులేషనులో బాగా ప్యాసవుతారని ప్రఖ్యాతి ఉండేది. ఆనాడు హెడ్మాస్టరుగానున్న కీ.శే. చాగంటి వీరభద్రయ్యగారు కడు సమర్థులు. ఒక్క తెలుగు తప్పించి తక్కిన అన్ని పాఠములను చక్కగా చెప్ప గల ప్రజ్ఞ గలవారు. శ్రీ వీరభద్రయ్యగారు మంచి అధ్యాపకులే గాక, మంచి సంగీతప్రియులు కూడా. పట్నం సుబ్రహ్మణ్య అయ్యరుగారి శిష్యులైన సి. యస్. కృష్ణస్వామి అయ్య ్గారిని రప్పించి ఇంటనే యుంచి సంగీతం నేర్చుకొన్నారు. ఇది కారణంగా అప్పారావుగారికి సంగీతముపట్ల ఆ బాల్యము అభిరుచి ఏర్పడింది. తల్లి మాణిక్యాంబగారు కూడా అధ్యాత్మ కీర్తనలు-పాటలు జనరంజకంగా పాడేవారు. అది తొలుతటి సంస్కృతి. శ్రీ వీరభద్రయ్యగారి కుమార్తెనే అప్పారావుగారు 1899లో వివాహ మాడినారు. ఇట్లు పుట్టినిల్లు, అత్తవారింట సంగీతానురక్తి పెంపొందుటకు బాగా దోహదకారులైనాయి.

## ఉద్యోగపర్వము

మెట్రిక్యులేషను ప్యాసయిన తర్వాత 1900 - 1904 న రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో చదివి ఫిజిక్సులో బి.ఏ ప్యాసయినారు. అటు పిమ్మట ప్లీడరీకి చదువుమని, దాని యందిష్టము లేక చెన్నపట్టణంలోని ప్రెసిడెన్సీ కళాశాలలో 1905, 1906 లలో ఫిజిక్సులో ఎం.ఏ చదివి ప్యాసయినారు. ప్రతిభ కారణంగా ప్రభుత్వము ఆ రెండు సంవత్సరములు స్కాలర్‌షిప్ మంజూరు చేసినది. సహాధ్యాయి యైన సి. వి. రామన్, వీరు కొన్ని పరిశోధనలు సాగించారు కాలేజీలో చదివే రోజుల్లో. పిమ్మట రాజమహేంద్రవరంలో ఎల్.టి చదివి, ఆ కాలేజీలోనే చిన్న మాస్టరుగా ఉద్యోగ జీవితం ఆరంభించారు. తదుపరి 1909లో ప్రెసిడెన్సీ కాలేజీలో ఫిజిక్సు అసిస్టెంటు ప్రొఫెసరుగా పనిచేసినారు. అనంతరం 1914 - 17 మధ్య రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలోను, 1917 - 19 నడుమ అనంతపురం ప్రభుత్వ కళాశాలలోను, అటు పిమ్మట 1927 వరకు మరల రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలలోను, మళ్ళీ 1927-36 నడుమ ప్రెసిడెన్సి కళాశాలలో ప్రొఫెసరుగాను వర్తించినారు. ఆ రోజులలో కాలేజీలో అధ్యాపకులు పెక్కుమంది దాక్షిణాత్యులే ఉండేవారు. 1936-38లలో రాజమండ్రి ట్రైనింగు కాలేజీకి ప్రిన్సిపాలుగా చేసి ప్రభుత్వ సర్వీసునుండి విశ్రాంతి గైకొన్నారు. అటు తర్వాత 1941 వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాల ప్రిన్సిపాలుగా చేసి ఉద్యోగము విరమించుకొన్నారు. ఆ తరువాత కూడా మరికొన్ని కళాశాలలకు ప్రిన్సిపాలుగా వీరి నాహ్వానించిరి కాని, వీరు ఇష్టపడరైరి.

## చెళ్ళపిళ్ళ కవితో పరిచయం

విస్సావారి కుటుంబంలో ఆనాటి పెద్దలంతా ఆంగ్ల విద్య నభ్యసించిన వారే. అయినప్పటికీ తెలుగులో భారత, భాగవతాలు, శ్రీనాథ, పెద్దనాది కవుల కృతులు బాగా ఆకళింపు చేసికొన్నవారే. ఆంధ్ర సాహిత్య సంస్కారము వంశానుగతంగా వీరి కలవడినది. వీరి పెదతండ్రిగారు వీరభద్రయ్యగారు చెళ్ళపిళ్ళవారిని బాగా ఎరుగుదురు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు కాకరపర్రులో చర్ల బ్రహ్మయ్యశాస్త్రులువారికడ చదువుతున్న రోజుల్లో - బ్రహ్మయ్యశాస్త్రిగారు, శిష్యులు తమ పాఠశాల వార్షికాలకై ఆంధ్ర దేశమంతటా సంచారం చేసేవారు. అట్లా సంచారంలో కిర్లంపూడి జమీందార్లను సందర్శించి వార్షికం తెచ్చుకొనే మార్గంలో పెద్దాపురం వచ్చి హవేళీ రాజులగు శ్రీ రాజా వత్సవాయి రాయ జగపతి రాజావారిని దర్శించి వారిచ్చే వార్షికాన్ని తీసికొని వెళ్లటం రివాజు. అట్లా వచ్చినప్పుడు పెద్దాపురంలో విస్సా రామచంద్రుడు గారింట బ్రహ్మయ్య శాస్త్రిగారు శిష్యసమేతంగా ఆతిథ్యం స్వీకరించే వెళ్ళేవారు. 1920 ప్రాంతాల్లో వెంకటశాస్త్రిగారు తరచు వీరింటికి రావడం కద్దు. అప్పుడు అప్పారావుగారి పెదతండ్రి వీరభద్రయ్యగారు, శాస్త్రిగారు చిన్నతనపు ముచ్చట్లు చెప్పుకొంటూండే వారట! చెళ్ళపిళ్ళవారిని గూర్చి అప్పారావుగారు ఒక ప్రస్తావనలో ఇట్లా అన్నారు. "నేనెరిగినంతవరకు తెలుగు క్లాసులో విద్యార్థులకు కడు భక్తిశ్రద్ధలతో మనోరంజకంగా పాఠాలు నేర్పుట - వాఙ్మయ సంబంధ విషయములు చెప్పుట శ్రీ శాస్త్రిగారి వల్లనే సాధ్యమైనదని చెప్పగలను"

## సాహిత్య పిపాస

అప్పారావుగారు చెన్నపట్టణంలో చదువుకొనేటప్పుడు విక్టోరియా హాస్టల్లో ఉండేవారు. స్నేహితుల ఆహ్వానం మీద, అప్పుడప్పుడు ఆదివారం మధ్యాహ్నం

## ఎక్కిళ్ళు

### శ్రీ శిష్ట్లా రాజేశ్వరశాస్త్రి

ఏడ్చి యేడ్చి సొక్కిపోయిన - పాప -
ఎక్కిళ్ళ మధ్య గడుస్తున్న గంభీరకాలమిది
గడ్డకట్టి చెక్కిళ్ళపై ఉప్పుదేలిన కన్నీరు
నాలుక చివరల్ని స్పృశించిన ఒక్కక్షణం
వేనవేల జ్ఞాపకాలను కదిలిస్తున్న తరుణమిది.

చల్లగా నిమిరే చిగురు వేళ్ళ చివరల కోసం
మెల్లగా తాకి కన్నీటిన అవిరిచేసే
లేత పెదాల వెచ్చని ముద్దుల కోసం
ఎదురు చూస్తూ - బెదిరిచూస్తూ ...

కఠిన కాల చక్రంలో కట్టుబడ్డ కదలికను
బరువుగా - భారంగా - దొరలిస్తున్న - ఆ
నిశ్చల - నిశ్శబ్ద - నిర్లిప్త వదనం వెనుక
దాగిన ఉదాత్తభావాలేమిటో, మరి ?
నడుమ - నడుమ - ఆ యెక్కిళ్ళు ఎందుకో మరి !



వచ్చి ఒక సీనియర్ విద్యార్థి గదిలో శ్రీ సముద్రాల వెంకట అప్పలాచార్యుల వారు శ్రవణానంద కావ్యాన్ని మధురంగా చదివి వ్యాఖ్యానించారు, ఆ వినటంవల్ల విద్యార్థిగా వున్నప్పుడే వారికి చెళ్ళపిళ్ళవారిపై - వారి రచనలపై గౌరవప్రపత్తు లేర్పడ్డాయి. పాండవోద్యోగ విజయాలు నాటకాలు చూడటంతో మరింత గట్టి పడిందని వారే చెప్పుకొన్నారు.

రాజమండ్రిలో మెట్కాఫ్ హాస్టలు డిప్యూటీ వార్డెనుగా వారుంటున్న రోజుల్లో ప్రతి సంవత్సరం గణపతి ఉత్సవాలకు వెంకటశాస్త్రిగారి నాహ్వానించి ఉపన్యాసా లిప్పించేవారు. అప్పట్లోనే వెంకటశాస్త్రిగారు విద్యార్థి వసతి గృహంలో తాము రచించిన బిడాలోపాఖ్యానం చదివి వ్యాఖ్యానించి చెప్పినారు. అర్ధరాత్రి అయినా విద్యార్థులెంతో శ్రద్ధాసక్తులతో వింటూనే ఉన్నారు. 1925లో శ్రీ అప్పారావుగారి పెద్దమ్మాయి వివాహం జరిగినపుడు వెంకటశాస్త్రిగారు పెళ్ళి అయిదు రోజులు ఉండి నూతన దంపతుల నాశీర్వదించి వెళ్ళినారు. మద్రాసులో ఉద్యోగం చేస్తున్న రోజుల్లో కూడా, రాజమండ్రి వచ్చినప్పుడల్లా కడియం వెళ్ళి చెళ్ళపిళ్ళ వారి దర్శనం చేసిరావటం వీరికి పరిపాటి.

దివాకర్ల తిరుపతిశాస్త్రి గారస్తమించినప్పుడు రాజమండ్రి కళాశాల హాస్టలులో తిరుపతి సమాజం స్థాపించి తొలి ఉపన్యాసం వెంకటశాస్త్రిగారిచే ఇప్పించినారు. ఇట్లా చెళ్ళపిళ్ళవారితో వీరి అనుబంధం మరింత దృఢ పడింది. అప్పారావుగారి సాహిత్యాభిరుచికి పునాదులు వైచినది వారి గురువులు వ. సు. రాయి కవిగారు.

### ఖగోళ విజ్ఞానం

ఫిజిక్సుతో సంబంధం గల ఖగోళ శాస్త్రమందు వీరు విశేషకృషి సల్పినారు. ప్రాచీన భారతీయ సంస్కృతి పట్ల విద్యార్థులకు ఆదరం ఏర్పడేటట్లు విద్వాంసులను పిలిపించి ఉపన్యాసా లిప్పించేవారు. జ్యోతిర్విద్యలో సిద్ధాంతభాగమన్నచో వీరికి ప్రీతి మెండు. ప్రాచ్య, పాశ్చాత్య ఖగోళ సిద్ధాంతాలను అవలోడనం చేసినారు. 1920 లో గోదావరీ పుష్కర ప్రవేశం గురించి వాద వివాదములు రేగగా, రాజమహేంద్రవరములో జరిగిన విద్వద్గోష్ఠికి శ్రీ అప్పారావుగారే అధ్యక్షత వహించినారు. ఆ సభలో వీరు దృక్సిద్ధాంతమునే అనుసరించవలెననీ, ప్రాచీన పద్ధతిని మార్చవలెనని తీర్పు చెప్పినారు. ఆనాటి నుండి పిడపర్తి చినపూర్ణయ్య సిద్ధాంతిగారు - వారి సంతతి ఆ పద్ధతినే ఈనాటికీ అనుసరిస్తూ పంచాంగములు చేస్తున్నారు.

### సంగీత ప్రియత

అప్పారావుగారి తల్లి మాణిక్యాంబగారు పిన్నలకు-పెద్దలకు స్త్రీల పాటలు, అధ్యాత్మ కీర్తనలు చెప్పేవారు. మామగారు మంచి సంగీత విద్వాంసులు. అమలాపురంలో వారు చదువుకొనే రోజులనుంచి కర్ణాట సంగీతము యొక్క నిజ స్వరూపము, స్వరము, కృతులు, రాగములు గుర్తింప గలిగినారు. వారి సంగీతాభిరుచికిది పునాది. మద్రాసులో ఉండగా పెద్ద పెద్ద సంగీత కచేరీలకు విడువకుండా వెళ్ళేవారు. 1927లో మద్రాసులో స్థాపింపబడిన మ్యూజిక్ అకాడమీకి పెక్కేండ్లు కార్యనిర్వాహక సభ్యులుగా ఉన్నారు. ఆ అకాడమీ మూల స్తంభములలో వీరొకరు.

### సంగీత సాహిత్యములకు సేవ

ఉద్యోగ విరమణానంతరం అప్పారావుగారు తమ కాలాన్నంతా సంగీత-సాహిత్య సేవకై వినియోగించారు. త్యాగరాయ కృతులకు వ్యాఖ్యానము వ్రాయించి, అచ్చుకాని అపురూపములైన కృతులను స్వరయుక్తముగా అచ్చు వేయించినారు. అట్లే క్షేత్రయ్య పదములకు మూలమును ఉద్ధరించి, పదములను స్వరయుక్తముగ ప్రచురించి క్షేత్రయ్య పదాభినయ వ్యాప్తికి ఎంతో కృషిచేసిన మహనీయులు. క్షేత్రయ్య జన్మస్థలమైన 'మొవ్వ'కు తొలిసారిగా కోలవెన్ను

రామకోటేశ్వరరావుగారితో, విస్సావారు వెళ్ళి దాని ప్రాముఖ్యాన్ని 1950లో వివరించినారు అది నేడు పెద్ద కళాక్షేత్రమయి మూడు పువ్వులారుకాయలుగా విరాజిల్లుతున్నది. కళాప్రపూర్ణ నటరాజ రామకృష్ణకు తొలుత ప్రోత్సాహ ప్రోద్బలము లిచ్చి ప్రచార ప్రశస్తులు కల్పించినది వీరే. సంగీతంలో మంచాళ జగన్నాధరావుగారికి, పౌరాణికులు శ్రీ కల్లూరి వీరభద్ర శాస్త్రిగారిని ప్రోత్స హించినది వీరే.

అధ్యాత్మ రామాయణ కీర్తనలు, రామదాసు కీర్తనలు నిర్దుష్టంగా ప్రచు రింప జేసినారు

నిసర్గమయిన కళాకాలీనం వీరిలో ఉండుటవల్లనే రాజమండ్రిలో దామెర్ల రామారావు ఆర్టు గేలరీ వ్యవస్థాపనకు కృషిచేసిన మూలపురుషులైనారు. రాజాజీ ప్రభృతి చిత్ర కళాకారు లీ విషయాన్ని ఉగ్గడించియే యున్నారు

'మృదంగతత్త్వము' అపురూప గ్రంథము. సచిత్రమయిన శాస్త్రీయ గ్రంధము. రచయిత తర్మాల రామమూర్తి. ఈ పుస్తక ప్రచురణకు వేయి రూపాయలు సహాయము చేసిన గుప్తదాత. ఎన్ని సత్కృతులకిట్లు సాయము చేసిరో!

సుప్రసిద్ధ రచయిత - దేశభక్తుడు చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారి స్వీయచరిత్రను వ్రాయవలసినదిగా ప్రోత్సహించుటే కాదు. ఆ రచన సాగినంత కాలము కొంత ఆర్థిక సహాయము చేసినట్లు చిలకమర్తివారు తమ స్వీయచరిత్ర పీఠికలో తెల్పుకొన్నారు.

## విజ్ఞానశాస్త్ర గ్రంథ రచయిత

పరమాణుశక్తి (1952)భౌతికశాస్త్రవిజ్ఞానమునకు సంబంధించిన గ్రంథము రచయించి విజ్ఞానశాస్త్ర గ్రంథ రచనకు దోహదం చేసినారు. 1960లో 'ఆకాశం' అనే శాస్త్రీయ గ్రంథమునకు రాష్ట్రపతి బహుమతి లభించినది. 'విజ్ఞానం-విశేషాలు' అనునది సర్ సి. వి. రామన్ రచనకు అనువాదం.

ఇవికాక నృత్య; సంగీత వ్యాసములెన్నో ప్రకటించినారు. ఇవి అన్ని సంకలించి 'నృత్య సంగీత వ్యాస రత్నావళి' గ్రంథంగా ప్రచురించారు. అప్పారావుగారి కుమారుడు డా. వి. రామచంద్రరావుగారు కాకినాడ రంగరాయ వైద్య కళాశాల ప్రిన్సిపాలుగా ఉండేవారు. అప్పుడు అప్పారావుగారు కూడా తరచు కాకినాడలోనే ఉంటూ వచ్చినారు. నేనూ వారిని పలుసార్లు దర్శించినాను, ఒక పర్యాయం కాకినాడ రోటరీలో 'ఉపాధ్యాయ దినోత్సవం' సందర్భంగా అప్పారావుగారు ఉపన్యసించారు. అప్పుడొక మాట అన్నారు "ప్రజాస్వామ్యం సక్రమంగా వర్ధిల్లాలంటే జాతి ఇద్దరిని జాగ్రత్తగా చూడాలి. ఒకటి ఉపాధ్యాయులు. రెండు విద్యార్థులు. ఈ రెండూ గాడి తప్పితే, జాతి అపమార్గంలో పోయినట్లే" ఉపాధ్యాయ శిక్షణా విధానంలో - విద్యా విధాన రూపకల్పనలో ఇంకా విప్లవకరమైన మార్పులు రావాలనీ, పాత పద్ధతులనే పట్టుకొని వ్రేలాడటం మంచిది కాదనీ హెచ్చరించారు. అర్ధశతాబ్ది అనుభవంతో చెప్పిన మాటలివి.

తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో మేము చదువుచున్న రోజుల్లో 1944 ప్రాంతంలో మా విద్యాపీఠము ఏర్పాటు చేసిన సాహిత్యసభకు అధ్యక్షత వహించి 'సాహిత్యపు విలువలను' గూర్చి మౌలికమైన మంచి ప్రసంగం చేసినారు. అది మాలో ఎంతో ఉత్తేజాన్ని కలిగించింది. వారి శాస్త్రీయ గ్రంథాల్లో కూడా వారి ఉదాత్త సాహిత్య సౌరభం గుబాళిస్తూనే ఉంటుంది.

ప్రథమాంధ్ర పరిశోధకుడు - మహాయోగి వేటూరి ప్రభాకరశాస్త్రిగారితో వియ్యమందినారు. శ్రీశాస్త్రిగారు చేరిన భుక్తిరహిత తారక రాజయోగంలో వీరూ 1927లో చేరి నలుబదేండ్లు యోగానుష్ఠానం శ్రద్ధాసక్తులతో చేసి ఆరోగ్య భాగ్యములను పొందినట్లు వారే చెప్పుకొన్నారు ఒక ప్రసంగంలో. 1966 జూలై 30 తేదీన హైదరాబాదులో పరమపదించినారు.

మద్రాసు మ్యూజిక్ అకాడమీ వీరి సేవలను గుర్తించి ఘనంగా సన్మా నించింది. శిష్యవత్సలతకు వీరిని చెప్పి, ఇంకెవరినైనా చెప్పాలి. ఆ కథలు కోకొల్లలు. సంగీత సాహిత్యాలకు జీవితం ధారపోసిన త్యాగమూర్తి; ఆంధ్ర ప్రభుత్వము తలపెట్టి నిర్మించిన 'విజ్ఞాన సర్వస్వ' సంపాధకులుగా ఎన్నికైన సేవ చేశారు. ప.సు. రాయకవి సప్తతమ వర్ధంతి రాజమహేంద్రవరంలో జరిపించి నారు. పండిత గోష్ఠులకు కొఱకలేదు. ఆకాశవాణి సలహా సంఘ సభ్యులుగా ఉన్నారు. ప్రతిభావంతులైన యువకులను గుర్తించి నిరపేక్షంగా ప్రోత్సహించి నారు ప్రాచీన సంప్రదాయములోని మహనీయతను గుర్తించి, ఆధునిక జగత్తును అవగాహన చేసికొని సమన్వయ బుద్ధితో వర్తించిన మేధావి. సంగీత, నాట్యకళ లకు సంబంధించిన ప్రాచీన కృతుల నుద్ధరించి వ్యాప్తిలోనికి దెచ్చిన కళాజీవి. ఆచార్యుడుగా వీరి ఘనతకు నోబెల్ లారియేట్ ఆచార్య చంద్రశేఖర్ సాక్షి. విశ్వవిద్యాలయ పాలనా సంఘములలో సభ్యులుగా ఉన్నారెంతో కాలం.

## కృష్ణగాన చిటికె భాగవతులు

వీరిని గూర్చి అప్పారావుగారు తమ జ్ఞాపకాలలో పేర్కొన్నారు ఇటీవలి కాలంలో ఈ విద్య అంతరించింది. వారు పేర్కొన్న విషయం వింతైనది. 'గొల్లపూడిలో అల్లంరాజు పేర్రాజుశర్మగారని కృష్ణగాన చిటికా భాగవతు లుండేవారు. వీరు అల్లంరాజు సుబ్రహ్మణ్య శర్మగారికి పుత్రతుల్యులు. పేర్రాజు శర్మగారికడ ఒక వాద్య విశేషముండేది లోలుతో మూతలు కుట్టిన చిన్న డబ్బాలు రెంటిని రెండు చేతుల వ్రేళ్ళలో తగులునట్లు కొట్టుట ఇందలి విశేషము. ఆ చిటికలతో అతి త్వరితముగా మద్దెలవారు కూడా వాయించలేనంత ధీమాలో అద్భుత లాగిరులను, విన్యాసములను ఆయన చేసేవారు. ఏదో కందమో, వృత్తమో తాళబంధముగా చదివి వాయించేవారు " ఇది అద్భుతంగా ఉండేదని; తమ చిన్నతనంలో విన్నామని అప్పారావుగారు వ్రాసినారు. పేర్రాజు శర్మ గారితో ఆ విద్య అంతరించినది ఇట్టి వాద్య విశేషమొకటి ఉండెడిదని వారు చెప్పుట చేతనే తరువాతి వారికి తెలిసినది.

నిస్స్వార్థంగా ఆంధ్రుల సంగీత, నాట్య, సంస్కృతులకు ఎనలేని కృషి చేసిన దేశభక్తుడు వారి నిజాయితీ - సేవాపరత ఆంధ్రులేనాడు మరువరానిది వారి శతజయంతిది నివాళి ★

# కలగూరగంప

## లోకజ్ఞుడు నన్నయకు శిష్ట సంప్రదాయాలు తెలియవా ?

"తెలుగు మీద కన్నడ ప్రభావ మెంత ?" అనే శీర్షిక క్రింద శ్రీ 'తి' "భారతి" [మార్చి 1984]లో ఒక విమర్శక వ్యాసం వ్రాస్తూ "కవిత్రయ భారతంలో పాత్రలన్నీ ఏక వచనంలో పిలుచుకొంటాయి. బహువచనంలో సంబోధన వున్నచోట ఎగతాళికై ప్రయోగించబడినట్లు స్పష్టం" అని అనాలోచితంగా చెప్పినారు. ఇట్లు చెప్పటం అంటే 'లోకజ్ఞుడు' అయిన నన్నయకు గాని, భారతం లోని పాత్రలకుగాని శిష్ట సంప్రదాయాలు ఏవీ తెలియవని అర్థం.

శ్రీ 'తి' తన స్వగ్రామంలోని ఒక సంప్రదాయాన్ని ఈ సందర్భంలో ఉదాహరించినారు. అచ్చటి ప్రజలు 'స్వామీ' అని పలుకరించి, ఆ వెంటనే 'నీవు' అని ఏకవచనంలో సంబోధిస్తారట. అయితే ఇది తప్పు పట్టవలసింది కాదని, "ఇది మహా కావ్య సంప్రదాయం" అని ఆత్మ సంతృప్తిచెందినారు. నిజమే, నన్నయ భారతంలో "భూసురోత్తమ.. జగన్మాన్య, యిక్కన్యాభిక్ష, బరిగ్రహింపుము" [ఆది 2-152], "ప్రసాద బుద్ధి యొనర్పు, సన్మౌని గణోత్తమ" [ఆది 8-40] "వచ్చితి నీకుమ, భాను నిభా శిష్యవృత్తి, బనిసేయంగన్ [ఆది 8-108] అని కొన్ని ప్రయోగాలు ఉన్నాయి.

బలి అనే రాజు దీర్ఘతముని ఉద్దేశించి ఇట్లు అంటాడు.

"ఎందుండి వచ్చితిందుల
కెందుల కేగుదు మహామునీశ్వర, విద్వ
ద్వందిత, నా పుణ్యంబున
జెందితిని, స్పష్ట ఫలము జెందిన పాటన్ [ఆది 4-232]

భీష్ముడు తొలిసారిగా ద్రోణుని చూచినప్పుడు "ఎందుండి వచ్చి తిందుల, కెందుండగ నీకు నిష్ట మెఱిగింపుము సద్వందిత" అని అడుగుతాడు [ఆది 5-213] అత్యున్నతస్థాయికి చెందిన వారిని, భారతంలో, ఇట్లే పిలువటంగద్దు. ప్రియమార పలుకరిస్తే, అది ఏకవచనంలో ఉన్నా పెద్దలకు సమ్మతమే. అట్లని శ్రీ 'తి' పేర్కొన్నట్లు కవిత్రయ భారతంలో పాత్రలన్నీ ఏక వచనంలో పిలుచుకొని ఉండ లేదు పైపెచ్చు "బహువచనంలో వున్న చోట్ల ఎగతాళికై ప్రయోగించబడినట్లు స్పష్టం" అని చెప్పటం, నన్నయ ప్రవేశపెట్టిన శిష్ట సంప్రదాయాలకు వక్రభాష్యం చేయటమే కాగలదు

పెద్దల యెడ పిన్నలకు గౌరవభావం, పిన్నలయెడ పెద్దలకు వాత్సల భావం ఉండవలెనని నన్నయ ఉద్దేశం. సామాజిక జీవనంలో ఇట్టి భావం కలిగిస్తే, ఇది సమాజ పురోగతికి ఎంతో తోడ్పడుతుందని నన్నయ ఆశించినాడు. 'లోకజ్ఞుడు' అయిన అతడు తనకాలం నాటి సామాజిక మర్యాదలను జాగ్రత్తగా గమనించినాడు. తనకావ్యంలో ఏ పాత్ర ఎట్లు మాట్లాడవలెనో శాసించినాడు ఆ ప్రకారం సామాజికులంతా నడచుకోనవలెనని అతని ఆశయం. కొన్ని ఉదాహరణాలను పరిశీలిద్దాం

శమీకుని శిష్యుడు గౌరముఖుడు పరీక్షిన్మహారాజు యొద్దకు వస్తాడు. 'మా గురుల పై నురగ శవము వైచుటవిని, యతి, వారి తనూజుండు శృంగియన్వాడు, వార్చిచ్చునట్టి శాపంబు నీకిచ్చె" [ఇది 2-179] "దానికి గురులు సంతాప మంది, భూతలేశ, నన్ను బుత్తెంచిరి "అని తన ఆగమనోద్దేశాన్ని వివరిస్తాడు. (ఇది 2-179) అర్జునుడు ఒకనాడు ఏకాంతంలో ద్రోణునితో ఇట్లు అంటాడు.

"విలువిద్య నొరులు నీక
గ్గలముగ లేకుండ, నిన్నుఁ గఱపుదునని మున్
బలికితిరి, నాక కాదీ,
త్రిలోకముల కధికుఁ జూచితిమి యొక యొఱుకున్"
"నాకంటెను, మీకంటెను
లోకములో నధికుడ తి బలుండు, ధనుర్వి
ద్యా కౌశలమున, నాతడు
మీకుంబ్రియ శిష్యుఁడటె, యమిథ్యా వచనా" [ఆది 5-239, 240] ఇక్కడ రెండవ పద్యం తుది చరణంలో "మీ-మి"లకు యతి మైత్రి ఉంది

వశిష్ఠుని హోమధేనువు నందిని. దానిని తన కిమ్మని విశ్వామిత్రుడు కోరగా, వశిష్ఠుడు నిరాకరిస్తాడు. అంతట దానిని పట్టుకొమ్మని విశ్వామిత్రుడు తన సైనికులకు ఆజ్ఞ ఇస్తాడు. నందిని వారికి దొరుకకుండ తప్పించుకొంటుంది. సైనికులు దానిని అనేక విధాల హింసిస్తారు. అప్పుడు అది, నన్నయ నేర్పిన శిష్ట భాషలో, వశిష్ఠునితో "నన్నేల యుపేక్షించితి రిన్నరుల కధర్మ పరుల కిచ్చితిరె విద్వన్నాథ యిదియు ధర్మువె?" అని అడుగుతుంది. [ఆది 7-106] నన్నయ మూగజంతువులకు కూడా శిష్ట భాష నేర్పి ఉండగా, మానవులకు నేర్పలేదని ఊహించటం ఎట్లు? ఈ వచనంలో "ఎగతాళి" మచ్చుకైనా ఉందా?.

"నాగరికం పండిన కొద్దీ బహు వచనాలూ, ద్వి బహువచనాలూ వచ్చినాయి" అని శ్రీ 'తి' పేర్కొనటం బట్టి ఆంధ్ర మహాభారత రచనా కాలంనాటికి గౌరవ వాచకాలు లేవని, సమాజంలో ఒకరినొకరు ఏక వచనంలోనే సంబోధించుకొన్నారని ధ్వనిస్తుంది. కాని ఇది వాస్తవానికి విరుద్ధం. మనం ఇప్పుడు నన్నయ భారతంలో శకుంతలోపాఖ్యానాన్ని పరిశీలిద్దాం.

దుష్యంతుడు తన సైన్యాన్ని ఒకచోట ఉండమని చెప్పి, ఒంటరిగా కణ్వాశ్రమానికి వస్తాడు. అతడు శకుంతలతో మాట్లాడుతూ "వేట వచ్చి, యిట కణ్వమహాముని జూచి పోవగా వచ్చితిమి" అని స్వోత్కర్షతో ప్రారంభిస్తాడు. 'వచ్చితిమి' అంటే 'మేము వచ్చితిమి' అని అర్థం. "ధరణీతల విభుడొక్కరుండ" కణ్వాశ్రమంలో ప్రవేశించినట్లు, అంతకుముందే నన్నయ సూచిస్తాడు. దుష్యంతుడు కణ్వుని దృష్టిలో ఉంచుకొని, శకుంతలతో "ఎందుబోయి రొకొవారు" [ఆది 4-27] అని అడుగుతాడు. అంతట శకుంతల "వారిచ్చట నుండి, యీ క్షణము, యేగిరి కానకు బండ్లుదేర, మీవచ్చు టెఱింగిరేని, జనవల్లభ, వారును వత్తురింతకున్" (ఆది 4-27) అని ప్రత్యుత్తరం ఇస్తుంది. ఇట్లు ఒకే పద్యంలో 'మేము' గ్రాహ్యం, 'వారు', 'మీరు' అనే బహువచనాలు గౌరవ వాచకాలుగా ప్రయుక్తం.

రాజు శకుంతల జన్మ వృత్తాంతం తెలిసికొన గోరుతాడు. "దీని జన్మ మెవ్విధమని, తమ్మొక్క మునినాథుడడిగిన, నిక్కాశ్యమల్రర్థి జెప్పిరేను వినంగన్" (ఆది 4-34) అని శకుంతల ఆ వృత్తాంతం సవిస్తరంగా చెప్పుతుంది. ఇక్కడ ఆత్మార్థకం 'తమ్ము' బహువచనం, ఇది గౌరవ వాచకంగా ప్రయుక్తం—శకుంతల తన 'అయ్యను' 'కాశ్యపులు' అని మర్యాదగా పేర్కొంటుంది. శకుంతలా దుష్యంతుల మధ్య, ఆ తర్వాత దీర్ఘ సంభాషణ కొనసాగుతుంది. తనకు భార్యవై ఉండుమని రాజు శకుంతలను కోరగా' శకుంతల "కరుణానిరతులు, ధర్మస్వరూపులింకను మదీయ జనకులు ననుదెంతురు; వారు వచ్చి, నీకిచ్చిరేని పాణిగ్రహణము

సెయుము ననున్" (ఆది 4-58) అని పలుకుతుంది. "కరుణా నిరతులు – ధర్మం స్వరూపులు – జనకులు – వసుదేంతురు – వారు – ఇచ్చిరేని" ఇవన్నీ బహు వచనాలు. ఇవి గౌరవ వాచకాలుగా ప్రయుక్తం. శకుంతల నన్నయ ఇంటనే పుట్టి పెరిగిందా అని పాఠకులకు అనిపిస్తుంది నన్నయ కాలంనాటికే నాగరికం పండిందని" దీనిని బట్టి ఋజువు కావటంలేదా ?

ద్రోణుడు పేదవడి, తన బాల్యసఖుడైన ద్రుపదునియొద్దకు వస్తే అతడు అవమానిస్తాడు. స్వోత్కర్షతో "మాయట్టి రాజులకు మీయట్టి పేదపాఱు వారలతో గార్యకారణంబైన సఖ్యం బెన్నండునుగానేరద"ని (ఆది 5-208) "పాఱుడు సంగడికాడె యెందునన్" అని చులకనగా మాట్లాడుతాడు. (ఆది 5-208) ద్రోణుడు సమయంకోసరం వేచి ఉంటాడు అతని ఆజ్ఞ మేరకు అర్జునుడు ద్రుపదుని "రథాక్షముతో గట్టి తెచ్చి" (ఆది 5-88) ద్రోణుని ముందు బెడతాడు. అప్పుడు ద్రోణుడు "మీరెవ్వరయ్య, ద్రుపదుమహారాజులె, యిట్లు కృపణులయి, పట్టు వడన్ వలెనెనె, మీరకి"(ఆది 6-90)ఉల్లసమాడి విడిచిపెడతాడు. శ్రీ 'తి' ఈ ఒక్క ఘటననే తీసికొని, "బహువచనంలో సంబోధన వున్నచోట ఎగతాళికై ప్రయోగించ బడినట్లు స్పష్టం" అని చెప్పటం కేవలం అనాలోచితం. ఇది పూర్తిగా త్వరపడి చెప్పిన మాట. నన్నయ సున్నిత హాస్యానికి ఈ ఘట్టం ఒక గొప్ప దృష్టాంతం. నన్నయ రచనలో ఇట్టివి ఎన్నోలేవు. ద్రుపదుని కట్టితెచ్చుటకు పూర్వం కుమారాస్త్రవిద్యా సందర్శన జరిగింది. కర్ణుడు అర్జునుని ఆక్షేపించి పలికిన పలుకులు గమనార్హం. 'నీపకడు నేర్పుకాడవు, గావంపదు, పీని గొన్ని గఱచితి మేమున్, నీ విద్యలెల్ల 'జూపుదుమే వీరుల సూచి, మేలు మేలని పొగడన్" (ఆది 6-88) ఈ ఆక్షేపణలో, కర్ణుని ఎగతాళి, ఎత్తిపొడుపు కూడ కలిసి ఉన్నాయి. ఈ పలుకులు విని అర్జునునికి కోపం, సిగ్గు రెండూ కలిగినాయట కర్ణుని స్వోత్కర్షను గమనించినారా? 'ఏమున్ గఱచితిమి' "నీ విద్యలెల్ల జూపుదుము" అన్నాడు.

భారతంలోని పాత్రలు కేవలము 'ఎగతాళికై ' కాకుండ గౌరవ వాచకాలుగా కూడ బహు వచనాలను ఆ మాటకువస్తే ద్వి బహు వచనాలను కూడ ప్రయోగించినట్లు స్పష్టం. ద్రోణుడు "ధనుర్వేద మగ్ని వేశులతోడ నర్థి గఱచె" (ఆది 7-5) ద్రోణుడు బ్రహ్మ శిరోనామకాస్త్రాన్ని అర్జునునికు అందిస్తూ, అగస్తి అనే దివ్యమునీంద్రుడు దానిని అగ్ని వేశులకు ఇచ్చినాడని, "వారలున్ మానక నాకునిచ్చిరి" (ఆది 6-78) అని గౌరవంతో తనగురువును 'వారలు' అంటాడు. ధర్మరాజు తన తల్లిని ద్రుపదునికి పరిచయం చేస్తూ "వీరు కుంతీమహా దేవుల" ని చెప్తాడు. (ఆది 7-239) తిక్కన భారతంలో విరటుడు కంకుభట్టు వేషంలో ఉన్న ధర్మరాజుతో "మీరు లెందులకు నిప్పుడు వచ్చిన దానికి గతం బెయ్యది... ఎఱిగింపుడు" (విరాట 1-190) అని అడుగుతాడు. ఎఱ్ఱన భారత భాగంలో పవిత్రత కౌశికునితో మాట్లాడుతూ, "అమ్మహాత్మునకు సపర్య సేయుచు విమున్ మదిలోన దలంపజాలనైతి" (అరణ్య 5-1 ) అని విచారం వెల్లడించింది. ఇక్కడ "త్మ-ము" కుల యతి మైత్రి ఉం . ఇవి గౌరవ వాచకాలుగా ప్రయోగింపబడిన బహువచనాలు వీటిలో 'ఎగతాళి' ఉందా ?

నన్నయ భారతంలో కృష్ణుడు జరాసంధునికి భీమాదులను పరిచయం చేస్తూ "వీడు భీముడు, వాడు గవ్వడి" అంటాడు (సభా 1-193) వీరిద్దరూ వయస్సులో కృష్ణునికంటే పిన్నవారు. ధృతరాష్ట్రుని తల్లి అంబిక. ధృతరాష్ట్రుని అనంతరం, అమ దాసికి పుట్టినవాడు విదురుడు. ధృతరాష్ట్రుడు ఒక సందర్భంలో "ధీరమతి విదురుతోడ విచారింతము వాడునయ విశారదుడు" (సభా 2-124) అంటాడు. ధర్మరాజు కిమ్మీరుడనే రాక్షసునికి తమ పరిచయం కలిగించిన విధం ఇది. "ఏను ధర్మసుతుడ, నీతడు భీముండు, వాడు విజయుడ ల్లవారు గవలు" (అరణ్య 1-115) "వాడు-అతడు", ఏను-ఇతడు", అతడు" (ఆది 5-79) 'వాడు' (ఆది 5-82) అన్నీ సమానార్థకాలే సాధువులే అని నన్నయ భావం. కృష్ణుడు, ధర్మరాజు ఆడిన మాటలలో వాత్సల్యం లేవని చెప్పగలమా? కుమారాస్త్ర విద్యా సందర్శన సందర్భంలో అర్జునుడు రంగ మధ్యాన నిలిచినాడు. అప్పుడు "చూపఱెల్లంబరమాద్భుత చిత్తులగుచు" తమలో దాము పలికిన మాటలను వినండి. "వీడె కృతహస్తుడఖిలాస్త్ర విద్యలందు, వీడె యగ్రగణ్యుడు ధర్మ విదులలోన, వీడె భరతవంశంబెల్ల వెలుగ గుంతి కడుపు చల్లగా బుట్టిన ఘనభుజుండు" (ఆది 6-19) — ఈ మాటలలో ప్రజలకు అర్జునుని యెడ ఎంత వాత్సల్యభావం ఉండో గమనించినారా?

ఆంధ్ర మహాభారతం మన భాషా చరిత్రయేగాక మన సామాజిక చరిత్ర కూడ అవుతుంది. సమాజంలో స్త్రీ – పురుషులు ఒండొరులను ఎట్లు గౌరవించు కొన్నారో మహాభారతం తెలుపుతుంది. "నాగరికం పండినకొద్దీ బహువచనాలూ, ద్విబహువచనాలూ వచ్చినాయి" అని శ్రీ 'తి' చేసిన వాదన సరికాదని, ఆంధ్ర మహాభారత రచనాకాలంనాటికే ఇవన్నీ ఆచరణలోకి వచ్చినాయని తేలుతుంది. శ్రీ 'తి' తమ విమర్శక వ్యాసంలో "కవిత్రయ భారతంలోని పాత్రలన్నీ ఏక వచనంలో పిలుచు కొంటాయ"నేడగాని, "బహువచనంలో వున్నచోట ఎగతాళికై ప్రయోగించి"నారనేదికాని యథార్థం కాదని తేలుతుంది.

(ఈ విషయ వివరణకు నన్ను ప్రోత్సహించిన శ్రీ బండ్లపల్లి ఓబుళరెడ్డి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు)

# లేఖ

డా॥ కె. ఓబిరెడ్డి

## ఆం. ప్ర. ప్ర. ర. స. ఆవిర్భావం

విప్లవ రచయితల సంఘం కార్యవర్గ సభ్యులమయిన మా నలుగురము కా॥ నమ్ము, కా॥ ఎస్. తిర్మల్, కా॥ ఎ. నారాయణ, కా॥ తోట మహదేవ్‌లు కా॥ కానూరు వెంకటేశ్వరరావు వంటి సీనియర్ సభ్యులతో సహా రాష్ట్ర వ్యాపితముగా 28 మంది విప్లవ రచయితలు "విప్లవ రచయితల సంఘం [విరసం] నుంచి చీలి రాష్ట్ర స్థాయిలో "ప్రజా రచయితల సమాఖ్య" [ఆంధ్రప్రదేశ్] [ప్రజా ర. స.] గా ఏర్పడినట్లు మేము ప్రకటిస్తున్నాము. ప్రజా రచయితల సమాఖ్య [ప్రజా. ర స.] రాష్ట్ర కన్వీనర్‌గా కా॥ నమ్ము వ్యవహరిస్తారు.

ఉమ్మడి వేదికయిన విరసం వేదికను మెజారిటీగా వున్న నాయకత్వం గ్రూపు వ్యక్తిగత హింసావాద రాజకీయాల ప్రచారానికి, తమ ముఠా సంకుచిత రాజకీయ ప్రయోజనాలకు లోబరుస్తూ విప్లవ సాహిత్యోద్యమానికి అంతిమంగా విప్లవోద్యమానికి తీవ్రనష్టము కలిగిస్తూ వస్తున్నది. విప్లవ సాహిత్యోద్యమంలో చీలిక నష్టదాయకమయినదని ఓపికతో బోల్షివిక్ స్పిరిట్‌తో ఈ సుదీర్ఘకాలమంతా నాయకత్వ పెడధోరణులకు వ్యతిరేకంగా అంతరంగిక పోరాటం సాగిస్తూ వచ్చాం. కాని మెజారిటీ నాయకత్వ గ్రూపు వ్యక్తిగత హింసావాద రాజకీయావగాహనతో పని పద్ధతులకు సంబంధించి వారి ఒంటెత్తు పోకడలో ఏమాత్రం మార్పురాలేదు. ఫలితంగా విప్లవ సాహిత్యోద్యమాన్ని ఈ పెడధోరణినుండి కాపాడి, దానిని ముందుకు తీసుకుపోవలసిన చారిత్రక అవసరాన్ని దృష్టిలో పెట్టుకుని పెడధోరణులకు కరుడు గట్టిన వేదిక అయిన విరసంతో తెగతెంపులు చేసుకుని మేము ప్రజా రచయితల సమాఖ్య ఆం. ప్ర. [ప్రజా ర. స.]ను ఏర్పాటు చేస్తున్నాం.

1970లో నక్సల్బరి, శ్రీకాకుళం, గోదావరిలోయ పోరాటాల ప్రేరణతో ఏర్పడిన విరసం తొలి రోజులనుంచి అవగాహనలో, కార్యాచరణలో అతివాద దుస్సాహసిక వాదానికి వ్యక్తిగత హింసావాద రాజకీయాలకు గురియై నాటి ప్రచార వేదిక అయింది. ఇది విప్లవోద్యమానికి తీవ్రమయిన నష్టాన్ని కల్గించింది

ఈ అనుభవంనుంచే 1978 ప్రాంతంలో విరసంలో తీవ్ర చర్చల ఫలితంగా ఆత్మ విమర్శ చేసుకుని "అతివాద ధోరణులకు మొరటు పద్ధతుల్లో సంస్థను లోబర్చడం జరిగిందని" స్పష్టంగా గుర్తించింది. ఇంకా అతివాద సంకుచితధోరణి సంస్థ నిర్మాణంలోను, పని పద్ధతుల్లోను ప్రతిబింబించక తప్పలేదు అందుచేత తాను బలపడవలసినంతగా బలపడలేక లక్ష్యసాధనలో కలిసిరాగల సాంస్కృతిక శక్తులన్నిటిని

కలుపురాలేక తనకు, విప్లవోద్యమానికి అంతిమంగా పీడిత ప్రజలకు తానే అపచారం చేసుతుంది" అని "రాజకీయ రంగంలోను కార్యాచరణ పద్ధతుల్ని సాంస్కృతిక రంగంలోని వాటిని కలగాపులగం చేశాం. మన కార్యక్షేత్రాన్ని ఖచ్చితంగా నిర్వచించుకోలేక పోయాం." అని ఆత్మవిమర్శ చేసుకుంది. కాని, ఆ ఆత్మవిమర్శను నిజాయితీగా కార్యాచరణలో పెట్టకపోగా దాన్ని లాంచనం చేసి, ఎప్పటిలాగే విరసం నాయకత్వం ప్రజలచే తిరస్కరించబడిన వారు వ్యక్తిగత హింసావాద రాజకీయాల ప్రచారముకోసం తమ అతివాద సంకుచిత ప్రయోజనాలకోసం విరసం వేదికను దుర్వినియోగ పరచుకుంటూ వచ్చుచున్నది. వేదికలపై ప్రసంగాలలోను, కళారూపాల్లోనూ నినాదాల్లో, సమీక్షల్లో తమ అతివాద అవకాశవాద విధానాన్ని ఒంటెత్తుపోకడమ ప్రదర్శిస్తూ వచ్చింది. విరసం ఒక ఉమ్మడి వేదికనే స్పృహనే నాయకత్వం కోల్పోయి పలుసందర్భాలలో మొరటు మెజారిటీ సూత్రంగా నిర్ణయాలని చేసి తమ గ్రూపు రాజకీయ ప్రచారాలకు వేదికగా వాడుకోవడము జరుగుచున్నది. విరసం నాయకత్వ పెడధోరణులకు వ్యతిరేకముగా మా అంతర్గత పోరాటం వారి మొరటు మెజారిటీకి బలయ్యింది

విరసం లక్ష్యసాధనలో కలుపుకు రావలసిన సాంస్కృతిక శక్తులను కలుపుకు వచ్చేందుకు విరసం ప్రణాళికలోని సభ్యత్వ అర్హతే అడ్డంకిగా వున్నది. అని దానిని నివారించేందుకు ఒక ప్రత్యామ్నాయ ప్రణాళికను సంస్థలో చర్చకు పెట్టాం. అంతరింగక పోరాటం చేశాం. అతివాద సంకుచిత రాజకీయావగాహన గల నాయకత్వం మా పోరాటాన్ని మొరటు మెజారిటీ క్రింద కొట్టిపారేసింది. విరసం ఒక ప్రజాసంఘంగా గాకుండా కేవలం మార్క్సిస్టు - లెనినిస్టు రచయితల సంఘంగానే మిగిలి తన కార్యక్షేత్రాన్ని కుంచించుకుంది. మిత్రవర్గాలను కలుపుకురావడంలో విఫలమై విప్లవ సాహిత్యోద్యమానికి చెయ్యాల్సిన మేలు చేయలేకపోయింది. కనుక విరసంతో తెగతెంపులు చేసుకుంటూ విప్లవ సాహిత్యోద్యమ సంస్థను ఒక ప్రజా సంఘంగా నిలబెట్టి విప్లవోద్యమంలో సాంస్కృతిక కర్తవ్యాన్ని నెరవేర్చేందుకు ప్రత్యమ్నాయ ప్రణాళిక ఆధారంగా ప్రజా రచయితల సమాఖ్య [ప్రజా. ర స.] ఏర్పాటు చేస్తున్నాం.

అఖిల భారతస్థాయిలో విప్లవ సాహిత్యోద్యమ సంస్థ అవసరాన్ని గుర్తిస్తూనే విరసం నిర్మాణం పని పద్ధతులపై యింకా అంతరంగిక విభేదాలు కొనసాగుతున్న ఈపరిస్థితుల్లో వాటిని పరిష్కరించుకోకుండా ఏఐఎల్ఆర్సి ఏర్పాట్లు అఖిల భారత స్థాయిలోకి విభేదాలు తెచ్చేందుకే తోడ్పడుతుందని అభిప్రాయపడ్డాం. మా అభిప్రాయాల్ని ఖాతరుచేయక ఏ. ఐ. ఎల్. ఆర్. సి.ని ఏర్పాటు చేయబోతున్నప్పుడు దానితో మేము సంబంధాలు పెట్టుకోమని ప్రకటించాం. వ్యక్తిగత హింసావాద రాజకీయాలు అతివాద దుస్సాహసికి విధానము అవగాహనలో వున్న విరసం మెజారిటీ నాయకత్వ గ్రూపే ఏ. ఐ. ఎల్. ఆర్. సి. తో ప్రధాన వ్యవస్థాపక భారత స్థాయిలో తను అవగాహనను ప్రచారము చేసుకొనే ఆతృతలో భాగంగానే ఏ. ఐ. ఎల్. ఆర్. సి. ని ఏర్పాటు చేసుకొని దానిని వాడుకుంటూ వున్నది. విప్లవ సాంస్కృతికోద్యమానికి ప్రస్తుత పరిస్థితుల్లో మేలు చేయని ఈ సంస్థ స్థాపన నివారణ కోసము మా పోరాటం మొరటు మెజారిటీకి బలయ్యింది. నిష్ఫలమైంది.

పై అన్ని కారణాల వల్లను విరసంలో యింకా ఎవరైనా కొనసాగడమంటే విరసం మెజారిటీ పక్షం అభిమానిస్తున్న వ్యక్తిగత హింసావాద రాజకీయాల ప్రచారానికి భాగస్వామి కావడమే అవుతుంది. వారి అతివాద అవకాశ వాదాన్ని బలపర్చడమే అవుతుంది. "ప్రజా పంథా" పేరు చెప్పుకుంటునే ప్రజల పాత్ర ప్రజల సంబంధములేని కొద్దినుండి చర్యలనే సాహసకృత్యాలుగా సాహిత్యీకరించి, భారత ప్రజల సంఘటిత దీర్ఘకాలిక విముక్తి పోరాటాలకు సాహిత్యీకరించడములో ప్రపంచ విప్లవోద్యమ గుణపాఠాలను తీసుకోవడములో విఫలమై విప్లవ సాహిత్యోద్యమానికి విప్లవోద్యమానికి. హానికల్గించిన వాళ్లమవుతాం. సాంస్కృతిక రంగములో మిత్ర వర్గాల్ని కలుపుకు రావడములో విఫలమౌతాం. అందువల్ల మన సాంస్కృతిక పాత్రను సరిగా నిర్వర్తించలేకపోతాం.

కనుక, ఈ నష్టాల్ని పరిమితుల్ని, పెడధోరణుల్ని అధిగమించేందుకు నూతన ప్రజాతంత్ర విప్లవంలో సాంస్కృతిక పాత్రను ధృడంగా నిర్వర్తించేందుకు అడ్డంకిగా వున్న విరసం నుండి వైదొలగడం అనివార్యమైనది. విరసంలో మేం చర్చకు పెట్టిన ప్రత్యామ్నాయ ప్రణాళిక ఆధారంగా ప్రజా రచయితల సమాఖ్య [ప్రజా. ర. స. ] అనివార్యమైన అవసరంగా ఏర్పాటు చేస్తున్నాం. ప్రజా రచయితల సమాఖ్య ప్రణాళికతో ఏకీభవించే ప్రజా రచయితలందర్ని సంస్థలోకి ఆహ్వానిస్తున్నాం. ప్రజా. ర. స. కర్తవ్యాల్ని సంక్షిప్తంగా ఈ ప్రకటన వెంట జతపరుస్తున్నాం.

-ప్రజాసాహిత్యం కళలు వర్థిల్లాలి.
-ప్రజా రచయితల సమాఖ్య అం. ప్ర. వర్థిల్లాలి.
-నూతన ప్రజాస్వామిక విప్లవం వర్థిల్లాలి.

కన్వీనర్ [ప్రజా. ర. స.] [ప్రజారచయితల సమాఖ్య [అం. ప్ర.] కా॥ నమ్మాతో పాటు విరసం నుంచి పైదొలగిన ఇతర కార్యవర్గ సభ్యులు. [1కా॥ ఎన్. తిర్మల్ [2కా॥ ఏ. నారాయణ [3కా॥ తోటా మహాదేవ్ (సీనియర్ విప్లవ కవి) కా॥ కానూరు వెంకటేశ్వరరావు.

## కర్తవ్యాలు

1. నూతన ప్రజాస్వామిక విప్లవం లక్ష్యం- ప్రజా ర.స. నూతన ప్రజాస్వామిక విప్లవంలో సాంస్కృతిక పాత్రను నిర్వహిస్తోంది.
2. సామ్రాజ్య వాదానికి, భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా భారత దేశం ప్రజలు చేసే అన్ని పోరాటాలను బలపరుస్తున్నది.
3. భూస్వామ్య, సామ్రాజ్యవాద సాహిత్య సంస్కృతులకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటం చేస్తుంది.
4. శాస్త్రీయ ఆలోచనా విధానము కొరకు, మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా పోరాడుతుంది.
5. భాషను ప్రజల పరం చేసేందుకు పోరాడుతుంది. సాహిత్యం, కళలలో మన దేశ సంస్కృతికి సంబంధించిన యితర రంగాలలో పరిశోధనకు కృషిచేస్తుంది. తత్వ, అర్థ, రాజకీయ చరిత్ర ప్రకృతి వగైరా శాస్త్రాల అభివృద్ధికి ప్రజల్లోకి తీసుకుపోయేందుకు కృషి చేస్తుంది.
6. ప్రజలమీద ప్రజలకు నాయకత్వం వహించే సంస్థల మీద పార్టీలమీద ప్రజారచయితలు, కళాకారుల మీద అభివృద్ధి నిరోధక పాలక వర్గాలు అమలు జరుపుతున్న నిర్బంధానికి వ్యతిరేకముగా పోరాడుతుంది. ప్రజల ప్రజాస్వామిక హక్కుల కొరకు పోరాడుతుంది.
7. వివిధ దేశాల ప్రజలు అభివృద్ధి నిరోధక, పీడక పాలక వర్గాలకు వ్యతిరేకంగా సాగించే విప్లవ పోరాటాలన్నిటిని బలపరుస్తుంది.
8. వలస, అర్ధవలస దేశాల ప్రజలు సామ్రాజ్యవాదానికి వలస, నయావలస విధానానికి, జాతి వివక్షణ విధానానికి, జియో నిజానికి వ్యతిరేకంగా చేసే పోరాటాలన్నింటిని బలపరుస్తుంది.
9. మూడవ ప్రపంచ దేశాలు తమ స్వతంత్రం, సార్వభౌమాధికార రక్షణకు జరుపుతున్న పోరాటాలను బలపరుస్తుంది. రెండవ ప్రపంచ దేశాలు అగ్రరాజ్యాల ఆధిపత్యానికి వ్యతిరేకంగా జరుపుతున్న పోరాటాన్ని బలపరుస్తుంది. రెండు అగ్రరాజ్యాల ఆధిపత్య విధానాలకు వ్యతిరేకంగా ప్రపంచ ప్రజలు జరుపుతున్న పోరాటాలను బలపరుస్తుంది.
10. రెండు అగ్రరాజ్యాల ఆధిపత్య పోటీ వలన మూడవ ప్రపంచ యుద్ధ ప్రమాదం నిరంతరం పెరుగుతున్నది. ముఖ్యంగా రష్యన్ సోషల్ సామ్రాజ్యవాదుల దురాక్రమణ విస్తరణ వాద ప్రయత్నాల వలన

ప్రపంచ యుద్ధ ప్రమాదం పెరుగుతున్నది. రెండు అగ్రరాజ్యాలు మూడవ ప్రపంచ యుద్ధానికి చేస్తున్న సన్నాహాలను వ్యతిరేకిస్తుంది. ప్రపంచ శాంతి కోసం ప్రపంచ ప్రజలు జరుపుతున్న పోరాటలను బల పరుస్తున్నది.

11. లక్ష్య సాధ్యం కలిగిన సంస్థలతోను, వ్యక్తులతోను కలసి పనిచేస్తుంది. అలాంటి శక్తులన్నీ ఒకే సంస్థలో ఐక్యం కావటదానికృషిచేస్తుంది.

12. వివిధ ప్రత్యేక సమస్యల విషయములో తన లక్ష్యాన్ని ముందుకు తీసుకు పోయేఉద్దేశ్యంలో కలిసి వచ్చే శక్తులన్నింటితో ఐక్యమవుతుంది.

13. కొంత మంది వ్యక్తులే వీరోచిత చర్యల ద్వారా సామాజిక మార్పును తీసుకురాగలరనే అతివాద దుస్సాహసిక విధానాన్ని ఒంటెత్తు పోకడను, వ్యక్తిగత హింసావాద రాజకీయ అవగాహన అట్లే ప్రజల చైతన్యాన్ని తక్కువ చేసి చూపే మితవాద లొంగుబాటు వాదాన్ని తోక పట్టుకు ('టైలిజమ్') పోయే వాదాన్ని వ్యతిరేకిస్తుంది. ప్రజలే చరిత్రని ర్మాతలని విశ్వసిస్తుంది.

# సెకండరీ స్థాయిలో గణిత విద్యాబోధన

స్వాతంత్ర్యం సిద్ధించినప్పటినుంచీ మనదేశంలో గణిత శాస్త్రవిద్యా విధానంలో మౌలికమైన మార్పులు తీసుకురావటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. మిగత శాస్త్రవిషయాలలో 1940-50 సంవత్సరాల ప్రాంతంలోనే ఐచ్ఛికము సామాన్యము అనే తేడాలు సెకండరీ స్థాయిలో తొలగించబడినప్పటికీ-ఒక్క గణిత శాస్త్ర బోధనలో మాత్రం ఈ తేడా కొనసాగుతూ వచ్చింది. తర్వాత నలభై ఏళ్ళ వరకూ అనగా 1982-83 వరకూ-సామాన్య గణితము, సంయుక్త గణితము-అని గణితశాస్త్ర బోధనలో రెండుభాగాలు స్థిరపడినాయి. దీనిమూలంగా ఒక దశాబ్ద కాలంపాటు గణితశాస్త్ర బోధనకు మనదేశంలో దుర్దినాలు సంప్రాప్తమయి నాయని చెప్పవచ్చును. సంయుక్త గణితాన్ని అభ్యసించవచ్చగించే విద్యార్థులసంఖ్య సన్నగిలటమూ, దానిని బోధించే ఉపాధ్యాయులు కొరవడడమూ జరిగినవి. అనేక గ్రామీణ ప్రాంతాలలోని పాఠశాలలలో సంయుక్తగణితాన్ని బోధనాంశాలనుంచి తొలగించినారు. ఎందుకంటే, అటునేర్పేవారు, ఇటు నేర్చుకునే వారు కూడా కర వైనారు కాని, ఇది అనుచితపద్ధతి అని గణితశాస్త్రాధ్యయనము పాఠశాలలలో ఈ విధంగా అపేక్షింపబడడము దేశంలో విజ్ఞానాభివృద్ధికి దోహదకారం కాదని విద్యానేత్తలు ఘోషించినప్పటికీ ఈ మాటలను పెడ చెవిన బెట్టినవారిలో విద్యార్థులేకాక ఉపాధ్యాయులు, ప్రధానోపాధ్యాయులు-కూడా ఉన్నారు. గణితంలో అభిరుచి లేనివారిపై దానిని బలవంతంగా రుద్దడము భావ్యం కాదని, విద్యావిధానపు ఎంపికలో విద్యార్థి స్వాతంత్ర్యానికి అడ్డు తగులరాదని వీరి వాదన. కాని, ఇంచు మించు 1978-79 నుంచి దేశవ్యాప్తంగా దీనికి భిన్నమైన ఆలోచనా విధానం పొడ చూపింది. గణితశాస్త్ర బోధనలో- సామాన్యము. ఐచ్ఛికము-అన్న తేడాల కృత్రిమమైనవి అనే అభిప్రాయం. దృఢపడింది. గణితశాస్త్రంలోని తార్కిక పద్ధతి అన్ని శాస్త్రాలకు అన్వయించవచ్చును. అంతేగాక, అధునాతనమైన కంప్యూటర్లు, యిత్యాది పరికరాలలో వాడేవి మౌలిక గణితీయ భావనల సమా జంలో ప్రతిభావంతులందరికీ గణితీయ దృక్పథం అవసరమని గుర్తింపబడినది. తత్ఫలితంగా గణితబోధనలో ఒకటవ తరగతినుంచి క్రమేపి దశలవారీగా బోధనాం శాలలో మార్పుల వచ్చినాయి. మనరాష్ట్రంలో మౌలికమైన ఈ మార్పుల తొమ్మి దవ తరగతి స్థాయిని గతవిద్యాసంవత్సరం-83-84లో అందుకున్నాయి. గణిత శాస్త్రాధ్యయనంలో ఇది వరకు ఉండిన-సామాన్య, ఐచ్ఛిక విభేధాలు తొలగింప బడి-విద్యార్థులందరికీ బోధనాయోగ్యంగా తొమ్మిదవతరగతిలో గణితపార్యాంశాలు ప్రవేశపరచబడినాయి. ఇంతవరకు విద్యార్థి బాహుళ్యానికి ఒక విధంగా కంటక ప్రాయమయిన, వడ్డీలు, చక్రవడ్డీలు, కాలము-పని-వంటి అంశాలను సిలబసునుంచి తొలగించి వాటిస్థానే అధునాతనము, ఔప యుక్తము, కొంతవరకు భావనాసౌంద ర్యము కల-సమితులును-సంబంధాలు, సహసంబంధాలు. మాత్రికలు, రేఖీయ కార్య క్రమ విధానం-వంటి ఆసక్తికరమైన అంశాలను చేర్చినారు. ప్రస్తుత విద్యాసంవ త్సరమయిన 84-85లో ఈ మార్పుల పదవతరగతి స్థాయిని చేరుకున్నాయి

నిర్మాణాత్మకమైన ఇటువంటి మార్పులు విద్యావిధానంలో రావడము హర్ష దాయకము. వాటిని సక్రమ పద్ధతులలో కొనసాగించినట్లయితే మనదేశపు విద్యా ప్రమాణాలను మెరుగుపరచడమేకాక సమాజశ్రేయస్సుకు కూడా తోడ్పడతుందన డము నిర్వివాదాంశము. అయితే ఎంతసదుద్దేశమయినా సరైన పద్ధతిలో అనువర్తిం చక పోయినట్లయితే అది విషమపరిణామాలకు దారితీస్తుంది. ఏ కార్యక్రమ నిర్వ హణలోనైనా ఆశించినలక్ష్యాలను దృష్టిలో ఉంచుకొని దానికి తగిన మార్గాలను అన్వేషించవలెను.

కాని ప్రస్తుతం మన రాష్ట్రంలో ఈ మార్పులను తీసుకువస్తున్న తీరు విద్యావేత్తలను ఆందోళన పరచక మానవు. ఇట్టి పద్ధతులలో ఆశయసిద్ధి పొంద గలమనుకోవడము కేవలం భ్రమ. దీనిలోని దొసగులను కొన్నిటిని క్రింద ఉద హరిస్తున్నాను.

సామాన్య, ఐచ్ఛిక విభాగాలగా పేర్కొన బడుచుండిన గణిత శాస్త్రాన్ని సమన్వయ పరచి దానిని సమగ్ర గణిత శాస్త్రంగా రూపొందించే బాధ్యత మన రాష్ట్రంలో సెకండరీ స్కూలు బోర్డు వారికి ప్రభుత్వమువారు అప్పగించిరి. కొఠారి కమిషను, అంతకుమునుపు కొందరు విద్యావిషయక సలహాదారులు, ఇటువంటి సమగ్ర గణితము దేశవ్యాప్తంగా పాఠశాలలలో బోధింపబడవలెనని పదే పదే ఉద్ఘాటించడం మూలంగా మన రాష్ట్రంలో ఈ ప్రయత్నము జరిగినది. సెకండరీ స్కూలు బోర్డువారు, గణితవిద్యానిపుణులను సంప్రదించి వారి చేత సెకండరీ స్థాయిలో అనగా తొమ్మిదవ తరగతి నుండి ప్రవేశపెట్టే సమగ్ర గణిత శాస్త్రానికి పార్యాంశాలను తయారు చేయించినారు. వారిచేత రూపొందింన సిలబసును కొన్ని స్కూళ్ళకు పంపి అందుపైవారి అభిప్రాయాలను కూడ సేకరించినారు. కాని, గణితశాస్త్ర ఉపాధ్యాయులకు, సెకండరీ బోర్డువారికి మధ్య దీనిని గురించిన కూలంకష చర్చ జరగలేదు. పాఠ్యపుస్తకాలు తయారు చేయడంలో-సెకండరీ బోర్డువారు వారికి తోచిన వ్యక్తులను ఎంపిక చేసుకొని వారిచేత వ్రాయించినారు. 83-84 విద్యా సంవత్సరంలో మొట్టమొదటి సారిగా తొమ్మిదవతరగతిలో ఈ నూతన సమగ్ర గణిత శాస్త్రాన్ని ప్రవేశపరచినారు. టెక్స్టుబుక్సు తయారు చేయ డంలో ప్రభుత్వ యంత్రాంగములో తప్పనిసరి అయిన కాలయాపన జరిగింది. విద్యాసంవత్సరం ప్రారంభమయిన కొన్ని నెలలకు పాఠ్యపుస్తకాలను ముద్రించి స్కూళ్ళకుపంపిణీ చేసినారు. ఈ పుస్తకాలు విడుదల కాగానే, ఉపాధ్యాయులను భయాందోళనలో ముంచి ఎత్తిన దనడము అతిశయోక్తికాదు. తర్వాత ప్రస్తుత విద్యా సంవత్సరమయిన-84-85లలో పదవతరగతి స్థాయికి వచ్చిన సమగ్ర గణిత శాస్త్రానికి సంబంధించిన టెక్స్టు ప్రస్తుతం సకాలంలోనే విడుదల చేయడము జరిగినది. ముద్రణ సకాలంలో జరిగిందన్న అంశాన్ని మినహాయిస్తే పాఠ్య పుస్తకంలో చెప్పుకోతగిన సుగుణాలేవీ కంచుకాగడా వెలిగించి చూచినా కానరాదు. తొమ్మిదవతరగతి పాఠ్యపుస్తకానికి అన్ని లక్షణాలతోను కవలపిల్ల అనేవిధంగా పదవతరగతి పుస్తకం ఆవిర్భవించిందని ఈ రెండు పుస్తకాల ప్రచురణ మూలంగా సెకండరీ విద్యార్థుల గణిత ప్రమాణాలు ఏ విధంగా మెరుగుపడుతుందో ఊహింప నలవికాదు. దానికి విరుద్ధమయిన ఫలితాలను కలిగించి విద్యార్థి లోకంలోనూ ఉపాధ్యాయ లోకంలోనూ గణితశాస్త్రం మీద ఏవగింపు కలిగించినా ఆశ్చర్యపడ వలసిన పనిలేదు. ఆ పుస్తకాల రచనాశైలి - వాటిని ప్రచురించిన తీరు- ఈ అను మానాలకు దారితీస్తున్నది.

1. అధ్యాయాలకు ఎన్నుకున్న విషయాల మధ్య ఎటువంటి క్రమబద్ధ మైన తీరు కనిపించడంలేదు. ఒక అధ్యాయానికి మధ్య హేతుబద్ధమైన సంబంధ మేదీలేదు. వాటిలో చర్చించబడిన అంశాలలో తార్కిక క్రమమంటూలేదు. ఒక కలగూరగంపలాగ తయారయినది.

2. అందులో వ్రాసిన కొన్ని అధ్యాయాలను పరిశీలిస్తే-గణిత శాస్త్రవాసన ఏ మాత్రంలేని వ్యక్తికైనా కొన్ని సత్యాలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. అధ్యా

యానికి అధ్యాయం-ఇంగ్లీషుభాషలోని ఏదో రచన నుంచి తు.చ.తప్పకుండా గ్రహించబడి తెలుగులోకి అనువదించబడినది. ఈ అనువాదం అసమర్థంగాను, అర్థరహితంగానూ ఉన్నది. అనువాదంలో వాడిన తెలుగు, ఒకరకమైన 'సంకర తెలుగు' వ్యావహారికంగాగాని, గ్రాంథికంగాగాని, ఆంధ్రదేశపు పొలిమేరలలో ఎవ్వరికీ వినిపించని భాష. అనువదించినవారికి తెలుగు క్షుణ్ణంగా రాకపోవటము క్షంతవ్యమైన నేరంకావచ్చు-ఎందుకంటే, తాము కేవలం గణితశాస్త్ర ఉపాధ్యాయులమని వారు తమ్ము తాము సమర్థించుకోవచ్చును. కాని తెలుగుభాషతో బాటు వారికి గణిత భాషకూడా లోపభూయిష్టము కావడం క్షమార్హం కాదు. గ్రంథ రచయితల గణితావగాహన కుంటుపడిందనడానికి కేవలం మచ్చుకొక ఉదాహరణ. పదవతరగతి 'గణితశాస్త్రము' పాఠ్యపుస్తకంలో 455వ పేజీలో "మాత్రికలు మరియు పరివర్తనలు" శీర్షికక్రింద నాల్గవపంక్తిలో "దృఢప్రమేయాలు" అన్న పదాన్ని వాడినారు. ఇది గణిత పరిభాషలో లేని పదం. పాఠకులను విస్మయపరచక మానదు. ఆంగ్లభాషలోని మాతృకలో 'సర్టెన్ ఫంక్షన్'' అన్నపదాలకు ఈ అనువాదం అర్థరహితంగా గావించినారు. దానికి సరిఅయిన అర్థం 'కొన్ని ప్రమేయాలు' కాని దీనిని అనువదించేవారికి గణితపరిజ్ఞానము లోపించుట్టే "దృఢప్రమేయాలు' అని అనువదించి చదివేవారికి దిగ్భ్రాంతిని కలుగజేసినారు. అనువాదంలోని అసమగ్రతకు ఉదాహరణగా పదవతరగతి పుస్తకం 308వ పేజీలో "ఆ సమాంతర పరివర్తన'' అన్న శీర్షిక క్రింద మొదటి పంక్తిలో "అంతేదూరం, అదేదిశ" అనివాడినారు. ఎంతదూరం, ఏ దిశ అని పాఠకుల్నిచకితులను కావిస్తుంది. ఇది మాతృకలోని'' 'సేమ్ డిస్టెన్స్ సేమ్' 'డయిరెక్షన్ అనగా సమాన దూరము, సమాంతరదిశ అని అనువదించడానికి రచయితలు పడినపాట్లను తెలుపుతుంది. ఇటువంటి అసమర్థ అనువాదాలు పుస్తకంలో చాలచోట్ల కనిపిస్తుంది.

3 ఈ విధమైన "సాహితీ చౌర్యానికి'' పాల్పడ్డ మహానుభావులు''– కనీసం ఆంగ్లంలోని ఏ గ్రంథాలనుంచి ఈ అధ్యాయాలను తస్కరించినారో అద్దానా పుస్తకంలో తెలియజేసి ఉన్నట్లయితే వీటిని బోధించవలసిన ఉపాధ్యాయుల కడగండ్లు కొంతవరకు ఉపశమనం చెందేవి మూలగ్రంథాన్ని పరిశీలించి వారి సంశయనివృత్తి కావించు కొనడానికి అవకాశముండేది కాని విచిత్రమయిన విశేష మేమంటే ఈ పుస్తకాల రచయితలు. వారు వ్రాసిన అధ్యాయాలను ఎవరికి తోచినట్లు వారు కొన్ని ఆంగ్ల మాతృకలలోనుంచి, అధ్యాయాలను సంగ్రహించినారు కాని ఈ పుస్తకాల ఆదిలోగాని, అంతంలోగాని మూలగ్రంథాలను గురించిన ఎటువంటి ప్రసక్తిలేదు ప్రభుత్వ ప్రచురణలలో ఇది గర్హనీయమైన పద్ధతి. ఎన్ సి ఇ ఆర్ టి. నేషనల్ కవున్సిల్ ఫార్ ఎడ్యుకేషనల్ రిసెర్చ్ ఎండ్ ట్రెయినింగ్ న్యూఢిల్లీ వారు ప్రచురించిన "బ్రోషూర్''లను ఆధారం చేసికొని ఇవి వ్రాసిఉన్నట్లయితే వాటిని తెలియపరచే కనీసధర్మము ప్రచురణకర్తలకున్నది.

4 పుస్తకాలలోని, 'భాషాదారిద్ర్యం' భావదారిద్ర్యాలతో బాటు ముద్రణా లోపాలు కుప్పలు తిప్పలుగా ఉన్నాయి. ముద్రణాలోపాలను తెలియజేసే 'తప్పొప్పుల పట్టిక' ను తయారుచేస్తే అది మరొక బృహద్గ్రంథమవుతుంది. ఈ 'ముద్రణా రాక్షసులు' వాక్యాలనేగాక, చిత్రాలను, రేఖాపటాలను కూడ కబళించినారు.

5. అసలు నూతన పాఠ్యాంశాలను అవగాహన చేసుకోలేక సతమతమవుతున్న ఉపాధ్యాయులకు సెకండరీ బోర్డువారు దయాభిక్షగా ప్రసాదించిన ఈ పుస్తకాలు 'మూలిగేనక్కపై తాటికాయ పడినట్లు' ఉంటుంది. ఇక పుస్తకాలను పఠించి దీనిలోని అంశాలను పరీక్ష పేపర్ల కెక్కించి ఉత్తీర్ణులు కాదలచిన పసి బాలుర పాట్లు పెరుమాళ్ళ కెరుక !

6 ఇటీవల విద్యార్థులు ప్రభుత్వము మీద వత్తిడితీసుకువచ్చి కొన్ని అంశాలను పాఠ్యపుస్తకాల నుంచి తొలగింప చేసినందుకు ముఖ్యమయిన కారణము పాఠ్యపుస్తకాలు లోపభూయిష్టము కావడమే. తొమ్మిదవ తరగతి, పదవ తరగతి గణిత పుస్తకాలలో ప్రచురించిన 'చలన జ్యామితి' అధ్యాయమొక ఉదాహరణ. మొదటి పుస్తకంలోని గణితపరిభాష రెండవ పుస్తకములో లేదు. 'సమాంతర పరివర్తన' అని ఒకపుస్తకంలోను "సదిశాచలనము'' అని మరొక పుస్తకంలోనూ వాడినారు వీటిని అనువదించిన రచయితల అసమర్థత మూలంగా రాష్ట్రంలో ఏ పాఠశాలలోగాని ఈ అధ్యాయాలను ఉపాధ్యాయులు బోధించలేక పోయినారు. చివరకు, విద్యార్థులు, ఏ కుమ్మడిగా ఈ అధ్యాయాలను తొలగించవలెనని పట్టు బట్టవలసి వచ్చినది.

వీటన్నింటికితోడు ఈ నూతన పాఠ్యాంశాలను నేర్పవలసిన ఉపాధ్యాయులకు సెకండరీ బోర్డువారి ఆధ్వర్యాన ఎటువంటి పునశ్చరణ తరగతులుగాని, శిక్షణా కేంద్రాలుగాని నిర్వహింపబడలేదు. అక్కడక్కడ జిల్లావిద్యాధికారులకు ఈ బాధ్యతను వప్పగించినప్పటికీ వారు శిక్షణ తరగతులలో ఉపాధ్యాయులకు ఇవ్వవలసిన టి. ఎ. డి. ఎ. ల గురించిన సమస్యలతో సతమతమవుతూ—ఈ బాధ్యతలను సమర్థవంతంగానూ, ఒక ప్రణాళికా బద్ధంగానూ నిర్వహించలేదు. ఉపాధ్యాయుల సంపూర్ణ సహకార, సానుభూతులు లేని ఇటువంటి కార్యక్రమాలు వమ్మగు ననడానికి సందేహములేదు. లక్షలాది విద్యార్థులకు, వేలకొలది గణిత ఉపాధ్యాయులకు సంబంధించిన ఇట్టి భారీఎత్తు కార్యక్రమాలలో ఉపాధ్యాయ శిక్షణకు అత్యధిక ప్రాధాన్యతనిచ్చి ఉండవలెను.

వీటన్నిటి కంటే ఈ కార్యక్రమంలో ప్రధాన లోపమేమంటే పాఠ్యాంశాలలో మౌలికమైన మార్పులు కొనిరావడమనేది మేధావులు చేపట్టవలసిన విషయము పాఠ్యప్రణాళికను తయారుచేసిదానికి సమగ్ర సమన్వయ రూపాన్నివ్వడు మేధావులకు, విద్యావేత్తలకు వదలివేయవలెను. ఈ విషయంలోనేమో ప్రభుత్వము తగిన చర్యలనుకైకొన్నది. కాని రూపొందించిన పాఠ్యప్రణాళికననుసరించి పుస్తకాలను రచించి, ప్రచురించే బాధ్యతను ప్రభుత్వ యంత్రాంగము చేపట్టలేదు ఇటువంటి ప్రయత్నాలలో ప్రభుత్వ యంత్రాంగం విఫలమవుతుందనడానికి తొమ్మిదవతరగతి, పదవ తరగతుల 'గణితశాస్త్ర' పుస్తకాలేనిదర్శనము. ఈ విషయంలో ప్రభుత్వపు ఆలోచనా రీతి ఏ విధంగా ఉన్నదంటే, ప్రజాస్వామ్యం నెలకొన్న ఈ రోజులలో పాఠ్యగ్రంథాల ప్రచురణ ప్రైవేటు యాజమాన్యానికి వదలితే వారు విద్యార్థులను దోచుకుంటారు. అందుచేత ప్రభుత్వమే ఈ బాధ్యతను స్వీకరించి, అందరికి అందుబాటులో ఉండు ధరలకు పుస్తకాలను ప్రచురించవలెను కాని ఈ ధోరణి శాస్త్రవిషయాలలో వర్తింపచేయడము సముచితంకాదు చవుకధరలనే ఆదర్శంగా భావించి ప్రభుత్వము ఇట్టి ప్రచురణలకు పాల్పడితే. ఇప్పుడు గణిత శాస్త్రంలో తయారయిన 'చవుకబారు' పుస్తకాలు మాత్రమే తయారవుతాయి. ఇవి సంకల్పించిన లక్ష్యసిద్ధిని భగ్నం కావించడమేకాక వీటి దుష్ప్రభావం విద్యార్థుల మీద తరతరాలుగా వ్యాపించి పోతుంది.

ఐ. కె. రావు

# "తిప్ప" శబ్దోత్పత్తి క్రమము

శ్రీ బి. నరసింహులు(బి న.) గారి "అనంతపురంజిల్లా గ్రామ, వ్యక్తి నామాలు - కన్నడ నిర్మాణ ప్రభావం'' (భారతి అక్టోబరు 1985) చదివితిని.

ఆయన చేసిన ఖండన, సిద్ధాంతములు వినుడు.

## ఖ ం డ న

" 'తి'గారు (అంటే నేను) "తిప్ప'' పదం "తిరుప'' శబ్దభవం. తిరుప→తిర్ప→తిప్ప అని చెప్పారు. ఇది సరియైన విశ్లేషణ కాదు.'' అని బి.న. గారన్నారు. దీనిని చదివినవారు బి.న.గారు "తిప్ప'' శబ్దమునకు సరియైన విశ్లేషణ ఇచ్చెదరేమో యని ఉవ్విళ్ళూరించుకొనుట సహజము.

బి.న.గారి సరియైన విశ్లేషణ ఇదిగో వినుడు.

## సి ద్ధా ం త ము

"శివుడు తిరుపం ఎత్తుకునేవాడు కాబట్టి ఆయనకు తిరుపయ్య అనే పేరు వచ్చింది అదే "తిప్పయ్య'' అయింది

తిరుపయ్య→తిర్పయ్య→తిప్పయ్య

హమ్మయ్యా! ఇది బి.న.గారి కొత్త విశ్లేషణ. నేను తిరుప→తిర్ప→తిప్ప అని యనగా, బి.న.గారు అది సరికాదు తిరుపయ్య→తిర్ప్పయ్య→తిప్పయ్య అనుచున్నారు. అయ్యలారా! ఇందు అయ్య తప్ప వేరే భేదమేమయినను ఉన్నదేమో చెప్పెదరా?

వెనుకటికి ఒక కోడలు బిచ్చగానిని పోయిరమ్మనిన, అత్త, అదెవతె పోయి రమ్మనుటకు, తిరిగి రమ్మని పిల్చి, వచ్చిన బిచ్చగానిని తాను పోయిరమ్మనినదట! అట్లున్నది బి.న.గారి పద్ధతి. ఎట్లయినను ఇచట ఇరుకుక్కొనినది బిచ్చగాడే ("తిరుపయ్యే") కదా!

మనం చర్చించుచున్నది భాషాశాస్త్రము, శబ్దోత్పత్తి (సక్రమము కాని ఆదార వ్యవహారములు కాదు. "తిప్ప" అను పేరు కలవారు మెడలో కంటె వేసికొనెదరు అని చెప్పిన మాత్రాన "తిప్ప" శబ్దము ఎట్లు నిష్పన్నమయినది తెలియదు.

శివుడు భిక్షువే. "తిరిపజోగి" అని ప్రాచీనకవి ప్రయోగమొకటి కలదు. భిక్షమునకు పర్యాయపదము "తిరిపము" లేదా "తిరిపెము". ఈ పదములను బి.న.గారే మొదట చర్చలో ఉపయోగించినారు. తీరా "తిప్ప" శబ్దోత్పత్తి క్రమములో "తిరుపం అని ప్రయోగించిరి. ఆయనకూ తెలుసు "తిరిప" నుండి తిర్ప, తిప్ప రాజాలవని.

అందుకే నా "తిరుపే" ఆయనకూ శరణ్యమయినది. శివునకు "తిరుపయ్య" అనే పేరు లేదు. "తిరుపయ్య" రూపము సరికాదు. 'తిరుపమయ్య' అని ఉండవలసి వచ్చును. భాషోద్భారణాశాస్త్రరీత్యా "తిరుపమయ్య", "తిప్పయ్య"గా రూపొందజాలదు. "తిరుపం" అంటే బిచ్చమునకు పర్యాయపదమని మాటవరుసకొప్పుకొనెదము. తిరుపము అచ్చదేశ్య తెలుగు కదా! సంస్కృత శబ్దములు భ్రష్టమై, కుదించుకొని తద్భవములయినట్లు, తెలుగు పదములు కావు. దేశ్య తెలుగు పదములు మెరికలవలె మొక్కపోక నిలిచియుండును. ఈ సూత్రీకరణములెందుకు చేయుచున్నాననగా, "తిరుపం" పదము తెలుగుది కనుక అది కుదించుకొని "తిప్ప" కాజాలదు అని స్పష్టము చేయుటకే. ఇదే కనుక సాధ్యమయితే, "తిరుపము" (బిచ్చము అనే అర్థములో)నకు "తిర్పం", "తిప్పం" అనే పర్యాయ పదములుండవలెను కదా." ఎచ్చటైనా తిప్పమెత్తుకొని బ్రతుకు" అని అనవచ్చునా? లోకవ్యవహారములో కానీ కావ్యాలలో కానీ ఈ ప్రయోగము వినబడదు, కనపడదు. అటులనే

దొరుకు—దొర్కు—దొక్కు,

సరిపెళ—సర్పెళ—సప్పెళ,

తిరుపు—తిర్పు—తిప్పు వంటి రూపములు నిష్పన్నము కావు.

అదే సంస్కృత పదములయితే

పర్వం—పర్బం—పబ్బం

అర్పణం—అప్పనం

సర్వం—సబ్బం (ప్రాకృతం) వంటి రూపములు తారసిల్లును. "తిరుపతి" అనే సమాసము ప్రాతిపదికముగా సంస్కృతమే కావున "తిర్పతి" "తిప్ప" (తి) అనే అవతారములు దాల్చగలదు. వచ్చిన చిక్కేమనగా, "తిప్ప" పేరు శివభక్తులు పెట్టుకొనెదరే! అటువంటప్పుడు "తి"గారు ఆ శబ్దము వైష్ణవమైన "తిరుపతి" శబ్దమునుండి వచ్చినదనుచున్నారే అను సందేహముచేతనే, ఎట్లోఒకట్లు "తిప్ప" శబ్దమును శివపరముగా లాగదీయవలెనని విశ్వవిద్యాలయ పరిశోధకులు వారి సంచాలకులు అవస్థ పడుచున్నారు.

"తిరుపతి" అంటే వేంకటేశ్వరుడే అని అనుకొనవలదు. ఎటులందురా? చెప్పెదను.

"తిరుపతి" అను పదము "శ్రీపతి" శబ్దభవము "తిరు" అను శబ్దము "శ్రీ" అను శబ్దమునుండి వచ్చినదని ఇంతకుముందు "భారతి"లో వివరించినాను. సముద్ర మధనమప్పుడు రెండు "శ్రీ"లు వచ్చినవి. ఒకటి, లక్ష్మి; రెండు, విషము. లక్ష్మి వరించిన విష్ణువు శ్రీపతి అయినాడు. విషమును వరించిన శివుడును శ్రీపతి అయినాడు. విష్ణువుండు కొండ "తిరుమల" (అంటే శ్రీశైలము) శివుడుండు కొండయు "శ్రీశైలము" (తిరుమల) అని ప్రసిద్ధి చెందినది. అందుచేత శివుడును "తిరుపతి"యే. "తిరుపతి" అనే పేరు దైవముదే అయినను ఆ దైవముండు కొండకు పేరుగా చలామణి అగుచున్నది. ఆ "తిరుపతి" కొండనుండి పుట్టినదే "తిప్ప" పదము. "తిప్పేరుద్ర"కు అర్థమేమన - ఎన్నో రుద్రరూపములున్నను, ఇది శ్రీశైలరుద్రుని సూచించు పేరు. ఎన్నో లింగరూపములున్నందున, రామలింగం, సోమలింగం, భీమలింగం అని పేర్లున్నవి.-సింహాచల నరసింహ, అహోబిల నారసింహ, యోగనారసింహ అని యున్నట్లు.

"తిరుపతి" అను పదము కొండకే రూఢి అయినది కాబట్టియు, "తిప్ప" శబ్దమునకు లౌకికార్థమూ కొండయని యుండుటచేతను, "తిప్ప" శబ్దము తిరుప(తి) శబ్దమునుండి పుట్టిన "డెరివేటివ్" (ఉచ్చారణ "డెరివ్") అని నిర్ణయించుట శబ్దోత్పత్తి శాస్త్ర సమ్మతమని నా మతము.

## ఉత్తమ నవలకు నూతలపాటి సాహితీ సత్కారం

చిత్తూరు :- గంగాధరం సాహితీ కుటుంబం (రిజిష్టర్డు) 1986 వ సంవత్సరం ఉత్తమ నవలకు అవార్డు యిస్తుంది. బహుమతి మొత్తం రు.1500/-లు. అవార్డుకోసం నవలలు పంపదలచినవారు క్రిందినిబంధనలు పాటించాలని కార్యదర్శి ఎస్ మునిసుందరం తెలియజేస్తున్నారు.

1. ఇతివృత్తం తెలుగుల జీవితానికి సంబంధించి వుండాలి.
2. 1-1-'83 నుండి 31-12-'85 లోగా మొదటి ముద్రణ జరిగి వుండాలి. వ్రాతప్రతులు, అనువాదాలు పంపరాదు.
3. ఒకసారి బహుమతి పొందినవారు పోటీకి పుస్తకాలు పంపరాదు.
4. ప్రచురణ కర్తలు పుస్తకాలు పంపవచ్చు. అయితే బహుమతి రచయితకే యివ్వబడుతుంది. రచయిత తప్పనిసరిగా సన్మానసభకు రావాలి.
5. మాకు వచ్చిన నవలల నుండే ఉత్తమ నవల ఎంపిక జరుగుతుంది. పుస్తకాలు తిరిగి పంపబడవు.
6. మా పరిశీలనకై నాలుగు ప్రతులు ఎస్. మునిసుందరం, కార్యదర్శి, 10-3-190 ఎ2; కె. కె. స్ట్రీట్; తిరుపతి-1 చిరునామాకు 7-3-'86 తేదీ లోగా పంపాలి.

ఎస్. మునిసుందరం

# గ్రంథవిమర్శలు

## దక్షిణామూర్తి స్తోత్రమ్

[సురభారతీ సాంస్కృతిక గ్రంథమాలా-త్రయోదశకుసుమమ్, దేవనాగరి లిపి - శ్రీ శంకర భగవత్పాదుల మూలమునకు శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావుగారి సంస్కృత వ్యాఖ్యతో, డెమ్మీ 80 పేజీలు, వెల 4 రూ.లు. ప్రకాశకులు ప్రాప్తిస్థానం- కార్యదర్శి, సురభారతీ సమితి, ఉస్మానియా యూనివర్శిటీ క్యాంపస్ హైదరాబాదు-500 007.

సంస్కృతాంధ్రాలలో సమర్థులైన విద్వాంసులూ, అద్వైతతత్వాన్ని చక్కగా అర్థం చేసుకున్నవారూ అయిన యల్లంరాజు శ్రీనివాసరావుగారు శ్రీ శంకరభగవత్పాదులు రచించిన దక్షిణామూర్తి స్తోత్రానికి సంస్కృతంలోనే విపులమైనవ్యాఖ్య వ్రాసి ప్రచురింప చేశారు. ఆయన 1982 వ సంవత్సరం అక్టోబరు నెలలో ఈ దక్షిణామూర్తి స్తోత్రాన్ని గురించి సురభారతీ సమితి భవనంలో ఉపన్యాస మిచ్చినట్లూ, ఆ ఉపన్యాస సారసంగ్రహమే యీ వ్యాఖ్యారూపంలో వెలసినట్లూ, సమితి కార్యదర్శులు బహుముఖ విజ్ఞానవేత్తలు డాక్టర్ పుల్లెల శ్రీరామ చంద్రుడు గారు దీని "ఆముఖం"లో తెలియ జేస్తున్నారు. సురభారతీ సమితివారు ఈ చిన్న గ్రంథాన్ని దేవనాగరి లిపిలో అచ్చువేయించి అద్వైత తత్త్వ జిజ్ఞాసువులందరికీ మహోపకారం చేశారు. దశశ్లోకి అనే పేరుతోకూడా ప్రచారంలో ఉన్న యీ స్తోత్రాన్ని శంకరభగవత్పాదులు రచించలేదని కొందరి సందేహం. కాని ఇందలిశైలి శ్రీ శంకరభగవత్పాదులు యితర రచనలశైలిని పోలియుండుట వల్లనూ, భగవత్పాదుల ప్రత్యక్ష శిష్యులైన సురేశ్వరాచార్యులవారు దీనికి వ్యాఖ్య రచించి యుండుట వల్లనూ అట్టి సందేహానికి అవకాశంలేదని ఏత ద్వ్యాఖ్యాత తమ 'ఉపక్రమం' లో వివరించారు.

ఈ స్తోత్రానికి "తస్మై శ్రీ గురుమూర్తయే నమఇదం శ్రీ దక్షిణామూర్తయే అన్నది మకుటం. ఈ స్తోత్రం చాలా మందికి కంఠస్థంకూడాను. దక్షిణామూర్తి పరమాత్మకంటె వేరుకాదు. అమూర్త స్వరూపుడైన పరమాత్మకు శక్తిరూపమూర్తి ద్వయం ఉన్నది. అందులో దక్షిణామూర్తి జ్ఞానశక్తి. నామమూర్తి క్రియాశక్తి. జ్ఞానశక్తి అయిన దక్షిణామూర్తి. జిజ్ఞాసువులకు గురుమూర్తి ఈ అంశాన్ని శ్రీనివాసరావుగారు ప్రత్యేకంగా వ్రాసిన 'మకుటార్థం'లో తెలియ జేశారు. వారు మకుటార్థాన్ని ఎంతో విపులంగా వివరించారు. ఈ స్తోత్ర వ్యాఖ్య కూడా చాలా విపులంగా తత్త్వ జిజ్ఞాసువులకు విద్వాంసులకు కూడా మిక్కిలి ఉపయోగకరంగా రచించ బడింది.

బులుసు వేంకటరమణయ్య

## శ్రీశైలవాసా! శివా!

[రచన : శ్రీబొమ్మన- సుబ్బారావు, రిటైర్డ్ ఇంజనీరు, వేలూరివారి వీధి, జయకృష్ణపురం, రాజమండ్రి, డెమ్మీసైజు 22 పుటలు వెల తెలియదు].

పాశ్చాత్య విద్యను అభ్యసించి, ఇంజనీరింగులో పట్టభద్రులై, ప్రభుత్వంలో బాధ్యతతో కూడిన ఉన్నత పదవిని నిర్వహించిన రచయితకు సహజంగా దైవ భక్తి, అందులోనూ శివభక్తి, కవితాసక్తి అలవడినవి. శ్రీశైల క్షేత్రంలో రచయిత. సుబ్బారావుగారి తమ్ములు రామచంద్రరావుగారి ఆధ్వర్యంలో నిర్మించ బడుతున్న ఉమారామలింగేశ్వర సత్రాన్ని చూచుటకు 1983 సం॥ శ్రావణమాసంలో కారులో వెళుతున్నప్పుడు రచయిత, భక్త్యావేశంతో అప్రయత్నంగా నోటినుండి వెలువడిన "శ్రీశైలవాసా! శివా !" అనేమకుటంతో అప్పటి కప్పుడే 8 పద్యాలు రచించారట! దారిలో ఒక అడవిలో కారు చెడిపోగా, అజ్ఞాతమిత్రులొకరు తమ్ము తమ కారులో ఆక్షేత్రం చేర్చారట! ఇదంతా ఈశ్వర సంకల్పమే అని వారి దృఢ విశ్వాసం. తర్వాత మరికొద్ది నెలల్లోనే నూటముప్పయి పద్యాలు పూర్తిఅయినవి సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ మల్లంపల్లి శరభయ్యగారు సంస్కరించి ఆ పద్య కుసుమాల సువాసనను ఇనుమడింప జేశారు. తర్వాత 108 పద్యాలు ఈ విధంగా శతకంగా "శ్రీశైలవాసా! శివా!" నామంతో ప్రచురించబడినవి.

ప్రఖ్యాత విద్వత్కవి విమర్శకులు గుంటూరు శేషేంద్ర శర్మగారు తిరుమల శ్రీశైలాల సామ్యవైశిష్ట్యాలను తులనాత్మకంగా సంగ్రహిస్తూ ఈకృతిని ప్రశంసించారు. మల్లంపల్లి శరభయ్యగారు పద్యరూపంలో ఆశీస్సులను అందించారు.

భక్తిభావ పూరితమైన యీ శతక రచన సరళశైలిలో మనోహరంగా సాగింది. ఒక పద్యం—

"పూవుల్ పూచినట్లుల్లై గగనమున్
పూర్ణేందు తారాద్యుతిన్
క్రోపుల్ మావులు నల్దెసల్ ముసరగా
క్రొత్తావు లావుల్ గొనన్
మావుల్ కోవెల కీవెలైన యెదలన్
మంద్రస్ఫురన్నాదమై
శ్రీవాత్సల్యముతోడ మమ్ము గనరా !
శ్రీశైలవాసా! శివా!" (పద్యం. 4)

కావలసిన వారు రచయితకు వ్రాసి దీనిని పొందవచ్చును.

"ఆంగీరస"

## సారళాదాసం

కేంద్ర సాహిత్య అకాడెమీ, ఢిల్లీ వారు ప్రప్రథమ ఒరియా కవి సారళాదాసుపై కృష్ణచంద్ర పాణిగ్రాహి ఆంగ్లభాషలో రచించిన దీర్ఘవ్యాసాన్ని ప్రచురించారు. నేను ఎరిగిన చాగంటి తులసిగారు ఈ వ్యాసాన్ని తెలుగులోనికి అనువదించారు. ఈ అనువాదం మద్రాసులో అచ్చయింది శ్రీ పురిపండా 'సారళాదాసు' అన్నారు తులసిగారు ఆంగ్లం నుంచి అనువదించడంచేత 'సరళాదాసు' అనడం సంభవించింది. ఇంతేకాక తనపేరు సి. తులసి అని వుంది. నిజంగా ఈమె పేరు చాగంటి తులసి ఇంగ్లీషులో సి అని వుండడం చేత తెలుగులో సకారం ఏర్పడింది తులసి గారికి ఒరియా తెలుసు ఒరియాలో రాయడం కూడా వచ్చు. ఈ కారణం చేత ఈమె 'సారళాదాసు' అని వుంటే బాగుండును. చాగంటి తులసి అని తనపేరు రాసి వుండవలసింది.

సారళాదాసు విలంక రామాయణం, మహాభారతం, చండీపురాణమే కాక విచిత్ర రామాయణం అన్న కావ్యాన్ని కూడా రచించాడు. ఈ గ్రంథం రచించినట్లు కృష్ణచంద్ర పాణిగ్రాహి ఎక్కడా అనలేదు సారళాదాసు ఈ గ్రంథాన్ని రచించినట్లు మొట్టమొదట పురిపండా పదే పదే చెప్పేకు. అతను చెప్పినట్లే ఈ గ్రంథం వ్రాతప్రతి చీకటిలో దొరికింది. తరువాత బరంపురం విశ్వవిద్యాలయం వారికి కూడా లభ్యమైంది. ప్రస్తుతం అచ్చులో వుంది.

సారళాదాసు భారతంతో సహా తన కావ్యాలన్నింటిలోనూ దాండీ వృత్తం

అనే ఛందస్సును ప్రవేశపెట్టేడు. ఈ ఛందస్సు తెలుగు ద్విపదకు దగ్గరగా వుంటుందని తులసిగారి అభిప్రాయం. సారళాదాసు మహాభారతం సంస్కృత మహాభారతమంత పెద్దది. అయితే కవి స్వతంత్రించి కేవలం తన భారతాన్ని రాశాడు. సంస్కృత భారతంలోని అనేక సంఘటనలను విడిచిపెట్టి స్వకపోల కల్పితమైన అనేక సంఘటనలను చేర్చాడు ఈ విడుపులు, చేర్పులను కృష్ణచంద్ర పాణిగ్రాహి విపులీకరించాడు.

సారళాదాసు పదిహేనవ శతాబ్దపు రెండవ భాగానికి చెందినవాడు. సమకాలీన తాత్విక దర్శనాన్ని కేవలం తన కాలానికి చెందిన విజ్ఞాన సర్వస్వాన్ని తన రచనలలో ముఖ్యంగా భారతంలో ప్రదర్శించాడు. ఈ విషయాలన్నీ ఈ రచనలో పొందు పరచబడ్డాయి చాగంటి తులసిగారు సులభ గ్రాహ్యంగా తెలుగులోకి అనువదించారు.

రోణంకి అప్పలస్వామి

## మహావీరుడు

[చల్లా రామ గణపతి ప్రసాద శాస్త్రి ప్రచురణ : శ్రీ వాసుపూజ్యజైన మందిరము గుండువారివీధి, రాజమండ్రి - 1, వెల రూ 6/-]

భారతీయ అవైదిక మతములలో జైనము, బౌద్ధము ముఖ్యమైనవి. ఈ మతప్రవక్తలైన మహావీరవర్ధమానుడు, గౌతమ బుద్ధుడు,ఇంచుమించుగనొకేకాలమునకుజెందియుండిరి. వీరి జీవిత చరిత్రలు ప్రాచీనగ్రంథములనుండి సంగ్రహింపబడి అనేక భాషలలో రచింపబడియున్నను వాటిలో మహిమలతోగూడిన చరిత్రాంశము మాత్రమే లభ్యమగుచున్నది. శంకరాచార్యులవంటి యితర మతాచార్యుల చరిత్రలు గూడ మహిమలతో గలిసియే మనకు లభ్యమగుచున్నవి. ప్రస్తుత మీ గ్రంథరచయిత గూడ మహావీరుని జీవితమందలి కొన్ని ప్రధాన సన్నివేశములను మహిమాన్వితములుగ చక్కగాకూర్చిరి. ఏ మతమందైనను మహిమలు అనివార్యముగ ప్రవేశించుచుండును. అట్టి యోగసిద్ధులు గలవని దృఢముగ విశ్వసించు భారతీయులకు ఆగాథలు ఆమోదయోగ్యములుగ నుండుననుటలో సందేహములేదు. కాని నవీన పరిశోధకులకు అవి అతిశయోక్తులుగనో మత ప్రచారము కొరకేర్పడిన విడ్డూరములుగనో తోచును. మహావీరుడు అహింసాపూర్వకమగు కొన్ని గొప్పశక్తులను ప్రదర్శించి తన మహత్త్వమును నిరూపించెనని యీ గ్రంథములోని గాథలుమనకు విశదపరచుచున్నవి. అట్టిశక్తులనే ఆ మహనీయుడు ప్రదర్శించకపోయినచో ఆ మహనీయుని బోధలనాచరించు వారే ఉండవారుకాదేమో. కనుక మతప్రవక్తలు తమ మహత్త్వములు ప్రదర్శింపక తప్పదు. వారి జీవితగాథ నుండి వాటిని తొలగించుటయు అనుచితము. మహావీరుడు అహింసనుపదేశించెనని యెంత వ్రాసినా విలువవుండదు. కాని ఆ విషయమునే ఆ మహనీయుడు చండకౌశికుడు. సిద్ధాంత నావికుడు. దావానలము మున్నగు గాథల సన్నివేశముతో తన మహత్త్వమును ప్రదర్శించి యెంతటి దుష్టశక్తులనైనా సాత్త్విక ప్రభావముతో నెదుర్కొనవీలగునని నిరూపించెను. ఇందు అసంభావితమును శంకించనవసరముండదు. సంస్కార విశేషమున వారికట్టి మహత్త్వము లుండునని మన విశ్వాసము. కనుక ఈ 'మహావీరుడు' అను పుస్తకమందున్న గాథలను సదవగాహనతో స్వీకరించి మహావీరుని జీవిత చరిత్రను తెలుసుకొనుటమంచిది. గ్రంథకర్త అట్టి మహనీయుని చరిత్రను తెలుగువారి కొరకు రచించుట ముదావహము. గ్రంథాదిలో శ్రీమద్విజయరాజేంద్ర సూరీశ్వరుని జీవితచరిత్ర సంగ్రహముగా వివరించిరి. ఈ జైనాచార్యులు భరత్‌పూర్‌లో విక్రమాబ్దము 1883లో జన్మించి, 1963లో రాజఘడ్‌లో మహాస్వర్గవాసమొందిరి. వీరు జైనమతమున పవిత్రతమ గ్రంథముగ భావించబడు కల్పసూత్రమునకు సామాన్యులకు సుబోధమగునట్లు 'శ్రీ కల్పసూత్రార్థ ప్రబోధిని' యను వ్యాఖ్యానము రచించి అశేషార్హతులకు పూజ్యులైరి. ఈ మహనీయుని యితర రచనలలో 1. 'అభిధాన రాజేంద్ర' (ప్రాకృత. మాగధీవిశ్వకోశము). 2. పాఇయ సద్దంబుహి 3. ప్రాకృత వ్యాకరణ వివృతి. 4. ప్రాకృత శబ్దరూపావళి 5. చంద్రికాధాతుపాఠః 6. శబ్దకౌముదీ. 7. సిద్ధాంతప్రకాశ 8. జినోపదేశమంజరి 9. తత్త్వవివేక 10. చతుర్వింశతి జినస్తవనం మొదలైనవి యేబదికి పైగా చెప్పబడుచున్నవి. వీటిలో నిఘంటువులు, శాస్త్రగ్రంథములు జైన మతగ్రంథములు గలవు. విజయరాజేంద్రసూరి గొప్ప విద్వాంసుడుగను, రచయితగను, జైన మతాచార్యుడుగను గడిచిన శతాబ్దిలో గొప్ప కీర్తి నార్జించెను. ఈ గ్రంథములో ఆ మహనీయుని సంగ్రహచరిత్ర కూడా పొందుపరచుట మిక్కిలి సముచితమై యున్నది.

గ్రంథము యొక్క రెండవభాగమున మహావీరుని పూర్వజన్మలవృత్తాంతము సంక్షేపముగా నీయబడెను. ఇందు ఇరువదియారు ఉత్తమ జన్మలు గడించగా ఇరువది యేడవజన్మగా మహావీరు డవతరించెను. మూడవ భాగములో మహావీరుని జన్మాదిగా ఇరువది నాలుగవ తీర్థంకరుడగుట వివరించబడెను. అప్పటికి పార్శ్వనాథునివరకు 'జైనమునందు అహింస, సత్యము, అచౌర్యము, అపరిగ్రహము అనునాలుగు ప్రధాన సూత్రములుగనుండెను. మహావీరుడు తీర్థంకరుడుగా బ్రహ్మచర్యమును గూడ జేర్చి జైనమున పంచమహావ్రతములను రూపొందించెను. ఈ పంచమహావ్రతాచరణము నవలంబించి నిర్వాణము నొందవచ్చునని మహావీరుడు జైనమత ప్రచారము గావించెను.

పి. వి. పరబ్రహ్మశాస్త్రి

## బృహద్భారతము

[రచన :- డాక్టర్ సి. వి. రామచంద్రరావు; వెల : 25 రూపాయలు ప్రాప్తిస్థానము : మానస పబ్లికేషన్స్, నెల్లూరు-524 003]

తనపేరు, పలుకుబడి ఎంతదూరం వ్యాపించిందీ తెలుసుకోవాలనే కుతూహలం ప్రతిమానవునికి సహజంగా ఉంటుంది. అలాగే తనమతం, తమ సంస్కృతి విదేశాలలో ఎంతగా విస్తరిల్లినదీ తెలుసుకున్నప్పుడు ప్రతివారికి హృదయం ఆనందంతో నిండిపోతుంది. భారతదేశంపై నేడు ఇంగ్లీషుభాష, పాశ్చాత్యసంస్కృతి విపరీతమైన ప్రభావం చూపుతున్నాయి. అయితే ఒకప్పుడు అంటే క్రీ శ. 1వ శతాబ్దం నుండి 15వ శతాబ్దంవరకూ ఆగ్నేయాసియా దేశాలలో సంస్కృతభాష హిందూమతం, భారతీయ సంస్కృతి ఎంత విస్తృత ప్రచారంలో ఉండేవో తెలుసుకున్నప్పుడు ఏ భారతీయుని తనువు పులకించదు!

నేటి భారతీయులకు పాశ్చాత్యదేశాల చరిత్ర, సంస్కృతితో ప్రగాఢ పరిచయం ఉంది కాని మనసంస్కృతి చిహ్నాలు ఇంకా ప్రత్యక్షసాక్ష్యాలుగా ఒప్పారుతున్న ఆగ్నేయాసియా చరిత్రమాత్రం లీలగానైనా తెలియని దురవస్థలో భారతీయులున్నారు. భారతసంస్కృతి పాదుకొన్న ఈప్రాంతాన్ని పాశ్చాత్య చరిత్రకారులు "బృహద్భారతం" (గ్రేటర్ ఇండియా) అని పిలిచారు. ఈప్రాంత చరిత్రను వివరించే గ్రంథమే డాక్టర్ సి. వి. రామచంద్రరావుగారు వ్రాసిన "బృహద్భారతము"

నేటి కంపూచియా (కంబురాజ్యం); దక్షిణ వియత్నామ్ (చంపారాజ్యం) సయాం లేక థాయ్‌లాండ్ (శ్యామదేశం) ; ఇండోనీసియా, మలేసియా (సువర్ణద్వీపం) ; బర్మా (బ్రహ్మదేశం) మున్నగు ప్రాంతాలన్నింటిలోనూ క్రీ. శ. 1, 2 శతాబ్దాల తరువాత హిందూమతము, భారతీయ సంస్కృతి శరవేగాన చొచ్చుకుపోయాయి. అక్కడ హిందూదేవాలయాలు వెలిశాయి. సంస్కృతభాషలో శాసనాలు వ్రాయబడ్డాయి. నాటి సంస్కృత శాసనాలు ఇప్పటికీ లభ్యమవుతున్నాయి. ఆ శాసనాలలో సంస్కృత కావ్య సంప్రదాయాలు పాటింపబడుతూ ఉండేవి. ఆనాడు నిర్మింపబడిన బొరొబొదూరు అంగ్‌కోర్‌వాట్ దేవాలయాలు సుందరశిల్ప సమన్వితములై హిందూసంస్కృతికి ప్రతీకలై నేడికీ కన్నులపండువు చేస్తున్నాయి.

ఆగ్నేయాసియాను పాలించిన రాజవంశాలలో పెక్కింటికి కౌండిన్యనామం పూజ్యమైనదిగా కనిపిస్తుంది రాజులలో జయవర్మ, రుద్రవర్మ ఈశానవర్మ మున్నగు పేర్లు తరచు వినిపిస్తాయి శ్రీవిజయ, శైలేంద్ర, మజపహిత్ (తిక్తబిల్వ) మున్నగు హిందూసామ్రాజ్యాలు మహావైభవంతో వర్ధిల్లాయి ఈ వైభవానికి సమకాలిక చైనా చరిత్రకారుల వ్రాతలు అద్దంపడుతున్నాయి వైభవాన్వితంగా వెలుగొందిన శైలేంద్రసామ్రాజ్యం చోళచక్రవర్తి రాజేంద్రుని దండయాత్రలవల్ల నశించడం శోచనీయం

భారతదేశంలో వలెనే ఆగ్నేయాసియా రాజ్యాలలో శివకేశవులవంటి హిందూదేవతలు పూజింపబడేవారు హిందూమతానికిచెందిన రాజగురువులు ఎదురులేని అధికారం చెలాయించేవారు మన వేదశాస్త్రాలు పురాణేతిహాసాలు ఆదేశాలలో విరివిగా పఠింపబడుతూ ఉండేవి. అనంతరకాలంలో హీనయాన, మహాయాన బౌద్ధ శాఖలు బర్మా, థాయ్‌లాండ్, కంపూచియా, లావోస్, వియత్నాంలలో నెలకొని ఇప్పటికీ వ్యాప్తిలో ఉన్నాయి

శ్యామదేశం (సయాం లేక థాయ్‌లాండ్)లో స్థాపింపబడిన హిందూరాజ్యం పేరు ద్వారావతి అక్కడి ప్రజలను తలైంగులని పిలిచేవారు ఈ తలైంగులు వలసపోయిన తెలుగువారేనని కొందరి అభిప్రాయం అలాగే 14వశతాబ్దిలో థాయ్‌లాండులో స్థాపింపబడిన అయోధ్యరాజ్యం 18వ శతాబ్దివరకూ వర్ధిల్లింది ఇప్పటికీ థాయ్‌లాండ్ రాజవంశం హైందవాచారాలు అవలంబించడం గమనార్హం

ఆగ్నేయాసియాలో నేటికి హిందూమతాన్ని అనుసరించే ఏకైక హిందూప్రాంతం బలిద్వీపం ఇండోనేసియా ద్వీపాలన్నింటిలోనూ 15వ శతాబ్దిలో ఇస్లాంమతం వ్యాపింపగా ఆత్మాభిమానం గల హిందువులు కొందరు బలిద్వీపంలో తలదాచుకొన్నారు నాటినుండి నేటివరకూ హిందూమతమూ సంస్కృతి స్థిరంగా నెలకొనివున్నాయి

ఇలాంటి ఎన్నెన్నో చారిత్రక, సాంస్కృతిక విశేషాలు డాక్టర్ రామచంద్రరావు గారి 'బృహద్భారతం గ్రంథములో చక్కగా పొందుపరచబడినవి ఈ గ్రంథం రాజకీయ సంస్కృతీ పర్వాలుగా విభజింపబడింది అనుబంధంలో ఆ ప్రాంతపు సంస్కృతశాసనాలు ఉటంకించడం ఎంతైనా ఉచితంగా ఉంది కాని రాజకీయ చరిత్రను మరింత విపులీకరించివుంటే బాగుండేది అలాగే ఒక్కో రాజ్యానికి సంబంధించిన మ్యాపూ అంగోర్ వాట్, బొరొబొదూరు దేవాలయ దృశ్యాలుకూడా చేర్చి ఉంటే నిండుతనం సంతరించుకొని ఉండేది ఏమైనా మన సంస్కృతి వ్యాప్తిని చిత్రీకరించిన 'బృహద్భారత' కర్త అభినందనీయులు ముమ్మందు ఈ విషయంపై తెలుగులో ఇంకా విపుల గ్రంథజాలం వెలువడగలదని ఆశిద్దాం

**పులిచెర్ల సుబ్బారావు**

## తెలుగు వ్యాకరణాలపై సంస్కృత ప్రాకృత వ్యాకరణాల ప్రభావం

[వెల రూ 25-00 ప్రాప్తిస్థానం 1) బేతవోలు రామబ్రహ్మం- తెలుగు విభాగం- నా.యూ నాగార్జుననగర్ - 522 510 , 2 (నవోదయపబ్లిషర్స్- ఏలూరురోడ్డు - విజయవాడ, 3) నవోదయపబ్లిషర్స్ - 5/1 అరండల్‌పేట- గుంటూరు ]

ఇది డాక్టర్ శ్రీ బేతవోలు రామబ్రహ్మంగారు రచించిన సిద్ధాంత వ్యాసం వీరు దీనిపై నాగార్జున విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్. డి పట్టం పొందారు

పేరుకు తగినట్లుగానే ఇది సాహిత్యక విషయాలతో ఏ మాత్రమూ- వ్యాకరణ విషయక రచనగా కూడా భాషాగత ప్రయోగాలతో సాక్షాత్తుగానూ- సంబంధంలేని బంధం. అందుచేత దీని పఠన క్షేత్రం తెలుగు వ్యాకరణ రచన ఆలనాటి నుంచీ చిన్నయసూరి వరకూ ఎలా సాగింది దానిపై సంస్కృత ప్రాకృతవ్యాకరణ ప్రవర్తకులూ తన్నిబంధకారులూ అనుసరించిన ఆయాంశజాల ప్రభావం ఎంతఉన్నదీ అనే విషయంలో లోతుగా ఆలోచించదలచిన పరిశోధకులకూ ఆంధ్ర విద్యార్థులకూ మాత్రమే పరిమితం ఇట్టి అధ్యేతృ పరితలకు ఇది అనేక విధాల స్ఫూర్తిప్రదం బన చక్కని నిబంధం

దీనిలోని అధ్యాయాలు ఎనిమిదీ పాణిన్యాచార్యుని అష్టాధ్యాయిని జ్ఞాపకం చేస్తున్నాయి దీనిలో వీరు చర్చించిన ఆయా అంశాల లోతుపాతులను తమ 'ప్రవేశిక' లో వీరి పర్యవేక్షక గురువులు మనోరంజకంగా వివేచించి ఉన్నారు ఈ సిద్ధాంత వ్యాసం 'ప్రారంభకుల కోసం' కాకపోయినా దీని ఆరంభంలో ఉండవలసిన ఉపోద్ఘాతం రచయిత వ్రాయని కొరతను ఇది పూరిస్తున్నది

ఈ రచయిత ఆంధ్రభాషా తద్వ్యాకరణాలతోపాటు సంస్కృతభాషా తద్వ్యాకరణాలను కూడా సంప్రదాయానుగత విధానంలో అధ్యయనంచేసి తాము తద్ద్వారా గ్రహించినంత విషయాన్ని అత్యంత ప్రామాణికతా భావంతో ఆయా అవశ్యక స్థలాల్లో ప్రతిపాదిస్తూ వచ్చారు ప్రకృతాంశాలతో అనుబద్ధం బన ప్రాకృత వ్యాకరణీయాంశాలను క్షుణ్ణంగా పరిశీలించిన వీరిశ్రమ ఈ నిబంధనలో సఫలంగా గోచరిస్తూ ఉన్నది

సంస్కృత ప్రాకృత వ్యాకరణాలతో సంబంధం లేక తెలుగుకు మాత్రమే పరిమితం బన ద్రుత - ద్రుత ప్రకృతి లాంటి అంశాలమీద వీరు విస్తృత పరిశీలనతో ప్రతిపాదించిన అంశాలు తెలుగుభాషా తత్త్వంలోని స్వతంత్ర ప్రతిపత్తికి గౌరవాదాయకాలు

పరుష సరళ సంజ్ఞాతత్త్వ వివేచనంలో వీరు చాలా లోతుకు వెళ్లారు దీనిపై చర్యకానీ నిర్ణయం కానీ ఇంతకంటె సరళ తరంగానే చేసిఉండవచ్చు

ప్రకీర్ణ 'విషయావళి'లో వీరు స్పృశించిన అంశాలు అన్యప్రధాన నిబంధంలోని ముఖ్యాంశాలుగా ఉండదగినవి కాకపోవచ్చు కానీ అవి నిబంధానికి ఒక విధమైన సరసత్వాన్ని సంపన్నంచేస్తూ-

'శబ్ద పల్లవ' సంజ్ఞ లాంటి మరికొన్ని అంశాలుకూడా వీరు దీనిలో చర్చించి ఉంటే బాగుండేది,

ఈ నిబంధ రచనలో వీరు భాషాతత్త్వాన్ని భాషాపరిణ క్రమానుసారియైన శబ్ద విశ్లేషణాత్మక దృష్టినీ ముందుంచుకొని పరిశోధన సాగించి ఉంటే 'వ్యాకరణ' శబ్దానికి గల అర్థాన్ని ఇంత కంటె ఎక్కువగా సమాదరించినట్లు అయ్యేది

ఏమయినా పరిశోధనలో త్రొక్కినత్రోవ శాస్త్రీయం అయి ఉండటం ముఖ్యం నిర్ణయం వ్యక్తిగతం వీరి పరిశీలన ఆ దృష్ట్యా సముచనమై ఏతద్విషయ జిజ్ఞాసువులకు స్ఫూర్తిని అందిస్తూ అన్నివిధాలా నిర్దుష్టంగా ప్రామాణికంగా సాగింది

రచయిత చెప్పదలచింది ఒక్క ముక్కలో ఏమిటి అనేదీ అది అలా చెప్పడం జరిగిందా లేదా అనేదీ ఏ రచనకైనా అత్యావశ్యకం ఆ విషయంలో రచయిత 'ఓచిన్నమాట' లో స్వయంగా చెప్పిన మాటలు దృష్టిలో ఉంచుకొని ఈ నిబంధాన్ని అధ్యయనం చేయవలసి ఉంటుంది

'సాధ్యమైనంత తక్కువ అచ్చుతప్పులతో' సాగిన చక్కని ముద్రణ

**పి. సీతారామాంజనేయులు**

*Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd , by S Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3 Editor S Radhakrishna, Vijayawada Phone 75667 & 61247*











JAI KISAAN
SAMRAT
18:46:0
ZUARI AGRO CHEMICALS LTD
GOA


అమృతాంజన్‌కే
తెలుసు
ఒంటి నొప్పులు
మరియు
బెణుకుల బాధ
మృదువైన మూలపదార్థము వల్ల
ఉపయోగించుట సులభము
క్రొత్త కార్కు అమరిక వల్ల
మందు శక్తికి రక్షణ
AMRUTANJAN
Pain Balm
AMRUTANJAN
PAIN BALM
అమృతాంజన్
ఏ ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి
1984 ఒలింపిక్స్ క్రీడలలో
పాల్గొన్న భారత క్రీడాకారులకు
అధికారపూర్వకంగా పెయిన్ బామ్
సరఫరా చేసినవారు.
OBM 8777 TG